హైదరాబాదాంధ్ర సాహిత్య పరిష త్ప్రచురణః

بسم الله الرحمن الرحيم

صحفا مطهرة فيها كتب قيمة

పవిత్రమైన ఈ పుటలలో సమస్త సత్యవేద (సారమును) గలదు.

# ఖుర్ ఆన్ షరీఫ్

సవివరణ ఆంధ్రానువాదము

**లఘువ్యాఖ్యాన సహితము**

## ప్రథమ సంపుటము

(1, 2 భాగములు)

హైదరాబాద్ (దక్కన్)

**1941**

بسم الله الرحمن الرحيم

# తొలిపలుకు

ఇప్పటికి పదకొండేండ్లక్రిందట డాక్టర్ చిలుకూరి నారాయణ రావుగారు ప్రకటించిన 'ఖుర్ఆన్' ఆంధ్రానువాదము చూచుట తటస్థించినది కొన్ని పేజీలు చదువుసరికి అది సరియైన అనువాదము కాదనిపించి వెంటనే మూలమును చూడగా నా అనుమానము స్థిర మైనది. శ్రీ నారాయణరావుగారి అనువాదము బహుదోషభూయి ష్ఠమును, ఇస్లాంమత సాంప్రదాయ జ్ఞానశూన్యమును అని నేనప్పుడు ౧౯౩౦, జులై ౧౪ వ తేదీ ఆంధ్రదినపత్రికయం దొక దీర్ఘవిమర్శన వ్యాసమును వ్రాసితిని. నిజాంరాష్ట్రాంధ్రపితామహులగు శ్రీ మాడ పాటి హనుమంతరావుగారా వ్యాసమును చదివి దానిని శ్లాఘించుచు మౌల్వీమీర్ అక్రమ్ ఆలీ సాహెబ్, బి. ఏ., బి.ఎల్, ఎమ్. ఎల్. సి. గారికి ఉత్తరము వ్రాసిరి. అందు ఖుర్ఆన్ గ్రంథ ఆంధ్రానువాదము నేనే చేసిన బాగుండు ననియు, అట్లు చేసినచో తాము సాయ మొనర్తు మనియు, అత్యంతోత్సాహజనకమగురీతి నభిప్రాయ మిచ్చిరి. అంతవరకు ఖుర్ఆన్ షరీఫు ననువదించవలె నను భావమైన లేని నాయందా లేఖ ఒక క్రొత్త అభిలాషను అంకురింపజేసెను. మహ త్తరమైన ఈ కార్యమునకు నేను తగుదునా తగనా అను వివేచనమైనను చేయక వెంటనే తదనువాదమునకు వలయు పరికరములను సంపా దింప సాగితిని. ఇట్లు ప్రారంభమైన ప్రయత్నమునకు ఫలమే ఈ యనువాదము.

ఖుర్ఆన్ గ్రంథము ౩౦ కోట్ల జనసంఖ్యగల మొహమ్మదీయ ప్రపంచమునకు వేదము. ఈ జనసంఖ్య ఒకదేశమునందుగాని, ఒక ఖండమునందుగాని పరిమితము గాక ఆసియా, యూరప్, ఆఫ్రికా, అమె రికా ఖండములందు వ్యాప్తమైయున్నది. ప్రపంచమందలి సమస్త నాగ

రికతలతోడను ముస్లిములకు సంబంధమున్నది. తూర్పున చైనా జపాను దేశములు మొదలుకొని పశ్చిమమున ఆసియామైనరు వరకు గల సమస్త ఆసియాఖండ దేశములందును ముస్లిములు ప్రతి దేశ జన సంఖ్యయందును ఒక ముఖ్యాంశమై యున్నారు. ముస్లిముసంఘమొక అంతర్జాతీయ సంఘము. ఖుర్ ఆన్ అందుచేతనే ఒక ప్రపంచ సందేశమును వినిపించుచున్నది.

ఖుర్ ఆన్ అనగా 'గ్రథితమొనర్పబడినది', లేక 'పఠింపబడినది' అని అర్థము. శ్రేష్ఠతమమగు ఉపదేశవాక్యములిందు గ్రథిత మొనర్పబడుట చేతను, నిత్యపఠనమునకై ఇది ఉద్దేశింపబడుటచేతను, ఈ గ్రంథమున కీ పేరు వచ్చినది ఇది అరబీ భాషయందు భగవదాజ్ఞచే శ్రీ మొహమ్మద్ ప్రవక్త హృదయఫలకమున నవతరించిన గ్రంథ రాజము. శ్రీ మొహమ్మద్ ప్రవక్త ఈ గ్రంథమును సాంతముగ రంజాన్ మాసములో దర్శించిరి అందుచేతనే ఈ మాసము పవిత్ర మాసముగ పరిగణింపబడుచున్నది.

ఖుర్ ఆన్ గ్రంథము 'సూరా' లనబడు ౧౧౪ అధ్యాయములుగ విభజింపబడినది. 'సూరా' అనగా అంతస్తు ఈ సూరాలు రెండువిధములైనవి: దీర్ఘములు, హ్రస్వములు దీర్ఘాధ్యాయములు పెక్కు 'రుకూ' లుగా విభజింపబడినవి. 'రుకూ'ను నేను 'ఖండము' అని ఈ అనువాదమున వాడితిని. ప్రతి 'రుకూ' యందును పెక్కు 'ఆయత్'లు కలవు. 'ఆయతు'ను నేను 'సూక్తి' అని అనువాదమున వాడితిని. 'ఆయత్' అనగా 'గుర్తు, చిహ్నము' అని అసలర్థము. కాని 'భగవత్సూక్తి' లేక 'మహాత్మ్యము' అను అర్థములో ఇక్కడ వాడబడినది. పఠన సౌలభ్యమునకై ఖుర్ ఆన్ గ్రంథమును ౩౦ భాగములుగ విభజించిరి. కాని ఇందు విషయవిభజనము లేదు. ఖుర్ ఆన్ గ్రంథమునందు మొత్తము ౬౩౬౦ సూక్తులు కలవు.

శ్రీ మొహమ్మద్ ప్రవక్త ౨౩ ఏండ్ల దీర్ఘకాలములో ఈ గ్రంథమును దర్శించిరి. ఇందులో కొంతభాగము మక్కాపట్టణమునందును, మరికొంత భాగము మదీనాపట్టణమునందును ప్రోక్తమైనది. శ్రీ

ప్రవక్త ఈ కాల పరిమితిలో ౧౩ ఏండ్లు మక్కాపట్టణమునందును, ౧౦ ఏండ్లుమదీనాపట్టణమునందును ఉండిరి. అందుచే ఇందలి ౯౩ అధ్యాయములు మక్కాయందును, ౨౧ అధ్యాయములు మదీనాయందును ప్రోక్తమైనవి. ఇదంతయు (శ్రీ) ప్రవక్తచేతనే సంకలితమొనర్పబడెను. ప్రవక్త శిష్యులలో అగ్రగణ్యులును, ప్రథమ ఖలీఫాయు నగు హాజరత్ అబూబకర్ (శ్రీ) ప్రవక్త పఠించుచుండెడి క్రమము ననుసరించి పెక్కు ప్రతులు వ్రాయించి ప్రపంచమునందలి ముస్లిమ్ కేంద్రము లన్నిటికిని పంపించిరి. ఈ విధముగ ఖుర్ఆన్ గ్రంథములో పాఠభేదములుగాని, ప్రక్షిప్తములుగాని, ఖిలకాండములుగాని లేవు. ఒక్క అక్షరమైనను భేదము లేకుండా ప్రపంచమంతటను ఒకే గ్రంథము ప్రచారములో నున్నది. ఇట్లు పాఠభేదము ఈషన్మాత్రమైనను లేక స్వచ్ఛమైన మూలపాఠము గల గ్రంథము ఖుర్ఆన్ ఒక్కటే యని చెప్పవచ్చును. "ఈ గ్రంథము నాచే ప్రోక్తమైనది. నేనే దీనికి సంరక్షకునిగ నుందును." (౧౫ : ౯) అని ఖుర్ఆన్‌లో భగవద్వాక్కు.

ఖుర్ఆన్ పెక్కు నామములతో వ్యవహరింపబడుచున్నది. ఈ నామములు ఖుర్ఆన్‌లోనే కలవు. అందులో ముఖ్యమైనవి : 'ఫుర్ ఖాన్' (సత్యాసత్యములను విచక్షణచేసి చూపునది), 'అజ్జికర్' (జ్ఞాపకము చేయునది), 'అల్-ముహైమిన్' (వెనుకటి సత్యవేదములను సంరక్షించునది) ఇవి ముఖ్యమైన నామములు. ఖుర్ఆన్ యొక్క పరమార్థము ఈ నామములయందు ప్రతిఫలించుచున్నది.

ఖుర్ఆన్ గ్రంథము ఒక క్రొత్తవేదము కాదు. ఇస్లాంమతమొక క్రొత్తధర్మమును కాదు. సత్యమువలె రెండును అనాదిసిద్ధములైనవే అదే విషయము ఖుర్ఆన్‌లో మాటిమాటికి చెప్పబడినది :-

"సత్యమును నిరూపించుటయే (ఖుర్ఆన్) ఉద్దేశము."

"నిశ్చయముగ నీకు (మొహమ్మద్ ప్రవక్తకు) పూర్వము సమస్తదేశములకును ప్రవక్తలను పంపియుంటిని. ఇప్పుడు నీకు వెలు

పరచుచున్న గ్రంథము (ఆ గ్రంథములను తారుమారొనర్చి వాని ననుసరించుచున్న) వారి సంశయములను బాపి వా రెక్కడ పొరపడిరో చూపుటకు మాత్రమే." (౧౬ . ౬౩, ౬౪ )

"ప్రవక్తా ! నీతో వాదముచేయువారితో నిట్లు చెప్పుము : మేము మీకు ప్రకటించిన సత్యమును, మీ ప్రవక్తలు ప్రకటించిన సత్యమును విశ్వసింతుము మీ దేవుడును మా దేవుడును ఒకడే. మేము అతనికే విధేయులము" (౨౯ : ౪౬)

"ఇప్పుడు మీవద్దనున్న సత్యమును నిరూపించుచు ఇది వెలువరచబడినది." (౨ : ౪౧, ౨ . ౮౧, ౨ : ౧౦౦; ౬ . ౯౩, ౩౫ : ౩౧.)

"సత్యముతో గూడిన గ్రంథమును మేము వెలువరచితిమి. ఇది ఇంతకుముందున్న గ్రంథములందలి సత్యమును నిరూపించి చూపునది. (అంతేకాని ఆ గ్రంథమునందలి సత్యము కలుషితము కాకుండ) కాపాడునది. అందుచే ఎవరు సత్యమార్గమున నున్నారో ఎవ రా మార్గమును తప్పి చరించుచున్నారో భగవత్ప్రోక్తమగు జ్ఞానమునుబట్టి నిశ్చయింపుము. అంతేకాని తుచ్ఛమగు మీ వాంఛల ననుసరించి మీకు ప్రోక్తమైన ఈ సత్యమును నిరాకరింపకుడు. మీ యెల్లరకును (అన్ని జాతులకును) ఒక్కొక్కరికి ఒక్కొక్క ధర్మమును, ఒక్కొక్క మార్గమును నియామక మొనర్చితిని. భగవంతు డిచ్ఛించియుండినచో మిమ్ముల నందరను ఏక జాతీయుల నొనర్చియుండెడి వాడు. కాని మీకు వెలువరచిన దానిబట్టియే మిమ్ములను పరీక్షించుటకై ఇట్లు చేసెను. అందుచే సత్కార్యములు చేయుట యందు ఒకరికంటె ఒకరు ముందడుగు వేయుడు. అందరును భగవంతుని సమక్షమునకే మరలవలసియున్నది. మీరు ఏ యే విషయము లందు భేదభావమును చూపిరో భగవంతుడు మీ కెఱింగించును."

౫ : ౪౮

"ఇది వేదజ్ఞానమును విస్పష్టముగ విప్పి చూపును. దీన సందేహ మేమియును లేదు." (౧౦ : ౩౭.)

ఇంకా ఇస్లామ్ మతపరమార్థమును గుఱించి ఖుర్ఆన్ ఇట్లు చెప్పుచున్నది:—

"(ఓ ప్రవక్తా!) ఇట్లు చెప్పుము. మేము భగవంతుని యెడ విశ్వసింతుము. మాకు ప్రోక్తమైన దాని (ఖుర్ఆన్ గ్రంథము) యెడను విశ్వసింతుము. అంతే కాదు. ఇబ్రాహీము, ఇస్మాయీలు, ఇస్హాకు, యాకూబు, ఇంకను ఇతర జాతుల ప్రవక్తలకును పంపబడిన వేద గ్రంథములను, మూసా, ఈసా మున్నగు ప్రవక్తలకు పంపబడిన వేద గ్రంథములను విశ్వసింతుము. ఈ ప్రవక్తల యెడ మే మెట్టి భేదభావమును చూపము. భగవంతునకే మేము వినతుల మగుదుము. (౩ ౮౩.)

"భగవంతుడు ఏ సహజస్థితియందు ప్రకృతిని సృష్టించి అందు మానవుని సృజించెనో యట్టి ప్రకృతిసహజమైన యీ మతమువైపు నకే మీ ముఖములను ధర్మజిజ్ఞాసువులై త్రిప్పుడు. అదే సత్యమగు మతము భగవంతుని సృష్టి మార్చ నలవికానిది. కాని పెక్కురు దీని నెఱుగరు

అట్లు భగవంతున కున్ముఖులైన వారై, అతని యెడ మీకు గల విధులను జాగ్రత్తగ నెరవేర్పుడు. ప్రార్థన సలుపుడు. బహు దైవతారాధకులు కాకుడు. తమ మతము నందు విభాగములు కల్పించి, పక్షములుగా చీలి, ప్రతి పక్షమును తమ తమ విభేదములను చూచి తమలో తాము సంతోషించు కొను వారితో కలియకుడు. (౩౦: ౩౦—౨)

ఇట్లు ఇస్లాం ఇటీవలి ఒక మతము కాదనియు, అది సనాతనమైనదనియు, మానవప్రకృతి యందే అది వేరు పాదుకొని యున్నదనియు, ఖుర్ఆన్ గ్రంథము ౧౩౯౦ ఏండ్ల క్రిందట ప్రోక్తమైన ఒక గ్రంథము కాదనియు, అది అత్యంత సనాతనమై, వివిధ కాలములందు వివిధ ప్రవక్తలకు సమస్త దేశములందు ప్రోక్తమైన సత్యవేద గ్రంథమనియు, ఇతర వేదగ్రంథములకు పోషకముగ వచ్చినదనియు

ఖుర్ ఆన్ వాకుృచ్చుచున్నది. ఖుర్ ఆన్‌కు ఇతర మతముల యెడ ద్వేషముగాని వైషమ్యముగాని లేదు. అది సర్వ మతములకు మార్గదర్శకము. అది సర్వ మతములను సమన్వయించును. అది యొక విశ్వ సందేశము నిచ్చు చున్నది, ఒక విశ్వమత మును బోధించు చున్నది దేశకాల జాతి వర్ణ భేదములు లేని ఒక మహాత్సందేశము నిచ్చుచున్నది. సర్వదేశములందును, సర్వ జాతులకును, సర్వకాలములందును ఆచరణయోగ్యమైన సందేశ మది.

ఖుర్ ఆన్ కేవలము వేదాంతముకాదు· కేవల మొక నీతి శాస్త్రము కాదు, కేవల మొక ధర్మశాస్త్రముకాదు, కేవలము కర్మకాండలకు సంబంధించినదియుకాదు, అదియొక సంపూర్ణ సత్య గ్రంథము. మానవజీవితమునందలి అన్ని దశలకును వలయు సర్వ ధర్మములును అందు విశదీకరింపబడి యున్నవి.

ఖుర్ ఆన్ గ్రంథమునందలి సందేశము ఒక విస్పష్టసందేశము. ఒకే మంత్రము నాధారము చేసికొని మూలసిద్ధాంతములందే పరస్పర విరుద్ధములగు సిద్ధాంతములను ప్రతిపాదించు వ్యాఖ్యానములు చేయుట కిందవకాశము లేదు. ఒకే వేదము నాధారముగా వేయి మతములను కల్పించుట కిట సాధ్యము కాదు. ఖుర్ ఆన్ ఈ విషయ మును స్పష్టముగ నిట్లు చెప్పినది·—

"ఖుర్ ఆనును గుఱించి వారు లోతుగ నాలోచింపరేల? అది భగవత్ప్రోక్తమే కాకపోయినచో అందు పరస్పర విరుద్ధములగు విష యము లుండవా ?" —౪ · ౮౨.

ఖుర్ ఆన్ గ్రంథము శ్రీ మొహమ్మద్ ప్రవక్త మాహాత్మ్య మని చెప్పబడినది ఖుర్ ఆన్‌లో గల శక్తి అసమానమైనది. ఈ గ్రంథము అరేబియా ప్రజలయందు కొలదికాలములో తెచ్చిన మార్పు, చరిత్రయొక్క గొప్ప విచిత్ర సంఘటనములలో నొకటి. ఒక్క అరేబియా ద్వీపకల్పమునందేకాక ప్రపంచమునందలి అధిక భాగములలో ఈ సందేశము కల్గించిన పరివర్తనము ప్రపంచ విప్లవ

ములలో నగ్రగణ్యమైన దనవచ్చును. ఇస్లామ్ మతమున కంతగా ననుకూలురుకాని పాశ్చాత్యక్రైస్తవ పండితు లీ విప్లవమును గురించి చెప్పిన ఈ క్రింది వాక్యములను గమనింపుడు:

"From time beyond memory, Mecca and the whole peninsula had been steeped in spiritual torpor. The slight and transient influences of Judaism, Christianity, or philosophical inquiry upon the Arab mind had been but as the ruffling here and there of the surface of a quiet lake; all remained still and motionless below. The people were sunk in superstition, cruelty, and vice . ..... Their religion was a gross idolatry, and their faith the dark superstitious dread of unseen things . ... Thirteen years before the Hejira, Mecca lay lifeless in this debased state What a change had these thirteen years now produced! . . Jewish truth had long sounded in the ears of the men of Medina, but it was not until they heard the spirit-stirring strains of the Arabian Prophet that they too awoke from their slumber, and sprang suddenly into a new and earnest life."[1]

(ఊహాకందరాని ప్రాచీన కాలమునుండియు మక్కా చుట్టునుండు దేశభాగ మంతయు మతవిషయమున మైకములో నుండెను యూదక్రైస్తవ మతములును, తత్వజిజ్ఞాసయు అరబ్బుల మనములపై తాత్కాలికమై స్వల్పమైన ప్రోద్బలము కలిగి శాంతసరోవరజలముపై నున్న స్వల్పతరంగజాలమువలె నుండి క్రింద నంతయు నిశ్చలముగను నిశ్శబ్దముగను ఉండెను ప్రజలు మూఢవిశ్వాసములలోను, క్రౌర్యమునందును, దుశ్శీలమునను మునిగి యుండిరి వారి మతము తుచ్ఛప్రతిమారాధనమై యుండెను. వారు మూఢవిశ్వాసములను దయ్యములను నమ్ముచుండిరి హిజరతుకు పూర్వము పదమూడు సంవత్సరముల క్రిందటి వరకు మక్కా నిర్జీవమై యిట్టి హీనస్థితియందుండెను. ఈ పదమూడేండ్లలో ఎట్టి అద్భుతమైన మార్పు కలిగెను!... .....అంతకు పూర్వము చిరకాలము యూదమతము మదీనా ప్రజల కర్ణపుటముల యందు ప్రతిధ్వనించియే యుండెను కాని ఆత్మను కలంచు అరబు ప్రవక్త ఖుర్ఆన్ సూక్తుల మధురరవము

1. Sir W. Muir's Life of Mohamet, Ch. VII.

వినినప్పుడే వారు తమ అజ్ఞాన దీర్ఘనిద్రనుండి లేచిరి గంభీరమైన ఒక నూతన జీవితము వారు హఠాత్తుగ ప్రవేశించిరి )

"A more disunited people it would be hard to find, till suddenly, the miracle took place! A man arose who, by his personality and by his claim to direct Divine guidance, actually brought about the impossible.. ..... .... namely, the union of all these warring factions."[2]

(ఈ హఠాత్పరివర్తనము జరుగకి పూర్వము వీరియంత సంఘీభావశూన్యమగు జాతి మరియొకటి లేకుండెను ఒక యత్యద్భుతవ్యక్తి బయలు వెడలి పరమేశ్వర ప్రేరణచే జరిగిన వ్యక్తి ప్రోద్బలముచే ఈ పరస్పర యుధ్యమాన జనములలో నసంభవ మైక్యతను కల్గించుట మిక్కిలి యాశ్చర్యకరమైన విషయము )

"And yet we may truly say that no history can boast events that strike the imagination in a more lively manner, or can be more surprising in themselves, than those we meet with in the lives of the first Musalmans, whether we consider the Great Chief, or his minister the most illustrious of men, or whether we take an account of the manners of the several countries he conquered, or observe the courage, virtue, and sentiments that equally prevailed among his generals and soldiers."[3]

(ఆది ముసల్మానుల చరిత్రమును చదివి, వారి నాయకాగ్రేసరుని, అత్యంత ఉత్తమ మానవులగు ఆయన మంత్రులను, ఆయన జయించిన దేశములందలి ఆచార వ్యవహారములను, ఆయన సేనానులలోను, సైనికులయందును సామాన్యముగ కన్పట్టు ధైర్యస్థైర్యములను, సచ్ఛీల సద్భావములను పరికించినచో, నిట్టి యాశ్చర్యకరమగు సన్నివేశములు చరిత్రమునం దెచ్చటను కానరావని సగర్వముగ నొక్కి వక్కాణించ వచ్చును చూచిన నది యంతయు నమ్మ శక్యము కాకుండును )

---

2. The Ins and Outs of Mesopotamia, P 99.
3. The Life of Mohamet, by the Count of Boulainvilliers (English Translation, P 5.)

"That the best of Arab writers has never succeeded in producing anything equal in merit to the Quran itself is not surprising." [4]

(అరబీభాషయం దత్యుత్తమశ్రేణికి చెందిన గ్రంథకర్త లెవ్వరును ఖుర్ ఆన్ ను సమానమైన గొప్పగ్రంథమును వ్రాయలేక పోయిరనుట వింతకాదు)

"It is the one miracle claimed by Muhammad—his standing miracle, he called it–and a miracle indeed it is." [5]

(మొహమ్మద్ ప్రవక్త తనదిగా చెప్పిన ఏకైకమహాత్మ్యమిదియే (ఖుర్ ఆనే) శాశ్వతముగ నిల్చి యందు మహత్వ మిది యని ఆయన చెప్పిరి నిస్సందేహముగ అదొక అద్భుత మహత్తే)

"Never has a people been led more rapidly to civilization, such as it was, than were the Arabs through Islam." [6]

(అరబుజాతి ఇస్లామ్ మతముద్వారా నాగరికతను పొందినంత సత్వరగమన ముతో మరేజాతియూ నాగరికతను పొందలేదు)

"The Quran is unapproachable as regards convincing power, eloquence, and even composition." [7]

(హేతువాదముచే ఒప్పించుట యందుగల శక్తికిని, అద్భుతధారకును, శయ్యా పాటవమునకును ఖుర్ ఆన్ తో సరితూగ గల గ్రంథము మరొకటిలేదు)

"And to it was also indirectly due the marvellous development of all branches of Science in the Moslem world." [8]

(ముస్లిమ్ ప్రపంచమున సర్వశాస్త్రములు నత్యద్భుతముగ అభివృద్ధి నొందుటకు ఖుర్ ఆన్ ప్రోద్బలమే పరోక్షకారణము)

---

Palmer's Introduction to English Translation of the Quran, P. iv.

Bosworth Smith's Life of Mohammad.

New Researches, by H. Hirshfield, P. 5.

Ibid, P. 8.

Ibid, P. 9.

"Here therefore its merits as a literary production should perhaps, not be measured by some preconceived maxims of subjective and aesthetic taste, but by the effects which it produced in Muhammad's contemporaries and fellow-country-men. If it spoke so powerfully and convincingly to the hearts of his hearers as to weld hitherto centrifugal and antagonistic elements into one compact and well-organized body, animated by ideas far beyond those which had until now ruled the Arabian mind, then its eloquence was perfect, simply because it created a civilized nation out of savage tribes, and shot a fresh woof into the old warp of history." 9

(ఏవో మనలో జీర్ణించియున్న కావ్యాభిరుచులను వరవడిపెట్టుకొని ఈ గ్రంథముయొక్క రచనను పరీక్షించుట యుక్తముకాదు ప్రవక్తయొక్క సమకాలికుల యందును, దేశీయులయందును ఇది యెట్టి మార్పు కలుగజేశెనో అను అంశమును బట్టి దీని గొప్పతనమును గణించవలెను అది శ్రోతల హృదయములలో శక్తివంతముగను, దృఢవిశ్వాసము కల్గునట్లగును ? నదించి, వారిలో నిండియుండిన స్వార్థపరత్వమును వైషమ్యమును రూపుమాపి, వారిని ఐకమత్యబంధముల బంధించి, కట్టుదిట్టములు కల్గిన ఒక జాతిని స్పృష్టించి, ఆజాతియందపూర్వమగు ఒక మహోదారభావమును కల్గించిన దన్నచో, ఈగ్రంథముయొక్క ప్రవచనపాటవము అసమానమైనదనియే చెప్పక తప్పదు అనాగరిక తెగల నైక్యమొనర్చి ఒక గొప్ప నాగరిక జాతిని సృష్టించి వారి చరిత్ర కామూలముగ నూతనత్వము కల్గించుటయే ఈగ్రంథమహత్వమునకు తార్కాణము )

"But if we consider the variety and heterogeneousness of the topics on which the Quran touches, uniformity of style and diction can scarcely be expected; on the contrary, it would appear to be strangely out of place. Let us not forget that in the book, as Muhammad's newest biographer, Ludolf Krehl expresses it, 'there is given a complete code of creeds and morals, as well as of the law based thereupon. There are also the foundations laid for every institution of an extensive common wealth, for instruction, for the administration of justice, for military organization,

9. Dr. Seignasst, in Hughes' Dictionary of Islam art. "Quran"

for the finances, for a most careful legislation for the poor· all built up on the belief in the One God, who holds man's destinies in His hand.' Where so many important objects are concerned, the standard of excellence by which we have to guage the composition of the Quran as a whole must needs vary with the matter treated upon in each particular case Sublime and chaste, where the supreme truth of God's unity is to be proclaimed, appealing in high-pitched strains to the imagination of a poetically gifted people where the eternal consequences of man's submission to God's holy will, or of rebellion against it, are pictured; touching in its simple, almost crude, earnestness, when it seeks again and again encouragement or consolation for God's messenger and a solemn warning for those to whom he has been sent, in the histories of the prophets of old: the language of the Quran adapts itself to the exigencies of every-day life, where this every-day life, in its private and public bearings, is to be brought in harmony with the fundamental principles of the new dispensation." [10]

(ఖుర్ ఆన్ గ్రంథమున వివిధములైనట్టియు పరస్పరాసంబద్ధమైనట్టియు విషయములను గమనించిన, భావశైలైక్యతల సంభవములు మరియు నవి యనవసరము లనికూడ తోచును "నమ్మకములకును, మతమునకును, ప్రవర్తనకును, శీలమునకును ఖుర్ ఆన్‌లో ఒక సంపూర్ణ ధర్మశాస్త్రము నిర్మింపబడినది వానిపై నాధారపడిన న్యాయశాస్త్రమును నిందు కలదు విద్యావిషయమునకును, న్యాయవిచారణమునకును, సైనిక శిక్షణమునకును, వేయేల ప్రజాస్వామ్యముతో కూడినయొక సంపూర్ణరాజ్యాంగ మునకు వలయు విషయము లన్నియు, నొకే పరమేశ్వరుడనియు, మానవుని భావ్యభివృద్ధి యంతయు నాయన హస్తగతమై యున్నదను మూలసూత్రములపై నాధారముచేస యీగ్రంథమున నుద్ఘాటింపబడినవి" అని చెప్పిన ప్రవక్తయొక్క యాధునిక జీవిత చరిత్ర కారుడగు Rudolf Krehl మహనీయుని వాక్యముల జ్ఞప్తియం దుంచుకొన వలసియున్నది ఇంత వైవిధ్యము గల గ్రంథమును ఏక వాక్యతగాగల గ్రంథముగ పరిశీలింప నమకట్టినపుడు, విషయముయొక్క ప్రత్యేకతననుసరించి యా యా భాగములు విడివిడిగా పరీక్షింపవలసియున్నది ఏకేశ్వర సూత్రము నుద్ఘాటించునపుడు దాత్తత కలిగి

10. Hughes' Dictionary of Islam, art. "Quran".

పరమేశ్వరుని పవిత్రాజ్ఞాను వర్తిత్వమును, తత్తిరస్కరణ ఫలితమును చర్చించునపుడు త్తమ కవిత్వమును విను నలవాటు కలశ్రోతలను నమ్మింపజాలు ఓజఃకాంతులు కలిగి, వెనుకటి ప్రవక్తృ చరిత్రములను విమర్శించి మొహమ్మదు ప్రవక్తను ప్రోత్సహించి యాయనను వినువారిని మాటి మాటికి మందలించు నపుడు హృదయాకర్షకత్వమును సుహృత్సమ్మతత్వమును కలిగి, యామహాగ్రంథములోని భాష ప్రతిదినమానవాంతరంగ బహిఃప్రవర్తనావసరములకు తగియుండి, తత్ప్రవర్తనమును నూతన మత సూత్రములతో మేళవించుచున్నది)

ఖుర్ఆన్ యొక్క శైలిని గురించి ఒక్క విషయము చెప్ప వలెను. ఖుర్ఆన్ గ్రంథము వచనముగ నున్నది. ఐనను అందొక విధమైన మాధుర్య ముట్టిపడుచున్నది. శబ్దమాధురికిని, శైలీ సార ళ్యమునకును ఖుర్ఆన్ అసమానమైనది అరబీభాష తెలియనివారికి కూడ అదొక మధురగానము వలె కర్ణపేయమై యుండును. ఛందో బద్ధము కాకపోయినను ఒక సుఖాస్పదమగు లయ ఆ భాషలో పొడ కట్టును. వేయేల అదొక అత్యద్భుత భాషాసృష్టి.

ఇట్టి మహత్తరమగు ఖుర్ఆన్ గ్రంథము సరిగా బోధపడవలె నన్న కొంత వ్యాఖ్యాన మవసర మనిపించినది. మన దేశములో మొదటినుండియు ఇస్లామ్ మతము యెడ పెక్కు అపోహ లుండుటచే ఆ అపోహాలను పోగొట్టుటకై ఈ వ్యాఖ్యాన మవసరమైనది ఈ సందర్భమున నేను గావించిన వ్యాఖ్యాన విధానమును వివరించుట ఉచితమను కొందును పరమత దూషణముగాని, పరమత ఖండనము గాని ఈ వ్యాఖ్యానోద్దేశము కాదు. వేదములును, ఉపనిషత్తులును ప్రతిపాదించిన మతమునకు ఖుర్ఆన్ గ్రంథ ప్రతిపాదితమగు మత ముతో ఎంతవరకు సమన్వయము కుదురును? సమన్వయము కాని చోట్ల అట్లు విరుద్ధముగ నుండుటకు కారణమేమై యుండును? ఈ విషయములను విమర్శాపూర్వకముగ వివరించుటయే నా ఉద్దేశము. భగవంతుడొక్కడే. సత్యమునుకూడ ఒక్కటే భగవత్ప్రోక్తమైన సత్యజ్ఞానము కూడ ఒక్కటే అట్టి యెడ మతములు వివిధములగుటకు అవకాశ మెక్కడనున్నది? ఇప్పుడు మనకు కన్పించుచున్న మత విభేదములు సత్యమును మనము గ్రహించుటయందును, గ్రహించినను

దాని ననుసరించుటయందును గల లోపములవల్ల కల్గినవేగాని స్వత స్సిద్ధమైనవి కావు. పూర్వాచారముల యెడలను, సాంప్రదాయముల యెడలను బానిసత్వము మానవ సహజమగు ఒక దౌర్బల్యము. విశాలదృష్టియు, స్వచ్ఛమైన దృక్పథమును, నిర్లిప్తమగు వివేచనా శక్తియు, అన్నిటి కంటె నధికముగ ధర్మజిజ్ఞాసయు నున్నప్పుడే ఆ దౌర్బల్యము నశించును. అప్పుడే స్వచ్ఛమగు సత్యము దృగ్గోచర మగును. అట్టి సత్యసందర్శనమునందు తోడ్పడుటయే నా ఈ అల్ప ప్రయత్నము యొక్క ఉద్దేశము. జిజ్ఞాసువులు దీనిని సద్భావముతో పఠింతురుగాక !

ఖుర్ ఆన్ గ్రంథ ఆంధ్రానువాదమును వ్యాఖ్యాన సహిత ముగ ౧౨ సంపుటములలో ప్రకటింప దలచినాను. పండ్రెండవ సంపు టము ఖుర్ ఆన్ గ్రంథమునకు ఒక సమగ్రమైన పీఠికయైయుండును. దైవానుగ్రహమున ఈపని పూర్తియైన తర్వాత శ్రీ మొహమ్మద్ ప్రవక్త ఉపదేశ వాక్కులను ఒక గ్రంథముగను, వారి జీవిత చరిత్ర మొక గ్రంథముగను వేర్వేరుగ ప్రకటింతును.

భాష సాధ్యమైనంతవరకు సుబోధకముగను సుస్పష్టముగను ఉండుటకై వ్యాకరణము నంతగ పాటింపక పోతిని. ఏదేని ఒక సూక్తముగాని, ఒక శబ్దముగాని స్పష్టముగ లేనప్పుడు దాని అర్థమును విడదీసి స్పష్టముగ నుండునట్లు బ్రాకెట్లలో ఇంచుక పైపుభేదముతో అచ్చువేయించితిని. ఈయనువాదము ప్రతిపదార్థము కాక సవివర ణానువాదమని అట్టపైననే సూచించితిని.

మౌలానాఅబుల్‌కలాం ఆజాద్‌గారు ఉర్దూ భాషలో రచించిన 'తర్జుమానుల్‌ఖుర్‌ఆన్' అను ఖుర్‌ఆన్ గ్రంథముయొక్క 'సవివరణ ఉర్దూ అనువాదమును' నేనెక్కువగ ననుసరించితిని. మౌలానా అబ్దుల్‌హక్‌గారు రచించిన 'తఫ్సీరెహక్కానీ' అను ఉర్దూ భాషయందు ఖుర్‌ఆన్ భాష్యము నాకెక్కువ ఉపకరించినది. ఇవికాక మౌలానా అష్రఫ్ ఆలీథానవీగారి యొక్కయు, హజరత్ షారఫీయుద్దీన్‌గారి యొక్కయు ఉర్దూ అనువాదములును, అలామాయూసుఫ్ ఆలీగారి

యొక్కయు, మౌల్వీ మొహమ్మదలీగారి యొక్కయు ఆంగ్లానువాదము లును నాకెంతయో ఉపకరించినవి. ఈ గ్రంథకర్తల కెల్లరకును నాకృతజ్ఞతలు.

ఆర్ష గ్రంథజ్ఞానము నాకెక్కువగ బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు ఆంధ్రమున వెలువరచిన ఉపనిషద్భాష్యములవల్ల కలిగినది తరువాత సర్. యస్. రాధాకృష్ణయ్యగారి "ఇండియన్ ఫిలాసఫి" రెండు సంపుటములును, ప్రొఫెసర్ దాస్ గుప్తాగారి "హిస్టరీ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ" రెండుసంపుటములును ప్రొఫెసర్ పి. సి. బారువాగారి "ప్రిబుద్ధిస్టిక్ ఇండియన్ ఫిలాసఫి" అను గ్రంథమును, ప్రొ. మాక్సుముల్లరు సంపాదితములైన వేదానువాదములును, మేజర్ బి.డి. బసుగారు సంపాదించిన 'సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ది హిందూస్' అను పెక్కు సంపుటముల గ్రంథావళియు మిక్కిలి ఉపకరించినవి. ఈ గ్రంథకర్తలకేనెంతయు కృతజ్ఞుడను.

అనువదింపవలెనను అభిలాషను నాయందంకురింపజేసిన శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారికిని, నా ప్రయత్నమునకు పలువిధముల దోహదమిచ్చిన గురు సమానులయ్యు నన్ను మిత్రునిగ వాత్సల్యమున నాదరించు బ్రహ్మశ్రీ కురుగంటి సీతారామయ్యగారికిని, కవిభూషణ శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారికిని, అర్థింపనిదే అచ్చు ఖర్చును నాచేత పెట్టి నన్నచ్చెరువుగొల్పిన ఉస్మానియా విశ్వవిద్యాలయ లా పండితు లగు డాక్టర్ మొహమ్మద్ హమీదుల్లా సాహెబ్ గారికిని, పెక్కు విధముల నా యీ ఉద్యమమునకు తోడ్పడుచున్న సుప్రసిద్ధ ఖుర్ ఆన్ భాష్యకర్తయు, నాకు గురువులును అగు మౌల్వీ అబ్దుర్రహీమ్ సాహెబ్ గారికిని నా కృతజ్ఞతా సహస్రములు. వారికి భగవంతుడు చిరాయురారోగ్యైశ్వర్యముల నిచ్చుగాక! ఖుర్ ఆన్ పవిత్రవాక్యములతో "వీరే ఇహలోకమునను పరలోకమునను జయశ్రీని పొందువారు"

హైదరాబాదాంధ్ర సాహిత్య పరిషత్తు ద్వితీయ ప్రచురణముగ దీని నంగీకరించిన పరిషత్తువారికి నేను కృతజ్ఞుడను.

హైదరాబాదు-దక్కన్,<br>౧౪, రంజాన్, ౧౩౬౦<br>౧, ఆజూరు, ౧౩౫౧ ఫసలి

ఇట్లు,<br>మొహమ్మద్ ఖాసింఖాన్.

సంపోషకుడ వీవె సకల లోకములకు
వరదాయకుడ వీవె కరుణామయుడ వీవె
అవసానకాలాన న్యాయాధిపతి వీవె!
సకల స్తుతులు మావి సర్వేశ నీకె
ఆరాధ్యుడవు మాకు అల్లాఃవు నీవె
నీ సహాయమె వాంఛనీయమ్ము మాకు!
నడిపింపుమా సజ్జనపధాల మమ్ము
తప్పుత్రోవలనుండి తప్పింపు మీశ!
సంరక్షకుడ వీవె శరణార్థి నేను.

# ఖుర్ ఆన్ షరీఫ్

## అధ్యాయము ౧

### ప్రారంభము

(ఫాతిహా)

1. కరుణామయుండును వరప్రదాయకుండును అగు అల్లాః నామస్మరణముతో (ప్రారంభించుచున్నాను.)

2. మా సమస్తస్తుతులును సర్వలోకపరిపోషకుడగు అల్లాఃకే.

3. అతడు వరదుండు; దయామయుండు;

4. అవసాన దినమున (మే మొనర్చు పాపపుణ్యములను విచారించి తత్తనుచితఫలమును నిర్ణయించు) న్యాయాధిపతి.

5. (ఈశ్వరా!) నిన్నుతప్ప మరెవ్వరిని మేము మారాధింపము; నీ సహాయమునే మేము మపేక్షింతుము. (మరెవ్వరి సహాయము మాకక్కరలేదు.)

6. ప్రభూ! (మోక్షము లభించు) తిన్నని మార్గమును మాకు చూపుము.

7. నీ అనుగ్రహమునకు పాత్రులైనవారి మార్గమునే మాకు చూపుము. నీ ఆగ్రహమునకు గురియైనవారి త్రోవనుండి మమ్ము తప్పింపుము.



# సూరయెషాతిహా లేక ప్రారంభాధ్యాయము

## వ్యా ఖ్యా న ము

ఖుర్ఆన్ గ్రంథమున కిది ప్రారంభాధ్యాయము ఇందు ఏడు (౭) ఋక్కులు కలవు. ఇది ప్రవక్త మక్కా పట్టణమందుండగా ప్రోక్తమైనది.

ఈ అధ్యాయము "బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్" (వరప్రదాయకుడును, కరుణామయుడును అగు అల్లాః నామస్మరణముతో ప్రారంభించుచున్నాను) అను వాక్యముతో ప్రారంభింపబడినది. ఖుర్ఆన్ గ్రంథమున ౧౧౪ అధ్యాయము లున్నవి. అందులో ౯వ అధ్యాయము తప్ప తక్కిన ౧౧౩ అధ్యాయములును ఈ తొలిసూక్తితోడనే ప్రారంభమగును. ప్రతి కార్యారంభమునను ముసల్మానులు దీనిని స్మరింతురు.

'ఫాతిహా' అను పేరు గల ఈ అధ్యాయము కడు చిన్నదైనను ఇస్లామ్‌మతసార మిందు సూత్రీకరింపబడినది. ఈ అధ్యాయ ప్రాశస్త్యమును ఖుర్ఆనే ఈ విధముగ నుగ్గడించుచున్నది :

"ఓ ప్రవక్తా ! మహత్తు గల ఖుర్ఆన్ గ్రంథముతో పాటు పునశ్చరణము నిమిత్తము ఏడు వాక్యములు గల అధ్యాయమును ప్రసాదించితిని"

ప్రవక్త ఈ అధ్యాయమును ఖుర్ఆన్‌యొక్క శిరస్సనియు ఖుర్ఆన్ యొక్క పునాది యనియు వచించిరి.

ఈ అధ్యాయము ప్రార్థనారూపమున నున్నది. అందుచేతనే దీని ననుదినము ప్రార్థనములందు ముస్లిము లనేకమారులు పఠింతురు. ఖుర్ఆన్ గ్రంథమును సమగ్రముగ చదువలేనివా రీ ఏడువాక్యముల యర్థమును బాగుగ నవగాహనముచేసికొనుచో ఇస్లామ్‌మతసారము వారికి కరతలామలకమగును.

ప్రతి మానవుడును నైజముగ ఈశ్వరు డొక డున్నాడని నమ్ముచున్నాడు. ఈ భావము మానవుని ప్రకృతియందే వేరుగొనియున్నది. మానవ పరిణామమందలి అన్ని దశలయందును ఈ భావము కాన్పించుచున్నది. కాని తన అంతరాత్మ 'అస్తి' (ఉన్నది) అని చెప్పుచున్న ఈ బ్రహ్మము ఎక్కడ, ఎట్లు, ఏ గుణములు కలిగి ఉన్నది అను ప్రశ్న

మానవుడు నిరంతరము చేయుచునేయున్నాడు. "కిం బ్రహ్మ" (బ్రహ్మ మన నేమి?) "కస్మైదేవాయ హవిషా విధేమ ?" (ఏ దేవునకు మాహావిస్సుల నివ్వవలెను ?) "కిం కారణం బ్రహ్మ?" (ఈ ప్రపంచమునకు బ్రహ్మమే కారణమా ?) ఇత్యాది ప్రశ్నలు అనాదినుండియు మానవహృదయమును వేధించుచునే యున్నవి. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" (బ్రహ్మమును పొందలేక వాక్కులు మనస్సుతో మరలుచున్నవి) అనిగాని లేక "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" (తపస్సు లేక ఆధ్యాత్మికాలోచనము వలన బ్రహ్మమును తెలిసికొనుము) అని చెప్పుటగాని ఈ ప్రశ్నలకు సమాధాన మిచ్చుట కాదు. బ్రహ్మజ్ఞానమున కాధ్యాత్మికాలోచన మవసరమే కాని యది సామాన్యులకు సాధ్యము కాదు. మతము సార్వజనీనకమై యుండవలెను బ్రహ్మస్వరూపనిర్ణయమున జ్ఞాని, అజ్ఞాని అను భేద ముండకూడదు. బ్రహ్మమును పొందు మార్గములయందు భేద ముండిన నుండవచ్చును; బ్రహ్మతత్వజ్ఞానమందు మాత్రము భేద ముండరాదు అందుచే సార్వజనీనక మగు బ్రహ్మతత్వనిర్వచన మొక టత్యంతావశ్యకమాయెను. అట్టి నిర్వచనముపైననే ప్రతి మతము నాధారపడి యుండును. ఈ విషయమున నేకీభావము కలుగుచో మతబాహుళ్యమునకు స్థానమే యుండదు. అట్టి నిర్వచనమును నిష్కర్షగా నిచ్చిన మతగ్రంథము ఖుర్ఆన్ ఒక్కటే నని చెప్పవలెను. ఈ యధ్యాయమున నట్టి నిర్వచనమే సూత్రప్రాయముగ చెప్పబడినది. ఖుర్ఆన్ గ్రంధమంతయు ఈ నిర్వచనమునే ఆధారము చేసికొని తన సమస్త సిద్ధాంతములను ప్రతిపాదించినది.

ఏ కాలమువందైనను మతజిజ్ఞాసువుల నెదుర్కొన్నవి నాల్గు సమస్యలు:

౧. బ్రహ్మముయొక్క లక్షణము లెవ్వి ?

౨. సృజింపబడిన మనము దేనిచేత జీవించుచున్నాము ? మన మనుభవించుచున్న సుఖదుఃఖము లెవని యధికారమునకు, నియమము లకు లోబడియున్నవి ? మన సుఖదుఃఖము లెవరికి నివేదించుకోవలెను ? ఎవరి నుపాసింపవలెను ?

౩. మన మీ లోకమున నాచరించుచున్న కర్మలపర్యవసాన మేమి?

౪. మోక్షమార్గ మేది ?

ఈ ప్రశ్నలు ప్రతి మానవుని హృదయాంతరాళమునను సదా ప్రతి ధ్వనించుచునే యున్నవి. వీనినే శ్వేతాశ్వతరోపనిషత్తు చక్కగ నిట్లు క్రోడీకరించినది —

ఓం బ్రహ్మవాదినో వదంతి
కిం కారణం బ్రహ్మ ? కుతస్స్మ జాతా ?
జీవామకేన ? క్వ చ సంప్రతిష్ఠితాః ?
అధిష్ఠితాః కేన సుఖేతరేషు
వర్తామహే ? బ్రహ్మ విదో వ్యవస్థామ్*—౧ ౧

ఖుర్ఆనులోని ఈ అధ్యాయమున పై ప్రశ్నలకు నిష్కర్షయగు సమాధానము సుబోధకముగ చెప్పబడినది సత్య మెప్పుడును సులభము గను సుగమముగను నుండును శంకలకుగాని అర్థాంతరములకుగాని తావిచ్చు సమాధానము సమాధానమే కాదు. అంతే కాదు, మానవబుద్ధిని ధిక్కరించునదియు, మానవ జ్ఞానమునకు వ్యతిరేకమును విపరీతమును ఐనదియు నగు సమాధానము సమాధానమే కాదు ఖుర్ఆన్ గ్రంధ మిచ్చిన సమాధానమున చిక్కు లేమియు లేవు; ఏ విధమగు శంకకును తావు లేదు.

భగవంతుని అనంతగుణములను వర్ణించు నామము లన్ని భాషల యందును అన్ని మతములవారికిని కలవు. ఖుర్ఆన్ గ్రంధమున కూడ భగవంతుని కల్యాణగుణములను వర్ణించు పెక్కు నామములు కలవు. వాటి సంఖ్య ౧౦౦౧ అని పండితులు గణించిరి. భగవంతుని అనంత గుణములను వర్ణించుటకు ఎన్ని నామము లున్న నేమి కొఱత ? ఇట్టి గుణవర్ణనమునుచేయు యే నామమును లేక అన్ని నామములు కలిసియు పరిపూర్ణుడగు బ్రహ్మమును నిర్దేశింపలేవు. ఒక్కొక్క నామము భగవం తుని ఒక్కొక్క అంశను, అన్ని నామములును కలసి భగవంతుని కొన్ని అంశలను మాత్రము నిర్దేశించగలవు. పరిపూర్ణుడగు బ్రహ్మమును నిర్దే

*ఈ ప్రపంచమునకు కారణము పరబ్రహ్మమా ? దేనివల్లనుండి మనము పుట్టితిమి? ఎవని సహాయముచే మనము బ్రతుకుచున్నాము ? మన మెచ్చట నున్నాము ? సుఖ దుఃఖములవ్యవస్థను ఎవ్వనిచేత అధిష్ఠితులమై అనుభవించుచున్నాము ? అని బ్రహ్మ వాదులు పరస్పరము చర్చించుకొనుచున్నారు.

శించు శబ్దము సాధకులకును సామాన్యులకునుకూడ చాల అవసరము. ఎందుకనగా గుణనామసంకీర్తనము చేయువారికి భగవంతుని సంపూర్ణ దర్శనము లభింపదు. ''నేదం యదిద ముపాసతే'' అను కేనోపనిషద్వచనము నందును, ''యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్యాంతి పితృవ్రతాః భూతానియాంతి భూతేజ్యాయాంతి మద్యాజినో ఽపిమామ్'' (౯ — ౨౫) అన్న గీతావచనము నందు నీసత్యమే విశదీకరింపబడినది అట్టి విభూతులను ఆరాధించుట అజ్ఞాన మని గీతయే కాక శ్రుతికూడ ''అంధం తమః ప్రవిశన్తి య ఉ సంభూత్యాగ్ం రతాః'' అని నిష్కర్షగ చెప్పినది. ఒక్కొక్క భగవద్గుణమును ఒక్కొక్క దేవతగ నిరూపించి అట్టి దేవతలను పూజించు ఆచారము కూడ సార్వార్థికనామము లేకపోవుటవలననే వచ్చియుండవచ్చును. భగవంతుని అనంతగుణములలో మూడు అత్యంతముఖ్యమైనవిగా పరిగణింపబడుచున్నవి.—౧ సృష్టికర్తృత్వము ౨ పోషకత్వము ౩ లయకారకత్వము. పుట్టుక, జీవనము, చావు –– ఇవి ప్రతి జీవికి సామాన్యధర్మములు ఈ మూడు అవస్థలకు ప్రేరేపకుడు లేక కారకుడైన భగవంతునకు మానవుడు మూడు ముఖ్యగుణముల నాపాదించినాడు. అంతటితో ఆగక ఒక్కొక్క గుణమునకు ఒక్కొక్క రూపమును కల్పించి ఆ రూపములను ప్రత్యేక ప్రత్యేకముగ ఆరాధింపసాగినాడు. బహుదైవతారాధనము ఈ విధముగనే ప్రాకియుండవచ్చును భగవద్విభూతులనే భగవంతుడని భ్రమించి అనేక దేవతలను కల్పించుకొని ఆ దేవతానీకములో ఎవరి నారాధింతునా అని సందేహింపసాగినాడు ఈ సందేహము ఆర్యజాతిని చిరకాలము బాధించి యుండవలెను. అనేక ఉపనిషత్తులయందు దీనిని గురించిన విచారణ కలదు. ఇట్లు విచారించి విచారించి ఇట్లు ప్రత్యుత్తర మిచ్చినాడు :

యోదేవానా మధిపో । యస్మిన్ లోకా అధిశ్రితాః
య ఈశే ఽస్య ద్విపద శ్చతుష్పదః । కస్మై దేవాయహవిషా విధేమ * శ్వేతా VI. 13.

---

* ఏ పరమేశ్వరుడు బ్రహ్మాది దేవతలకు అధిపతియో, సర్వకారణభూతుడగు ఏ పరమేశ్వరునియందు భూతాదిలోకములు అధిష్ఠింపబడియున్నవో, ఏ పరమేశ్వరుడు ఈ మనుష్యులకును, పశువులకును నియామకుడుగా నుంటున్నాడో అట్టి ఆనందస్వరూపుడును ప్రకాశస్వరూపుడును అగు పరమేశ్వరుని కొఱకు హవిస్సులను సమర్పించుకొనుచున్నాము

ఇట్లు విజ్ఞానధను లగు మహర్షులును తత్వజ్ఞులును సత్యజ్ఞానానంద స్వరూపుడును అవాఙ్మానసగోచరుడును అగు భగవంతుని తెలిసికొనిరి. కాని జనసామాన్యమగు మతము మాత్రము ప్రతిమోపాసనము, బహు దైవతారాధనముతోడనే ఆగిపోయెను ఇంతే కాక మానవమాత్రులగు శ్రీకృష్ణ బుద్ధాది మహాత్ములను, ధార్మికులగు రామ హనుమదాది వీరాగ్రేసరులను, దైవతములుగా నారాధింపసాగిరి. అట్లు చేయుట అజ్ఞానమని రామమోహనరాయలవంటి తాత్వికశిరోమణులు మనదేశమున బోధించిరి. ఈ అజ్ఞానమున కంతటికిని బ్రహ్మగుణోపాసనమే కారణమని ఇంతకు ముందే చెప్పియుంటిని. బ్రహ్మస్వరూపనిర్ణయము చేయుటయందు ఆర్యఋషులు ఎంతో శ్రమపడిరి కాని వారి పరిశోధనాఫలితమునంతటను ఒకచో చేర్చి వాటియందలి సత్యాసత్యములను నిర్ణయించు గట్టిప్రయత్నమును విమర్శకదృష్టితో ఎవరును చేయ్యరైరి. అట్లు ప్రయత్నము చేసిన వారు కూడ "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను సిద్ధాంతము ననుసరించి సూర్యాది సమస్త భూతములం దంతర్యామియై యున్న భగవదంశమును ఆధారముగా గొని అయ్యేవస్తువులను బ్రహ్మకభేదముగా సిద్ధాంతీకరించిరి. (ఛాందో. ౧-౬-౬. తైత్తి నారా ౧౩-౧౪ )

ప్రపంచమునందలి యే మతమునందైనను శుద్ధబ్రహ్మమునకు సార్వార్థికనామ మున్నట్లు కన్పించదు బ్రహ్మము అచిన్త్యరూపము; అవాఙ్మానసగోచరము; నిరాకారము, అనంతము, అఖండము. అట్టి బ్రహ్మమును నిర్దేశించు శబ్దము మరొక అర్థమునకు తా వీయకూడదు. ఖుర్ఆన్ అట్టి శబ్దమును కల్పించినది. ఆ శబ్దమే "అల్లాః". ఈ శబ్దమునకు వ్యుత్పత్తి లేదు; లింగ వచనములు లేవు; ఎట్టి అకారమునకును ఇది చిహ్నము కాదు. నిరాకారుడగు శుద్ధబ్రహ్మమునకే ఇది చిహ్నము. తక్కిన సహస్ర సంఖ్య గల నామము లన్నియు గుణనామములు మాత్రమే. "అల్లాః అసంఖ్యాక-కల్యాణగుణకలితుడు మీ కిష్టమైనచో ఆ గుణములతో వానిని సంబోధింపుడు." (౧౮౦ : ౭.) అని ఖుర్ఆన్ చెప్పుచున్నది. అల్లాః శబ్దమును శుద్ధబ్రహ్మమునకు సంజ్ఞావాచకముగ ఖుర్ఆన్ యేర్పరచినది.

ఇట్లు శుద్ధబ్రహ్మమున కొక సార్వార్థికనామమును ఏర్పరచి ఈ అధ్యాయము నాల్గు ప్రధాన గుణనామములను పేర్కొనుచున్నది. ఈ గుణ

నామములు బ్రహ్మస్వరూప నిర్ణయమును చేయుచున్నవి. బ్రహ్మలక్షణము లీ నామములందు వివరింపబడినట్లు యింక వేనియందును వివరింపబడ లేదు. ఈ నామములు వరుసగా ఇవి రబ్, రహ్మాన్, రహీమ్, మాలికె యౌమిద్దీన్

'రబ్' అను నామమును నేను 'పరిపోషకుడు' అని తెనిగించితిని. తెలుగున మరొకవిధముగ ఆ శబ్దార్థము ననువదింప సాధ్యము కాలేదు. ఈ శబ్దమునకు అరబ్బీభాషయందు విశాలమగు అర్థము కలదు "ఉత్పత్తి యైనది మొదలు సంపూర్ణాభివృద్ధినొంది గమ్యాంతమును చేరువరకు గల సమస్తావస్థలయందును తత్తదుచితమగు పోషణము నిచ్చువాడు" అని రాగిబ్ అను నిఘంటుకారుడు దీని యర్థమును వ్రాయుచున్నాడు. అనగా ప్రతి వస్తువును సృష్టియందలి దాని ప్రథమావస్థ మొదలుకొని చరమావస్థ వరకు గల సమస్తావస్థలయందును ఆయా అవస్థలకు కావలసిన సమస్త పోషణయు నిచ్చువాడని అర్థము సృష్టి స్థితి లయములను మూడవస్థల యందు మొదటి రెండవస్థలకును హేతుభూతుడు అను అర్థ మిం దున్నది.

భగవంతుని యొక్క వర్ణనములలో ముఖ్యమైనవి అతని సృష్టి కర్తృత్వమునకును పోషణత్వమునకును సంబంధించినవి "కిం కారణం బ్రహ్మ? కుతస్మజాతా? జీవామకేన? క్వ చసంప్రతిష్ఠితా?" ఇత్యాది ప్రశ్నల కన్నిటికిని సమాధాన మిం దీయబడినది తాత్వికులు కొందరు సృష్టికి కారణము బ్రహ్మము కాదనియు కాలాదులు కారణమనియు చెప్పిరి. కర్మయే జగత్కారణమని మీమాంసకులును, ప్రకృతిస్వభావమే జగత్కా రణ మని లోకాయతికులును, కాలమే కారణమని కాలవేత్తలును, యదృచ్ఛ చేతనే జగత్తు సృజింపబడుచున్నదని నిరీశ్వరవాదులును, పంచమహాభూత ముల సంయోగము వలన జగత్సృష్టి జరుగుచున్నదని జగన్నిత్యత్వవాదు లును, ప్రకృతియే జగత్కారణమని శాక్తేయులును, ఇట్లు వివిధముగ తలంచుచున్నారు. ఈ వివిధ మతములను పేర్కొని శ్వేతాశ్వతరశ్రుతి:

తేధ్యానయోగానుగతా అపశ్యన్
దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్,
యః కారణాని నిఖిలాని తాని
కాలాత్మయుక్తా న్యధితిష్ఠత్యేకః*

(I 3)

అని ఈ సర్వకారణములను నియమించు అద్వితీయుడగు పరమాత్మయొక్క సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వాది గుణములచేత నిగూఢమైనట్టి జగదుత్పత్తి స్థితి లయ నియమనశక్తియే జగత్కారణమని చెప్పుచున్నది.

ఇక్కడ ఖుర్ఆన్ గ్రంథము భగవంతుడు సృష్టికర్త యనియే కాక సర్వావస్థలయందును పోషకుడనికూడ చెప్పుచున్నది

ఇంక రెండవ నామము 'రహ్మాన్' ఈ శబ్దమును 'వరదుడు' అని నే నాంధ్రీకరించితిని రహ్మాన్ అనగా శ్రేష్ఠమగు వస్తువుల నిచ్చువాడని అర్థము. భగవంతుడు మన కిచ్చుచుండిన శ్రేష్ఠమగు వస్తువు లెవ్వి ? ఎట్లిచ్చుచున్నాడు ? ఎవరి కిచ్చుచున్నాడు ? అని ప్రశ్నలు సహజముగ నుత్పన్నమగును. ఈ ప్రశ్నలకు ఖుర్ఆన్ గ్రంథమున స్పష్టమగు ప్రత్యుత్తరము లీయబడినవి

భగవంతుడు సృష్టికర్త, మన స్థితికి కారకుడు అన్నవిషయము 'రబ్' నామమునందిమిడియున్నదని చెప్పియుంటిని. అట్టి సృష్టికి శ్రేష్ఠత్వమును సౌందర్యమును ఆపాదించువాడుకూడ భగవంతుడు. ప్రకృతియందు కేవలము నిర్మాణకౌశలమే కాక, సౌందర్యాపాదనాశక్తియు కనిపించుచున్నది. అందుచేతనే ప్రతి వస్తువు సుందరమగుచున్నది.

---

* ఆ బ్రహ్మవేత్తలు ధ్యానయోగము ననుసరించినవారై ఏ అద్వితీయుడగు పరమాత్మ కాలము మొదలుకొని పురుషునివరకు గల ఆ కారణముల నన్నిటిని నియమించుచున్నాడో అట్టి పరమాత్మయొక్క సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వాది గుణములచేత నిగూఢమైనట్టి ప్రకాశస్వరూపుడగు పరమాత్మయొక్క జగ దుత్పత్తిస్థితి లయ నియమనశక్తిని జగత్కారణముగా నెఱింగిరి.

పువ్వులయందు పరిమళము, పక్షుల కలకంఠము, వృక్షముల మనో హర వర్ణములు, జంతువుల నయనానందకరమగు వింతరంగులు, సూర్యుని తేజస్సు, చంద్రుని వెన్నెల, నక్షత్రముల వింతకాంతులు, శిలలయందలి చిత్రవర్ణములు, సీతాకోకచిలుకరెక్కల సవరింపు, మిణు గురుపురువుల మేలిమివెలుగు—సౌందర్యాపాదకములగు ఇవన్నియు భగ వత్సృష్టికి అమూల్యాభరణములు సృష్టివ్యాపారమునందు అలంకృతికూడ కన్పించుచున్నది. ఈఅలంకారగుణమే 'రహ్మత్' అని ఖుర్ఆన్ చెప్పు చున్నది. సౌందర్యము, శ్రేష్ఠత్వము లేని సృష్టి ఎడారివంటిది. దానిలో ఆనందములేదు. అందుచే భగవంతుడు ప్రతి వస్తువునందును శ్రేష్ఠత్వ మును సౌందర్యము నుంచెను.

"ప్రతి వస్తువును సౌందర్యవంతముగను శ్రేష్ఠముగను నిర్మించిన భగవంతుడు కళాకారుడు" (సున అల్లాహిల్లజీ అత్ ఖన కుల్లషై ఇన్")

నేను సృష్టించిన ప్రతి వస్తువును సుందరముగనే నిర్మించితిని." (అల్లజీ అహ్సన కుల్లషై ఇన్ ఖలఖహు)

"సౌందర్యాపాదకమగు నా శక్తి సమస్త వస్తువులను పరివేష్టించి యున్నది." (వరహ్మతి వసిఅత్ కుల్లషైఇన్) అని ఖుర్ఆన వాకొనుచున్నది.

భగవంతుని సృష్టిలో మరొక విశేషము కలదు. ప్రతి వస్తువు మన ఉపయోగమునకే సృష్టింపబడినది అనుపయుక్తమగువస్తు వేదియు సృష్టియందు లేదు. ఇదికూడ భగవంతుని వరదాయకత్వమే.

ఇంక ఈ వరదాయకత్వము, ఈ శ్రేష్ఠత్వ సౌందర్యాపాదకమగు శక్తి ఎట్లు ప్రకాశమునకు వచ్చుచున్నవి ? భగవంతుడు ప్రకృతిని కొన్ని నియమములచే బంధించినాడు. ఆ నియమములకు లోబడి ఈ శక్తులు క్రమముగ పరిణమించి పరిపక్వదశను పొందును. ఈ క్రమవికాసధర్మము కూడ భగవంతుని వరదాయకత్వగుణము వలననే యేర్పడినదని ఖుర్ఆన్

చెప్పుచున్నది. ఈ ప్రకృతి పరిణామధర్మమునకు లోబడియే సర్వసృష్టియు నడచుచున్నది.

భగవంతుని అనంతమగు వరప్రసాదత్వమున అందరకును భాగమున్నది. సృష్టియందలి వరములు అందరిసొత్తుగా భగవంతుడు నియమించినాడు. సూర్యుడు దుష్టులకును సజ్జనులకును ఒకేవిధమగు లాభమును కలిగించుచున్నాడు కాని దుర్మార్గులు భగవంతుని వరములను దుష్టమార్గమున వినియోగించుచున్నారు దాని ఫలము వారి కప్పుడే కలుగును.

ఈశ్వరదత్తమగు వరములను తమ ఆత్మోత్థానమునకును జన్మసాఫల్యమునకును ఉపయోగించుకొనక దౌర్మార్గ్యమునకై వినియోగించినచో వెంటనే శిక్ష దొరుకును. అగ్నిని స్పృశించిన కాలును సముద్రములో దుమికిన మునిగి చావవలసివచ్చును కాని అగ్ని, నీరు — ఇవి భగవంతుని అత్యంత శ్రేష్ఠమగు వరములలో చేరినవి. వానిని మనము దుర్వినియోగముచేయుచో అవి ప్రాణాంతకమగును సృష్టియందు అపకారకరమును, హేయమును అగు వస్తు వేదియును లేదు వాని దుర్వినియోగమే వాటియం దపకారభీతియు హేయభావమును కలిగించుచున్నది

మన ప్రతిసేతకును ప్రతిఫల మున్నది అది దైవనిర్ణీతము — ప్రకృతియందే ఆ నియమము స్థగితమై యున్నది. సేతకు ప్రతిసేత కల్గించు శక్తి ఒక భగవద్విభూతి, ఈ ఆధ్యాయమందలి నాల్గవగుణము ఈ విభూతినే వర్ణించుచున్నది ("మాలికెయామిద్దీన్") (అవసానదినమునాటి న్యాయాధినేత.)

ప్రకృతియందు బాధ, తన్నివారక సాధనములు — రెండును ఒకదానివెంబడి ఒకటి కన్పించుచున్నవి. ఈ ధర్మము ఒక జీవకణము మొదలు బ్రహ్మాండమువరకును గల సమస్త జీవులయందును పని చేయుచున్నది మనము కాలుజారి నీటపడినప్పుడు నీరు వెంటనే ముంచి చంపదు అది ముందు పైకి తేల్చును. ఏదేని విషక్రిమి మనదేహమున ప్రవేశించి

నపుడు ఇంతకుముందే దేహమున నున్న అనేక క్రిములు దానిని ముట్టడించును. ఇది శరీరశాస్త్రజ్ఞుల కందరకును తెలిసిన సామాన్యవిషయము. ఎట్టి కార్యమున కెట్టి ఫలము కలుగవలెనో ఆ నియమము సృష్టియందే యున్నది కాని మానవజీవితము యేకకార్యనిర్మితము కాదు మనము చేయు లక్షలకొలది పనులు, మాట్లాడు లక్షలకొలది మాటలు, తలచు లక్షలాది తలపులు——వీటి అన్నిటివలన కలిగిన సామూహికఫలమును మరణానంతరమే నిర్ణయింపవలెను ఎందుకనగా ఆ ఫలము మనము జీవితకాల మంతటను కావించిన సమస్త కర్మలయొక్కయు, పలికిన సమస్త భాషణములయొక్కయు, తలచిన సమస్త భావములయొక్కయు సామూహికపలము. ఆ ఫలము సహితము భగవంతుని అనుల్లంఘనీయ మగు ప్రకృతిధర్మము ననుసరించియే యుండును. ''భగవన్నియమములలో యెట్టి మార్పును కలుగజాలదు'' (ఖు. ౩౦ : ౩౦) అట్టి సామూహికఫలమును తుదిదినమున నిర్ణయించువాడు భగవంతుడు ఇది భగవంతుని ముఖ్య విభూతులలో నొకటి మన మరణానంతర జీవితము దీనిపైననే ఆధార పడియున్నది.

ఇట్లు భగవత్స్వరూప నిర్ణయమునుగావించి, ముఖ్యమగు భగవద్విభూతులను వివరించి ఈ అధ్యాయ మింక మానవునకును భగవంతునకును మధ్య నుండవలసిన సంబంధమును నిర్వచించుచున్నది.

"నిన్ను తప్ప మరెవ్వరిని మే మారాధింపము" అని ప్రతిజ్ఞ చేయుమని భగవంతు డాజ్ఞాపించుచున్నాడు.

'భగవంతుడు ఒకడు' అని మతము లన్నియు ఏదో ఒకవిధముగ చెప్పుచున్నవి కాని ఆ ఏకేశ్వరునే ఆరాధించు మతములు లేవు వాయ్వాది భూతములను ప్రత్యక్షదైవతములుగా ఆరాధించు పద్ధతులు ఉపనిషత్తుల యందుసైతము చెప్పబడినది (తైత్తి. నారా. ప్ర) ఖుర్ఆన్ భగవంతు డొక్కడే ఆరాధ్యుడు, అతనిని తప్ప మరెవ్వరిని ఆరాధింపకూడదు.

"నీ సహాయమునే నే మపేక్షింతుము మరెవ్వరి సహాయమునూ మా కక్కరలేదు" అని మానవునికడనుండి ప్రతిజ్ఞను గొనుచున్నది "ఇన్ద్రఃపురపతు నస్స్వస్తి దాం"* "నమో రుద్రాయ విష్ణవే మృత్యుర్మేపాహి"♦ "మేధాం మ ఇన్ద్రోదదాతు మేధాం దేవీసరస్వతీ మేధాం మే అశ్వినా వుభావాధత్తాం పుష్కరస్రజా" .. ఇత్యాది వివిధ దేవతారాధనాసూచకములగు ఎన్నో వాక్యములు ఉపనిషద్గ్రంథము లందు సైతము కన్పించుచున్నవి ఖుర్ఆన్ ఇట్లు ఒక్కొక్క కోరిక కొక్కొక్క దేవతను ప్రార్థించు విధానమును ఖండించినది భగవంతు నొక్కనే ఆరాధింపవలెను. "అతనికడ నుండియే సహాయమును వేడవలెను" అని ఖుర్ఆన్ చెప్పుచున్నది.

అందుచేతనే మోక్షమార్గమును చూపుమని భక్తుడు భగవంతునే ప్రార్థించుచున్నాడు :—

"ప్రభూ! మోక్షము లభించు తిన్ననిమార్గమును మాకు చూపుము నీ అనుగ్రహమునకు పాత్రులైనవారి మార్గమునే మాకు చూపుము నీ ఆగ్రహమునకు గురియైన వారి మార్గమునుండి మమ్ము తప్పింపుము"

ఇట్లు ఖుర్ఆన్ భగవంతుని స్పష్టముగ నిరూపించుచున్నది ఈ నిరూపణము శ్వేతాశ్వతరోపనిషత్తునందలి యీ క్రింది భావములతో సామరస్యము కలిగియున్నది :—

న తస్య కార్యం కరణఞ్చ విద్యతే
న తత్సమశ్చాప్యధికశ్చ దృశ్యతే,

---

* వర్షము కురిపించువాడును సుఖము నొసగువాడును, అభయ మొసగువాడును అగు ఇంద్రుడు మా సంరక్షణార్థము ముందు వచ్చుగాక.

♦ రుద్రుని కొఱకును విష్ణువు కొఱకును నమస్కారము అగుగాక ఓ రుద్ర విష్ణువులారా! నన్ను మృత్యువునుండి రక్షింపుడు.

...ఇంద్రుడు, సరస్వతీదేవియు, పద్మమాలాలంకృతులగు అశ్వినీదేవత లిద్దరును నాకు మేధను కలుగజేయుదురుగాక

తైత్తిరీయోపనిషత్ నారాయణప్రశ్నాంతర్గతము.

# ప్రారంభాధ్యాయ వ్యాఖ్యానము

పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ॥

న తస్య కశ్చిత్పతిరస్తి లోకే
న చేశితా నైవ చ తస్య లిఙ్గమ్
స కారణం కరణాధిపాధిపో
న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః॥

[VI : 8, 9]

ఆ పరమేశ్వరునకు శరీరముగాని చక్షురాదీంద్రియములుగాని లేవు ఆ పరమేశ్వరునితో సముడుగాని అధికుడుగాని ఎవ్వడు కనపడడు ఆ పరమేశ్వరుని శ్రేష్ఠమైన శక్తి నానావిధమైనదిగా వేదములందు ప్రతిపాదింపబడుచున్నది ఆ ఈశ్వరశక్తి స్వాభావికమైనది, సర్వవిషయ జ్ఞానప్రవృత్తియు, స్వసన్నిధిమాత్రముచేత సర్వము స్వాధీనముచేసుకొని నియమించునదియునై యున్నది

ఆ పరమేశ్వరుడు కార్యకారణాదిశూన్యుడగుటచేత అతనికి ప్రభువుగాని నియంతగాని లేడు, అతడిట్టివాడని ఊహించుటకు లింగభూతమైన చిహ్నముగాని లేదు అతడే సర్వకారణభూతుడు అతడే ఇంద్రియాధిష్ఠాన దేవతలగు సూర్యాదిదేవతలకు ప్రభువు అతనికి జనకుడుగాని, అతనికంటె అధికుడుగాని మఱొక్కడు లేడు )



# అధ్యాయము ౨

## గోవు*

(బఖరా)

కరుణామయుడును వరప్రదాయకుడును అగు

అల్లాఃనామస్మరణముతో (ప్రారంభించు చున్నాను)

### మొదటి ఖండము

1. అలిఫ్ - లామ్ - మీమ్.౧

2. ఇది భగవత్ప్రోక్తమగు గ్రంథము. దీన సంశయ మేమియును లేదు. సన్మార్గప్రవర్తకుల కిది మోక్షమార్గమును చూపును.

3. అతీంద్రియములైన తత్వములను విశ్వసించువారును,౨,౩ ప్రార్థనమునందు నిశ్చలబుద్ధి కలవారును,౪ మేముప్రసాదించిన సంపదను ధర్మమార్గమున వ్యయపరచువారును,౫

4 నీకు (శ్రీ మొహమ్మద్ ప్రవక్తకు) ఈయబడిన భగవద్గ్రంథమునందును, పూర్వప్రవక్తల కీయబడిన భగవద్గ్రంథములయందును (శ్రద్ధాపూర్వకముగ) విశ్వాసముంచువారును,౬ మరణానంతరజీవితముపై విశ్వాసముగలవారును-౭

5. వీరే భగవన్మార్గమున నడచువారు. వీరే (ఈ లోకమునందును, పరలోకమునందును) జయశ్రీని పొందువారు.

6. కాని ఎవరు నిశ్చలమగు ఆస్తిక్యబుద్ధిని విడనాడి తిరస్కారమును చూపిరో వారిని నీవు భయపెట్టినను భయపెట్టకపోయినను ఒకటే. వారింక విశ్వసింపరు ౮

7. వారి హృదయములును చెవులును ముద్రాబద్ధములు కావింపబడినవి. వారి కండ్లు పొరలు గ్రమ్మినవి.౯ వారు ఘోరశిక్షకు పాత్రులగుదురు.

### రెండవ ఖండము*

8. మరికొంద రున్నారు, వారిట్లందురు: "మాకు అల్లాః యందును కర్మపరీక్షాదినము నందును విశ్వాసము కలదు."

9. కాని వాస్తవముగ వారి కట్టి విశ్వాసము లేదు. వారు అల్లాఃను విశ్వాసవంతులను మోసగింపజూచువారు. గ్రహింపలేరు గాని వారు తమ్ము తామే మోసగించుకొనుచున్నారు.

10. వారి హృదయములు అవిశ్వాసజాడ్యపీడితములు. భగవంతుడా జాడ్యమును ప్రకోపింపజేసినాడు. ఇట్టి వారికై ఘోరశిక్ష వేచియున్నది ఎందుకనగా వారసత్యవాదులు, మోసగాండ్రు.

11. "ప్రపంచములో దౌర్మార్గ్యమును వ్యాపింపజేయకుడు" అని వారితో చెప్పినపుడు, వారు "మేము లోకసంస్కర్తలము" అని (దంబములు) పలుకుదురు.

12. (జ్ఞాపకముంచుకొనుము) నిశ్చయముగ వారే దౌర్మార్గ్యమును విస్తరింపజేయువారు. అది వారికి తెలియదు.

13. "మీరు కూడ విశ్వాసవంతుల వలె సన్మార్గము ననుసరింపుడు" అని వారితో చెప్పినపుడు, వారు "ఏమీ! మేము ఈ బుద్ధిహీనుల వలె విశ్వసింతుమా?" అందురు. జ్ఞాపకముంచుకొనుము: వీరే వాస్తవముగ బుద్ధిహీనులు; వారి కది తెలియదు.

14. (ఈ సందేశమును) విశ్వసించినవారితో కలిసినప్పుడు "ఆ సందేశమునందు మాకు కూడ నమ్మకము కలదు" అని వారందురు. కాని దుర్మార్గులగు తమ సహచరులను కలిసినపుడు "మేము మీలోని వారమే; వారిని పరిహసించుటకు మాత్ర మట్లు చెప్పితిమి." అందురు.

15. కాని వాస్తవముగ వారే పరిహాసపాత్రు లగుచున్నారు. వారి పరిహాసమునకు ఫలము భగవంతుడు వారికిచ్చును. వారట్లే అంధకారపథముల నడచుచుందురు.

16. జ్ఞానమును విక్రయించి అజ్ఞానమును కొన్న మూఢులు వీరు. దీనివలన వారికేమియు లాభము కలుగకపోవుటయే గాక వారు జ్ఞానమార్గమును సహితము కోల్పోయిరి (ఈ విధముగ వారు రెంటికి చెడిన రేవడలైరి)

17. ఒకడు అగ్నిని ప్రజ్వలింపజేసెను. నలుదిక్కుల కాంతి పర్విన పిదప హఠాత్తుగా దేవు డా కాంతిని హరించెను. అంధకారము మిగిలెను వా రంధప్రాయులైరి. వారి స్థితి కిది ఉపమానము.౧౦

18. వారు చెవిటివాండ్రు, గ్రుడ్డివాండ్రు, మూగవాండ్రు. అట్టి వారు సన్మార్గమునకు రాలేరు.

19. (వారి స్థితికి మరియొక దృష్టాంత మీయవచ్చును.) వర్షదములగు కారుమబ్బులతో ఉరుములు మెరుములు నుండును. మేఘావృతమైన ఆకాశమున చీకటి క్రమ్మియుండును. ఉరుములు భూమిని కంపింప జేయును. మెరుములు కన్నులు మిరుమిట్లు గొల్పును. పిడుగులు భయము గొల్పును. ప్రపంచమంతయు నీటి కొఱకు నోరు తెరచి కొనియున్నప్పుడు దేవుడు వర్షమును కురిపించుటకై మేఘములను పంపగా, వర్షము వలన కలుగు లాభమును గ్రహించలేక, మేఘము ఉరుము చున్నప్పుడు వీరు మృత్యుభయమును పొందుచున్నారు. చెవులలో వ్రేళ్ళను దూర్చుకొనుచున్నారు వా రే స్థితియందున్నను భగవంతుడు వారి నావరించియే యున్నాడు.

20. మెఱుపు వారి కన్నుల మిరుమిట్లు కొల్పును. మెరిసినప్పుడు ఆ వెలుతురులో కొన్ని అడుగులు ముందుకువైచి చీకటి ముసురుకొని రాగా వా రాగిపోదురు. (కటికచీకటి! ముందడుగిడలేరు! గుండెలదురు! అయ్యో! వర్షము వలన కలుగు భాగ్యమునకు ప్రపంచమంతయు ఆనందించుచుండగా ఈ నిర్భాగ్యులిట్లు తల్లడిల్లుచున్నారు.) దేవుడిచ్ఛించుచో వీరు అంధులుగను బధిరులుగను ఉండవలసినవారే. (వీరు చెవులలో వ్రేళ్ళు దూర్చుకొని మెరుములను చూచి అడలవలసిన అవసరము లేకుండెడిది) దేవునకు సమస్తవస్తువులపైనను అధికారము కలదు.

## మూడవ ఖండము

21. మానవులారా! మిమ్ములను మీ పూర్వులను సృష్టించిన మీ ప్రభువును సేవింపుడు. దుష్పథమునుండి మీరు రక్షింపబడుదురు.౧౧

22. మీరు విశ్రాంతిని బడయుటకై భూమిని సృజించినాడు. నభోమండలము నుండి భూమిపై వర్షమును కురిపించుచున్నాడు. దాని వలన పచ్చనిపైరులచే భూమి శోభాయమాన మగుచున్నది. ఆహారార్థము వివిధములైన ఫలము లుత్పన్న మగుచున్నవి. ఇదంతయు చేయుచున్నది ఏకేశ్వరుడే నని మీకు తెలియదా? మరియు (అద్వితీయుడగు) అతనితో నితరులను కలిపి అతనికి సమానులని ఏల పేర్కొందురు? (ఎఱిగియుండియు నట్లేల చేయుదురు?)[౧౨]

23. నాచే ప్రోక్తమై, నా ప్రవక్త మీకు వినిపించు ఈ సందేశమును మీరు నమ్మనిచో దీనికి సమానమైన ఒక్క అధ్యాయమును రచించి తీసికొని రండు. మీరు సత్యవాదులే యగుచో మీ సహాయులను కూడ పిల్వుడు. (అప్పుడైనను వ్రాయగలరేమో)

24. మీ రట్లు చేయలేరు. అది నిశ్చయము అట్టిచో సత్యము నేల నిరాకరింతురు? సత్యమును నిరాకరించు వారికై సిద్ధముగనున్న మానవులును పాషాణములును ఇంధనములుగా గల అగ్నిజ్వాలలకు భయపడుడు.[౧౩]

25. (ప్రవక్త మీకు వినిపించు) సందేశమును విశ్వసించు సత్కార్యాచరణపరులకు ఈ సువార్తను తెలుపుము. నిర్ఝరులు ప్రవహించు ఆనందోద్యానములు వారికై సిద్ధముగ నున్నవి. స్వర్గఫలమును పొందుచూ వారు "మా కిట్టి ఫలమే వాగ్దత్త మీయబడినది." అని చెప్పుదురు. వారి కట్టి ఫలమునే దేవుడు ప్రసాదించును. వారికక్కడ పవిత్రలగు సుందరుల సహవాసభాగ్యము లభించును. వారు నిత్యము ఆనందధామముననే వసింతురు.

26. సామాన్యజ్ఞానదుర్గ్రాహ్యమగు మహత్తర విషయములను మీకు బోధించుటకై భగవంతుడు ఎంతటి చిన్నవస్తువుల నైనను— దోమనైనను సరే—దృష్టాంతములుగ తీసుకొనును. విశ్వాసముగల వారు ఈ దృష్టాంతముల యథార్థభావమును గ్రహించి ఇదంతయు ఈశ్వరప్రోకమనియే నమ్ముదురు. విశ్వాసము లేనివారు "ఈ కథల

అర్థమేమి ?" అని (పరిహాసగర్భితముగ) అందురు. అనేకులకు ఇట్టి ఉప మానముల వలన సత్యము తేటతెల్లమగును ; వారు సన్మార్గము నవ లంబింతురు. (ఆ ఉపమానముల వలన) అనేకులకు భ్రమయును కలుగును. వారు దౌష్ట్యముననే నిమగ్నులై యుందురు. మౌర్ఖ్యముచే సత్యమును గ్రహింపనివారిని తప్ప మరెవ్వరిని భగవంతుడు భ్రమ యందు పడద్రోయడు.

27. (అసత్యవాదులును అధర్మాచరణపరులును ఎట్టి వారు?) దైవనిర్ణీత మైన ధర్మమునకు సమ్మతించి, తరువాత దానిని నిరాకరించు వారు, ఐక్యము కలిగించవలసినపట్ల, విభేదము కలిగించువారు, (తమ దుష్కార్మలచే) దేశమునందు అంతఃకలహములను కలిగించువారు—ఇట్టి దుష్కార్యముల వలన కలుగు నష్టములను వారే అనుభవింతురు.

28. (మానవులారా!) జడమునుండి మిమ్ములను సృజించి మీకు ప్రాణదాన మొసగిన దేవుని ఎట్లు నిరాకరించగలరు? అతడే మీ జీవితాంతమున మరణము నొసగి తిరిగి ప్రాణదానము చేయును. మీరు తుదకు ఈశ్వరసాన్నిధ్యముననే మరలుదురు.

29. ఈ భూమిపై నున్న సమస్తవస్తుజాలమును మీకొఱకై సృజించినది అతడే కదా? తరువాత మీకొఱకతడు ఏడూర్ధ్వగతులను సృజించెను.౧౪ అతడు సర్వజ్ఞుడు.

## నాల్గవ ఖండము*

30. (ఓ ప్రవక్తా!) నీ ప్రభువు దేవతల నుద్దేశించి "భూమిపై నా ప్రతినిధి నొకని సృష్టింప దలచితిని" అనెను. అప్పుడు దేవతలు, (నమ్రులై) "దౌర్మార్గ్యము నవలంబించి రక్తమును స్రవింపజేయు జీవిని ప్రతినిధిగా నియమింతువా? నీ మహిమను నీ పావిత్ర్యమును మేము సదా కీర్తించుచున్నాము" అనిరి.

"నేను ఏ సత్యమును నిర్దేశించి ఈ సృష్టికార్యమును చేయుచున్నానో అట్టి నా మహాభావమును మీరు తెలిసికొనలేరు." అని దేవుడు వారికి సమాధాన మొసగెను.

31. దేవుడు ఆదమునకు (మానవునకు) సర్వవస్తు పరిజ్ఞానమును ప్రసాదించెను.[౧౩] అప్పుడా సర్వవస్తుజాలమును దేవతలకు చూపించి, మీకు తెలిసినచో ఈ వస్తువుల (తత్వములను) పేర్కొనుడు" అని అడిగెను.

32. అప్పుడు దేవతలు నమ్రులై "ఈశ్వరా! సమస్త మహత్తు నీదేను. నీవు మాకు ప్రసాదించినది తప్ప మాకు మరే ఇతర జ్ఞానమును లేదు. నీవు సర్వజ్ఞుడవు, ప్రజ్ఞానిధివి" అనిరి.

33. అప్పుడతడు ఆదమునుద్దేశించి, "ఆదమ్! ఈ వస్తువుల స్వరూపమును దేవతలకు బోధింపుము" అని ఆజ్ఞాపించెను.

ఆదమ్ (సమస్త వస్తుస్వరూపమును) బోధించెను.

అప్పుడు దేవుడిట్లనియె: "భూమ్యాకాశములందున్న సమస్త రహస్యములను నే నెఱుగుదునని మీకు చెప్పియుండ లేదా? మీరు ప్రకటించునదియు దాచునదియు అంతయు నే నెఱుగుదును."

34. "ఆదమునకు సాష్టాంగ పడుడు" అని దేవతలకు నే నాజ్ఞాపించితిని. ఇబ్లీస్ తప్ప తక్కిన వారందఱును సాష్టాంగపడిరి. ఇబ్లీస్ గర్వించి ఈశ్వరాజ్ఞను తిరస్కరించెను వాడు విశ్వాస హీనుడు.[౧౪]

35. అప్పుడు ఆదమునకిట్లాజ్ఞాపించితిని: "ఓ ఆదమ్! నీవును నీ భార్యయు ఈ స్వర్గోద్యానమున నివసింపుడు. సంతుష్టికరముగ తినుడు, త్రాగుడు; శాంతిప్రదమైన జీవితమును గడుపుడు. ఇక్కడ ఒక చెట్టున్నది. దాని పొంత పోవలదు సుమా. మీరు దాని కడకు పోతిరా చెడిపోదురు. మీరు మీహద్దుల నతిక్రమించినవా రగుదురు"

36. కాని సైతాన్ వారి నిగ్రహశక్తిని తొలగించి ధర్మస్థానమునుండి వారిని పడద్రోసెను. అప్పుడు నే నిట్లంటిని: "ఇంక మీరి క్కడినుండి తొలగిపొండు. మీలో మీకు శత్రువులున్నారు. భూమిపై

మీకు నివాసమును, కొంతకాలము వరకు సరిపోవు ఆహారమును కలదు."

37. ఆదమ్ తన ప్రభువు కడనుండి అధ్యాత్మజ్ఞానమును పొందినవాడై ఆ సర్వేశ్వరుని (పశ్చాత్తప్త హృదయముతో) ప్రార్థించెను. (దేవుడతనియెడ కరుణించెను) దేవుడు దయానిధి. కరుణించుటలో అతనికి సమాను లెవ్వరును లేరు.

38. అప్పుడు నేని ట్లాజ్ఞాపించితిని : "మీ రిక్కడనుండి ఇక పొండు. క్రొత్తజీవనము నవలంబింపుడు. నిశ్చయముగ నా కడనుండి మీకు ధర్మప్రబోధము కల్గును. దాని ననుసరించినచో మిమ్మే భయశోకము లంటవు.

39 కాని దానిని నిరాకరించి అవిశ్వాసమును చూపినవారు నరకాగ్నికి ఇంధనములగుదురు, నిరంతరము నరక యాతనకు పాలగుదురు."

## ఐదవ ఖండము*

40. ఓ ఇస్రాయీల్ వంశీయులారా ! నా అనుగ్రహములను జ్ఞప్తికి తెచ్చుకొనుడు. (నా ఆజ్ఞలను శిరసావహించి సన్మార్గప్రవర్తనులమై యుందుమను) మీ ప్రతిజ్ఞలకు బద్ధులై యుండుడు. నేనుకూడ (సన్మార్గప్రవర్తనులకు ఇహపరలోకములందు జయశ్రీ నొసగుదునన్న) నావాగ్దానమును నెరవేర్తును. నేను తప్ప మరెవ్వరును లేరు. నాకు తప్ప మరెవ్వరికిని భయపడకుడు. (నాయందు భయభక్తు లుంచుడు)

41. నాచే ప్రోక్తమైన ధర్మము ననుసరింపుడు. మీ కింతకుముం దిచ్చిన ధర్మముతో దీనిని పోల్చుకొనుడు. దానిని నిర్ధారించుటకు మాత్రమే ఇది నూతనముగ ప్రోక్తమైనది. ఈ ధర్మము నిరాకరించుటలో ముందడుగు వేయకుడు. నా ధర్మమును తుచ్ఛమగు మూల్యమునకు అమ్మివేయకుడు. నేను తప్ప మరెవ్వరును లేరు. అందుచే నన్ను నిరాకరించుట యనెడు (మహాదోషము) నుండి రక్షింపబడుడు.

42. సత్యముతో అసత్యమును కలిపివేయకుడు. తెలిసియూ సత్యమును దాచకుడు.

43. ఉపాసనమును (నమాజును) విడువకుడు. 'జకాతు' ౧౩ నీయుడు. నతులొనర్చెడివారితో మీరును వినతులుగండు.

44. ప్రజలకు సన్మార్గము నుపదేశించి, భగవత్ప్రోక్తమగు గ్రంథమును చదివియూ మిమ్ములను మీరు మరచియుందురా? (మీరు ఇతరుల కుపదేశించినది స్వయముగ నాచరింపవలెనను) జ్ఞానము మీకు లేదా? (ధర్మగ్రంథమును చదువుచుండిన మీరే ఇట్లు చేతురా?)

45. ఓర్పు వహించి ప్రార్థనముల సల్పి భగవత్సహాయమును కోరుడు. దైవభీతిపరులకు తప్ప తక్కినవారి కిది కష్టతరసాధ్యమే. కాని సాత్త్వికులకును, 46. తమకు దేవుని సాన్నిధ్యభాగ్యము కలుగు ననియు తుద కతని కడకే మరలువార మనియు దృఢవిశ్వాసము కల వారికిని ఇది సులభము. (తామసులకును, విశ్వాసహీనులకును మాత్రమే అది కష్టసాధ్యము.)

## ఆరవ ఖండము ౧౪

47. ఓ ఇస్రాయీల్ వంశీయులారా! నా అనుగ్రహములను జ్ఞప్తికి తెచ్చికొనుడు. ప్రపంచములోని సమస్త జాతులలోను మిమ్ముల నుత్తమజాతిగా నొనర్చితిని కదా!

48. జాగ్రత్త! ఒక దినము వచ్చును. నాడు ఎవరూ ఎవరికి సహాయముచేయ రారు. మిమ్ములను వెంటబెట్టుకొని రక్షించుట కెవ్వరును రారు. మీ పాపముల కేదియు పరిహారముగా గ్రహింపబడదు. మరే విధమైన సహాయమును మీకు లభింపదు. ౧౫

49. జ్ఞాపక ముంచుకొనుడు. మీరు ఫిర్జౌన్ సంతతివారికి బానిసలై యుండిరి. వారు మిమ్ములను నానా బాధలను పెట్టిరి. మీ మగశిశువులను సంహరించి స్త్రీలనే విడిచిపెట్టుచుండిరి. అది భగవంతుడు మీకు పెట్టిన ఒక కఠినపరీక్ష. (మిమ్ములను ఆ దుర్భర పారతంత్ర్యమునుండి విముక్తులనొనర్చితిని.)

50. మీరు చూచుచుండగనే ఫిర్ జౌన్ సమస్త సైన్యమును సముద్రగర్భమున ముంచివైచి మిమ్ములను రక్షించితిని.

51. మూసాకు నేను నలువది రాత్రుల ఆజ్ఞ యొసగినప్పుడు (అత డా నలువదిదినములు మిమ్ములను విడిచి తూర్ పర్వతమునకు వెళ్లిపోయెను ) అప్పుడు మీరు గోవత్సమును పూజింపసాగిరి. సత్యమార్గమునుండి తొలగిపోతిరి.

52. కాని నా కరుణాళుత్వము నప్పుడైనను మీరు గుర్తెఱుగుదురేమో నని, మీ తప్పును నేను మన్నించితిని.

53 అప్పుడు ధర్మాధర్మ విచక్షణమునకును, మీకు ఐహికాముష్మికసాధన మగుటకును ఒక మహాగ్రంథమును మూసాకు ప్రసాదించితిని.

54. (మూసా తూర్ పర్వతమునుండి తిరిగి వచ్చుసరికి మీరు గోవత్సమును పూజించుటయందు నిమగ్నులై యుండిరి ) అప్పుడు మీతో మూసా ఇట్లనెను : "ఓ నా జాతీయులారా ! (ఇదేమి !) మిమ్ములను మీ రిట్లు పతితుల నొనర్చుకొనెద రేల ? ఇప్పుడైనను పశ్చాత్తాపపడి భగవత్సాన్నిధ్యమునకు మరలుడు. అప్పుడే భగవంతుడు మిమ్ములను క్షమించును. భగవంతుడు కరుణామయుడు, క్షమాసముద్రుడు."

55. అప్పుడు మీ రిట్లనిరి : "ఓ మూసా ! భగవంతుని ప్రత్యక్షముగా చూచువరకు మేము విశ్వసింపము."

అప్పుడే మీరు చూచుచుండగనే పిడుగులు కురిసెను. మీరు విభ్రాంతులై స్పృహతప్పి పడిపోతిరి.—౨౦

56. కృతజ్ఞులగుదురేమోనని శవములవలె పడియున్న మిమ్ములను మరల తెప్పిరిల జేసితిని.

57. మీకు నీడ నిచ్చుటకై మేఘములను పంపితిని. 'మన్నా' 'సల్వా' అను ఆహారములను పంపితిని. "మీకై పంపబడిన ఈ దివ్యాహారము నారగింపుడు" (అని మీ కాజ్ఞాపించితిని. దీని తరువాత కూడ

మీరు కృతఘ్నతాగుణము విడువరైరి) ఐతే దీని వలన నష్ట మెవరికి కలిగి నది ?

58. (ఇదికూడ జ్ఞప్తికి తెచ్చుకొనుడు మే మప్పుడు మీతో నిట్లంటిమి)

"ఈ పురమును ప్రవేశింపుడు. సంతుష్టికరముగ భుజింపుడు. నగరద్వారమును ప్రవేశించునపుడు ప్రణమిల్లి, "ప్రభూ! మోయలేని మా భారమును తొలగింపుము" అని ప్రార్థింపుడు. మీ తప్పుల నప్పుడు క్షమింతును. మీలో పరోపకారపరులకు ఇంకను ఎక్కువగా శుభములను ప్రసాదింతును.

59. కాని మీలోని దుర్మార్గులు కొందరు నాచే ప్రోక్తమైన వాక్కుల నొకదాని కొకటి మార్చి (దౌర్మార్గ్యమున మగ్నులైపోయిరి.) అట్టి దుర్మార్గులకొఱకు ఆకాశమునుండి ఒక శిక్షను పంపించితిని. తిరిగి తిరిగి దౌష్ట్యము నొనర్చువారి కదే శిక్ష.—౧

## ఏడవ ఖండము

60. (ఇదికూడ జ్ఞాపక ముంచుకొనుడు). తన దేశస్థులకొఱకు మూసా నీరు కావలెనని కోరినప్పుడు మేమి ట్లాజ్ఞాపించితిమి: "నీ చేతికఱ్ఱతో ఆ కొండరాతిపై కొట్టుము." (మూసా ఆ ఆజ్ఞను శిరసా వహించెను) అప్పుడు దానినుండి పండ్రెండు సెలయేళ్ళు ఉత్పన్నమాయెను. అన్ని తెగలును తమకొఱకు ప్రత్యేక జలాశయములను కనుగొనెను. (నిర్జలమును, సస్యహీనమును అగు ఆ ప్రదేశమున మీకై అన్నపానీయములను పుష్కలముగ కల్పించితిని, ఇక) తినుడు; త్రాగుడు. భగవంతుడు ప్రసాదించిన ఈ సమస్త వస్తుజాలమునుండి లాభమును పొందుడు. (ఈ వస్తుసంపదయందలి లోభమోహములకు లోనై) దేశమున కలహములను మాత్రము పెంపకుడు.

61. (మీ చరిత్రలో ఈ ఘట్టమునుకూడ జ్ఞాపక ముంచుకొనుడు.) మీరు మూసాతో, "ఓ మూసా! మే మెప్పుడును ఒకే విధముగు ఆహారమును తిని యుండజాలము. (ఈజిప్టులో నున్నప్పుడు మేము తిను

చుండిన) వివిధములైన కూరగాయలు, గోధుమలు, పప్పు, ఉల్లి, వెల్లుల్లి మొదలైన సమస్త ఆహారపదార్థములును మాకు కలుగునట్లు భగవంతుని ప్రార్థింపుము" అంటిరి. అప్పుడు మూసా ఇట్లనియె : "(మీ మరుపు యెంత శోచనీయము !) తుచ్ఛమగు ఈ కోరికను తీర్చుకొనుటకై (శుభోదర్కమగు ఈ మహదాదర్శమును) విడనాడజూతురా ? (మీ దౌర్భాగ్య మట్లున్నసరే) ఇక్కడనుండి పొండు; నగరమార్గమును పట్టుడు. అక్కడ మీరు నోరార్చుకొనుచున్న వస్తువులన్నియు లభించును. (కాని దానితోపాటు బానిసత్వముకూడ ప్రాప్తమగును )

ఇట్లు ఇస్రాయీల్ సంతతికి దుర్దశ ప్రాప్తమాయెను. భగవదాగ్రహమునకు గురియై వా రధోగతికి పాలైరి. భగవద్వాక్కుల నిరాకరించుటకును, సత్యసందేశహారులగు ప్రవక్తలను వధించుటయందాసక్తులై యుండుటకును ఇదే ఫలము. (భగవదాజ్ఞాబద్ధులగుటకు బదులు నిరంతరము) ఆజ్ఞోల్లంఘనము చేయుటయే దీనికి కారణము. (సత్యము యొక్క) పొలిమేరలను దాటి వారు నిరంకుశులై పోయిరి.

## ఎనిమిదవ ఖండము

62. (వాస్తవముగ మోక్షము సత్యమునందు మీకుగల విశ్వాసముపైనను, స్వకీయమగు కర్మలపైనను ఆధారపడియున్నది కాని జన్మము, వంశము, మతాచారములు—వీటిపై ఆధారపడిలేదు సత్యమును) విశ్వసించువారు ఎవ్వరైననగుదురుగాక : యూదులగుదురు గాక, క్రైస్తవులగుదురు గాక, (గ్రహములను పూజించు) సబాయీ లగుదురు గాక, (మరేమతస్థులైనను కానిమ్ము ) దేవునిపైనను, కర్మపరీక్షాదినమునందును విశ్వాసముంచి, సత్కార్యాచరణము చేయువారైనచో దేవుడు వారికి దానిఫలము నిచ్చును. వారి కే విధమగుభయము గాని శోకము గాని అంటదు.

63. మరియు (మీ చరిత్రమందలి ఈ ఘట్టమునుకూడ జ్ఞాపక ముంచుకొనుడు.) మీ కడ నుండి ప్రతిజ్ఞను గైకొని, తూర్ పర్వతశిఖరమును మీ పైకె మహోత్తర మొనర్చి, "మీకు మార్గదర్శకముగ నుండుటకీ గ్రంథమును ప్రసాదించితిని. దృఢనిశ్చయులై దాని ననుసరింపుడు.

దానిలో చెప్పబడినదంతయు నిరంతరము స్మరించుచుండుడు. దీనివలన మీరు రక్షింపబడుదురు" అని చెప్పితిని. 64. కాని మీరు తిరిగి వాగ్భంగమొనర్చితిరి. (దుష్టమార్గము నవలంబించిరి) భగవంతుడు కరుణించనిచో మీ రప్పుడే అధఃపతితులై యుందురు.

65. మరియు మీలోనివారే కొందరు సబ్బాతువిషయమున దోష్యమొనర్చిన సంగతి నిశ్చయముగ మరచియుండరు. (మీ వలెనే వారును విధ్యుక్తములను నెరవేర్చుటయందు ఏవో సాకులను పన్ని తప్పించుకో జూచిరి.) తుచ్ఛములగు కోతుల స్వభావమును పొందుడని వారు శపింపబడిరి. (వారల్లే మర్కటస్వభావులైరి)

66. వారి సమకాలికులకును వారి తర్వాత రాబోవువారికిని ఇది యొక గుణపాఠముగ నుండునట్లు చేసితిమి. సత్యమార్గాచరణ పరుల కిది యొక పాఠము.

67 ఇదికూడ స్మృతికి తెచ్చికొనుడు. "ఒక ఆవును యజ్ఞ మొనర్పవలె నని మిమ్ములను భగవంతు డాజ్ఞాపించుచున్నాడు." అని మూసా తన ప్రజలతో చెప్పెను. "నీవు మమ్ముల పరిహసించు చున్నావా ?" అని వారు మూసాకు ప్రత్యుత్తర మిచ్చిరి. "నేను అనృతవాదిని, అజ్ఞానిని కాకుండునట్లు భగవంతు నాశ్రయించు చున్నాను" అని మూసా చెప్పెను.

68. ఇది విని వా రిట్లనిరి : "(ఇదియే నిజమైనచో) యజ్ఞపశువు ఎట్టిది కావలయునో మాకొఱకు భగవంతు నడిగి తెలిసికొమ్ము."

మూసా ఇట్లనియె : "అది అతి వృద్ధ కాని, మిక్కిలి లేతది కాని కాకూడదు. మధ్యవయసులో నుండవలెను. మీ రీ యాజ్ఞ ననుసరించి చేయుడు."

69. దానికి ప్రజ లిట్లనిరి : "ఆ గోవు ఎట్టి వర్ణము కలదిగా నుండవలెనో మాకొఱకు భగవంతు నడిగి చెప్పుము."

చుండిన) వివిధములైన కూరగాయలు, గోధుమలు, పప్పు, ఉల్లి, వెల్లుల్లి మొదలైన సమస్త ఆహారపదార్థములును మాకు కలుగునట్లు భగవంతుని ప్రార్థింపుము" అంటిరి. అప్పుడు మూసా ఇట్లనియె : "(మీ మరుపు యెంత శోచనీయము!) తుచ్ఛమగు ఈ కోరికను తీర్చుకొనుటకై (శుభోదర్కమగు ఈ మహదాదర్శమును) విడనాడజూతురా ? (మీ దౌర్భాగ్య మట్లున్నసరే) ఇక్కడనుండి పొండు; నగరమార్గమును పట్టుడు. అక్కడ మీరు నోరార్చుకొనుచున్న వస్తువులన్నియు లభించును. (కాని దానితోపాటు బానిసత్వముకూడ ప్రాప్తమగును )

ఇట్లు ఇస్రాయీల్ సంతతికి దుర్దశ ప్రాప్తమాయెను. భగవదాగ్రహమునకు గురియై వా రధోగతికి పాలైరి. భగవద్వాక్కుల నిరాకరించుటకును, సత్యసందేశహారులగు ప్రవక్తలను వధించుటయందాసక్తులై యుండుటకును ఇదే ఫలము. (భగవదాజ్ఞాబద్ధులగుటకు బదులు నిరంతరము) ఆజ్ఞోల్లంఘనము చేయుటయే దీనికి కారణము. (సత్యము యొక్క) పొలిమేరలను దాటి వారు నిరంకుశులై పోయిరి.

## ఎనిమిదవ ఖండము

62. (వాస్తవముగ మోక్షము సత్యమునందు మీకుగల విశ్వాసముపైనను, స్వకీయమగు కర్మలపైనను ఆధారపడియున్నది కాని జన్మము, వంశము, మతాచారములు—వీటిపై ఆధారపడిలేదు సత్యమును) విశ్వసించువారు ఎవ్వరైననగుదురుగాక : యూదులగుదురు గాక, క్రైస్తవులగుదురు గాక, (గ్రహములను పూజించు) సబాయీ లగుదురు గాక, (మరేమతస్థులైనను కానిమ్ము ) దేవునిపైనను, కర్మపరీక్షాదినమునందును విశ్వాసముంచి, సత్కార్యాచరణము చేయువారైనచో దేవుడు వారికి దానిఫలము నిచ్చును. వారి నేవిధమగుభయము గాని శోకము గాని అంటదు.

63. మరియు (మీ చరిత్రమందలి ఈ ఘట్టమునుకూడ జ్ఞాపక ముంచుకొనుడు.) మీ కడ నుండి ప్రతిజ్ఞను గైకొని, తూర్ పర్వతశిఖరమును మీపైకె మహత్తర మొనర్చి, "మీకు మార్గదర్శకముగ నుండుటకీ గ్రంథమును ప్రసాదించితిని. దృఢనిశ్చయులై దాని ననుసరింపుడు.

74. మరియు నప్పుడు (నిరంతర దుష్కార్యాచరణముచే) మీ హృదయములు బండబారి పాషాణప్రాయము లాయెను. పాషాణములకన్నను కర్కశతరము లాయెను. కొన్ని రాళ్ళనుండి సైతము సెలయేళ్ళు ప్రవహించును; కొన్ని శిలలు పగిలినప్పుడు వానినుండి జల ముత్పన్నమగును, మరికొన్ని దైవభీతికి (కంపించి) క్రిందపడుచున్నవి. కాని మీ హృదయములు మాత్రము దైవభీతిచే చలింపవు. దైవనియమము మీరుచేయు కర్మల నేమరి యుండదు. (మీ ప్రతి కర్మను అది పాలించుచున్నది. మీ కర్మానుసారము మీరు ఫలము ననుభవింప వలసినదే.)

75. ఓ ప్రవక్తా! నీ సందేశమును వారు విశ్వసింతురనియే ఆశించుచున్నావా? వారిలో కొందరు దైవసందేశమును విన్నవారు సైత ముండిరి. దాని అర్థమునుకూడ గ్రహించిరి. కాని తర్వాత దానిని వారు (బుద్ధిపూర్వకముగ) మార్చివైచిరి. (స్వలాభాపేక్షచేతను, కొన్ని యెడల తమ భావములతో సమీకరించుటకునువారట్లు చేసిరి తాము చేయుచున్నపని దుష్టమని వారికి తెలియును) అట్టి స్వభావము గల ప్రజలు నీవు చాటుచున్న సత్యమును స్వీకరింతురనియే ఆశింతువా?

76. (నాయెడలను, నీ సందేశముయెడలను) విశ్వాసము కలవారిని కలిసినప్పుడు వీరు తాముకూడ విశ్వసించితి మనియే చెప్పుదురు. కాని తమవారితో ఏకాంతగోష్ఠి నున్నప్పుడు "మీకు దేవుడు ప్రసాదించిన మహాజ్ఞానమును వీ రందరికిని ప్రకటింతు రేల? మీ రట్లు (ఈ జ్ఞానసూత్రములను వారికి నేర్పినచో వాటి నాధారముగాగొని మీకు వ్యతిరేకముగ వారు భగవంతునిసమక్షమున వాదింతురుకదా!) ఇంతటి స్థూలవిషయముకూడ మీరు గ్రహించలేరా?" అనుకొందురు. 77. (కేవలము తమ పంతము నెగ్గించుకొనుటకు వీరు సత్యమును దాచివేయజూతురు తెలిసియుండియు వితండవాదముల సేతురు వీరి యవివేక మెంత శోచనీయమైనది? ఇది సామాన్య విషయము కాదు.) భగవంతునకు తెలియని దేదైన కలదా? వారు పైకి చెప్పునదియు, లోలోన దాచునదియు సర్వమును దేవునకు తెలియునని వా రెఱుగరా?

78. (ఇది వారి విద్వాంసులు ప్రవర్తించువిధము కాని) వారిలో కొందరు విద్యాహీనులును కలరు. వారు భగవద్గ్రంథము నెఱుగరు. వారసత్యములనే ఎఱుగుదురు. వారివన్నియు స్వకపోలకల్పితములగు ఊహాలే.

79. కొందరు తామే గ్రంథములను స్వహస్తములతో వ్రాసి "ఇది దైవప్రోక్తము"అందురు. కించిల్లాభమునపేక్షించి వా రట్లుచేతురు. అట్టివారు దుఃఖభాజను లగుదురుగాక! దేనిని వారిచేతులు వ్రాసెనో దానికొఱకును, దానివలన వారు గడించినదాని కొఱకును వారు దుఃఖభాజను లగుదురుగాక !

80. మరియు వా రిట్లందురు : "మమ్ములను నరకాగ్ని దగ్ధము చేయదు. (ఎందు కనగా మేము ముక్తిపొందినజాతివారము.) మేము ఒకసారి అగ్నిలో వేయబడినను (నిత్య మందుండుటకు కాదు, పాపమాలిన్యమును తొలగించుకొనుటకై) తాత్కాలికముగమాత్రమే అందుందుము.

ఓ ప్రవక్తా! వారితో స్పష్టముగ నిట్లు చెప్పుము : మీా రట్లని భగవంతునికడ వాగ్దానము గైకొనిరా?—అట్లైనచో భగవంతుడు వాగ్భంగము గావింపడు— లేక మీాకు తెలియని యొక విషయమును గుఱించి భగవంతునిపై నిందమోపుదురా ?

81. (మోక్షము ఏ యొక్క ప్రత్యేక జాతియొక్క గాని ఒక ప్రత్యేక ప్రజయొక్కగాని సొత్తు కాజాలదు ఏ జాతికి, ఏ దేశమునకు చెందిన వ్యక్తియైనను) దుష్కార్యాచరణముచే పాపసమావృతుడైనచో, అతడు నరకముపాలగును. నిత్యము నరక మనుభవించును. 82. అట్లు గాక ఏవ్యక్తి విశ్వాసమార్గము ననుసరించి సత్కార్యాచరణము చేయునో యతడు స్వర్గమునకు అర్హుడగును. వానికి స్వర్గమునందే నిత్యనివాసము.

## పదియవ ఖండము

83. ఇస్రాయీలీయులకడ నుండి మేమొక ప్రతిజ్ఞను గైకొంటిమి. (అది) : దేవునితప్ప యితరులను ఎవ్వరిని ఆరాధింపరాదు. తల్లిదండ్రులకు కృతజ్ఞులైయుండవలెను. పేదసాదలయెడల నుపకార

బుద్ధి కలిగి యుండవలెను. అందరితోడను ప్రియభాషులై యుండ వలెను. నిత్యము ప్రార్థనావిధులను సల్పుచుండవలెను. జకాతు నియ్యవలెను.” అప్పుడు మీలో కొందరుతప్ప తక్కినవా రందరును తర్వాత మాటతప్పిరి. ధర్మాచరణదృష్టియే మీకు లేకపోయెను. మీరు ధర్మనిరాకరణమునందు చాలదూరము పోయిరి.

84. అటులనే మీకడనుండి మరియొక ప్రతిజ్ఞను గొంటిని: “మీవారి రక్తమును స్రవింపజేయకుడు. మీ వారిని పురములనుండి వెడలగొట్టకుడు.” మీ రావిధముగ ప్రతిజ్ఞలను జేసితిరి. ఇప్పుడు కూడ మీ రావిషయము నొప్పుకొందురు.

85. అయినప్పటికి మీరు మీ ప్రజలనే నిష్కారణముగ సంహ రించుచున్నారు. మీలో మీరు కక్షులుగ నేర్పడి ఒకపక్షమువారు మరొక పక్షమువారిని అధర్మముగను అన్యాయముగను వారిని ఇండ్ల నుండి వెడలగొట్టి బాధించుచున్నారు ఎంతటి అన్యాయమునకును ఒడికట్టి వారి శత్రువులకు సహాయము చేయుచున్నారు. కాని వారు ఖైదీలైనపుడు ధనమిచ్చి విడిపించితెత్తురు. (ఇది చాల పుణ్యకార్యమని వారి ఊహ). కాని అన్యాయముగ వారిని యిండ్లనుండి వెడలగొట్టుట అధర్మముకాదా? మీరు భగవద్గ్రంథమునందలి కొంతభాగమును స్వీకరించి కొంత భాగమును నిరాకరింతురా? ఇహలోకమున అగౌర వమును పరలోకమున నరకయాతనయు తప్ప మీలోని ఇట్టి దుష్కా ర్యాచరణపరులకు మరొకలాభ మేమున్నది? మీ సమస్తకర్మలను భగవంతుడు పరికించుచునేయున్నాడు.

86. వీరు (శాశ్వతమైన) పారలౌకిక సుఖమునకు బదులు (తాత్కాలికమగు) ఐహికసుఖమును కొనువారు. (ఇట్టివారికి మోక్షప్రాప్తి యెన్నడును కలుగదు) వారి కష్టములు యెంతమాత్రమును తగ్గవు. వారి కెట్టి సహాయమును లభింపదు.

**పదునొకండవ ఖండము**

87. నిశ్చయముగ మూసాకు మేము జ్ఞానగ్రంథమును ప్రసా దించితిమి. (అది మీ మార్గదర్శకత్వమునకు) ఆయన తర్వాత ఒకరివెనుక

నొకరిని నెందరినో ప్రవక్తలను పంపించితిని. తుదకు మరియమ్ కుమారుడగు ఈసాకు స్పష్టమగు సత్యము నిచ్చి పంపి అతనికి పరిశుద్ధాత్మబలమును ప్రసాదించితిని. (కాని మీరా ప్రవక్తల నందరిని ధిక్కరించితిరి భగవంతుని సందేశమును నిరాకరించితిరి ) మీ స్వార్థములకు అనుకూలముగ లేని సత్యసందేశముతో ప్రవక్తలు మీవద్దకు వచ్చినపుడు మీరు దుర్గర్వప్రమత్తులై వారిని నిరాకరించిరి. కొందరిని వధించిరి. మీ రిట్లే యకార్యాచరణమున నిమగ్నులై యుందురా ?

88. (ఈ దుస్స్వభావమునకే వారు గర్వించుచు నిట్లందురు ) "మా హృదయములపై గాటముగా ముసుగులు వేయబడియున్నవి. (ఏ క్రొత్తమాటయు మా హృదయములయందు చొరజాలదు ఇది విశ్వాసదార్ఢ్యము వల్ల కాదు అట్లైనచో అది ప్రశంసార్హమే ) అది దేవునియందలి నిరాకరణబుద్ధియం దుత్పన్నమైనది. దానిచే వారు శపితులైరి. అందు చేతనే వారు ధర్మసందేశమును విననైన వినరు. ఒకసారి వినినను దానిని స్వీకరింపరు.

89. ధర్మమార్గమును చూపునట్టి ఈశ్వరప్రోక్తమగు ఒక గ్రంథము వారికి ప్రాప్తమయ్యెను. అది ఇంతకుముందు వారికడనున్న గ్రంథమును నిర్ధారించునదియై యుండెను. ఏ గ్రంథముపేరు చెప్పి వారు ఆ విశ్వాసకులపై తమకు విజయము కలుగుటకై ప్రార్థనలు చేయుచుండిరో అట్టిగ్రంథము ప్రత్యక్షమైనప్పుడు దానినిసైతము నిరాకరించిరి. (దానికి విరుద్ధముగకూడ నడుముకట్టి నిలిచిరి తెలిసియుండియూ) సత్యమును నిరాకరించినవారిపై భగవదాగ్రహము కల్గును.

90. ఎంతటి తుచ్ఛపుమూల్యమునకు వారు తమఆత్మలను అమ్మివైచిరి ? భగవంతుడు తన ఇచ్ఛవచ్చినవారిని అనుగ్రహించి తన సత్యమును ప్రసాదించినాడను ఈర్ష్యచే వారు (తెలిసియుండియూ) భగవత్ప్రోక్తమగు ఆ సత్యసందేశమును నిరాకరించిరి. * (వారు తమ

* భగవత్ప్రోక్తమగు సత్యము తమ జాతివారికే గాని ఇతరులకు లభ్యమగుట అసంభవ మని యూదులు తలచెడివారు యూదజాతికిచెందని మరియొకనికి అనగా శ్రీ మొహమ్మద్ ప్రవక్తకు భగవద్గ్రంథము లభించె నను ఈర్ష్యచే వారు ఖుర్ ఆన్ భగవద్గ్రంథమని తెలిసియుండియు దానిని నిరాకరించిరి.

దుష్ప్రవర్తనముచే మొదటనే భ్రష్టులై ఇప్పుడు ద్విగుణీకృతాగ్రహమునకు గురియైరి ) వారు పదేపదే భగవదాగ్రహమునకు పాత్రులైరి. సత్యమును నిరాకరించినవారికి పరాభవశిక్ష ప్రాప్తమగును.

91. "భగవత్ప్రోక్తమగు యీ గ్రంథమును విశ్వసింపుడు" అని వారితో చెప్పినచో వా రిట్లందురు :

"ఇంతకుపూర్వము మాకు ప్రాప్తమైన భగవద్గ్రంథమునే మేము విశ్వసింతుము. (మ రేగ్రంథమును మేము విశ్వసింపము )"

తమ భగవద్గ్రంథమును నిర్ధారించు సత్యగ్రంథమైనను సరే. వారు దానినే గాదు, తమ గ్రంథము కాని మరి దేనినైనను నిరాకరింతురు.

ఓ ప్రవక్తా ! వారి నిట్లడుగుము : "మీరు నిజముగ (మీ భగవద్గ్రంథమునందు) విశ్వాసము కలవారే యైనచో, (తౌరాత్‌గ్రంథము కలదు కదా అను కారణముచే మీరు ఖుర్ ఆనుపై విశ్వాస ముంచవలసిన అవసరము లేదని తలచువా రైనచో) మీరు ఇంతకు ముందు (తౌరాత్‌గ్రంథమును అనుసరించు డని బోధించిన) ప్రవక్తలను ఏల వధించిరి ?

92 మూసా మీకడకు చిక్కులులేని స్వచ్ఛమగు భగవత్సందేశముతో వచ్చెను అతడు లేని సమయమున మీరు గోవత్సమును పూజింపసాగిరి. మీ రిట్లు (సత్యమును నిరాకరించి) అధర్మమునకు పాల్పడిరి.

93. మహోన్నతమైన సినాయీ పర్వతశిఖరములక్రింద సత్యవర్తనులై యుండునటుల మీకడ ప్రతిజ్ఞను గైకొంటిని. అప్పుడు మీరి ట్లాజ్ఞాపింపబడితిరి : "మీ కీయబడిన ఈ గ్రంథమును స్థిరచిత్తులై అవలంబింపుడు దీని యాజ్ఞలను శిరసా వహింపుడు."

అప్పుడు మీరు (నోటితో) "వింటిమి" అనిరి. (కాని మనస్సుతో) "మేము దీనిని అనుసరింపము" అనిరి.

విశ్వాసరాహిత్యమువలన మీ హృదయములలో గోవత్సము యెడ మోహము దృఢముగ పాదుకొనెను. (ఓ ప్రవక్తా!) వారితో

నిట్లనుము "మీరు ఏమతము నవలంబించుచున్నా మనుచున్నారో, ఆ మతము ఇదే యైనచో అది కడు శోచనీయమైనది. మీ మతము మిమ్ములను దుష్టమార్గమున నడిపించుచున్నది."

94. (మోక్షము మాసొమ్మే అని వా రనుచున్నారు. ఓ ప్రవక్తా ! వారితో) ఇట్లనుము .

మీ కొక్కరికే మోక్షప్రాప్తికలుగుచో, — ఈ నమ్మకము నందే మీకు గట్టి విశ్వాస మున్నయెడల — (మీరు ఇహమును విడిచి పరమునే వాంఛింప వలసియుండెడి వారు మరి నిర్భీతులై) మృత్యువు ను వాంఛింపుడు.

95. (ఓ ప్రవక్తా ! నీవు చూచెదవుగాక !) వా రిన్నాళ్ళు కూడబెట్టి యుంచిన దుష్కర్మలు వారినట్లు చేయనియ్యవు. భగవంతుడు దుష్టులను బాగుగ నెఱుగును.

96. (ఇంతేకాదు) జీవితము యెడ వారికిగల తృష్ణ మరెవ్వరి కిని లేదు. బహుదైవతారాధకులకునైనను ఇంతతృష్ణ లేదు. వెయ్యేండ్ల జీవితము నాశించువారును వారిలో కలరు. వా రెంతకాలము జీవించి నను భగవంతుని శిక్షను తప్పించుకోలేరు వారు చేయు పనుల నన్నిటిని భగవంతుడు చూచుచునే యున్నాడు.

## పండ్రెండవ ఖండము

97. (ఓ ప్రవక్తా !) భగవదాజ్ఞానుసారము జిబ్రాయీలు నీ హృదయమునకు వ్యక్తీకరించిన (ఈ సత్యము) భగవ త్ప్రోక్తము. ఇది ఇంతకుముందు వ్యక్తీకృతమైన సత్యగ్రంథములను నిరూపించు చున్నది. ఇందు మానవునకై ఉపదేశ మున్నది విశ్వాసవంతులకు (మోక్షవిజయముల) శుభసందేశ మిందు కలదు. (మరి ఇట్లు జిబ్రాయీలు ద్వారా ప్రోక్తమైన ఈ సత్యగ్రంథమును నిరాకరించి "జిబ్రాయీలు ద్వారా ప్రోక్తమైన ఈ ప్రవచనమును విశ్వసింపము" అన్నచో వారితో) నిట్లనుము :

98. "భగవంతునకును, అతని దూతలకును, అతని ప్రవక్త లకును జిబ్రాయీల్, మీకాయీలులకును ఎవడు శత్రువో భగ వంతుడుకూడ అట్టి నాస్తికులకు మిత్రుడు కాజాలడు."

99. నిశ్చయముగ సత్యప్రకాశకములగు చిక్కులు లేనివాక్కు లను మేము ప్రవచించితిమి. సత్యమార్గమును తప్పి తప్పుత్రోవల భ్రమించువారుతప్ప మరెవ్వరును వానిని నిరాకరింపరు.

100. వారు సత్యమునకు కట్టుబడియుందుమని యెప్పుడు ప్రతిజ్ఞ చేసినను వారిలో నెవరైన నొకరు ప్రతిజ్ఞాభంగ మొనర్చియే తీరిరి. వాస్తవ మేమనగా వారిలో పల్వుర హృదయములు భగవ ద్భక్తి విశ్వాసశూన్యములై యున్నవి.

101. దేవునికడనుండి ఒక ప్రవక్త వారి పురాతన భగవ ద్గ్రంథమును దృఢపరచుచూ వచ్చినప్పుడు వారిలో కొందరు భగ వద్గ్రంథమును నమ్మువారై యుండియు దానిని దాచివైచి యేమియు నెఱుగనట్లే నటించిరి.

102. వారు దైవదత్తమగు గ్రంథమును విడిచి పాషండులగు మంత్రకాండ్రను కొలువసాగిరి. దురాత్ములగు ఈ మంత్రజ్ఞులు మహానుభావుడగు సులైమాన్ గొప్ప మంత్రవేత్త యనియు, అతని మహత్తంతయును మంత్రమూలకమనియు, చెప్పిరి. వాస్తవముగ సులైమాన్ పాషండుడు కాడు. ఇట్టి మాటలను చెప్పి ప్రజలకు ఈ దురాత్ములు మంత్రములను తంత్రములను నేర్పుచుండిరి. బాబి లోనియాలో హారూత్, మారూత్ అను ఇద్దరు ఖగోళశాస్త్రజ్ఞుల కిట్టి విద్యను భగవంతుడు ప్రసాదించె ననుటయు సత్యముకాదు. వాస్తవ మేమనగా వారు తమకు వచ్చిన ఏపాటి విద్యయైనను ఎవరికైనను బోధించునప్పుడు ఈ విధముగ చెప్పుచుండిరి: "మేరాక మీకొక పరీక్ష. మీరు అవిశ్వాసులు కాకుడు" అట్లు చెప్పినను వినక భార్యాభర్తలను ఎడబాపునవియు (ఇతర విధములైనవియు నగు) మంత్ర తంత్రములను వారికడ నేర్చుకొనుచుండిరి. వాస్తవముగా వా రీ

మంత్రతంత్రములవల్ల ఎవరికిని నష్టము కలిగింప జాలకుండిరి. భగవ దాజ్ఞవల్ల యెవరికైన నష్టము కలుగవలసియుండి ఆ నష్టము సంభవిం చిన సంభవింపవచ్చును. (యొత్తమునకు) వీరు (భగవద్గ్రంథము యొక్క ఆదేశమును విడిచి) వారికి నష్టమును కలిగించు విషయముల నేర్చు కొనుచుండిరి. దానివలన వారి కేమియు లాభము కలుగదు. (వారికి భగవత్ప్రోక్తమగు ఉపదేశము తెలియదనియు కాదు. ధర్మమును విక్రయించి) మంత్రతంత్రములను ప్రీతిగా గొనువానికి పరలోకఫలము కలుగదని వారికి తెలియును. (వారు ఇది ఎఱిగియుండియు తమ దుర్మార్గవృత్తిని విడు వరు.) ఈ తుచ్ఛమూల్యమునకై వారు తమ ఆత్మలను అమ్మివైచిరి. ఇది వారు గ్రహింపరు.

103. వారు విశ్వాసవంతులై సత్ప్రవర్తకులైయుండిరేని భగ వంతుఁడు వారి నెంతయో బహూకరించి యుండును. (కాని వారు నశ్వ రమగు ప్రాపంచిక లాభమునకై శాశ్వతమగు మోక్షమును వదలుకొనిరి) వారీ విషయమును గ్రహింపరు.

## పదుమూడవ ఖండము

104. విశ్వాసవంతులారా మీరు బహుళార్థకములగు మాటల నాడకుడు. మర్యాదగా పలుకరింపుడు. ప్రవక్త పలుకు లను శ్రద్ధతో నాలకింపుడు. విశ్వాసహీనులకు ఘోరమగు శిక్ష కలదు.

105. మీకు భగవంతుడు శుభము లొనగూర్చుట విగ్రహా రాధకులకును, క్రైస్తవ యూదులలో విశ్వాసహీనులకును రుచిం పదు. కాని భగవంతుడు తన యిచ్ఛవచ్చినవారి ననుగ్రహించును. భగవంతుని యనుగ్రహము అపరిమితమైనది.

106. మేము రద్దుపరచునట్టియు, మరపించినట్టియు ఆజ్ఞలకు మారుగా అట్టివైనను లేదా వానికంటె మేలైనవియు నగు ఆజ్ఞలను ప్రసాదింతుము. భగవంతుడు సర్వశక్తిమంతుడని మీ రెఱుగరా?

107. భూమ్యాకాశముల సర్వప్రభుత్వమును భగవంతునిదే యనియు, భగవంతుడుతక్క మరెవ్వరును మీకు సంరక్షకులుగాని సాహాయ్యులు గాని లేరనియు మీకు తెలియదా ?

108. పూర్వము మూసాప్రవక్తకు అప్పటి ప్రజలు చేసిన వ్యర్థప్రశ్నలవంటివే మీరును మీ ప్రవక్త నడుగుదురా ? (వ్యర్థవాదములు సేతురా ?) శ్రద్ధావిశ్వాసములకు బదులు ఎవడు తిరస్కారమార్గము నవలంబించునో వాడు ఋజుమార్గమును గోల్పోయిన వాడు. (మోక్షమార్గమును తప్పినవాడు)

109. క్రైస్తవ యూదులలో పల్వురు మిమ్ములను శ్రద్ధా విశ్వాసములను విడిచి తిరస్కారమార్గము నవలంబింపజేయుటకు ప్రయత్నింతురు. వారికి సత్యము తెలియును ఐనను అసూయాభావముచే వారు మిమ్ములను సన్మార్గమున నుండగా జూచి యోర్వజాలరు. (వారితో అనవసరముగా జగడమాడుటలో కాలమును వ్యర్థపుచ్చకుడు) ఓర్పువహించి వారిని క్షమింపుడు. భగవంతుడే (ఈ విషయమున) తీర్మానించును. (సత్యమునకు జయమును ప్రసాదించి ఏది సత్యమో ఏది అసత్యమో వెల్లడించును) నిస్సంశయముగ భగవంతునకు సర్వవస్తువుల పైనను అధికారము కలదు.

110 ప్రార్థనను (నమాజ్) సల్పుడు. దానము (జకాతు) నీయుడు. (దీనివలన మీ ఆధ్యాత్మికశక్తి బలపడును) మీరు చేసికొనిన పుణ్యకార్యముల ఫలము భగవంతుడు మీ కిచ్చును. మీరు చేయుచున్న దంతయు భగవంతుడు చూచుచున్నాడు.

111. యూదుడు కానిచో ఎవడును స్వర్గమును ప్రవేశింప నేరడని యూదులందురు. అట్లే క్రైస్తవులు కానివారు స్వర్గమును ప్రవేశింప నేరరని క్రైస్తవులందురు (ఇట్లే ప్రతి మతస్థులును తమ తమ మతము నవలంబించని వారు స్వర్గమును ప్రవేశింపజాలరని అందురు కాని, ఓ ప్రవక్తా !) ఇవి కేవలము వారి అజ్ఞానజన్యమైనకోరికలు గాని సత్య

ములు కావు. "మీా మాట సత్యమైనచో నిరూపింపుడు" అని వారి నడుగుము.

112. (మోక్షద్వారము ఎల్లప్పుడును తెరువబడియేయున్నది అది యొక ప్రత్యేకమతస్థుల మార్గముకాదు ఎవరైనను సరే, ఏ మతమునకు చెందినవారై నను సరే, ఏ నామమున పిలువబడుచున్నను సరే) భగవంతునకు తనను తన సర్వస్వమును అర్పించుకొని సత్కార్యాచరణము చేయువా డైనచో భగవంతుడు అతనిని బహూకరించును. అతని కెట్టి భయ ముగాని, ఎట్టి చింత గాని యవసరము లేదు.

## పదునాల్గవ ఖండము

113. క్రైస్తవుల మతము సత్యమైనది కాదని యూదు లం దురు. యూదుల మతము అసత్యమైనదని క్రైస్తవు లందురు. అట్లయ్యు ఇరుమతములవారును ఒకే గ్రంథము నవలంబింతురు. (వాస్తవముగ ఇద్దరి మతమును ఒకటే) అదేవిధముగ అజ్ఞానులు (విగ్రహా రాధకులు) కూడ (తమ మతమే సత్యమని నమ్ముచున్నారు) భగవంతుడు వారి తగవులను అవసానదినమున తీర్చును.

114. భగవంతుని ప్రార్థనాలయములలో భగవన్నామమును స్మరించుటను నిరోధించుట యందును, వాటిని ధ్వంసముచేయుటయం దును ఆసక్తుడైనవానికంటె దుష్టుడు మరెవ్వ డుండును ? దైవభీతి కలుగనంతకాలము ఇట్టి దుష్టులు ప్రార్థనాలయములలో అడుగుపెట్టు టకు అర్హులుకారు. ఇట్టివారికి ఈ లోకమున అగౌరవమును, పరలోక మున కఠిన శిక్షయు కలుగగలదు.

115. ప్రాక్పశ్చిమములు రెండును భగవంతునివే. (ముఖము ఒకేవైపునకుమాత్రమే త్రిప్పవలెనను నియమములేదు) ఎటు ముఖము త్రిప్పి నను భగవంతుడు ఎదురుగనే ఉన్నాడు. భగవంతుడు తన మహా చ్ఛక్తిచే సర్వమును నిండియున్నాడు. (అంతే కాక) సర్వజ్ఞుడును కూడ.

116, (క్రైస్తవులు) ఇట్లందురు "భగవంతుడు ఏసుక్రీస్తును తన కుమారునిగా స్వీకరించినాడు." (పాపము శమించు గాక!) భూమ్యాకాశములలో ఉన్న సర్వస్వమును అతనిదే కదా! (అతనికి కుమారుని స్వీకరించునంతటి గతి యేమిపట్టెను?) అందరును అతని ఆజ్ఞకు బద్ధులై యున్నారు.

117. భూమ్యాకాశములను అత్యద్భుతముగ సృష్టించిన యతడు, ఏదైనను చేయఁగోరినచో (అతని కొకరి సహాయముగాని సలహాగాని అవసరము లేదు) "అగుము" అని ఆజ్ఞమాత్ర మిచ్చును. ఆ యాజ్ఞానుసారము వెంటనే యది సంభవించును.

118. జ్ఞానములేనివా రిట్లందురు: "భగవంతుడు మాతో ఏల మాట్లాడడు? అథవా తన చిహ్నమేని యొకటి యేల పంపడు?" ఇంతకుముందుకూడ అజ్ఞాను లిట్టి మాటలనే పలికిరి. వారి హృదయము లొకే విధమైనవి. (వీరికి చిహ్నములే కావలసినచో ఆ చిహ్నములను గ్రహించుశక్తి వారు సంపాదించుకోవలెను చిహ్నములను గ్రహించుశక్తి ఉన్నచో) విశ్వాసవంతులకొఱకు ఎన్నేని చిహ్నములను ప్రత్యక్షీకరించితిని. (వానివలన వారు జ్ఞానమును బడయుచున్నారు)

119. (ఓ ప్రవక్తా!) ప్రపంచమునకు సత్యమును చాటుటకును, (విశ్వాస సదాచారముల ఫలముయొక్క) సువార్తను తెలుపుటకును, (సత్యనిరాకరణమున కెట్టి శిక్ష కలుగునో చెప్పి) హెచ్చరించుటకును నిన్ను పంపితిని. (ఈ సందేశమును వినియు సన్మార్గమునకు మరలని) నరకవాసుల బాధ్యత నీకు లేదు. (సత్యసందేశమును వినిపించుటయే నీ ధర్మము)

120. యూదులు గాని క్రైస్తవులు గాని ఎన్ని మహాత్మ్యములు చూపినను వారి మతమును నీవు అవలంబించనంత కాలము నిన్ను చూచి సంతోషింపరు. (ఎందులకనగా వారు తమతమ సంఘాచారము లందలి దురభిమానమునే మతమని నమ్ముచున్నారు) నీవు వారితో (స్పష్టముగ) ఇట్లు చెప్పుము: ఏది సత్యమగు భగవంతుని ధర్మమో అదే సత్యమగు ధర్మము. (అంతేకాని మీరు కల్పించుకొన్న మతములును, ధర్మములును,

సంఘములును కావు) జ్ఞాపక ముంచుకొనుము నీకు సత్యజ్ఞానము లభించినతర్వాత కూడ నీవు వీరి ఇచ్ఛానుసారము ప్రవర్తించితివేని (ఇది భగవదాజ్ఞలకు విరుద్ధము) నీవు భగవంతుని రక్షణను సహాయమును కోల్పోవుదువు.

121. దైవదత్తమగు గ్రంథము ప్రసాదింపబడినవారు (యూదులలోను క్రైస్తవులలోను కొందరు) దానిని సరిగా పఠించి దాని ననుసరింతురు. దానియెడ శ్రద్ధావిశ్వాసములను కూడ చూపుదురు. ఎవరు శ్రద్ధావిశ్వాసములను చూపరో వారే నష్టపడుదురు.

## పదునేనవ ఖండము

122. ఓ ఇస్రాయీలీయులారా! మిమ్ములను సర్వజాతులపైనను నాయకత్వమిచ్చిన నా యనుగ్రహమును జ్ఞప్తికి తెచ్చుకొనుడు.

123. ఒక ఆత్మ మరొక ఆత్మకొఱకు ఎంతమాత్రమును బాధ్యతవహింపని ఆదినమునకు భయపడుడు. నాడు (మీ పాపములకు) ప్రతిగా ఏదియు గ్రహింపబడదు, (శిక్షనుండి) తప్పించుటకు ఎవరును అడ్డురారు, మరేవిధముననను నాడు సహాయము లభించదు.

124. ఇబ్రాహీమును కొన్నివిషయములలో పరీక్షించినప్పుడు, అతడు ఆ పరీక్షయందు దుత్తీర్ణుడాయెను. భగవంతుడు అప్పుడిట్లనెను: "నీకు నేను మానవులపై నాయకపదవి నిచ్చెదను." దానికి ఇబ్రాహీం ఇట్లు విన్నవించుకొనెను: "ప్రభూ! మరి నా సంతానమునకో?" దానికి భగవంతు డిట్లనెను: "దుర్మార్గము ననుసరించువారికి నా వాగ్దానము చెల్లదు."

125. అప్పుడు నేను ఆ ఆలయమును మానవులకు కేంద్రముగను, శాంతిపవిత్రతల స్థానముగను చేసితిని. ఇబ్రాహీం నిలువబడిన స్థలము నమాజు కుచితమైన స్థలమగునట్లుగా నాజ్ఞాపించితిని. మరియు ఇబ్రాహీమునకును, ఇస్మాయీలునకును ఇట్లాజ్ఞాపించితిని: "నా

ఆలయమును, ప్రదక్షిణము చేయువారి నిమిత్తమును, ప్రార్థనచేయు వారి కొఱకును, సాష్టాంగపడువారి కొఱకును శుభ్రపరచి యుంచుడు.

126. ఇబ్రాహీము ఇట్లనెను · "ప్రభూ! ఈ పట్టణమును సురక్షితమైనదానిగా చేయుము భగవంతునియందును, తుది దినము నందును విశ్వాసముకల ఇక్కడి ప్రజలకు ఫలవృక్షములను ప్రసాదింపుము." దానికి భగవంతు డిట్లనెను: "(నా అనుగ్రహము అందరకును సమానముగనే లభించును కాని) అవిశ్వాసకులకు కలుగు ఫలము (నశ్వరము). అది కొద్దికాలమునకు మాత్రమే. తరువాత వారు నరక యాతనలకు పాలగుదురు. ఎంతటి ఘోరమగు గమ్యస్థానము!"

127. "ఇబ్రాహీము ఇస్మాయీలులు కాబాకు పునాదివేసి దేవు నిట్లు ప్రార్థించిరి: "ప్రభూ! (ఈ మా నివేదనను) మాకడనుండి స్వీకరింపుము నిశ్చయముగ నీవు సర్వమును వినువాడవు, సర్వమును తెలిసినవాడవు.

128. "ప్రభూ! మమ్ములను (ఋజుమార్గ ప్రవర్తకుల నొనర్పుము). నీకు వినతులైనవారినిగా జేయుము. మా సంతతినుండి నీకు నమ్రులై యుండు ఒక జాతిని పుట్టింపుము. మాకు సరియైన భక్తిమార్గమును చూపుము. మా తప్పిదములను క్షమింపుము. నీవు క్షమాపూర్ణుడవు; దయానిధివి.

129. "ప్రభూ! వారిలో ఒక ప్రవక్తను పుట్టింపుము. అతడు నీసందేశమును వినిపించి దైవదత్తమగు గ్రంథమును, జ్ఞానమును వారికి నేర్పి, వారిని పరిశుద్ధుల నొనర్చును. నీవు సకల శక్తిమంతుడవు; సర్వజ్ఞుడవు."

## పదునారవ ఖండము

130. తమ్ముతాము తుచ్ఛపరచుకొన్నవారు తప్ప మరెవ్వరు ఇబ్రాహీముయొక్క మతమునుండి విముఖులు కాగలరు? వాస్తవ

ముగ అతడు నాచే (ఇహమున) పావిత్ర్యమునకై ఎన్నుకొనబడిన వాడు. పరలోకమునను అతడు పుణ్యాత్ములలో పరిగణింపబడును.

131. ఇబ్రాహీమ్ తన ప్రభువుచే "వినతుడవు కమ్ము" అని ఆజ్ఞాపింపబడినప్పుడు అతడు: (ప్రభూ!) సర్వలోకాధిపతియు, పోషకుడును అగు నీకు నా ఆత్మ సర్వస్వమును సమర్పించు కొనుచున్నాను" అనెను.

132. అదేవిధముగ ఇబ్రాహీము తన పుత్రులకును, (అతని మనుమడగు) యాఖూబు తన పుత్రులకును ఉపదేశించిరి. వా రిట్లనిరి: "పుత్రులారా! భగవంతుడు మీ కొఱకై ఈ సత్యమతమును నిర్దేశించినాడు. భగవదిచ్ఛకు లొంగినవారు* కాకుండ మరణింపకుడు."

133. యాకూబుకు మరణ మాసన్నమైనప్పుడు మీరుండిరా? అప్పుడతడు తన కుమారులతో నిట్లనెను: "నా మరణానంతరము మీ రెవరి నారాధింతురు?" దానికి వారంద రిట్లనిరి: "నీ వారాధించుచున్న భగవంతుని, నీ పెద్దలారాధించుచుండిన భగవంతుని, ఇబ్రాహీమ్, ఇస్మాయీల్, ఇస్హాకులు ఆరాధించుచుండిన భగవంతుని — ఆ ఏకేశ్వరునకే మేము వినతుల మగుదుము."

134. వీ రిప్పుడు మరణించిరి. (వారి పుణ్యకర్మలు మీ దుష్కార్యములకు ప్రతీహారము కాజాలవు) వారు చేసికొనిన పుణ్యముల ఫలము వారిది. మీ కర్మఫలమును మీ రనుభవింతురు. వారి కర్మలకు మీరు బాధ్యులుకారు.

135. యూదు లిట్లందురు: "మీరు యూదులుకండు. మీ కప్పుడు సత్యమగు ధర్మము లభించును." అట్లే క్రైస్తవు లిట్లందురు: "మీరు క్రైస్తవులు కండు. అప్పుడే మీకు సత్యమగు ధర్మము లభించును." కాని నీ విట్లనుము. "కాదు మేము ఋజుమార్గ ప్రవ

---

* ముస్లిములు అని అరబ్బీ మూలము

ర్తకుడగు ఇబ్రాహీము మతమునే అవలంబింతుము. అతడు బహు దైవారాధకుడు కాడు."

136. (ఓ విశ్వాసవంతులారా!) ఇట్లనుడు: "మేము భగవంతుని యందును, మాకు ప్రోక్తమైన (ఖుర్ఆన్) గ్రంథమునందును, ఇబ్రాహీం, ఇస్మాయీల్, ఇస్‌హాక్ ప్రవక్తలకును యాకూబ్ సంతతివారికిని ప్రోక్తమైన గ్రంథములందును, మూసాకును ఈసాకును ప్రోక్తమైన గ్రంథములందును (ఇంతేకాదు) ప్రపంచమున నుద్భవించిన సమస్త ప్రవక్తలకు ప్రోక్తమైన ఉపదేశములందును విశ్వసింతుము. ఈ ప్రవక్తలలో ఎవ్వరియెడను మేము భేదభావమును చూపము. ఏకేశ్వరునకే మేము వినతులమగుదుము.

137. నీవు విశ్వసించినట్లే వారుకూడ విశ్వసించినచో (జగడములన్నియు నంతరించును). వారు సత్పథమున నున్నవారగుదురు. అట్లుకాక నిరాకరించినచో వారు ప్రతిఘటనమును, దౌర్జన్యమును చేయుచున్నారన్నమాట. మీరు వారిని లెక్కగొనకుడు. వీరి ప్రతిఘటనమును ఎదుర్కొనుటకు భగవంతుడు మీకు శక్తిని ప్రసాదించును. భగవంతుడు సమస్తమును వినుచున్నాడు. అతడు సర్వజ్ఞుడు.

138. (వారితో ఇట్లు చెప్పుము) భగవంతుని సంస్కారమును పొందుడు. భగవంతునికంటె ఎక్కువ సంస్కారమును కలిగించువాడెవ్వడు?* మే మా భగవంతునే ఆరాధింతుము.

139. ఇట్లనుము: "భగవంతునివిషయమై మాతో వివాదము సల్పుదురా? భగవంతుడు మాకును మీకును భగవంతుడే. మీ

---

* క్రైస్తవులు బాప్టిజమ్ అను ఒక మతసంస్కారమును జరుపుదురు. అది జరిగినప్పుడే ఒక వ్యక్తి క్రైస్తవమతమును ప్రవేశించునని వారి నమ్మకము. హృదయము యొక్క సంస్కారము కావలెను గాని బాహ్యసంస్కారములు కావు మోక్షద్వారమును తెరచునవి అని ఖుర్ఆన్ బోధించుచున్నది. అట్లే ఉపనయనాది సంస్కారములకును దీని ననువర్తించవలెను. భగవంతునియందలి భక్తివిశ్వాసములే నిజమైన సంస్కారములు.

కర్మలు మీకు, మా కర్మలు మాకు. మేము భగవంతుని హృదయ పూర్వకముగ నారాధింతుము.

140. ఇబ్రాహీమును, ఇస్మాయీలును, యాకూబును అతని సంతతివారును క్రైస్తవులును యూదులును అందువా? వారితో నిట్లు చెప్పుము: "మీరు బాగుగా ఎఱుగుదురా లేక భగవంతు డెఱుగునా? మీరు చేయు పనులన్నింటిని భగవంతుడు చూచుచునే యున్నాడు."

141. వీరుకూడ మరణించిరి. వా రొనర్చిన కర్మఫలము వారిది, నీ వొనర్చు కర్మఫలము నీది. వారి కర్మలకు నీవు బాధ్యుడవు కావు.

# రెండవ భాగము

**142.** బుద్ధిహీను లిట్లందురు. "ముసల్మానులు ఇంతవరకు ఒక దిక్కు మొగమై ప్రార్థన సలుపుచు ఇప్పు డాదిక్కు నేలమార్చిరి?"౦ (ఓ ప్రవక్తా!) వారితో నిట్లనుము. "తూర్పైనను పడమరైనను అన్ని దిక్కులును భగవంతునివే – అతడు తన ఇచ్ఛవచ్చిన వారికి తిన్నని మార్గమును చూపును."

**143.** మీరు మానవు లందరికొఱకును సత్యసందేశమును నిరూపించి చెప్పువారని మీకు ఒక ఉత్కృష్ట జాతిగౌరవమును ప్రసాదించితిని. *ప్రవక్త మీ సత్యసందేశమునకు సాక్షియై యుండును.

ఇన్నాళ్లు మీరు ఏదిక్కు మొగమై ప్రార్థనల సలుపుచుండిరో, దాని నింతకాలము స్థిరపఱచి యుంచుటలో ఉద్దేశము నిజముగా ప్రవక్తను ఎవ్వరనుసరించుచున్నారో, ఎవ్వరు వెనుజూపుచున్నారో తెలిసికొనుట. నిస్సందేహముగ సన్మార్గప్రవర్తకులకు తప్ప తక్కినవా రందరకును ఇది ఒక కఠినపరీక్ష. ఇట్టివారి విశ్వాసమును భగవంతుడు నిష్ఫలమొనర్పడు. నిశ్చయముగ భగవంతుడు ప్రేమమయుడు, కరుణాళువు.

**144.** ఓ ప్రవక్తా! నీవు స్వర్గముకేసి మొగమెత్తుచుండుటను మేము చూచుచున్నాము. మేము త్వరలో నీ ముఖమును నీ ఇష్టము వచ్చిన ఒక 'ఖిబ్లా' వైపుకు త్రిప్పనున్నాము.ᵃ

ఆ పవిత్రప్రార్థనాలయము కాబావైపునకు మీ ముఖములను త్రిప్పుడు. మీ రెక్కడున్నను దానివైపునకే ముఖము త్రిప్పుడు. ఈ సత్యసందేశమును పొందినవారు ఇది భగవంతునికడనుండి వచ్చిన సత్యమని ఎఱుగుదురు. వారు చేయుదానిని భగవంతు డేమఱి యుండడు.

---

* అనగా మీరు ప్రవక్తకడ సత్యసందేశమును విని లోకమంతటికిని వినిపింపుడు మీ రట్లు చేయువారుగనుకనే మీకు నుత్కృష్టజాతి గౌరవము నొసంగితిమి.

145. యూదులకును క్రైస్తవులకును మీరెన్ని నిదర్శనములు చూపినను సరే, వారు మీ ఖిబ్లాను అంగీకరింపరు. మీరుకూడ వారి ఖిబ్లాను అంగీకరింపరు. వారు సహితము ఏదే నొకే ఖిబ్లాను స్వీకరించినవారుకారు. వారిలో ఒక తెగవారి 'ఖిబ్లా'ను మరొక తెగవా రంగీకరింపరు. ఇదంతయు తెలిసియుండియు మీరు వారి ననుసరించినచో మీరు భగవదాజ్ఞ నతిక్రమించినవా రగుదురు. *

146. వాస్తవమేమనగా యూదులును క్రైస్తవులును వారి పండితులు తమసంతతి నెట్లు గుర్తుపట్టుదురో నిన్ను (ఇస్లాం ప్రవక్తను) అట్లే గుర్తుపట్టుదురు. అట్లయ్యు వారిలో కొందరు తెలిసియుండియు సత్యమును దాచిపుత్తురు. *

147. ఈ సత్యము భగవదాజ్ఞయై యున్నది. అందుచే మీరు దానివిషయమై సంశయాత్ములై వాగ్వాదములను చేయకుడు.

## పదునెనిమిదవ ఖండము

148. ప్రతి సంఘమునకును ఒక్కొక్క దిశ కలదు. (ప్రార్థన సలుపునపుడు) వా రా దిశకు తమ ముఖమును త్రిప్పుకొందురు. (కాని ఇది మతము యొక్క ఏమంత ముఖ్యాంగము కాదు మతముయొక్క ప్రధానాంగము సత్ప్రవర్తనము) అందుచే సన్మార్గమున ఒకరినిమించి ఒకరు ముందుండుటకు ప్రయత్నింపుడు. మీరు ఎక్కడున్నను (ఎక్కడ ఏదిశకు తిరిగి భగవంతుని ప్రార్థించినను) భగవంతుడు మిమ్ములను కని పెట్టును. నిశ్చయముగ భగవంతుని శక్తికి మించిన దేదియు లేదు. (అతని శక్తి ప్రతి వస్తువును ప్రతి దిశను ఆవరించియున్నది )

149. ఓ ప్రవక్తా! మీరెక్కడనుండి వచ్చినను (అనగా ఎక్కడున్నను సరే, ఏ దిశనున్నను సరే) పవిత్ర ప్రార్థనాలయము కాబా ఉన్న దిశకు ముఖములను త్రిప్పుడు. ఇది మీ భగవంతుని కడనుండి వచ్చిన సత్యమగు ఆజ్ఞ. మీరు చేయు ఏపనినైనను భగవంతుడు ఏమరియుండడు.

150. మీరు ఎక్కడనుండి వచ్చినను సరే (ప్రార్థనాసమయమందు మాత్రము) మీ ముఖమును కాబా వైపునకు త్రిప్పుడు మీరు ఏ ప్రదేశమున ఏదిక్కున నున్నను మీ ముఖములను కాబా వైపుకు త్రిప్పుడు. ఇ రెండు కనగా మీకు వ్యతిరేకముగ ప్రజల కెట్టి వివాదమును ఉండరాదని. కాని అన్యాయపరులు (ఎట్లున్నను పగబూను వారే) (వారిపగ మీ కెట్టి హానియు కలిగింపజాలదు) అందుచే వారికి భయపడకుడు. నాకు మాత్రము భయపడుడు. (నాకు మీరు భయపడినచో మిమ్ములను విశ్వములో మరేశక్తియు భయపెట్టజాలదు.) నేను మీకు వాగ్దానమిచ్చిన నా అనుగ్రహమును మీరు సన్మార్గప్రవర్తకులగుటకొఱకు పూర్తిచేయుదును.

151. మీలోనుండి ఒకనిని నా సందేశమును వినిపించు ప్రవక్తగా నెన్నుకొంటిని. అతడు నా ప్రవచనములను మీకు వినిపించుచున్నాడు. మీ హృదయములను సంస్కరించుచున్నాడు. మీకు జ్ఞానమును గఱపుచున్నాడు. వేదమును నేర్పుచున్నాడు. మీకు తెలియని విషయములను తెల్పుచున్నాడు. (ఇట్లే మీపై అనుగ్రహమును కురిపించి మిమ్ములను సన్మార్గప్రవర్తకులను చేయుదును.)

152. అందుచే నన్ను స్మరింపుడు. నేను మిమ్ములను స్మరింతును నాకు కృతజ్ఞులై యుండుడు. కృతఘ్నులు కాకుడు.

**పదునాఱవ ఖండము**

153. ఓ విశ్వాసవంతులారా! ఓర్పుతోడను, నమ్రతతోడను ఆశ్రయము నర్థింపుడు. ఓర్పువహించువారితో భగవంతు డున్నాడు.

154. భగవన్మార్గమున మరణించినవారిని గూర్చి చచ్చిరని చెప్పకుడు. అట్లు కాదు. వారు జీవించియున్నారు. కాని మీరు గ్రహింపరు.

155, 156. భయమును, ఆకలిని, ధన ధాన్య ప్రాణనష్టమును కల్గించి మిమ్ములను నిశ్చయముగ పరీక్షింతును. ఏదేని ఆపద సంభవించినప్పుడు "మా సమస్తమును భగవంతునిదేను. మన కందరకును

భగవంతునియొద్దకే మరలవలసి యున్నది" అను నట్టి ఓర్పు గలవారికి (ఓ ప్రవక్తా!) శుభవార్తను తెల్పుము.

157. ఇట్టివారే భగవంతుని కృపకును అనుగ్రహమునకును పాత్రులైనవారు. సన్మార్గగాములుకూడ వీరే.

158. సఫా, మర్వా పర్వతములు— భగవంతుని మహాత్తును ప్రకటించు చిహ్నములు. అందుచే మీరు కాబాను దర్శించ బోయినప్పుడెల్ల ఈ పర్వతముల ప్రదక్షిణముచేయుట పాపకార్యము కాదు. స్వచ్ఛమగు హృదయముతో ఏ సత్కార్యము చేసినను భగవంతుడతనికి సంపూర్ణ ఫలమిచ్చును. భగవంతుడు వరదుడు; సర్వజ్ఞుడు.

159. స్వచ్ఛమగు సత్యమును సన్మార్గమును చూపుటకై పంపబడిన సందేశమును సమస్త మానవలోకమునకు తెలియునట్లును వారికి ఆచరణయోగ్య మగునట్లును సవివరణముగ భగవద్గ్రంథమునందు విప్పి చెప్పినను (లోకభయముచే) అసత్యమును దాచువారు భగవంతునిచే శపితులగుదురు. (అంతేకాదు) సమస్త శాపములును వారికి తగులును.

160. (కాని పశ్చాత్తాపద్వార మెప్పుడును తెఱచియేయున్నది) పశ్చాత్తాప పడి తమ ప్రవర్తనమును మార్చుకొని, (భగవత్సందేశమును దాచుటకుమారు లోకమునకు) చాటుచో అట్టివారి పశ్చాత్తాపమును నేను చిత్తగింతును. నేను క్షమించువాడను. దయానిధిని.

161. కాని భగవన్మార్గమును ధిక్కరించి, ఆమరణాంత మట్లే యుండి మరణించినవారికి భగవంతునియొక్కయు, దేవదూతలయొక్కయు, మానవులయొక్కయు శాపములు తగులుగాక !

162. వారాస్థితియందే నిరంతర ముందురు. వారి శిక్ష ఎన్నడును తక్కువకాదు. వారికి వ్యవధి లభించదు.

163. మీ ఈశ్వరుడు ఏకేశ్వరుడు. మరెవ్వడును ఈశ్వరుడు లేడు. అతడు సమస్త వరప్రదాయకుడు; దయానిధి.

## ఇరువదవ ఖండము

భూమ్యాకాశముల సృష్టియందును, రేబవళ్ళ మార్పుల యందును, మానవుని లాభమునకై (వస్తుసంచయమును మోసుకొని) సముద్రయానముచేయు ఓడలయందును, మేఘములనుండి వర్షించు నీటియందును, మృతినొందిన మృత్తిక కా నీరు జీవప్రదానముచేయు విధమునందును, భూమిపై బహువిధములగు జంతుసంతతి వ్యాపించిన తెఱగునందును, పవనముల మార్పునందును, భూమ్యాకాశముల మధ్య మేఘములు (తమ తమ నిర్ణీత స్థలములలో) బంధింపబడియున్న తెఱగునందును బుద్ధిమంతులకొఱకు (భగవంతుని అస్తిత్వముయొక్కయు అతని దయాళుత్వముయొక్కయు) గొప్పచిహ్నములు స్పష్టముగనున్నవి.

165. కొందరు భగవంతునకు సమానులను కల్పించి ఈశ్వరార్హమగు ప్రేమతో వారిని ప్రేమింతురు. విశ్వాసవంతులు మాత్రము భగవంతునే ప్రియతమునిగ భావింతురు.* దుర్మార్గులగు (విశ్వాసహీనులు) తమయట్టి ఇతరుల కీయబడిన శిక్షనుచూచినచో భగవంతుడే సర్వశక్తిమంతుడనియు దౌష్ట్యమును శిక్షించుటలో అతడు కఠినుడనియు తెలిసికొనియుందురు.

166. వీరు కల్పించుకొనిన (ఈ దేవతలు) తమ అనుయాయులగు వీరిని వారికర్మమునకు విడిచిపెట్టినప్పుడును, తమవంటివా రనుభవించుచున్న శిక్షను వారు కండ్లార చూచినప్పుడును, వారి బంధములు తెగినప్పుడును (కాని వారికి తెలియదు)

167. ఆ దేవతల అనుయాయులగు వీరు ఇట్లందురు: "మేము (భూలోకమునకు) మరలినచో వీ రిప్పుడు మమ్ములను విడిచి పోయినట్లే వీరినికూడ మేము విడిచిపెట్టుదుము" ఈ విధముగ భగవంతుడు వారి కర్మఫలమును వారికి దుఃఖము కల్గునట్లు చూపును. వారు నరకాగ్నినుండి బయటకు రారు.

## ఇరువది యొకటవ ఖండము

168. ఓ మానవులారా! భూమిపైనున్న వస్తువులలో ధర్మ విహితములును, మంచివియు నగు వాటినే భుజింపుడు. సైతాను అడుగుజాడలను వెంబడింపకుడు. అతడు మీకు బహిరంగ శత్రువు.

169. అతడు మిమ్ములను చెడుగును సిగ్గుమాలినతనమును అవలంబించుమనియే ప్రోత్సహించును. మీరెఱుగని అంశములను గుఱించి దేవునిపేరు చెప్పి అబద్ధములు చెప్పుటకై మిమ్ముల నతడు పురికొల్పును.

170. "భగవదాజ్ఞానుసారము ప్రవర్తింపుడు" అని వారితో చెప్పినప్పుడు వా రిట్లందురు: "అట్లుకాదు. మా తండ్రు లనుసరించిన మార్గమునే మే మనుసరింతుము." ఏమీ వారి తండ్రులు బుద్ధిహీనులైనను, సన్మార్గగాములు కాకపోయినను సరే (వారి మార్గమునే గుడ్డిగా ననుసరింతురా?)

171. (వాస్తవ మేమనగా భగవంతుడనుగ్రహించిన బుద్ధిని ధిక్కరించి) తిరస్కారమార్గము ననుసరించినవారి ఉదాహరణ మిట్టిది: ఒక పశువుల కాపరి తన మాట పశువులు వినుటలేదనియు, అవి కేవలము తన పిలుపు ధ్వనిమాత్రము వినగలవనియు కేకలు వేసినట్లున్నది. వారు బధిరులు, మూగవారు, గుడ్డివారు. వారు ఆలోచింపరు; గ్రహింపరు.

172. ఓ విశ్వాసవంతులారా! మీకీయబడిన వస్తువుల నుండి మంచివాటినే గ్రహించి తినుడు. మీరుభగవంతు నారాధించు వారైనచో అతనికే కృతజ్ఞతలను సమర్పింపుడు.

173. తమంత తాము చచ్చిన (మృగ పక్షులను) రక్తమును, పందిమాంసమును, భగవంతునిపేర తప్ప మరే ఇతరదేవతకు బలి యీయబడిన యే ఆహారములైనను మీకునిషేధింపబడినవి. కాని ఆపత్కాలమున కోరిక లేకపోయినను (ప్రాణసంరక్షణార్థమై) మితము తప్పక భుజించినచో నది పాపము కాదు. ఎందుకనగా భగవంతుడు క్షమించువాడు; దయానిధి.

174 తుచ్ఛమగు మూల్యమునకై భగవత్ప్రోక్తమగు గ్రంధ మందలి ఒక భాగమును దాచిపెచినవారు అగ్నిని భుజింతురు. అవ సానకాలమున భగవంతుడు వారిని పలుకరించడు. అట్టివారిని భగ వంతుడు పరిశుద్ధుల నొనర్పడు. వారికి భాధాకరమగు శిక్షను విధిం చును.

175. సన్మార్గమునకు బదులు చెడుత్రోవయు, క్షమకు బదులు శిక్షయు సంపాదించుకొనువారు వీరే. నరకాగ్నిని చొరబూను వీరు ఎంతటి సాహసులు !

176. ఇదెందుకనగా భగవంతుడు దైవగ్రంథమున సత్యమును ప్రవచించినాడు. ఈ భగవద్గ్రంథమునకు వ్యతిరేకులైనవారు ఒక గొప్ప విరోధమును చేయుచున్నారు.

## ఇరువదిరెండవ ఖండము

177. తూర్పువైపునకుగాని, పడమటివైపునకుగాని ముఖ మును త్రిప్పుటయే ధర్మప్రవర్తనము కాదు. భగవంతునియందును, తుదిదినమునందును, దేవదూతలందును, భగవద్గ్రంథమునందును, ప్రవ క్తలయందును, విశ్వాసముంచుటయు; బంధువులకును, అనాథబాల బాలికలకును, నిరుపేదలకును, మార్గస్థులకును, బిచ్చగాండ్రకును ఇచ్చుటకును, ఖైదీలను విడిపించుటకును, భగవంతుని ప్రేమకై తన కున్న ధనమును వ్యయపరచుటయు, ప్రార్థన సలుపుటయు, జకాతు నిచ్చుటయు—ఇది నిజమగు ధర్మ ప్రవర్తనము.

వాగ్దానమిచ్చి దానిని పాలించువారును, కష్టకాలములో ఓర్పు వహించు వారును—వీరే ధర్మ ప్రవర్తకులు. వీరే దౌష్ట్యమునుండి తప్పి చరించువారు.

178. ఓ విశ్వాస వంతులారా! వధింపబడినవారి విషయములో ప్రతీకారము తీసికొనుటకై మీ కనుజ్ఞ ఇవ్వబడినది. ఒక స్వచ్ఛంద మానవుడు వధింపబడుచో అతనికి బదులు అతడే వధింపబడ వలెను. ఒక బానిస వధింపబడుచో బానిసయే వధింపబడవలెను. స్త్రీ వధింప బడినచో స్త్రీయే వధింపబడవలెను.

ఒకప్పుడు వధింపబడిన వాని వారసుడగు అతని సోదరుడు, వధించినవానిని క్షమించినచో (రక్తమునకు మారుగా రక్త శుల్కమును గ్రహించుట కొప్పుకొనినచో) ఆ వారసునకు ధర్మప్రకారము (రక్త శుల్కము) నియ్యవలెను. వధించినవాడు సంతోషముతో ఇవ్వవలెను. ఇది మీ కష్టములను తగ్గించుటకొఱకు భగవంతుడు చూపిన అనుగ్రహము. దీని పిదప ఎవరైనను తమ హద్దులను మీరుచో ఘోరమగు శిక్షకు పాత్రులగుదురు.

179. (ఓ వివేకవంతులారా!) ఈ ప్రతీకార ధర్మములో (ప్రాణమునకు ప్రతిప్రాణము విధింపబడినను ఇది నిజముగ మరణము కాదు) మీకై ఇందు జీవితమున్నది. మీకు చెడుగు లంటకుండుటకును (దౌర్జన్య మంత మొందుటకును ఇట్లు విధింపబడినది)

180. (ఓ విశ్వాసవంతులారా!) మీలో ఎవనికేని మరణ మాసన్నమగునప్పుడు అతని కున్న ధనమును, ఆస్తిని తన తల్లిదండ్రులకును బంధువులకును విడిచిపెట్టి వెళ్ళవలెను. ధర్మప్రవర్తకుల కిట్లు చేయుట విధి.

181. అట్లు (మరణించినవాడు చేసిన విభజనమును) వినియు దానిని ఎవడు మార్చునో అట్లు మార్చినవానిదే పాపమగును భగవంతుడు సర్వమును వినువాడు; సర్వజ్ఞుడు.

182. కాని మరణశాసనమును వ్రాసి చనిపోయినవాడు అన్యాయమున కొడిగట్టుకొనెనని గాని, ధర్మోల్లంఘనము చేసెనని గాని అనుమానమున్నచో (వారసులను ఒప్పించి) వారిలో ఒడంబడిక కుదిర్చినచో అది పాపకార్యము కాదు. నిశ్చయముగ భగవంతుడు (మానవసహజమైన దౌర్బల్యమును) క్షమించువాడు, కృపానిధి.

## ఇరువది మూడవ ఖండము

183. విశ్వాసవంతులారా! మీ పూర్వులకునువలె మీకు కూడ ఉపవాసము విధివిహిత మొనర్పబడినది.[౧౦] దీనివలన మీకు చెడుగు అంటకుండును.

184. (ఈ ఉపవాసము) కొన్ని నిర్ణీత దినములయందు (మాత్రమే వధింపబడినది ) కాని మీలో రోగగ్రస్తులైయున్నవారును, ప్రయాణమునం దున్నవారును, (వారికి వీలైన) ఇతర దినములలో ఉపవాస ముంచి ఆ దినములను పూర్తి చేసుకొనవలెను ఉపవాస ముండ నశక్తులైనవారు ఒక బీదవాని కన్నముపెట్టిన చాలును. ఎవరైనను సంతోషముతో ఇంకను ఎక్కువ సత్కృతి నాచరించినచో (ఇంకను ఎక్కువమందికి అన్నము పెట్టినయెడల) అతనికి ఎక్కువ పుణ్యము లభించును. మీరు జ్ఞానవంతులైనచో ఉపవాసముచేయుటయే ఉత్తమము.

185. ఈ రంజాన్ నెలలో ఖుర్ ఆన్ అవతరింప మొదలిడినది మానవుల కది మార్గదర్శకమైనది, సన్మార్గముయొక్క స్వచ్ఛమగు నిదర్శనములు కలది, సత్యాసత్యములను వేరుపరచి చూపునది. అందుచే మీలో ఆరోగ్యవంతులైనవా రుపవాసమొనర్పుడు. రోగగ్రస్తులైనవారును, ప్రయాణమునందున్నవారును (వారికి వీలైనప్పుడును) శక్తి యున్నప్పుడును తప్పియున్న దినములను ఇతర దినములయందుపవాసముండి పూర్తిచేసికొనవచ్చును. (సత్యమైన ధర్మమార్గము కఠినమైనది కాదు ) భగవంతుడు మీకు సౌలభ్యమునే కలిగింప గోరును. మీకు కష్టమును కలిగింప గోరడు. అందుచే (నిర్ణీతదినముల) సంఖ్యను పూర్తిచేసికొనుడు. మీరు కృతజ్ఞులై యుందురని మిమ్ములను ఋజుమార్గమున నడిపించిన భగవంతుని మహత్తును కొనియాడుడు.

186. (ఓ ప్రవక్తా!) నా సేవకులలో ఎవడేని నన్నుగురించి (నన్ను చేరు మార్గమును) అడిగినచో నేను చాల దగ్గరగ నున్నానని యతనితో చెప్పుము. నా భక్తుడు నన్ను పిలిచినప్పుడు నే నా పిలుపును వినుచున్నాను. ఆ పిలుపున కుత్తరమిచ్చుచున్నాను. అందుచే వారును నా పలుకున కుత్తర మీయవలెను. నాయందు విశ్వాస ముంచి ధర్మమార్గమున నడువవలెను.

187 ఉపవాసదినములలో రాత్రులయందు మీ భార్యలను గవయుట మీకై ధర్మవిహితమొనర్పబడినది. మీకు వారు అవగుంఠ

నములవంటివారు అట్లే మీరును వారికి అవగుంఠనముల వంటివారు. అట్లు చేయకూడ దనుకొని మీ అంతరాత్మల ప్రబోధమునకు వ్యతిరేకముగ మీరు ప్రవర్తించుచుండిరి (భార్యలను గవయుచుండిరి) (వాస్తవమున కిది అపరాధము కాదు మీరుమాత్ర మట్లనుకొనుచుండిరి ) అందుచే భగవంతుడు తన అనుగ్రహముచే మీ పాపరాహిత్యము నంగీకరించినాడు. మీ తప్పిదమును క్షమించినాడు. ఇప్పుడు స్వేచ్ఛగా మీ భార్యలను కలియుడు. భగవంతుడు మీ కనుగ్రహించినవాటిని ఉపయోగింపుడు.

ఉదయంపు తెలిరేఖ రేనలుపునుండి వేరుపడువరకు (రాత్రులయందు) తినుడు, త్రాగుడు. తర్వాత రాత్రివరకు ఉపవాసమును పూర్తిచేయుడు. కాని మీరు మసీదులలో వుండవలసివచ్చినపుడు మాత్రము మీ భార్యలను గూడకుడు. భగవంతు డేర్పరచిన హద్దులివి. అందుచే అప్పుడు మాత్రము వారిని చేరబోకుడు. చెడుగు లంటకుండుటకై భగవంతుడు స్వచ్ఛమును సందేహరహితమును నగు ఆజ్ఞలను ప్రసాదించినాడు.

ఒకరి ఆస్తి నొకరు అన్యాయముగ మ్రింగివేయకుడు. అధికారులను తమవైపు త్రిప్పుకొనుటకై ధనము నుపయోగించి (లంచములనిచ్చి) ఇతరుల ఆస్తులను అన్యాయముగ వశపఱచుకొనకుడు.

## ఇరువదినాల్గవ ఖండము

189. (ఓ ప్రవక్తా!) లోకులు నిన్ను నెలపొడుపులను గుఱించి అడుగుచున్నారు. వారితో నిట్లనుము: ఇవి మానవులకొఱకు కాలమానముగా నిర్ణయింపబడినవి. యాత్రామాసముల నిర్ణయము దీనిని బట్టి జరుగును. (అంతేకాని చంద్రుని గుఱించిన మూఢాచారములన్నియు గర్హితములు ) తమ ఇండ్లలో వెనుకగుమ్మముద్వారా ప్రవేశించుట పుణ్యకార్యము కాదు. స్వధర్మనిర్వహణమే సత్కృతిగాని (ఇట్టి మూఢాచారముల నాచరించుట కాదు.) అందుచే (ఇట్టి మూఢాచారములకు గురికాక) మీ రిండ్లలో ప్రవేశించినపుడు ముంగలిగుమ్మము ద్వారా ప్రవేశింపుడు.

భగవదాజ్ఞోల్లంఘనమును చేయకుడు. (అప్పుడే) మీకు విజయము కల్గును.

190. మీతో యుద్ధము చేయుచున్నవారితో మీరుకూడ భగవన్మార్గమున యుద్ధముచేయుడు. కాని మితిమీరకుడు. హద్దుల నతిక్రమించినవారిని భగవంతుడు ప్రేమింపడు.

191. (మీతో యుద్ధముచేయువారు) ఎక్కడ దొరికిన అక్కడ వధింపుడు. మిమ్ములను వా రెక్కడనుండి వెడలగొట్టిరో మీరును వారి నక్కడనుండి వెడలగొట్టుడు. (రక్తపాతము మంచిది కాకపోయినను) దౌర్జన్యము స్థిరపడుట (తాత్కాలికమగు) రక్తపాతముకంటె చెడ్డది. పవిత్రప్రార్థనాలయపు హద్దులలో శత్రువులు మీతో యుద్ధముచేయ నంతవరకు మీరును యుద్ధము చేయకుడు. వారు యుద్ధముచేసినచో మీరుకూడ యుద్ధముచేయదగును. భగవంతుని నిరాకరించినవారి (దౌర్జన్యమున) కిదియే ప్రతీకారము.

192. ఒకసారి వారు యుద్ధమును మానుకొనినచో భగవంతుడు క్షమించువాడు, కృపానిధి.

193. వారి దౌర్జన్య మణగు వరకు వారితో యుద్ధము చేయుడు. మతము భగవంతునకు సంబంధించినది. (వారి మత పరివర్తనమునకై యుద్ధము చేయవలదు ఎందుకనగా మత విషయములో భగవంతుడే బాధ్యత వహించును.) ఒకసారి వారు యుద్ధము మానుకొనినచో మీరు కూడ యుద్ధమును మానుకొనుడు. దౌర్జన్యము చేయువారి తోడనే పోరాడవలెను.

194. (పవిత్ర మాసములందు యుద్ధమును గురించి.) పవిత్ర మాసములను వారు గౌరవించినచో మీరును గౌరవింపుడు. వా రా మాసములను గౌరవించక యుద్ధము చేసినచో మీరును చేయుడు. ఈ విషయములో వారి చేతకు ప్రతిసేత చేయవలసినదే. అన్యాయముగ కయ్యమునకు కాలుత్రివ్వి మీ కెవరైనను హింస యొనర్చుచో దానికి సమానమైన హింసను మీరును చేయుడు. భగవంతు

వకు భయపడుడు. ధర్మపరులకు భగవంతుడు తోడుండునన్నమాట మరువకుడు.

195. భగవన్మార్గమున మీ ధనమును ఖర్చు పెట్టుడు. (ధర్మయుద్ధము నాచరించుటకు వెనుదీసి) స్వహస్తములతో నాశమును పొందకుడు (ఎందుకనగా భగవంతుడు మీకిచ్చిన దానిని మీరు ఖర్చుపెట్టుటకు భయపడి మీపై శత్రువులు చేయు వినాశమును సహించినచో మీచేతులతో మిమ్ము లను మీరు నశింపజేసికొనినట్లే ) ధర్మకార్యములను చేయుడు. ధర్మ పరు లనే భగవంతుడు ప్రేమించును.

196. యాత్రయు దర్శనమును దేవుని కొఱకు చేయుడు.

ఒకసారి మీరు (యాత్రకు పోవుచు) మార్గమధ్యమున ఆపివేయ బడుచో మీకు ఏది సులభముగ లభించునో దానిని (ఉపాయనముగ) పంపుడు. ఈ ఉపాయనము గమ్యస్థానము చేరునంతవరకు శిరో ముండనము చేసికొనకుడు. కాని రోగగ్రస్తులైనపక్షమునను, ఏదేని శిరోరోగముచే బాధపడుచుండినపక్షమునను అట్టివారు (తమ కేశములకు బదులు) ఉపవాసమైనను ఉండవలెను, లేదా దానమైనను చేయ వలెను, లేదా బలియీయవలెను.

(యుద్ధము మొదలైనవి లేని) శాంతి పరిస్థితులలో ఎవరైనను యాత్రయు దర్శనమును కలిపి చేయదలచినచో అట్టివారును తమకు లభించిన జంతువును బలియియ్యవలెను.

బలి జంతువు లభించనిచో యాత్రాదినములలో మూడు దిన ములు ఉపవసింపవలెను. మరలివచ్చి మరి ఏడుదినము లుపవసింప వలెను. ఇట్లు పది దినములు పూర్తియగును. మక్కాలో ఇండ్లులేని వారికై యీ ఆజ్ఞ (ఇవ్వబడినది ) భగవంతునియెడ మీ ధర్మములను చక్కగా నిర్వహింపుడు. అధర్మపరులను భగవంతుడు కఠినముగ శిక్షించును.

## ఇరువదియయిదవ ఖండము

197. యాత్రచేయు మాసములు సుప్రసిద్ధమైనవి. ఈ మాసములలో యాత్రచేయ బూనువారు యాత్రలో నున్నట్లే. యాత్రలో నున్నప్పుడు స్త్రీసంగమము చేయరాదు. అసభ్యమగు మాటలాడరాదు. జగడములాడరాదు. మీరు చేయు సత్కృతులనన్నిటిని భగవంతుడెఱుగును. యాత్రకు వెళ్లునప్పుడు మార్గమున అగు ఖర్చులకై ఏర్పాటులను చేసికొని మీరు బయలుదేరుడు. అన్నిటికంటె గొప్ప విషయము పుణ్యశీలము. ఓ వివేకవంతులారా! భగవంతునకు భయపడుడు. (దానివలననే పుణ్యశీలము కల్గును.)

198. మీరు (యాత్రాకాలములో) భగవంతుని అనుగ్రహమును బడయగోరినను పాపముకాదు. (అనగా భగవంతుడనుగ్రహించు వాణిజ్య లాభమును పొందినను పాపముకాదు.)

మీరు 'అర్‌ఫాత్' మైదానమునుండి తిరిగి వెళ్ళుచు 'ముజ్దలఫా'* దగ్గర భగవన్నామ స్మరణ మొనర్పుడు. మీ కుపదేశింపబడినరీతిని మనన మొనర్పుడు. ఇంతకుముందు నిశ్చయముగ మీరు కుమార్గము ననుసరించినవారై యుండిరి. (వివిధ మూఢాచారములను అనుసరించుచుండిరి.)

199. జనులు ఎక్కడినుండి మరలుచున్నారో మీరును అక్కడినుండి మరలుడు. మీపాపములను క్షమించుటకై భగవంతుని ప్రార్థింపుడు. నిశ్చయముగ భగవంతుడు మహాక్షమి, కరుణానిధి.

200. మీరు యాత్రావిధుల నన్నిటిని తీర్చుకొని పూర్వము మీరు మీ తాతతండ్రుల ఘనతను కొనియాడుచుండినట్లే ఇప్పుడు భగవంతుని స్మరింపుడు. అంతకంటె అధికముగ స్మరింపుడు.

(ఇహలోక సౌఖ్యములనే ఆరాధించువారు కొందరున్నారు.) "ప్రభూ! మాకు ప్రాపంచిక సౌఖ్యములనే ప్రసాదింపుము" అనువారున్నారు. పరలోక సౌఖ్యములు మరి వారికి లభింపవు

---

* జిల్‌హజ్ నెల 9 వ తేదీ సాయంకాలము అరఫాత్ మైదానమునుండి మరలి వెళ్లుచు రాత్రికి యాత్రికులు ఆగు ఒకస్థలము అరఫాత్ మైదానము మక్కాకు 12 మైళ్ల దూరమున నున్నది. యాత్రికులందరు నిక్కడ సమావేశ మగుదురు.

201. (ఇహపరముల నాశించు వారు మరి కొందరున్నారు.) వారి ట్లందురు. "ప్రభూ! మాకు ఇహమునను పరమునను కూడ సౌఖ్య మును ప్రసాదింపుము. మమ్ములను నరక యాతనల నుండి రక్షింపుము." ౧౨

202. వారి కర్మముల ననుసరించి వారికి సుగతి లభించును. సత్కృతులకు ప్రతిఫలమిచ్చుటలో భగవంతుడు జాగుచేయడు.

203. యాత్రయొక్క నిర్ణీత దినములలో* భగవత్స్మరణ ములో మగ్నులై యుండుడు.

మరలుటలో తొందరపడి ఎవరైనను రెండు దినములలోనే మరలినచో అది పాపము కాదు. ఉండిపోయినను ప్రమాదముకాదు. కాని ఇది కేవలము పుణ్యశీలుర కొఱకే. భగవంతుని యెడ మీకు గలవిధులను జాగ్రత్తగ నెరవేర్పుడు (ఏదోయొకనాడు మరణింపవలెననియు అతని సమక్షముననే తిరిగి కూడవలెననియు మరువకుడు)

204. ధార్మిక జీవనము విషయములో కొందరి మాటలు (పైకి) బాగుగ కన్పించును. వారు తమ అంతరాత్మయొక్క పారి శుద్ధ్యమునకు భగవంతునే సాక్షిగా పలుకుదురు. (వాస్తవముగ వారి హృదయములలో ద్వేషమును అవిశ్వాసమును నిండియున్నవి) వారుద్వేషము నందును శత్రుత్వమునందును మిక్కిలి కఠినులు.

205. వారికి ప్రభుత్వము లభించినప్పుడు తమ అధికారము నంతటిని దేశములో చెడుగును వ్యాపింపజేయుట యందును, వ్యవ సాయమునకును ఇతరకృషికిని ఫలితమైన (ధనధాన్యములను) ధ్వంస మొనర్చుట యందును, మానవ సంతతిని నశింపజేయుట యందును వినియోగింతురు. (సౌఖ్యసంపదలతో తులతూగు చుండుటకు బదులు) వినాశ మునకును విధ్వంసమునకును భగవంతుడెన్నడును ఇష్టపడడు.

* జిల్‌హాజ్ నెల ౧౦ వ తేదీ మొదలు ౧౩ వ తేదీ వరకు.

206. "భగవంతునకు భయపడుడు" అని వారితో చెప్పి నప్పుడు వారు గర్వము వలన పాపమార్గముననే ఈడ్వబడుదురు. అట్టివారికి నరకమే ప్రీతిగొల్పును. నిశ్చయముగ అది ఎంతయు దుష్టమగు ఆశ్రయము.

207. భగవంతుని ప్రీతికై తమప్రాణములను సైతము ధార పోయువారు కొందరున్నారు. ఇట్టి భక్తులను భగవంతుడు ప్రేమించును.

208. ఓ విశ్వాసవంతులారా! (ముస్లిమ్ పదవి నొందుటకు కేవలము నోటితో నేను ముస్లిము నైతినని చెప్పుట చాలదు) సంపూర్తిగ భగవంతునకు తమ సర్వస్వమును) సమర్పింపుడు. అధర్మము అడుగు జాడలను వెంబడింపకుడు. సైతాను మీకు బహిరంగ శత్రువు.

209. స్పష్టమగు నిదర్శనములు మీకు లభించిన తర్వాత కూడ మీరు సంశయాత్ములై దిగజారినచో భగవంతుడు సర్వ శక్తిమంతుడనియు సర్వజ్ఞు డనియు ఎఱుగుడు.

210. (మీరు విశ్వసించుటకై ఇప్పుడు స్పష్టపరుప బడిన నిదర్శనములు సరిపోకపోయినచో) వీరు దేనికై నిరీక్షించు చున్నారు? మేఘముల చాయలలో నిలువబడియుండగా దేవదూతలు వరుసలుతీరి భగవంతుడు ప్రత్యక్షము కావలయునందురా? కావలసినదంతయు నిర్ధారణమై పోయినది. సమస్తమును భగవంతుని చేతులలో నున్నది.

## ఇరువదియారవ ఖండము

211. (మీరు వెనుకటి చరిత్రను ఉదాహరణముగా నేల గ్రహింపరు?) ఇస్రాయీలీయుల నడుగుడు, వారి కెన్ని స్పష్టమగు చిహ్నములను ప్రసాదించితిమో? (ఇహపర సౌఖ్యములకై యున్న సమస్త ద్వారములను వారికై తెరచితిమి) ఐనను వారు సన్మార్గము ననుసరింపరైరి. వారు భగవదనుగ్రహమును గ్రహింపరైరి. భగవంతుని వరములను బడసి వానిని మార్చివైచినచో భగవంతుడు కఠినముగ శిక్షించువాడు.

212. సత్యమును నిరాకరించు వారి దృష్టిలో కేవలము ప్రాపంచిక జీవితమే ప్రధానమైనది. వారు విశ్వాసవంతుల (ప్రస్తుత కష్టములను) చూచి పరిహాసించుచుందురు వాస్తవముగ (ప్రాపంచిక వస్తువులు నిజమైన ఘనతకు కారణములుకావు) పుణ్యాపురుషులు అవసాన దినమునాడు వీరి కన్న ఉన్నత స్థితిలోనుందురు. (నేడెవరు దారిద్ర్యము ననుభవించుచున్నారో వారే భగవదనుగ్రహము వలన రేపు ధనధాన్యములతో తుల తూగ గలరన్న విషయము వారికి తెలియదు) భగవంతుడు తన కిష్టులైన వారికి అపరిమితమగు ఆహారపదార్థములను ప్రసాదించును.

213. (ప్రారంభములో మానవులు వివిధజాతులుగ నుండువారు కారు) సమస్త మానవజాతియు నొకే జాతిగ నుండెను.౧౩(కాని తర్వాత) పెక్కు కారణములచే వారిలో పలు జాతులు ఏర్పడెను. భగవంతుడు వారికై ఒకరి తర్వాత నొకరిని ప్రవక్తలుగ పంపెను. వారు (ఏకేశ్వ రునియందు విశ్వసించుటయందును, సత్కార్యాచరణ మొనర్చుటయందును గల పుణ్యముయొక్క) శుభవార్తను తెల్పుచు (దుష్కార్మాచరణమువలన గలుగు దుర్గతిని జెప్పి) భయపెట్టుచు వచ్చిరి. సత్యమును బోధించు భగవద్గ్రం థముకూడ వారి కియ్యబడెను. అది వారిలో (వివిధ జాతులలో) గల విభేదములను పరిష్కరించునదియైయుండెను. (సమస్త మానవలోకమును భగవన్మార్గమున నైకమత్యము కలిగించుట దాని ఉద్దేశమై యుండెను) ఈ విధ ముగ వీరు విభేదములు కల్పించుకొనినది సత్యము తెలియకయు, సరి యగు బోధన లేకపోయియుకాదు. భగవంతుడు వెలువరచిన సత్యము వారి ముందుండెను. (దానిలో పరస్పర విద్వేషమునకును విభేదమునకును స్థానమే లేకుండెను) ఐనను వారు పరస్పర విద్వేషము వలనను, అసూయాభావము వలనను విభేదములను కల్పించుకొనుచుండిరి. (మతముయొక్క ఏకైకమార్గమును ఐకమత్యముతో అనుసరించుటకు బదులు వివిధ మతములందును, వివిధ సంఘములయందును విడిపోవుచు వచ్చిరి) తుట్టతుదకు మానవులు విభేదములను కల్పించుకొనిన విషయములను విప్పిచెప్పి విశ్వాసవంతులకు (భగవంతుడు) సత్యముయొక్క నిజస్థితిని

తెల్పెను. భగవంతుడు తన కిష్టులైన వారికి మతముయొక్క ఋజు మార్గమును చూపును.

214. ఏమీ మీరు (మేము విశ్వాసవంతులమని కేవలము నోటితో చెప్పి) స్వర్గమును ప్రవేశింతుమని తలచుచున్నారా ? (పుణ్యపురుష లగుటకు సద్వర్తన మవసరమే లేదని తలచుచున్నారా ఏమి ?) మీకు (పుణ్యపురుష లియ్యవలసిన) పరీక్ష మీ పూర్వులకు వలె ఇంకను రానే లేదు. వారి కన్నివిధములగు కష్టములను సహింపవలసివచ్చెను. పడ రాని ఇడుములును, దుస్సహాకష్టములును వారిని మొదలంట కంప మెత్తించెను. దానికి తాళలేక ప్రవక్తయు అతని అనుయాయులును, (ప్రభూ !) నీ దివ్యసాహాయ్య మెప్పుడు లభించును ?' అని మొఱ పెట్టుకొనిరి. (అప్పుడుహఠాత్తుగ భగవత్సాహాయ్యము 'భీతిల్లకుడు') ఇదిగో ఈశ్వర సహాయము సమీపముననే యున్నది, (అనుచు సహాయము వచ్చెను )

215. (ఓ ప్రవక్తా !) మిమ్ములను వారు ఎట్లు వ్యయపరుపవలె నని అడుగుదురు. వారితో నిట్లనుము : మీ ధనమునుండి మీ రెంత వ్యయముచేయగలరో అంత వ్యయపెట్టుడు. మీ తల్లిదండ్రులును, బంధువులును, అనాధబాలికలును, పేదవారును, (కష్టములలో చిక్కు కొన్న) బాటసారులును నీ ధనమునకు పాత్రులు. నీవుచేయు సత్కృ తులను భగవంతు డెఱుగును.

216. యుద్ధముచేయుటకై మీ కనుజ్ఞ యీయబడినది. అది మీకు అయిష్టముగ నున్నది. (ఒకొక్కప్పుడు) ప్రశస్తమైన విష యము మీ కయిష్టముగ నుండవచ్చును. అట్లే హానికరమగు ఒక విషయము మీకు ప్రేమాస్పదము (కూడ) కావచ్చును. (మీ కేది మంచిదో, ఏది చెడ్డదో) భగవంతునకు తెలియును (మీరు స్వల్పబుద్ధులు) మీకు తెలియదు.

## ఇరువది ఏడవ ఖండము

217. (ఓ ప్రవక్తా !) పవిత్రమాసములో యుద్ధముచేయుటను గుఱించి నిన్ను జను లడుగుదురు. వారితో ఇట్లనుము : ఆమాసములో

యుద్ధముచేయుట చాల తప్పు. కాని మానవుని భగవన్మార్గమున నిరోధించుట, కాబాలోనికి వెళ్లకుండ నడ్డుపడుట, మక్కా-వాసులను వారి నివాసములనుండి వెడలగొట్టుట—ఇవి భగవంతుని దృష్టిలో అంతకంటెను చెడ్డవి. విద్వేషములను రగుల్కొల్పుటయు, కష్టపెట్టుటయు సంహారముకంటెను దుష్టమైన పనులు.

మీరు మీ మతమును విడిచిపెట్టువరకు అట్లు చేయుట వారికి సాధ్యమైనచో వారు యుద్ధము చేయుచునేయుందురు. (కాని ఎవరు భయముచే) సత్యమగు తమ మతమును విడనాడి, అవిశ్వాసముతో మరణింతురో వారు చేసిన సమస్త (పుణ్య) కర్మలును ఇహమునను పరమునను కూడ వ్యర్థమగును. వారు నరకజ్వాలల పాలగుదురు. నిరంతరము వారందే వసింతురు.

218. కాని ఎవరు విశ్వసింతురో (తమ శ్రద్ధా విశ్వాసములందు దృఢనిశ్చయులైయుందురో,) ఎవరు తమ గృహములను విడువవలసివచ్చి అట్టి పలాయనముయొక్క కష్టములను సహింతురో, ఎవరు భగవన్మార్గమున యుద్ధమొనర్తురో, అట్టివారు నిస్సందేహముగ భగవదనుగ్రహమునే ఆశింతురు. భగవంతుడు సర్వమును క్షమించువాడు, కరుణానిధి.

219. (ఓ ప్రవక్తా!) జనులు నీతో మద్యపానమును గుఱించియు, జూదమును గూర్చియు అడుగుదురు. వారితో నిట్లనుము: ఈ రెండును ఎక్కువ నష్టమును కలిగించునవి. ఇందు కొంత లాభముకూడ కలదు. కాని లాభము కన్న నష్టమే ఎక్కువగ నున్నది.

(ఓ ప్రవక్తా!) ధర్మార్థమై యెంత ఖర్చుబెట్టవలెనని జనులు నిన్నడుగుదురు. వారితో నిట్లు చెప్పుము: అన్నవస్త్రాదులకు మీ అవసరములు తీరగా మిగిలినది ఖర్చుపెట్టుడు.

ఇహపరములను గుఱించిన విషయములపై మీరాలోచించుకొనగల్గుటకై భగవంతు డిట్లు తన ఆజ్ఞలను స్పష్టపరచును.

220. అనాథులను గురించి వారు నిన్నడుగుదురు. వారితో నిట్లు చెప్పుము: "వారికై (అనాథ బాలబాలికలకై) ఏది మంచిదో అదే చేయవలెను. మీ రొకసారి వారితో కలసిమెలసి యుండగోరినచో (వారిని తమ వంశములోనికి తీసికోదలచినచో) వారు మీకు సోదరులవంటి వారు. (వారు పరాయివారు కారు) ఎవరు నష్టమును కలిగించు నట్టి వారో, ఎవరు మంచిని చేయగోరు నట్టివారో వారిని భగవంతు డెఱుగును. భగవంతు డిచ్ఛించినచో మీరు కష్టములలో చిక్కు-కొనియుందురు. నిశ్చయముగ భగవంతుడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు.

221. (ఏకేశ్వరుని) విశ్వసించు వరకు విగ్రహారాధకురాండ్రను పెండ్లియాడకుడు. నిశ్చయముగ విగ్రహారాధకురాలు నీకు ప్రియమైన దైనను ఆమెకంటె విశ్వాసవతియే ఉత్తమురాలు.

అట్లే విశ్వాసవతులను విగ్రహారాధకులకిచ్చి వారు విశ్వ సించు వరకు వివాహ మొనర్పకుడు. (ఓ యువతీ!) విగ్రహారాధకుడు నీకెంత ఇష్టుడైనను విశ్వాసవంతుడగు బానిసవాడు విశ్వాసహీనుని కంటె ఉత్తముడని తెలిసికొమ్ము.

(విశ్వాసహీనులు) మిమ్ములను నరకాగ్ని వైపున కాహ్వానింతురు. భగవంతుడు మిమ్ములను స్వర్గమునకు ఆహ్వానించుచున్నాడు. తన యిష్టముచే క్షమించుచున్నాడు. మానవుల బోధకై తన సందేశమును విస్పష్ట మొనర్చుచున్నాడు. "*

## ఇరువది ఎనిమిదవ ఖండము

222. స్త్రీల రజోదర్శన కాలములను గురించి వారు నిన్నడు గుదురు. వారితో నిట్లు చెప్పుము: "రజోదర్శనకాలము మంచిదికాదు. అందుచే ఆకాలమున వారు పరిశుద్ధలగు వరకు వారిని గవయకుడు. వారు పరిశుద్ధలైన తర్వాత భగవదాదేశాను సారము వారిని గవ యుడు. భగవంతుడు తన కున్ముఖులైన వారిని (సన్మార్గ ప్రవర్తకులను) పరిశుద్ధులను మాత్రమే ప్రేమించును."

223. మీ భార్యలు మీకై క్షేత్రములవంటివారు. అందుచే మీ క్షేత్రముల యందు తగు రీతిని వ్యవసాయ మొనర్పుడు. మీ భావికై మంచి కృషి సల్పుడు. (సంతానము బడయుటకై ప్రయత్నింపుడు) భగవంతునకు భయపడుడు. ఒకానొకనాడు చావ వలసియున్నద నియు భగవంతుని సమక్షమునకు మరలవలసి యున్నదనియు మరువ కుడు. (ఓ ప్రవక్తా!) విశ్వాసవంతులకు (రాబోవు సౌఖ్యముల) శుభ వార్తను తెల్పుము.

224. ఎవరికైనను ఉపకారము చేయుటయందుగాని, సన్మార్గము ననుసరించుటయందుగాని, మనుష్యులలో పరస్పరము మైత్రిని కుదుర్చుటయందుగాని, భగవన్నామముతో మీరు కావించుకొనిన ప్రతిజ్ఞలు ఇట్టి సత్కార్యములకు ఆటంకములగునట్లు చేయకుడు. భగ వంతుడు సర్వమును వినువాడు; సర్వమును తెలిసినవాడు.

225. మీ ప్రతిజ్ఞలలో వ్యర్థమగు వాటిని భగవంతుడు గణిం పడు. మీ హృదయములలో ఉన్న విషయములను భగవంతుడు గణించును. దానిని గుఱించి మిమ్ముల నడుగును. భగవంతుడు మహా క్షమి, దయానిధి.

226. తమ భార్యలకడకు వెళ్లమని ప్రతిజ్ఞ చేసినవారు (తొందర పడి వారితో సంబంధములను త్రెంచికొనరాదు) నాల్గు నెలలపాటు ఆగ వలెను. ఈ వ్యవధిలో వారు తమ భార్యలను చేరబోయినచో భగవంతుడు వారి పాపమును క్షమించును. అతడు కరుణానిధి.

227. (అట్లుగాక) వారు విడాకుల నిచ్చుటకు నిశ్చయించుకొని నచో (ఇది జ్ఞాపకముంచుకొనుడు) భగవంతుడు సర్వమును వినువాడు; సర్వమును తెలిసినవాడు.

228. విడాకులివ్వబడిన స్త్రీలు మూడు మాసములు మూడు సార్లు రజోదర్శనమగువరకు (ద్వితీయ వివాహము చేసికొనకుండ) ఆగ వలెను. వారు (స్త్రీలు) నిజముగ భగవంతునియందును అవసానదినము,

నందును విశ్వాసము కలవారైనచో వారి గర్భములందు భగవంతుడు సృష్టించిన (పిండములను) దించుకొనకుండ నుందురు.

(విడాకులిచ్చిన) భర్తలు ఈ వ్యవధిలో (తమ భార్యలతో) మైత్రి చేసుకొనగోరుచో వారిని తిరిగి స్వీకరించుటకు (ఇతరులకంటె) వారికే ఎక్కువ అధికారమున్నది.

చూడుడు. పురుషులకు స్త్రీలపై ఎట్టిహక్కులు కలవో స్త్రీలకును పురుషులపై అట్టి హక్కులే కలవు. అందుచే వారితో మృదురీతిని వ్యవహారింపుడు. నిశ్చయముగ స్త్రీలపై పురుషులకు ఒక ప్రత్యేకమగు ఆధిక్యత ఇవ్వబడినది. (కాని) జ్ఞాపకముంచుకొనుడు, భగవంతుడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు.

## ఇరువది తొమ్మిదవ ఖండము

229. రెండు సార్లు మాత్రము విడాకులు చెప్పవచ్చును. తర్వాత (భర్తకు రెండే మార్గములు కలవు.) వారిని స్నేహభావముతో తమ కడ నుంచుకొనుటయు, లేకపోయినచో వారిని దయతో పోని చ్చుటయు. వారికి నీవింతకుముందిచ్చిన ఏవస్తువైనను తిరిగి తీసికొ నుట నీకు ధర్మము కాదు. ఒకసారి భార్యాభర్త లిద్దరును భగవంతు డేర్పరచిన హద్దులలో ఉండజాలమను అనుమాన మున్నచో భార్య తాను భార్యాత్వ బంధములనుండి విడిపించుకొనుటకై (తన హృదయ పూర్వకముగ) తనకున్న దానినుండి ఏదైన నిచ్చివేయుచో నది దోషము కాదు. ఇవి భగవంతుడేర్పరచిన హద్దులు. వాటిని అతిక్రమించకుడు. ఈ హద్దుల నతిక్రమించిన వారే అధర్మపరులు.

230. ఒకసారి పూర్తిగ విడాకులిచ్చిన పిదప ఆమె మరొక భర్తను పెండ్లాడి (అతని వలన కూడ విడాకులు పొంది) న గాని నీకు వివాహ యోగ్యురాలు కాదు. రెండవ భర్తకూడ ఆమెకు విడాకు లిచ్చిన యెడల ఈ సారి భగవంతు డేర్పరచిన హద్దులలో నుండ గల మను విశ్వాసమున్నచో నామె తిరిగి తన మొదటి భర్తను పెండ్లా

డుట దోషము కాదు. ఇవి భగవంతు డేర్పరచిన హద్దులు. వివేక వంతుల కొఱకు ఇది స్పష్టపరుప బడినది.

**231.** మీరు తమ స్త్రీలకు విడాకు లిచ్చునప్పుడు వారి నిర్ణీత కాలము పూర్తియైన వెంటనే విడాకుల నియ్యక యథాపూర్వముగ భార్యలుగా నుంచుకొనుడు. లేదా వారికి పూర్తిగ విడాకుల నిచ్చి ఔదార్యముతో వారిని స్వేచ్ఛగ పోనియ్యుడు. వారిని బాధించు నుద్దేశముతో నుంచుకొనకుడు. అట్లుంచికొనినచో దానివలన మీరు హద్దుల నతిక్రమించినవా రగుదురు. ఇట్లెవరు చేయుదురో వారు తమకు తామే ద్రోహము చేసికొనిన వారగుదురు. నేడు పెండ్లాడి రేపు విడాకులిచ్చి విషయలోలత్వమున మగ్నులై యుండి భగవంతుని సందేశములను పరిహాసింపకుడు. మీకు సన్మార్గమున నడిపించుటకై (పంపబడిన) భగవద్గ్రంథమును, జ్ఞానమును మరువకుడు. భగవంతునిచే విహితమైన ధర్మముల నాచరించుటలో శ్రద్ధ వహింపుడు. భగవంతుడు సర్వమును తెలిసిన వాడని ఎఱుగుడు.

### ముప్పదియవ ఖండము

**232.** మీరు మీ భార్యలకు విడాకులిచ్చిన తర్వాత వారు నిరీక్షించవలసిన నిర్ణీతకాలాంతమున తమకు నచ్చిన ఇతర పురుషులతో ద్వితీయవివాహ మొనర్చుకొనుటకు (వారికి హక్కుగలదు) వారు తమ క్రొత్త భర్తలతో పరస్పరాంగీకారముతో ఉచితమగురీతిని వివాహమాడినచో అది దోషమని ఎంచకుడు. భగవంతునియందును, అవసానదినమునందును విశ్వాసముకలవా రందరకును ఈ ఆజ్ఞ మూలముగా ఉపదేశ మొసగబడుచున్నది. ఇది మీకు ఉత్తమ మైనదియు పవిత్రమైనదియు నగు పద్ధతి. భగవంతుడు సమస్తమును ఎఱుగును కాని మీ రెఱుగరు.

**233.** (తనభార్యకు విడాకులిచ్చిన పక్షమున ఆమెకు శిశువుండినచో) తల్లి తనుబాలే ఆ శిశువునకు త్రాగింపదలచినచో తల్లి పూర్తిగ రెండేండ్లపాటు పాలు త్రాగించవలెను. శిశువు తండ్రి ఆమెకు అన్న

వస్త్రములను ఉచితమగురీతి నిచ్చి పోషింపవలెను. ఎవరికిని అతని శక్తికి మించిన భారమును వహించు విధి లేదు. శిశువుకొరకై తల్లియు నష్టపడకూడదు; తండ్రియు నష్టపడకూడదు. (తండ్రి చని పోయిన పక్షమున ఆ భారమును వహించుట) అతని వారసునివిధి

అట్లుకాక పరస్పరాంగీకారముచే తల్లిదండ్రులు శిశువును (నిర్ణీతకాలమునకు) ముందే పాలు విడిపించినచో అది దోషము కాదు.

తల్లికి బదులు మీ శిశువులకొఱకై మీరు దాదులను ఏర్పాటు చేయగోరినచో మీ రా దాదులకు దేశాచారప్రకారము ఎంత ఇచ్చుటకు వాగ్దాన మిచ్చిరో అంత ఇచ్చినంతకాలము దోషముకాదు.

దేవునిచే విహితమైన ధర్మములను నిర్వహించుటలో శ్రద్ధాళులు కండు. మీరు చేయు సమస్తమును భగవంతుడు చూచుచునేయుండు నని ఎఱుగుడు.

**234.** మీరు మరణించిన తర్వాత విధవలగు మీ భార్యలు నాల్గునెలల పది దినములు (ద్వితీయ వివాహమొనర్చుకొనకుండ) వేచి యుండ వలెను. ఈ గడువు పూర్తియైన పిదప ధర్మానుసారము వారేమి చేసినను దోషమురాదు. మీరుచేయు సమస్తమును భగవంతు డెఱుగును.

**235.** ( మీరు వివాహము చేసికొన దలచిన విధవా స్త్రీలకు ) వివాహము చేసుకొమ్మని తన అభిప్రాయమును సంకేతముగ వెలి బుచ్చుట పాపముకాదు. వివాహము చేసుకోవలెనను మీ అభిప్రా యమును గోప్యముగను ఉంచవచ్చును. మీ భావములు వారివైపున కొరగునని భగవంతు డెఱుగును. కాని దొంగతనముగ వివాహము చేసుకొందునను వాగ్దానము చేయరాదు. ధర్మవిహితమైన పద్ధతిని వారితో మాట్లాడుము.

(విధవా స్త్రీలు) తమ నిర్ణీత నిరీక్షణకాలము పూర్తియగు వరకు వివాహ బంధమును ప్రవేశింపకూడదు.

మీ హృదయములలో (గుప్తమైయున్న భావములను) భగవంతు డెఱుగునని తెలిసికొనుడు. అందుచే భగవంతునకు భయపడుడు. భగవంతుడు క్షమించువాడనియు పాపములను మన్నించువాడనియు తెలిసికొనుడు.

## ముప్పది యొకటవ ఖండము

236. మీరు స్త్రీని ముట్టకపూర్వమును (మహర్) ధనమును నిర్ణయించకపూర్వమును విడాకు లివ్వగోరుచో (మహర్) ధనము నామె కివ్వనక్కర లేకయే విడాకు లియ్యుడు. దీనిలో పాపములేదు.

కాని ఇట్టిపరిస్థితులలో (ఒక స్త్రీని మీరు పెండ్లాడుటకు సిద్ధమైన తర్వాత నిరాకరించుటచే ఆమెకు కలిగిన నష్టమునకు పరిహారముగా) ఆమెకు లాభము కలుగునట్లు చేయవలెను. అట్టి లాభమామెకు ధర్మవిహితమగు పద్ధతిని లభింపజేయవలెను. కలిగియున్నవాడు తన శక్త్యనుసార మీయవలెను. బీదవాడు తన స్థితి ననుసరించి ఇవ్వవలెను. సుకృత మొనర్చువారికిది విధివిహితము.

237. కాని మీరు స్త్రీని ముట్టకపూర్వమును, ఆమె (మహర్) ధనమును నిర్ణయించిన తర్వాతను విడాకు లివ్వగోరినచో ఆ నిర్ణీత ధనమునందలి సగము ధనము నామె కీయుడు. ఆ స్త్రీ తానా ధనమును స్వేచ్ఛతో విడిచిపెట్టిన లేక ఆమెపై అధికారము గల పురుషుడు విడిచిపెట్టినను (మీ రా ధనమును సైత మామె కీయనక్కరలేదు) మీరు అట్లు క్షమించుట పుణ్యకార్యము. పరస్పర సాహాయ్యమును చేసికొనుటను మరువకుడు. జ్ఞాపక ముంచుకొనుడు. మీరు చేయుచున్నదంతయు భగవంతుడు చూచుచునే యున్నాడు.

238. ప్రార్థనలయెడ శ్రద్ధ వహింపుడు. ప్రత్యేకముగ (ప్రత్యక్షమునను, పరోక్షమునను) అత్యుత్తమమగు ప్రార్థన యెడల శ్రద్ధ వహింపుడు. నిజమైన నమ్రతతో భగవంతుని సమక్షమున నిలువబడుడు,

**239.** మీకు శత్రుభయమున్నచో (అట్టి యెడ మీరు విధి విహితమగు రీతిని ప్రార్థన సలుపజాలకుండినచో) మీరు పాదచారులై యున్నను, అశ్వారూఢులైనను ఎట్టి స్థితియందున్నను, ఎట్లు వీలుపడిన నట్లు ప్రార్థన సలుపుకొనుడు

మీరు సురక్షితులై యున్నప్పుడు భగవంతు డుపదేశించినట్లు ప్రార్థనలను సల్పుడు. (ఆ పద్ధతి) మీకు ఇంతకు ముందు తెలియ కుండెను.

**240.** చచ్చుటకు ముందు మీ భార్యలు ఒక్క సంవత్సరము పూర్తిగా మీ ఇల్లు విడిచిపెట్టకుండునట్లు వారికై ఒక్క సంవత్సర మునకు వలయు అన్నవస్త్రములను విడిచిపెట్టి వెళ్లుడు. ఒకసారి (స్త్రీలు) తమంత తాము (ఇల్లు విడిచి) వెళ్ళిపోయి ధర్మవిహితముగ (ద్వితీయ వివాహ మొనర్చుకొనినచో) అది పాపముకాదు. భగవం తుడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు.

**241.** విడాకు లివ్వబడిన స్త్రీల పోషణమునకై ఆచారాను సారము ఇవ్వవలెను. ధర్మాచరణపరులకిది విధి.

**242.** మీకు బాగుగా తెలియుటకై భగవంతుడు తన ఆజ్ఞల నిట్లు స్పష్టపరచును.

### ముప్పది రెండవ ఖండము

**243.** (ఓ ప్రవక్తా!) వేలకొలది సంఖ్యగలవారై యున్నను మృత్యు భయముచేత తమ ఇండ్లను విడిచిపెట్టి పారిపోయినవారినిగురించి నీవు ఆలోచింపలేదా ? (భీరులై అట్లు వారు పారిపోయినప్పుడు) భగవంతు డి ట్లాజ్ఞాపించెను. (మీరు మృత్యుభయముచే పారిపోయిరి గాన మీరు) మృత్యువువాత పడుదురుగాక. (వారి భీరుత్వముచే శత్రువులు వారి నోడించ గల్గిరి) తర్వాత భగవంతుడు వారిని సజీవుల నొనర్చెను. (వారిలో ధైర్యసాహసములను పూరించెను. వారు శత్రువుల నెదుర్కొని విజయమును బడసిరి.) నిశ్చయముగ భగవంతుడు మానవులయెడ అపారమగు కృపను చూపువాడు. (పెడద్రోవల పోయినను తిరిగి ఋజుమార్గమునకు మరల్చువాడు.) కాని పల్వురు కృతఘ్నులై యున్నారు.

244. భగవన్మార్గమున యుద్ధము చేయుము. భగవంతుడు సర్వమును వినువాడనియు సర్వమును తెలిసినవాడనియు నెఱుగుడు.

245. సంతోషపూర్వకముగ భగవంతునకుఅప్పిచ్చువారెవరు? వారికి భగవంతుడు అప్పును రెండింతలు నూరింతలు చేసి తీర్చును. దారిద్ర్యము, సంపద — రెండును భగవంతుని చేతిలో నున్నవి. భగవంతుని సమక్షమునకే మీ రందరును మరలవలసియున్నది.

246. (ఓ ప్రవక్తా!) మూసాతర్వాత ఇస్రాయీలీయుల నాయకు లనుభవించిన ఆ వృత్తాంతమునుగుఱించి నీవు యోచించలేదా? ఇస్రాయీలీయ నాయకులు తాము భగవన్మార్గమున యుద్ధము చేయుదు మనియు, అందుకై తమకొఱకు ఒక పాలకుని నియమించవలసిన దనియు తమ ప్రవక్తను కోరిరి. అప్పుడు ప్రవక్త వారితో ఇట్లనెను: తీరా యుద్ధము చేయుడని మీ కాజ్ఞాపించినప్పుడు మీరు యుద్ధము చేయ నిరాకరించవచ్చును. ఇస్రాయీలీయ నాయకులు దాని కిట్లనిరి: మే మట్లేల చేయుదుము? మేము మీ యిండ్లనుండి వెడలగొట్టబడి తిమి. మా సంతతినుండి వేరుచేయబడితిమి. అట్టియెడ మే మేల భగవన్మార్గమున యుద్ధముసల్పుటకు వెనుదీయుదుము?

తర్వాత వారికి యుద్ధముచేయుట కాజ్ఞయివ్వబడెను. అప్పుడు వారిలో కొద్దిమందితప్ప తక్కినవా రందరును వేరుజూపిరి. భగవంతు డధర్మపరుల నెఱుగును.

247. వారితో ప్రవక్త ఇట్లు చెప్పెను: "మీపై భగవంతుడు తాలూతును పాలకునిగా నియమించినాడు. (అందుచే అతడు చెప్పినట్లు వినుడు. అతని నాయకత్వముక్రింద యుద్ధమునకు సిద్ధపడుడు అప్పుడు తాలూతూ ఆధిపత్యమును అంగీకరించక) వారిట్లనిరి: అతడెట్లు మాకు పాలకుడు కాగలడు? అతనికంటె ఎక్కువ సమర్థులును యోగ్యులును ఐనవారు మాలో ఎందరో కలరు. అంతేకాక అతడు ధనవంతుడు కూడ కాడు."

దానికి ప్రవక్త ఇట్లనెను : "భగవంతుడు తాలూతు మీకంటె ఉత్తముడని అతనిని పరిపాలకునిగా నియమించినాడు. భగవంతుడు అతనికి మీకంటె ఎక్కువగ విద్యను బలమును ప్రసాదించినాడు. (ప్రభుత్వమునకై కావలసిన నీ రెండు గుణములేగాని ధనమును వంశమును కావు) భగవంతు డెవ్వరి కీయగోరునో వారికే భూపరిపాలనమిచ్చును. (అంతేకాని మీరు అధికార మిచ్చినంతమాత్రమున ఎవ్వడును ప్రభువు కాజాలడు.) భగవంతుడు మహాప్రదాత, సర్వజ్ఞుడు."

248. వారి ప్రవక్త వారితో నిట్లనెను. అతని రాజ్యచిహ్నమేమనగా భగవంతుడు మీ హృదయములను శాంతిపరిపూర్ణ మొనర్చును. దేవదూతలు (మీకై శాంతిని) మోసికొనివత్తురు. పరిశస్తమైన (ఈ శాంతిని) మూసా ప్రవక్త అనుయాయులును, హారూను అనుయాయులును విడిచిపోయిరి. మీరు విశ్వాసవంతులే యైనచో ఇందులో మీ కొఱకు నిశ్చయముగ ఒక చిహ్నము కలదు.

## ముప్పదిమూడవ ఖండము

249. కొన్నాళ్ళ తర్వాత తాలూతు ససైన్యుడై యుద్ధమునకు వెడలుచు (తన అనుచరులతో) ఇట్లనెను. "(దారిలో ఒక నది వచ్చును) భగవంతుడు మిమ్ముల నా నది నీటితో పరీక్షింపనున్నాడు. అందుచే జ్ఞాపకముంచుకొనుడు. ఈ నది నీరు త్రాగినవానితో నా కెట్టి సంబంధమును ఉండదు. ఈ నీటి రుచియైనను చూడనివాడే నా మిత్రుడగును. ఒకసారి ఎవరైనను (ఆపద్ధర్మముగ) ఒక దోసిలి నీరు త్రావినచో అభ్యంతరము లేదు."

కాని (సైన్యము నది యొడ్డునకు చేరిన వెంటనే) కొలదిమంది తప్ప తక్కినవారందరును నీరు త్రాగిరి.

తాలూత్ తనకు వశవర్తులైన సైనికులతో నదినిదాటి వెళ్లుచుండగా (తాలూతును ధిక్కరించిన) వారు ఇట్లనిరి : "మేము తాలూతును అతని సైన్యములను ఎదుర్కొనును నంతటి శక్తిగలవారము కాము." కాని తా మొకనాడు తప్పక భగవంతుని సమక్షమునకు

మరలుదుమను విశ్వాసముగలవారు ఇట్లనిరి : “ (మీరు శత్రువుల యొక్క ఎక్కువ సంఖ్యను, మీ కొలది బలమును చూచి అధైర్య మేల పడుచున్నారు ?) భగవత్సాహాయ్యముచే ఎన్నిసారులు ఒక చిన్న సైన్యమొక పెద్ద సైన్యము నోడించెను? ఓర్పువహించు వారితో భగవంతుడున్నాడు.”

250. వారు తాలూతు తోడను అతని సైన్యములతోడను యుద్ధముచేయుటకు రంగమున దిగి (భగవంతుని పార్థించుచు) నిట్లనిరి : “(ప్రభూ ! మేము బలహీనులమను విషయము నీకు తెలియును ) అందుచే మాపై క్షమా వర్షమును కురిపింపుము. యుద్ధరంగమున మా పాదములను దృఢముగ పాదుకొల్పుము. విశ్వాసహీనులగు వారి ప్రతిపక్షులైన మాకు సాహాయ్యమొసగుము. ”

251. అట్లే వారు భగవదాజ్ఞలచే శత్రువులను తరిమివైచిరి. దావూదు తాలూతును సంహరించెను. తర్వాత భగవంతుడు దావూదుకు రాజ్యమును వివేకమును ప్రసాదించెను. నేర్పవలసిన దంతయు నేర్పెను. (ఈ విధముగ ఒక చిన్న సంఘముయొక్క క్షమా ధైర్యములు ఇస్రాయీలీయుల పతిత జాతి నిజౌన్నత్యమునకు తెచ్చెను.) వాస్తవ మేమనగా మానవులలో ఒక జాతి మరొక జాతిచే ఓడింపబడకపోయినచో భూమిపై అరాజకము ప్రబలి యుండెడిది. కాని భగవంతుడు జీవుల యెడ అత్యంత దయ కలవాడు.

252. (ఓ ప్రవక్తా !) ఇదంతయు నిశ్చయముగ భగవతోక్తము. సత్యముతో నీ కిది బోధించుచున్నాను. నిశ్చయముగ నీవు ప్రవక్తలలో ఒకడవు.

---

# రెండవ అధ్యాయము

## వ్యా ఖ్యా న ము

ఈ అధ్యాయము శ్రీ ప్రవక్త మదీనా నగరమునం దుండగా ప్రోక్తమైనది గోవును గురించి ఒక ఉపాఖ్యాన మిందు చెప్పబడుటచే ఈ అధ్యాయమున కీ పేరు వచ్చినది. ఇందు ౪౦ ఖండములును ౨౮౬ సూక్తులును, ౨౬౭౨ అక్షరములును కలవు.

౧ ఇవి బీజాక్షరములు. శ్రీప్రవక్తగాని వారి శిష్యులుగాని ఈ అక్షరములకును ఇట్టి ఇతరాక్షరములకును అర్థము చెప్పలేదు ఇటీవల కొందరు వ్యాఖ్యాతలు అర్థము వ్రాసిరి కాని అవి కేవలము స్వకపోల కల్పితములు

ఖుర్ ఆన్‌లోని మరి ఐదు అధ్యాయములు (3, ౨౯, 30, 3౧, 3౨) ఇవే అక్షరములతో ప్రారంభింపబడినవి

౨ 'విశ్వాసము' నకు 'ఈమాన్' అరబ్బీమూలము 'ఈ మాన్' అనగా నిశ్చలమగు ఆస్తిక్యబుద్ధి. ఆర్ష భాషలో దీనికి 'శ్రద్ధ' యందురు భగవంతుని అస్తిత్వమునందును ఖుర్ ఆన్‌లో ప్రవచితమైన సత్యమునందును విశ్వాసమునకు ఈమాన్ అందురు నేను క్లుప్తముగ దీనికి 'విశ్వాసము' అని అనువాదమం దెల్లెడల వాడితిని అట్లే 'విశ్వసించు' అని దీనికి సంబంధించిన క్రియాపదముగ వాడితిని శ్రుతులలోకూడ శ్రద్ధయొక్క ఆవశ్యకత ఉగ్గడింపబడినది ఋగ్వేదమున శ్రద్ధ ఒక ఉపాస్యదైవతముగ చెప్పబడినది "దేవతలు సహితము శ్రద్ధను ఉపాసింతురు." (ఋగ్వే X 151) ఛాందోగ్యోపనిషత్తునందు "శ్రద్ధత్స్వ" (విశ్వాసముంచుము) అని తండ్రియగు ఉద్దాలకుడు శ్వేతకేతువునకు ఉపదేశించును అదే శ్రుతి "శ్రద్ధాతపః" '(శ్రద్ధయే తపస్సు) అని బోధించుచున్నది (ఛాం III 16) శ్రద్ధ లేక యే కార్యము చేసినను వ్యర్థమని తైత్తిరీయోపనిషత్తు బోధించుచున్నది (తైత్తి. I 9)

'ఈమాన్' కేవలము విశ్వాసముకాదు దాని కది పునాది. విశ్వాసము కేవలము బుద్ధియొక్క వ్యాపారము ఒక ప్రవక్తయందలి గౌరవము వలన గాని, లేక జ్ఞాన సంపాదనము వలన కలిగిన ప్రజ్ఞావిశేషమువలన కాని, కలిగిన విశ్వాసము మాత్రమే 'ఈమాన్' కాదు అట్టి విశ్వాసము పునాదిగాగల సత్కర్మాచరణమునందలి ఆసక్తి 'ఈమాన్'.

3 "అతీంద్రియములైన తత్వములయందు విశ్వాసముంచుము" అని ఖుర్ ఆన్ ఉపదేశించుచున్నది భగవంతుడు, ఆత్మ, దేవతలు, మరణానంతరజీవితము ఇత్యాది మహా తత్త్వములకు ప్రత్యక్షప్రమాణము లేదు అందుచే చార్వాకాదులు, భౌతికశాస్త్రజ్ఞులు ఈ తత్వములను నిరాకరించినారు ఖుర్ ఆన్ అట్టివారిని ఋజు మార్గమునకు పిలుచుచున్నది ఒక సత్యము ప్రత్యక్షము కానంతమాత్రమున అది లేదు అని చెప్పుట అజ్ఞానమని చెప్పుచున్నది మానవబుద్ధికి అగమ్యమగు మహా తత్త్వ జ్యోతిర్మండలమును నిరాకరించుట గ్రుడ్డివాడు సూర్యుని నిరాకరించుటవంటిది కేవలము బుద్ధివ్యాపారమువలన ఆ మహా తత్త్వములను గ్రహింపలేము

విశ్వాసము ఆస్తిక్యతకు పునాది అది లేనివాడే నాస్తికుడు అందుచేతనే ఖుర్ ఆన్ ప్రప్రథమమున ఆస్తిక్య బుద్ధి నుగ్గడించుచున్నది

* * *

౪. ప్రార్థనముయొక్క ఉద్దేశ్యము ఖుర్ ఆన్ యీవిధముగ వివరించుచున్నది "ప్రార్థన మానవుని దౌర్జన్యమునుండి తప్పించును భగవంతుని స్మరించుట చాల గొప్ప విషయము. అది సమస్త పాపసంహారకము" (౨౯ . ౪౫.)

ప్రార్థనమువలననే ఈమాన్ దృఢమగుచున్నది పాపచింత నశించుచున్నది సంశయము సమయుచున్నది నిరంతర భగవత్స్మరణము నాస్తికబుద్ధిని నశింపజేయును. అందుచేతనే ప్రప్రథమమున ఆస్తిక్యబుద్ధిని కలిగించు శ్రద్ధను ఉగ్గడించి, వెంటనే దానిని దృఢపరచు ప్రార్థనము లేక భగవచ్చింతనము ఆజ్ఞాపింపబడినది

* * *

౫ వెనువెంటనే నైతిక సంస్కారము ఉపదేశింపబడుచున్నది "మేము ప్రసాదించిన సంపదను ధర్మమార్గమున వ్యయపరుపుము." ధనము లోభమునకు, మోహమునకు, గర్వమునకు, మదమునకు — వేయేల సమస్త దుర్భావములకును మూలమగుచున్నది ధనసంపద కీడుకాదు కాని ధనమును కూడబెట్టరాదు, వ్యయపరుపవలెను దుర్మార్గులుకూడ ధనమును వెచ్చింతురు అందుచేతనే "ధర్మమార్గమున వ్యయపరుపుడు" అని ఖుర్ ఆన్ బోధించుచున్నది ధనమదాంధుడు శ్రద్ధాసమన్వితుడు కాజాలడు. ఏసుక్రీస్తు "సూచికా రంధ్రమునుండి ఒక ఒంటెయైనను దూరిపోగలదు గాని ధనికుడు స్వర్గద్వారమును ప్రవేశింపనేరడు" అని నుడివెను పాపమూలమగు ధనమును కూడబెట్టవలదని ఖుర్ ఆన్ బోధించుచున్నది ధనమునకు నిరంతర వ్యయము కావలెను. అట్టి వ్యయము ధర్మమార్గము ననుసరించి

చేయవలెను "శ్రద్ధయాదేయమ్ అశ్రద్ధయా అదేయమ్" అని తైత్తిరీయోపనిషత్తు వాకొనుచున్నది

ధనము ఒకచో కూడు సాధనములలో వడ్డీ ముఖ్యమైనది ఇదే కారణముగ ఖుర్ఆన్ వడ్డీని నిషేధించినది ఆస్తివిభాగనిబంధనములు కూడ దీని ననుసరించియే యున్నవి సమిష్టికుటుంబపద్ధతికి ఇస్లామీయ సంఘములో స్థానములేదు. ఆధునిక అర్థశాస్త్ర పరిశోధనములు ఈ సిద్ధాంతములను బలపఱచుచున్న విషయము సుప్రసిద్ధము.

* * *

౭ ధనగర్వము వంటిదే జ్ఞానగర్వము నిజమగు జ్ఞాని గర్వి కాజాలడు. సత్యమును దర్శించినవాడు సత్య మెక్కడున్నను దానిని నిరాకరింపడు తన సత్యమున కది విరుద్ధముగ నున్నయెడల దానిని సమన్వయింప జూచును గాని సమయింప జూడడు. సత్యము ఒకరిసొత్తు కాదు అది సర్వకాలములయందును, సర్వదేశములయందును మహాత్ముల హృదయఫలకములపై దివ్యహస్తముచే లిఖింపబడుచునే యున్నది దేశకాలపాత్రానుసారముగ ఆ మహాత్ములట్లు చిత్రింపబడిన సత్యమును వివిధరూపములలో వివిధభాషలలో, వివిధరీతుల ప్రకటింపవచ్చును ఒక్కొక్కప్పుడు సత్యమునందలి కొన్ని అంశములనే చెప్పి తమ సందేశమును విరమించుకొనవచ్చును "నేను చెప్పవలసిన దింకను ఎంతయో కలదు. కాని ఇది చెప్పుటకు సమయముకాదు. నా తరువాత మరియొక ప్రవక్తవచ్చును. ఆయన మీకు సంపూర్ణ సత్యమును ప్రకటింపగలడు." అని ఏసుక్రీస్తు చెప్పియుండెను .మనదేశమునకూడ ఒక్కొక్కకాలమున ఒక్కొక్క ధర్మము ప్రతిపాదింపబడియుండుట సుప్రసిద్ధవిషయము పరాశరస్మృతియందు కృతయుగమున ధ్యానయోగమును, త్రేతాయుగమున యజ్ఞములును, ద్వాపరయుగమున ఆరాధనమును, కలియుగమున స్తోత్రములును, ప్రార్థనములును భగవదారాధనా పద్ధతులని చెప్పబడినది ఈవిధముగ కాలభేదములను దేశభేదముల ననుసరించి ఆచరణవిధానముకూడ మారుచుండును అందుచే పూర్వప్రవక్తల కీయబడిన భగవద్గ్రంథములను నిరాకరించుట అజ్ఞానము ఖుర్ఆన్ పూర్వగ్రంథములయందు విశ్వాసముంచవలెనని శాసించుచున్నది. ప్రతిదేశమునందును నేనొక్కొక ప్రవక్తను పుట్టించితిని. ప్రతి ప్రవక్తయు ఒక్కొక్క గ్రంథమును సావలన పొందెను. అని ఖుర్ఆన్‌లో అనేకచోట్ల చెప్పబడినది (ఖు ౨౪ ౧౦ ౪౭, ౨ ౨౧౩, ౩౧ ౭, ౮) ఒక ప్రవక్త మరణించిన పిదప ఆయన అనుయాయులు తమ ప్రవక్త పలుకులను తారుమారొనర్చి, లేక వాని అర్థమును మరచి విపరీతార్థములను కల్పించి అనృతమార్గముల పడవచ్చును. ఇది

మానవునకు సహజము సత్యమునుండి అసత్యమును వేరుచేసి సత్యమును ప్రకటించుట ప్రవక్తల విధి "నిశ్చయముగనీకు పూర్వము సమస్తదేశములకు ప్రవక్తలను పంపియుంటిని. ఇప్పుడు నీకు వెలువరచుచున్న గ్రంథము వారి సంశయములను బాపి వా రెక్కడ పొరపడిరో చూపుటకు మాత్రమే." (౧౬ ౬౩, ౬౪) "సత్యమును నిరూపించుటయే దాని ఉద్దేశము." (౫ ౪౮)

దేశకాలభేదముల ననుసరించి కొన్ని మార్పులు వివిధ ప్రవక్తల సందేశములందు కన్పించినను మూలసూత్రమునందు మాత్రమట్టి భేదము లేదనియే ఖుర్ ఆన్ చెప్పుచున్నది

"ప్రవక్తా! నీతో వాదముచేయువారితో నిట్లు చెప్పుము: మేము మాకు ప్రకటింపబడిన సత్యమును, మీ ప్రవక్తలు ప్రకటించిన సత్యమును విశ్వసింతుము. మీ దేవుడును మా దేవుడును ఒక్కడే. మేము అతనికే విధేయులము." (ఖు ౨౯ ౪౬)

ఈ విధముగ ఖుర్ ఆన్ విశ్వమతమును బోధించుచున్నది ఖుర్ ఆన్ బోధించు మతమునకు దేశకాలముల గోడలు లేవు దానికి మానవలోకమంతయు నొక కుటుంబము కాలమునందలి మార్పులు సముద్రమునందలి అలలవంటివి అలలు లేచినను పడినను, శాంతముగ నున్నను అల్లకల్లోలముగ నున్నను, సముద్రముయొక్క మూల స్వరూపము మారదు ఆదినుండియు సత్యమొక్కటే ఈ సత్యమును ప్రకటించు భగవద్గ్రంథము లన్నియు విశ్వాసపాత్రములే

* * *

౨ "మరణానంతర జీవితముపై విశ్వాసముంచుము." అని ఖుర్ ఆన్ ఆదేశించుచున్నది ఆస్తికమతములన్నియు మరణానంతర జీవితముకలదని నమ్ముచున్నవి నాస్తికులును చార్వాకాదులును మరణము జీవితముయొక్క అవధి యందురు భగవంతుని, ఆత్మను నిరాకరించుట లనగా మరణానంతర జీవితమును నిరాకరించుట అన్నమాట మనదేశమున ఋగ్వేదకాలమునుండియు మరణానంతర జీవితమునుగురించి అనేక ఊహలు మొలకెత్తినవి వాటి నీ క్రింద సంగ్రహింతును

(౧) యమ, యమి అను ఇరువురు మర్త్యులు పరలోకమున కేగి అక్కడి ప్రభువులై మర్త్యలోకమునుండి వచ్చినవారి నాదరింతురు గత దేహములైన ఆత్మలు జ్యోతిశ్శరీరములను ధరించి యమలోకమును ప్రవేశించి సుఖముగా నుండుదురు వీరందరు పుణ్యాత్ములు పాపులకు నరకముకూడ కలదు. ఇది ఋగ్వేద మతము (ఋగ్వే ౧౦ ౬. ౧౦, ౧౪. ౪౧ ౨, ౧౦ ౧౩౨. ౪, ౪. ౫ ౫, ౪ ౨౭. ౧ ఇత్యాది.

(౨) పుణ్యకర్మలకు అమరత్వము కలుగును పాప పుణ్యముల రెంటిని ఒనర్చిన వారి పాపపుణ్యములు ఒక త్రాసున తూచబడినపిదప ఆయా కర్మల కను గుణముగ శిక్షాదులు నిర్ణయింపబడును. (శత బ్రా ౧౧ ౨ ౭ 33) తాను నిర్మించు కొన్న ప్రపంచమునందే మానవుడు తిరిగి జన్మించును. (శ బ్రా. ౬ ౨ ౨ ౨౭. చూ రాధాకృష్ణపండితుని Indian philosophy vol I PP. 133-5) ఇది బ్రాహ్మ ణముల మతము

(౩) మానవుడు తాను గావించిన పాప పుణ్యములఫలములను అనుభవించుటకు మానవలోకమున తిరిగి జన్మింపవలెను కర్మక్షయాంతమువరకు ఇట్టిజన్మము లెన్నైని కావచ్చును "పుణ్యకర్మల నాచరించినవారు స్వర్గమునందు పుణ్యఫలము ననుభవించి పుణ్యశేషముతో బ్రాహ్మణాద్యుత్తమ జన్మములందు పుట్టుచున్నారు పాపకర్మల నొనర్చినవారు నరకలోకమునందు తత్ఫల మనుభవించి కర్మశేషముతో శ్వ సూకర చండాలాది నీచజన్మములందు పుట్టుచున్నారు" (ఛాందో ౫ ౧౦ ౭) ఇట్లే గౌతమ ధర్మసూత్రములు (౨ ౨ ౨౪) ఇది ఉపనిషన్మతము పురాణమతముకూడ దగ్గరదగ్గరగ నిదియే

ఇవి వైదిక మతములు

ఇంక ఖుర్ ఆన్ మరణానంతరజీవితమును గురించి యేమి చెప్పుచున్నది ?

ఖుర్ ఆన్ మతము వేదమతముతోడను బ్రాహ్మణముల మతముతోడను కొంత వరకు సామరస్యము కలిగియున్నది. ఋగ్వేదమున వలె ఖుర్ ఆన్ స్వర్గ నరక ములను పేర్కొనుచున్నది మృతులైనవారు పరలోకమున వారి వారి కర్మాను సారము స్వర్గనరకములను అనుభవింతురు ఆత్మ దేహమును విడిచిపోవునపుడు దేహి గావించిన కర్మలను పుష్పవాసనను వాయువు మోసికొనిపోయినట్లు పరలోకమునకు మోసికొనిపోవును శతపథ బ్రాహ్మణమునందు వలె పాపపుణ్యములు తూచబడును (శత. ౧౧ ౨ ౭ 33, ఖుర్ ౨౧, ౪౭, ౭ ౮) ఈ రెండు గ్రంథములును ఒకే ఉపమానమును గ్రహించుట చిత్రము ఋగ్వేదమునందువలె స్వర్గసుఖము నిత్యము కాని నరకాగ్ని అనిత్యము అగ్ని లోహముల నెట్లు పరిశుద్ధపరచునో అదే విధముగ నరకాగ్ని పాపజీవులను పరిశుద్ధులను గావించును (ఖుర్ ఆన్ ౫౭ · ౧౫, ౧౦౧ : ౯ చూ మొహమ్మద్ అలీ The Religion of Islam. PP. 308-9, 314)

ఖుర్ ఆన్‌లో నరకము భయంకరముగ వర్ణింపబడినది వేద గ్రంథములయం దును తరువాతి స్మృతులందును పురాణములందును వర్ణింపబడినది అదేవిధముగ స్వర్గము సర్వసౌఖ్యములకు ఆటపట్టుగ వర్ణింపబడినది ఈ వర్ణనలు కేవలము ఉప

మాన పూర్వకములని ఖుర్ ఆన్ (౧౩ ౩౫ ౪౭ ౧౫) వక్కాణించు చున్నది మానవ హృదయములందు రగులొన్ను అగ్నిజ్వాలలే నరకమనియు, (౧౦౪ · ౬, ౭) ఆధ్యాత్మిక శాంతియే స్వర్గమనియు (౧౪ ౨౩, ౫౬ ౨౫, ౨౬, ౬ ౧౨౭, ౧౦ · ౨౫) ఖుర్ ఆన్ స్పష్టముగ చెప్పుచున్నది

* * * *

౮ ఇది మానవ ప్రకృతి మాఘుడీ సత్యమునే "అర్థవాభి నివిష్ట బుద్ధిషు వ్రజతి వ్యర్థకతాం సుభాషితమ్" ౧౭ ౪౩ (అసత్యజ్ఞానముచే ఒకసారి మనస్సు గ్రసింపబడెనేని ఆ మనుజునకు సత్యవాక్కులు మనసున పట్టవు) అని చెప్పినాడు

౯ అనగా వారి హృదయములు సత్యమును గ్రహింపవ, చెవులు సత్య వాక్కులను వినవు, ప్రత్యక్షముగ నున్నను వారు సత్యమును దర్శింపలేరు

## రెండవ ఖండము

ప్రథమ ఖండమున రెండుతరగతుల వ్యక్తులను గురించి చెప్ప బడినది. (౧) భగవన్మార్గమున నడచువారు (౧-౫); (౨) విశ్వాస మును విడనాడి తిరస్కారమును చూపువారు (౬—౭). ఈ ఖండ మున మరియొక తరగతి వ్యక్తులను గురించి చెప్పబడుచున్నది. వీరు గోముఖ వ్యాఘ్రముల వంటివారు. ఇతరులను మోసగింపదలచి తామే మోసపోవు అవివేకులు వీరు. విశ్వాసమును నటించి తమ బాహ్య వేషములచే లోకులను మోసగింప జూచువారు కొందరు; శాంతి దూతలని చెప్పికొని ప్రపంచమునందు అశాంతిని ప్రబలజేయువారు కొందరు, తాము మహా బుద్ధిమంతులమనియు, ప్రవక్తలు చెప్పినంత మాత్రమున విశ్వసించువారు అవివేకులనియు, బాగుగా విమర్శించి గాని తామట్లు విశ్వసింపమనియు చెప్పి విఱ్ఱవీగు మూర్ఖులు కొందరు, కేవలము పరిహాసమునకు గాని వాదమునకు గాని విశ్వాసమును ప్రకటించువారు కొందరు. ఈ విధముగ వీరు నాల్గు తెరగులుగ విభజింపబడిరి. (౮—౧౫.) భగవద్గీతయందు కూడ దుష్కృతులు నాల్గు విధములుగ చెప్పబడినారు. (భ. గీ. ౭ : ౧౬ చూ. రామానుజ భాష్యము.)

ఈ రెండు ఖండములయందును మానవమనస్తత్వము చక్కగ విమర్శింపబడినది.

౧౦ నాల్గు (17—20) సూక్తులయందును ఈ వంచకులస్థితిని నిరూపించుటకు రెండుపమానములు చెప్పబడినవి వంచకునకు ప్రప్రథమమున కొంతలాభము కలుగవచ్చును దాని తరువాత దుర్భరమగు అవమానముతప్ప మరేదియు లేదు వంచకులు ఈ లోకమున తమ వంచక బుద్ధిచే లౌకిక సంపదలను పొంది తమవంటి మూర్ఖులచే శ్లాఘింపబడవచ్చును కాని ఈ వంచకజీవితము ముగిసిన పిదప పరలోకమున వారికి మిగులునది అంధకారమే ఈ జీవితమున వంచకులకు కలుగు కించిజ్జయము అగ్నియొక్క కాంతిగా చెప్పబడినది దేవుడా కాంతిని హఠాత్తుగ హరించెను అనగా ఆ వంచకులు మృత్యువు వాతబడి మరణించిరి ఇంక పరలోకమున వారికి అంధకారమే

ఇట్టి వంచకులను సన్మార్గమునకు త్రిప్పగలమా ? అని ప్రశ్నవచ్చును అట్లు చేయుట అసంభవము ఏలననగా వారు సత్యమును వినలేరు బధిరులకు శంఖారావము వలె జ్ఞానబధిరులకు సత్యము వినరాదు వారు జ్ఞానాంధులు కూడ అంధులకు చంద్రోదయమువలె వీరికి సత్యము గోచరింపదు ఈ వంచకులు సత్యవాక్యము నెప్పుడు పలుకలేరు 'వారు మూగవాండ్రు.'

రెండవ ఉపమానము వంచకుల మనోవృత్తిని మరింత స్పష్టముగ నిరూపించుచున్నది ఏదేని ఒక ప్రాపంచిక లాభము కొఱకు బాహ్యవిశ్వాసమును ప్రకటించి, ఏదేని విపత్తువచ్చినప్పుడు గాని లేక వారనుకొన్నంత ప్రాపంచిక లాభము అందు లభించనప్పుడుగాని వెనుకకు మరలు చున్నారు వారి కసలు విశ్వాసములేదు ఏదో ప్రాపంచిక లాభము నాశించి విశ్వాసమును నటించిరి అట్లు వంచకులై విశ్వాసవంతులను చేరుటవలన కలుగు సాంఘికలాభములను అనుభవించి, తిరిగి విశ్వాసకులకు సాంఘికముగ నేదేని విపత్తు వచ్చినప్పుడు ఈ వంచకు లడలి ప్రాణభయముచే వెను తగ్గుచున్నారు.

## మూడవ ఖండము

౧౧ ౨౧వ సూక్తియందు ఒక ధర్మరహస్యము చెప్పబడినది "భగవత్సేవ మానవుని దుష్పథమునుండి రక్షించును" అందుచేతనే భగవద్గీతయందు.

అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవచ మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః
క్షిప్రంభవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి
గీ ౯ ౩౦—౧.                                    అని చెప్పబడినది.

౧౨ ౨౨వ సూక్తియందు ప్రకృతి వ్యాపారమంతయు భగవత్ప్రేరణము వలననే జరుగుచున్నదని చెప్పబడినది ప్రకృతి వ్యాపారములు వివిధము లగుటవలన, ప్రకృతియందలి ప్రతి వ్యాపారమునకు ఒక్కొక్క అధిష్ఠాన దేవత కలదనియు, అట్టి దేవత లందరును ఆరాధనీయులే యనియు ఋగ్వేదాది గ్రంథములయందు కాన్పించుచున్నది—(ఋగ్వేదము ౧౦—౮౭ ౧, ౮—౩౨ ౮, ౨—౬, ౭—౨౮, ౬, ౯—౬౭ ౧౬) ఋగ్వేదమునందే ఈ బహు దైవతారాధనమునుగురించి ఇట్లు చెప్పబడినది "ఈ దేవతానీకము భక్తుని పరమాత్ముని సమీపమునకు తీసుకొనిపోవును"— ఋగ్వేదము ౧—౨౮ ౧ ఖుర్ ఆన్‌లో ఈ మతముకూడ వివరింపబడినది బహు దైవతారాధకులు ఇట్లందురు "ఈ దేవతలు మమ్ము పరమాత్ముని సన్నిధిని చేర్చెదరని మాత్రమే మేము వారిని పూజించుచున్నాము స్పష్టమగు సత్యము బోధింపబడినను దానిని విశ్వసింపక ఇట్లనెడి వీరి భేదభావమును దేవుడు తుది దినమున పరిష్కరించును (ఖు ౩౯, ౩)

ఐతే ఆర్షమతమున బహు దైవతారాధనమే బోధింపబడెనా ? అను ప్రశ్న రావచ్చును ఆర్ష గ్రంథములు సమగ్రముగ చదివిన ఈ సందేహము కలుగకమానదు. దయానందసరస్వతి, రాజా రామమోహనరాయ్ ప్రభృతులు ఆర్ష గ్రంథములయందు బహు దైవతారాధనము లేదనియే వ్రాసిరి బహుదైవతారాధనమును బోధించు లేక సమర్థించు గ్రంథభాగములను తమ పాండిత్యప్రతిభచే బ్రహ్మైక్యార్థము వచ్చునట్లు వ్యాఖ్యానించిరి జిజ్ఞాసువుల కిది సరియగు పద్ధతికాదు ఉన్నదున్నట్లు వాస్తవముగ చెప్పుట వ్యాఖ్యాత విధి

ఆర్ష గ్రంథములందు బహుదైవతారాధనము కొన్నిపట్లను ఏకేశ్వరత్వము కొన్నిచోట్లను ప్రతిపాదింపబడినది ఆర్షమతమునందలి క్రమ పరిణామమును రాధాకృష్ణ పండితుడు చక్కగ నిరూపించినాడు బ్రహ్మతత్త్వ నిరూపణమునం దైదవస్థలు కన్పించుచున్నవని ఆయన అభిప్రాయము ఈ క్రమవికాసమునకు మకుటాయమానమగు అద్వైత సిద్ధాంతము ఉపనిషత్తులయందు ప్రతిపాదింపబడినది. (చూ రాధాకృష్ణ Indian Philosophy Vol. I PP. 98-9) ఏకేశ్వరత్వమును ప్రతిపాదించు ఉపనిషద్వచనము లెన్నో కలవు "ఓ యాజ్ఞవల్క్యమహర్షి! ఈశ్వరు లెంత మందికలరు ?" "ఒకడే" అని ఆయన సెలవిచ్చెను. (బృ. ౯-౧ ఇట్లే

* దురాచారరతుడైనను నన్ననన్యమగు భక్తిచే సేవించినచో అట్టివాడు సాధువగును ఏలననగా నట్టివాడు దృఢమగు నిశ్చయముకలవాడు అట్టివాడు శీఘ్రముగ ధర్మాత్ముడై నిత్యశాంతిని పొందును. నిశ్చయముగ నా భక్తుడు ఎంతమాత్రము చెడుగునొందడు.

మైత్రి ౪-౫౬, ముండక ౧-౧ ౧, తైత్తి ౧-౫ ; బృహ. ౧-౪. ౬, ౧-౪. ౭, ౧-౪-౧౦ ఇత్యాది.)

క్రమవికాసము ప్రకృతి సహజము ఆధ్యాత్మికవిషయములం దిట్టి క్రమవికాసము కలుగుట ఎట్లు సహజమో ఖుర్ ఆన్ చూపుచున్నది. ఇబ్రాహీమ్ ప్రవక్తకు బ్రహ్మతత్వవిషయమున ఎట్లు క్రమవికాసము కల్గెనో ఖుర్ ఆన్ ఇట్లు వాకొనుచున్నది :

"రేనీడలు ముసురుకొనిరాగా అతడొక ప్రకాశవంతమగు నక్షత్రమును చూచెను. అట్లు చూచి, 'ఇది నా ప్రభువేయగునా?' అని భ్రమించెను తరువాత అది అస్తమించెను. అప్పుడతడు ఉదయించుచున్న చంద్రుని చూచెను దానిని చూచికూడ భ్రమించెను. 'ఇది నా ప్రభువేయగునా?' అని యనెను. చంద్రుడుకూడ అస్తమించెను అత డప్పు డిట్లు ప్రార్థించెను: 'ప్రభూ! నీవు నాకు మార్గమును చూపవేని నేను దారితప్పినవాడనగుదును.' తెల్లవారెను. ఇబ్రాహీమ్ ఉదయభానుని చూచెను తిరిగి అతడు భ్రమించెను. 'ఇదేనా నాప్రభువు? అన్నిటికంటె మహత్తరమైనదిదేనా?' అని శంకించెను. సూర్యుడుకూడ అస్తమించెను. ఇబ్రాహీముకు సత్యము గోచరించెను. అప్పుడతడు తన ప్రజలను పిలచి 'ఓ నా ప్రజలారా! నాకిప్పుడు సత్యము గోచరించినది. భూమ్యాకాశాది సమస్తమును సృజించిన భగవంతుని నేనారాధింతును. నేను బహుదైవతారాధకుడనుకాను' —" (౬ ౭౭-౮౦)

భ్రమాజన్యమైన లేక అసంపూర్ణజ్ఞాన జన్యమైన పూర్వసిద్ధాంతములు సంపూర్ణవికాసానంతరము మాయవలెను ప్రకృతి శక్తులనే భగవంతునిగ భావించిన దశ మానవజ్ఞాన పరిణామమున కలదు కాని మానవు డా దశను దాటిన తరువాత పూర్వభావములను దిద్దుకోవలెను దురదృష్టవశమున మనదేశమున అట్లు కాలేదు దీనిని గురించి రాధాకృష్ణ పండితు డిట్లనుచున్నాడు.

" None asked the people to forsake the gods they were wont to worship. Ingeneous explanations, suggestions and symbolism helped to interpret the old superstition in consistency with the new idealism. While the hour demanded fidelity to the spiritual ideal, we find in the Upanishads a good deal of temporising.............................................The

polytheistic conception was too deeply rooted in the Indian consciousness to be easily overthrown There was also a reverence for the past"* Vol 1 P 44—5

* * *

౧౩ తరువాతి రెండుసూక్తులయందును ఖుర్ ఆన్ యొక్క ఔత్కృష్ట్యమును, అనమానత్వమును చెప్పబడినది ఖుర్ ఆన్ ప్రవక్తమాహాత్మ్యముగ పరిగణింపబడుచున్నది పాశ్చాత్య విద్వాంసులు ఖుర్ ఆన్ మహత్తును గురించి చెప్పినమాటలను గమనింపుడు —

"It (Quran) is one miracle claimed by Mohamad—his standing miracle, he said—and a miracle indeed it is" (Bosworth Smith, **Life of Mohamad**)

"The Quran is unapproachable as regards its convincing power, eloquence and even composition"

(Hirshfeld, 'New Researches'—P 8)

౧౪ ౨౯ వ సూక్తియందు ఏడు ఊర్ధ్వగతులు లేక ఆకాశములను సృష్టించినట్లుగా చెప్పబడినది ఆత్మవికాసము నందలి పరిణామదశ లేడని తత్వజ్ఞులు దీనిని వ్యాఖ్యానించినారు ఈ సప్తసంఖ్య ఆర్షగ్రంథములందును మిక్కుటముగ కాన్పించుచున్నది తైత్తిరీయోపనిషదంతర్గత నారాయణ ప్రశ్నమున —

సప్తప్రాణాః ప్రభవంతి తస్మా
త్సప్తార్చిషస్సమిధస్సప్తజిహ్వాః
సప్త ఇమే లోకా యేషు చరంతి
ప్రాణాగుహాశయాన్నిహితస్సప్తసప్త ౧౨ ౨.

## * నాల్గవ ఖండము

ఈ ఖండమునందు మానవుని ఉత్కృష్టత ఉగ్గడింపబడినది. సృష్టికి మానవుడు కిరీటప్రాయుడు. దేవతలుసహితము మానవునకు ప్రణమిల్లిరి. ఈ విషయమునే తైత్తిరీయోపనిషత్తు ఈవిధముగ చెప్పుచున్నది :—

రుచం బ్రాహ్మం జనయన్తః
దేవా అగ్రే తదబ్రువన్

---

* (వారు సాంప్రదాయముగ కొలుచుచున్న దేవతలను విడిచిపెట్టుమని ఎవరును అనరైరి ప్రాచీన మూఢాచారములను క్రొత్త విజ్ఞానమునకు సరిపడునట్లు చమత్కారమైన యుక్తులను కల్పించి, ప్రతీకములను సృష్టించి అన్వయింప గోరిరి నవీన ఆధ్యాత్మికాదర్శమున విశ్వాసము చూపుటకు మారు ఉపనిషత్తులలో చాలవరకు సమన్వయము కలదు— బహుదైవతారాధనమత మత్యంత దృఢముగ భారత మనస్తత్వమున వేరుగొని యున్నది— దానిని నిర్మూలింప సాధ్యముకాలేదు ప్రాచీన సాంప్రదాయములయెడ గౌరవముకూడ కలదు.)

యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్
తస్య దేవా అసన్ వశే —నా ప్ర ౧—౫.

(దేవతలందఱును ప్రప్రథమమున సృష్ట్యాదికాలమందు బ్రహ్మ విద్యా సాంప్రదాయమును ప్రవర్తింపజేయు సమయమునందు విద్యా సామర్థ్యముచేత పరబ్రహ్మ చైతన్యమును ప్రాదుర్భవింపజేయుచు ఇట్లు పలికిరి 'ఓ పరమేశ్వరా! ఏ బ్రహ్మవేత్త ఈవిధముగ తెలుసుకొనునో, అట్టి బ్రహ్మవేత్తకు సమస్తమైన దేవతలు స్వాధీనమగుచున్నారు.')

ఇదేవిధముగ బృహదారణ్యకోపనిషత్తునందు (౧-౪. ౧౦.) కూడా చెప్పబడినది.

ఆదమ్ అనగా మానవుడు. ఆర్షసాంప్రదాయమున మనువు వంటివాడు.

౧౫. మానవునకు భగవంతుడు బుద్ధినిచ్చి తద్వారా సర్వవస్తు పరిజ్ఞానమును కలుగునట్లు కావించెను సర్వవస్తు పరిజ్ఞానము ఆర్షభాషయందు ఋత మనబడును. ఋతమును ప్రకాశింపజేయు బుద్ధినే భగవంతుడు మానవునకు ప్రసాదించినాడు ఈ బుద్ధి 'ఋతంభర' యనబడును (చూ విద్యారణ్యకృత జీవన్ముక్తిప్రకాశిక తృ ప్ర)

"వసురణ్వో విభూరసి ప్రాణేత్వమసి సంధాతా బ్రహ్మన్త్వమసి" ఇత్యాది తైత్తరీయోపనిషత్ నారాయణ ప్రశ్నాంతర్గతమగు ౨౦వ మంత్రమున 'వసురణ్వ' లేక 'వస్తుతత్త్వము నుపదేశించు వాడవు' అని పరమేశ్వరుడు స్తుతింపబడినాడు వసురణ్వ శబ్ద వ్యుత్పత్తి భాష్యకారులు ఇట్లు వ్రాయుచున్నారు — "వస్తునః వస్తు తత్వస్య, రణ్వః వాశితా, కథయితా, అస్మదనుగ్రహార్థ ముపదేష్టా వసురణ్వః" — మాయందలి అనుగ్రహముచేత వస్తు తత్వమును ఉపదేశించువాడు

.. ... .. ...

౧౬ ఇబ్లీస్ ఒక దుష్టదేవత మరి రెండు చోట్ల ఖుర్ఆన్‌లో ఈ ఉపాఖ్యానము వివరింపబడినది —

"నీ ప్రభువు దేవతల నుద్దేశించి ఇట్లనెను 'మంటితో నే నొక మర్త్యుని సృజింపదలచుకొంటిని' అప్పుడు నేను మానవుని పూర్తిగ సృజించి వానిలో నా ఆత్మను ప్రవేశింప జేసినపిదప, 'సాష్టాంగపడుడు' అని ఆజ్ఞాపించితిని దేవతలందరును ఒక్కుమ్మడిని సాష్టాంగపడిరి కాని ఇబ్లీస్ వినతాంగుడు కాడాయెను.

సాష్టాంగపడుట కతడు నిరాకరించెను భగవంతు డిట్లనియె — 'ఓ ఇబ్లీస్ ! నీ వెందుకు సాష్టాంగపడవైతివి ?' వాడిట్లనెను . 'మంటితో నిర్మింపబడిన ఈ మర్త్యునకు నేను సాష్టాంగపడను '

అప్పుడు భగవంతు డిట్లనెను — 'ఇటనుండి పొమ్ము నీవు బహిష్కరింపబడితివి నీవు ప్రళయకాలము వరకు శాపగ్రస్తుడవై యుండుము '

అప్పుడు ఇబ్లీస్ ఇట్లనెను — 'ప్రభూ ! నాకు ప్రళయకాలమువరకు గడువు నొసంగుము '

'పొమ్ము. అట్లే గడువిచ్చితిని అది ఒక నియమితకాలమునకు మాత్రమే ' అని భగవంతుడు సెలవిచ్చెను

'ప్రభూ ! నీవు నన్ను విపథగామినంటివి నేను చెడుగునే మంచిదిగా కన్పించునటులజేసి మానవులను విపథగాముల నొనర్తును నీ భక్తుల సమీపమునకును పవిత్రులగువారికడకును మాత్రము పోను ' అని ఇబ్లీస్ విన్నవించుకొనెను

భగవంతు డిట్లనెను —'నీ కుచితమగురీతినే చేసితిని నా సేవకులపై నీ కెట్టి అధికారమును లేదు దుర్మార్గులపై మాత్రమే నీ కధికారము కలదు ' నిశ్చయముగ వారి స్థానము నరకము అది బహుద్వారసమంచితము ప్రతి ద్వారమునుండియు వారు వత్తురు (౧౫: ౨౮–౪౪ )

అట్లే ౩౮వ అధ్యాయమున :—

నీ ప్రభువు దేవతలనుద్దేశించి ఇట్లనెను — 'మంటితో నేనొక మర్త్యుని సృజింపదలచితిని అన్నట్లు నేను అతనిని పూర్తిగ సృజించి నా యాత్మ నతనియందూదితిని అప్పుడు నేను దేవతల కిట్లాజ్ఞాపించితి 'సాష్టాంగపడి అతనికి నమస్కరింపుడు ' దేవతలెల్లరును అట్లే సాష్టాంగపడిరి కాని ఇబ్లీసు అట్లు చేయడాయెను వాడు గర్విష్ఠియై విశ్వాస హీనులలో నొకడాయెను. భగవంతుడు వానినుద్దేశించి ఇట్లనియె :—

'ఓ ఇబ్లీస్ ! నీ వెందుకు సాష్టాంగపడవైతివి ? మానవుడగు ఇతనిని నేను నా రెండు చేతులతో సృజించితినికదా ? నీవు గర్విష్ఠివైతివా ? లేక నీవేమి ఘనుడవనుకొనుచున్నావా ?' దానికి ఇబ్లీస్ ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను :—'నే నీ మర్త్యునికంటె శ్రేష్ఠతరుడను నీవు నన్నగ్నినుండి పుట్టించితివి అతడు కేవలము మట్టినుండి సృజింపబడినాడు '

దానికి భగవంతు డిట్లనెను :—

'నీ విటనుండి పొమ్ము నీవు బహిష్కరింపబడితివి ప్రళయకాలమువరకు శాపగ్రస్తుడవై యుండుము '

అప్పుడు వా డిట్లనెను — 'ప్రభూ! వారు (మానవులు) తిరిగి బ్రతికి లేచు ప్రళయకాలమువరకు నాకు గడువు నొసగుము'

దానికి భగవంతు డిట్లనెను :— 'పొమ్ము. నీ కట్లే గడువిచ్చితిని కాని ఇది ఒక నిర్ణీతకాలమువరకే'

వా డిట్లనెను — 'నా శక్తితో వారిని నేను తప్పుతోవలకు మరల్తును నీ భక్తులను' పరిశుద్ధులనుమాత్రము చెనకను,' దానికి భగవంతుడిట్లనెను — 'వాస్తవమేమనగా నేను నిన్ను, నీ అనుయాయులను నరకముననింపుదును'— ౩౮ : ౭౧—౮౫

## * ఐదవ ఖండము

ఈ ఖండమున దుర్మతులు ముత్తెరగులుగ చెప్పబడినారు. (అ) ధర్మగ్రంథమును నిరాకరించువారు, (ఆ) పూర్వపు ధర్మగ్రంథములందు అసత్యములను చేర్చి అదే సత్యమని ప్రకటించువారు; (ఇ) ధర్మగ్రంథమును చదివియు, ఇతరులకు బోధించియు తాము స్వయముగ ఆచరింపక భ్రష్టులైనవారు.

వీరికి ప్రబోధము కలుగుటకు ఖుర్ ఆన్ ప్రత్యేకముగ వీరిని పేరొ్కనినది. ఇది ఇస్రాయీలీయులకు సంబోధించిన ట్లున్నను ప్రపంచమునందలి అన్ని జాతులకును అన్వయించును. ఎందుకనగా ప్రపంచమందలి అన్నిజాతులకును భగవంతుడు ధర్మగ్రంథములను ప్రసాదించినాడు. అందరును ఆ యా గ్రంథములను పొడిగించియు, కుదించియు, పెంచియు, తగ్గించియు వాటి అసలు స్వరూపమును మార్చివైచిన విషయము సుప్రసిద్ధము. ఇట్లు అడుగంటిన ధర్మమును పునరుద్ధరించుటకు నూతనధర్మము బయల్వెడలును. ఆ ధర్మ గ్రంథము ఏది ధర్మమో ఏది అధర్మమో విడదీసి చూపును. ఇది ఖుర్ ఆన్ మతము. అందుచేతనే ఖుర్ ఆన్‌కు ఫుర్ ఖాన్ అను నామాంతరము కలదు. ఫుర్ ఖాన్ అనగా ధర్మాధర్మ విచక్షణమును చేయునది. 'మీ కింతకుముందిచ్చిన ధర్మగ్రంథముతో దీనిని పోల్చి చూచుకొనుడు. దానిలో సత్యాసత్య విచక్షణమును చేసి, అందులో ఏది సత్యమో, ఏది మీరు కలిపినదో వేరు చేసి చూపునది యీ

గ్రంథము. అందుకొరకే ఇది ప్రోక్తమైనది.' అని ఈ ఖండమునందు చెప్పబడినది.

౧౪ "జకాత్‌ను ఈయుడు" అని ఇందు ఆజ్ఞాపింపబడినది 'జకాత్' దాతృత్వమను అర్థమున వాడుకలో నున్నది అరబీభాషలో 'జకాత్' అనగా 'అభివృద్ధి' లేక 'పరిశుద్ధి నొందుట' అని అర్థము దాతృత్వమునకు అరబీలో 'సదఖా' అనికూడ నందురు ఖుర్ ఆన్‌లో ఈ శబ్దముకూడ అనేకచోట్ల వాడబడినది 'సదఖా' అనగా సద్బుద్ధితో ఇచ్చునది అన్నమాట ఇది 'సిద్క్' (సత్యము)— అను ధాతువునుండి నిష్పన్నమైనది ఖుర్ ఆన్‌లో దాతృత్వము రెండువిధములుగా చెప్పబడినది·—౧ ఐచ్ఛికము ౨ నిర్ణీతము నిర్ణీతమగు దాతృత్వమునకే 'జకాత్' అని పేరీయబడినది

'జకాత్'ను గురించి చెప్పుటకు ముందు ఇస్లామ్‌మత పరమార్థమును ఇంచుక వివరించుట ఉచితము మతము ఒక సాంఘిక వ్యవస్థ మానవుడు సంఘజీవి మానవుని జీవితమును తీర్చి దిద్దబూనిన మతము, సంఘజీవితమును దిద్ద యత్నించవలెను సంఘము సముద్రమువంటిది వ్యక్తులు కెరటములవంటివారు కెరటములకు సముద్రములకు అవినాభావసంబంధ మున్నది ఇఖ్బాల్ కవి యనినట్లు

నరుడు నరుడయ్యె సంఘ మాలంబనముగ,
ఎవ్వ డేకాకిగా నుండ నెంచు జగతి ?
జలధియందునె అలలుంట కలదు గాని
వనధి విడిచి బయట అల యనుట వెఱ్ఱి

ఇస్లామ్ ఒక ఆదర్శసంఘమును నిర్మింప దలచుకొన్నది ఈ ఆదర్శసంఘమునకు అయిదు స్తంభములు నెలకొల్పినది ఏకేశ్వరునియందలి విశ్వాసము మొదటి స్తంభము. భగవత్ప్రార్థనము లేక నమాజ్ రెండవ స్తంభము జకాత్ మూడవ స్తంభము ఉపవాసము నాల్గవ స్తంభము హాజ్ లేక మక్కా యాత్ర అయిదవ స్తంభము ఈ అయిదు విధులయొక్క ప్రయోజనమును ఒకటే ఏకేశ్వరత్వము, మానవ సౌభ్రాతృత్వమును స్థాపించుట. మానవులు కృతకముగా నిర్మించుకొనిన హెచ్చు తగ్గులను, కొద్దిగొప్పలను రూపుమాపు సంస్థలివి ఒకరి భుజమునంటి మరియొకరు నిలిచి అందరును — ప్రభువైనను బానిసయైనను, ధనికుడైనను పేదవాడైనను—భగవంతుని ప్రార్థించుట ఎంతటి మనఃపరివర్తనము కల్గించును ? అందరును అట్లు నిలిచి 'ఈశ్వరా ! నీవు దయాసముద్రుడవు, వరదుడవు, మా కర్మల పరీక్షించి, పాపపుణ్యముల నిర్ణయించి

తత్తదుచితమగు ఫలమును ప్రసాదించువాడవు నీవే మాకారాధ్యుడవు నీసహాయమునే మే మపేక్షింతుము ప్రభూ ! మాకు మోక్షమార్గమును చూపుము' అని ప్రార్థించు నప్పుడు మానవుడు తన అహంభావమును కోల్పోవుటయే కాక తన ప్రక్క నిలిచి భగవంతుని సమక్షమున వినతు డగుచున్న తోడి మానవునియెడ భ్రాతృత్వభావమును వహింపక మానడు వాని మనోనిర్మాణమే దాని కనుకూలముగ రూపొందును

'హజ్' కూడ నట్టిదే అరఫాత్ మైదానమున ఒకే విధమగు వస్త్రముతో యాత్రికు లందరును భుజము భుజము కలిపి దేవుని మ్రోల నిలిచి ప్రార్థించుటయందు కూడ అట్టి భావమేకలుగుచున్నది

ఆర్థికమగు హెచ్చు తగ్గులు మానవ సంఘమునందు హెచ్చుతగ్గులను కల్పించు చుండుట ప్రసిద్ధము. ధనికునకు అహంకార మెక్కువై పేదలను నీచదృష్టితో చూచు చుండుట అందరికి అనుభవమే అందుచే ఖుర్ఆన్ సామ్యమెంతవరకు అట్టి హెచ్చు తగ్గులు కలుగకుండ సంఘనిర్మాణమునకు పూనుకొనినది 'జకాత్' ఇట్టి హెచ్చుతగ్గు లను నిర్మూలించుటకు ప్రధాన సాధనముగా గ్రహింపబడినది "ధనికులకడనుండి గ్రహించి బీదల కిచ్చు ధనము జకాత్" అని ప్రవక్త (బుఖారీ—౨౪ ౧—) స్పష్టముగ చెప్పినారు ధన మొకచో నిరంతరాయముగ కూడినయెడల కొందరు ధన గర్వముచే బీదస్థితిలో నున్నవారిని నీచముగ చూచుట తటస్థించును దీని వలన భ్రాతృత్వము కలుగదు అందుచే పుంజీపతిత్వమును ఇస్లామ్ ఖండించుచున్నది పుంజీ పతిత్వమునకు ప్రధానసాధనమగు వడ్డీని నిషేధించినది అంతేకాక ధనికులపై ఒక పన్నునుకూడ నిర్ణయించినది ఈ పన్నే 'జకాత్' 'జకాత్' ఆదాయపుపన్ను కాదు. దానిని ధనసుంక మన వచ్చును పూర్తి ధనముపై అది పన్ను కేవలము లాభముపైకాదు ఒకవ్యక్తి తనయింట నున్న సర్వసంపదపైనను నూటికి రెండున్నర చొప్పున ఈ పన్ను చెల్లింపవలెను. ముస్లిమ్ ప్రభుత్వమున్న చోట్ల ఈ పన్నును ప్రభుత్వమే వసూలుచేసి ఒక నిధిని తయారుచేయును ఇది బీదల కొరకే వినియోగింతురు ముస్లిమ్‌ప్రభుత్వము లేనిచోట్ల ఈ నిధిని సంఘప్రతినిధులు పాలింపవలెను ఈ నిధిని సంఘమునందలి బీదల కుపయోగించు విధమున వినియోగింప వలెను.

... ... ...

క్షుద్బాధ యెట్టిదో తెలియుటకు స్వయముగ క్షుద్బాధ ననుభవించవలెను. క్షుద్బాధ యెట్లుండునో తెలిసినప్పుడే ఆకలిచే వేగు బీదప్రజల కష్టసుఖము లర్థ మగును. ఐశ్వర్యమున నోలలాడుచు కష్టమన నేమియో, ఆకలియన నెట్టిదో తెలి

యనివారు బదసాదలయెడ సానుభూతి చూపజాలరు అందుచేతనే సంవత్సరమున కొక నెల ఉపవాస ముండుటను ఖుర్ఆన్ను విధించుచున్నది విషయవాంఛలను అరి కట్టు ఒక యోగాభ్యాస ముపవాసము

ఇట్లు ఇస్లామ్ మతము నిర్మించిన సంఘునిర్మాణ మీ ఐదు స్తంభములపైనను ఆధారపడియున్నది

## * ఖండములు 6, 7, 8

౧౫ పై మూడు ఖండములయందును మూసాప్రవక్త జీవితమునందలి కొన్ని అనుభవములనుగురించి చెప్పబడినది మూసాప్రవక్త యూదుల మతకర్త ఆయనను గురించి ఖుర్ఆన్లో విస్తారముగ చెప్పబడినది బైబిల్లోకూడా మూసాప్రవక్త ప్రసక్తి చాలాకలదు క్రైస్తవులు వీరిని మోసెస్ (Moses) అందురు మూసాప్రవక్తను గురించి చెప్పినంత మరేప్రవక్తనుగురించియు ఖుర్ఆన్ చెప్పలేదు అంతేకాదు ఖుర్ఆన్లో అందరికంటె ముందు ఈ ప్రవక్తనుగురించియే చెప్పబడినది మూసా ప్రవక్త కింతటి ప్రాముఖ్య మిచ్చుటకు కారణము ఖుర్ఆన్నుండియే మనము గ్రహించవచ్చును

"ఫిరఔను కడకు మేము ఒక ప్రవక్తను పంపియుండినట్లే మీకడకును ఒక ప్రవక్తను పంపియున్నాము" అని ఖుర్ఆన్ ప్రజలను సంబోధించుచు చెప్పుచున్నది ఫిర్ఔనుకడకు పంపబడిన ప్రవక్త మూసా వారికిని శ్రీ మొహమ్మద్ ప్రవక్తకును అనేకవిధముల సామ్యము కలదు. ఈ సామ్యమును బైబిలులో మూసా ప్రవక్తయే వివరించి చెప్పియుండెను చూడుడు — "తిరిగి మీ సోదరజాతి నుండి **నావంటి** ఒక ప్రవక్తను ప్రభువు పుట్టించును. మీ రందరును ఆయన ఉపదేశమును గ్రహింపవలెను."

అని మూసా తన ప్రజలను సంబోధించి చెప్పియుండెను శ్రీ మొహమ్మద్ ప్రవక్త ఇస్రాయీలీయుల సోదరజాతినుండియే కదా ఉద్భవించెను శ్రీ ఏసుక్రీస్తు పరలోకగతు లైనపిదపకూడా ఆయనశిష్యులు వాగ్దానమీయబడిన ప్రవక్తకొరకు ఎదురు చూచుచునేయుండిరి

శ్రీ మొహమ్మద్ప్రవక్త మూసాప్రవక్తవలెనే కేవల ధర్మప్రవచనమే కాకుండా ధర్మసంస్థాపనముకూడా చేసిన మహాత్ముడు కొందరు ప్రవక్తలు ధర్మప్రవచనము మాత్రము చేయుదురు కొందరు ధర్మసంస్థాపనమును చేతురు మూసాప్రవక్త శ్రీ మొహమ్మద్ప్రవక్తవలెనే ధర్మప్రవచనమే కాక ధర్మసంస్థాపనమునుకూడ చేసిన మహనీయుడు

మూసాప్రవక్త చరిత్ర ఖుర్ఆన్‌లో సంక్షిప్తముగ నీయబడినది ఈ ప్రవక్త జీవిత రంగము ఈజిప్టుదేశము ఈజిప్టుదేశములో ఆ కాలమున 'ఫారోఆ' లేక 'ఫిరఔన్' అనబడు చక్రవర్తులు పాలించుచుండిరి అప్పటి ప్రజలు సూర్యుని పూజించుచుండిరి నాటి భాషలో సూర్యునకు 'రః' అని పేరు చక్రవర్తి సూర్యుని అవతారముగా పరిగణింపబడుచుండెను అందుచేతనే చక్రవర్తి 'ఫారోఆ' అను బిరుదుతో వ్యవహరింపబడుచుండెడివాడు ఈ ఫారోఆల సమాధులు నేటికిని ఈజిప్టు దేశములో నిలచి యున్నవి వీటిని 'పిరమిడు' (Pyramids) లందురు

మూసాప్రవక్త ఇస్రాయీల్ వంశమునకు చెందిన మహాపురుషుడు ఇస్రాయీల్ వంశస్థులు యూసుఫ్‌ప్రవక్త కాలములో ఈజిప్టుదేశమునకు వెళ్లిరి యూసుఫ్ ప్రవక్త పరిపాలనాకాలములో ఈజిప్టుప్రజలు తర్వాత స్వతంత్రులై ఇస్రాయీల్ వంశీయులను బానిసలుగా పట్టుకొనిరి మూసాప్రవక్త ఇస్రాయీలీయవంశమున జన్మించుటచే తన ప్రజల విముక్తికై ఆయన నాటి ఫారోఆ చక్రవర్తితో పోరాడవలసి వచ్చెను ఆయన ఫారోఆను అర్థించిన విషయములు రెండు —ఇస్రాయీల్ వంశమువారిని బానిసత్వమునుండి విడిపించుట , వారిని ఈజిప్టుదేశమునుండి వా రిచ్చ వచ్చిన చోటికి వలస పోనిచ్చుట.

మూసాప్రవక్త చరిత్ర ఖుర్ఆన్‌లో నిట్లుచెప్పబడినది చక్రవర్తికి భయపడి మూసాప్రవక్త తల్లి భగవదాజ్ఞచే ఆయన జన్మించిన తక్షణమే ఒక పెట్టెలో పెట్టి నైలునదిలో విడుచును ఆ పెట్టె దైవవశమున చక్రవర్తికే దొరకును తేజోవంతుడగు ఆ శిశువును చూచి రిచ్చవడి చక్రవర్తియే ఆబాలుని పెంచును ఆ బాలుడు దినదినము నభివృద్ధి నొంది చక్రవర్తి పెంపుడుకుమారునిగ పెరిగి యువకుడయ్యెను ఇట్లుండగా ఒకనాడు ఒక ఈజిప్టుదేశస్థుడు ఒక ఇస్రాయీలీయుని బాధపెట్టుచుండగా చూచి ఓర్వలేక ఈజిప్టుదేశస్థుని మూసా ఒక దెబ్బ కొట్టును దానితో అతడు ప్రాణముల విడుచును ఇట్లు తలవనితలంపుగా జరిగిన హత్యవలన తనకు అపాయము కలుగునను శంకతో మిడియన్ దేశమునకు పలాయితుడగును అక్కడ జెత్రో అను నాయనను ఆశ్రయించి ఆయన కూతును వివాహమాడును. ఇట్లు పదేండ్లు అజ్ఞాతవాసమును గడిపి తుదకు ఈజిప్టుదేశమునకు మరలును ఈజిప్టుదేశమునకు పోవు మార్గములో ఆయన భగవత్తేజమును చూచి దివ్యజ్ఞానమును బడయును. నాటినుండి ఆయనకు ప్రవక్తృత్వము లభించును

మూసాప్రవక్తకు దివ్యశక్తి లభించును ఆయన చేతికఱ్ఱ ఆయన ఇచ్ఛానుసారము ఒక మహాసర్ప మైనట్లును ఆయన శ్వేతహస్తు డైనట్లును ఆయనకు కనిపిం

చును వెంటనే ఈజిప్టుదేశమునకు పోయి ఇస్రాయీలీయులను దాస్యమునుండి విడిచి పెట్టవలసినదిగా ఫారోఆను కోరమని ఆయన భగవంతునిచే ఆజ్ఞాపింపబడెను మూసా తన సోదరుని సహాయముగా గొని ఫారోఆను సందర్శించి మేము దేవుని దూతలము భగవదాజ్ఞలను అతిక్రమించక ఇస్రాయీలీయులను విడిచిపెట్టవలసినదనియు, వారిని బాధించవలదనియు చెప్పును. ఫారోఆ చక్రవర్తి మూసా మాటలకు నవ్వి 'నీ భగవంతు డెవరు ?' అని అడుగును ఫారోఆ తానే భగవంతుడ నను అహంకారము కలిగి ఉండెను మూసా ఈ ప్రశ్నకు ఇట్లు జవాబు చెప్పును 'సర్వసృష్టికి కారణభూతుడై దానిని నడిపించుచున్నవాడే మా ప్రభువు' ఫారోఆ మూసా సందేశమును నిరాకరించుటయే కాక భగవంతునియందు కూడ అవిశ్వాసము ప్రకటించును ఏమైనను మహాత్మ్యములను చూపుమని మూసాను కోరును మూసా భగవన్నామముచే తన చేతికఱ్ఱను పాముగను, తన చేతిని శ్వేత హస్తముగను మార్చి చూపును ఇది యేదియో మంత్ర ప్రభావమని ఫారోఆ చక్రవర్తి సుప్రసిద్ధ మాంత్రికులను రప్పించి మూసాపై మంత్రములను ప్రయోగించుమని ఆజ్ఞాపించును మాంత్రికులు మూసా ఎదుట నిర్వీర్యులై ఆయన భగవంతుని దూత అని తమ విశ్వాసమును తెలుపుదురు మూసా మరి తొమ్మిదిమహాత్మ్యములను చూపును ఫారోఆచక్రవర్తి తనకు ఆపద వచ్చినప్పుడు దానినుండి తప్పించుకొనుటకై విశ్వసించెదనని మాటనిచ్చి ఆపద గడచిన పిదప ఎప్పటియట్లు విశ్వాసహీనుడై యుండును మూసాప్రవక్త తన ప్రజలను ఓపికవహించి భగవంతుని ప్రార్థించుడని హెచ్చరించును తుదకు మూసా ఒకనాటి రాత్రి తన యనుచరులతో రాజధానిని విడిచి పలాయితుడగును ఫారోఆసైనికులు మూసాను వెంబడింతురు మూసా తన మహిమచే సముద్రమును దాటి పోవును వెంబడించిన ఫారోఆసైనికులు సముద్రగర్భమున మునిగి పోదురు

ఇట్లు తనప్రజలను ఫారోఆ బానిసత్వమునుండి విడిపించి మూసా తన ప్రజలను విడిచి తపస్సుచేసుకొనుటకై యొకపర్వతమునకు పోవును మూసాసందేశమునందు సందేహము కలిగినవారై ఇస్రాయీలీయులు భగవంతుని ప్రత్యక్షముగ చూపుమని ఆయనను కోరుదురు మూసా భగవంతుని ప్రార్థించును భగవత్తేజము ఒక తటిల్లతవలె చేరువనున్న పర్వతముపై చూపట్టగనే ఆపర్వతము భస్మీభూతమగును అందరును మూర్ఛపోవుదురు మూసా తెలివినొంది మూర్ఛావశులైన తనప్రజలకొఱకై ప్రార్థించును అందరును తిరిగి లేతురు

మూసాప్రవక్త భగవద్గ్రంథమును బడయును ఇస్రాయీలీయులు మూసా తపస్సునకుపోయి ఉండిన కాలములో ఒక గోవత్సమును పూజింపసాగిరి. మూసా ఈ

పూజను మాన్పించును తర్వాత గోవునందలి ఆరాధనాభావమును మాన్పించుటకై తన ప్రజలచే గోయజ్ఞమును చేయించును

మూసా తన ప్రజలను స్వదేశమైన కెనాన్ దేశమునకు తనతో నడువవలసినదిగా కోరను బానిసస్థితిలో నిరపాయజీవితమును గడపిన ఇస్రాయీలీయులకు తామెన్నడో విడిచిపెట్టిన స్వదేశమునకుపోయి తమ హక్కులను సంపాదించుకొనుటలో గల కష్టములను సహించుట రుచింపదయ్యెను వారు మూసాపై తిరుగబడి ఈజిప్టుకు మరలి పోవలెనని సహితము తలచిరి మూసా మాట వినక ఇస్రాయీలీయులు ౪౦ ఏండ్ల కాలము ప్రవాసములో గడపి నానా కష్టములను అనుభవింతురు

మూసాప్రవక్త సంక్షిప్తచరిత్రమిది ౪౦౦ ఏండ్లు దుర్భర దాస్యమునకు కట్టుబడి ఉండిన ఇస్రాయీలీయులను విముక్తినొందించి వారిని స్వదేశమునకు తీసుకొనిపోయిన జాత్యుద్ధారకుడు మూసాప్రవక్త ఇప్పుడు యూదులని పిలువబడుచున్నవా రందరును మూసాప్రవక్త అనుయాయులు.

చరిత్రనుండి గుణపాఠము గ్రహించవలసినదని ఖుర్ఆను ఆదేశించుచున్నది. ఖుర్ఆనుగ్రంథములో ప్రతి అధ్యాయమునందును చరిత్రప్రసిద్ధములైన ఇట్టి గాథలే ఉదాహరణములుగా ఇయ్యబడి ఉన్నవి నాటి విజ్ఞానప్రపంచములో ఈ ప్రవక్తల చరిత్రములు అతి ప్రసిద్ధములై యుండెను ఖుర్ఆను గ్రంథమునందు పేర్కొనబడిన చరిత్ర పురుషులు బైబిల్‌లో పేర్కొనబడినవారే బైబిల్‌గ్రంథము క్రైస్తవులకును యూదులకును గూడ పవిత్రగ్రంథ మగుటచే ఈ ఉపాఖ్యానములు ప్రపంచమునందలి యెక్కువ భాగమునకు శ్రుతివిశ్రుతములైనవి

* * *

౧౯ ఆరవ ఖండమున రెండు ఆధ్యాత్మిక సత్యములు వివరింపబడినవి. ౧ ఎవరి పాప పుణ్యములను వారే యనుభవించవలెను అనునది మొదటిది "జాగ్రత్త! ఒకదినము వచ్చును. నాడు ఎవరూ ఎవరికీ సహాయమును చేయరాదు మిమ్ములను వెంటబెట్టుకొని రక్షించుటకు రారు. మీ పాపములకు ఏదియు పరిహారముగా గ్రహింపబడదు." ఆకాలమునను ఈ కాలముననుకూడా పాపపరిహారమునుగుఱించిన అనేక మూఢవిశ్వాసములు అన్నిమతములవారియందును వ్యాపించి యుండిన విషయము విదితము ఏసుక్రీస్తుతనయందు నమ్మిన వారందరిని రక్షించుననను విశ్వాసము క్రైస్తవులలోనున్నది అటులనే సర్వశక్తి సంపన్నుడగు పరమేశ్వ విడచి దేవతలను, మహాపురుషులను ఆరాధించి వారిద్వారా ముక్తిని బొందవచ్చునను భావము హిందూ బౌద్ధజైనమతములందు వ్యాపించియున్నది. ఈ

విశ్వాసము ప్రకృతి ధర్మములకు విరుద్ధముగ నుండుట స్పష్టముగ కనిపించుచున్నది మనము చేసిన కర్మలకు మనమే బాధ్యులమై యుండుట సహజము మన ఆధ్యాత్మిక పరిణామముకూడ ప్రకృతిధర్మములచే కట్టబడియున్నది భగవత్ప్రార్థన, దానము, కరుణాళుత్వము ఇత్యాది పుణ్యకార్యములు మన మనస్సులను సంస్కరించును దాని వలన మనకు ముక్తి లభించుటకు సాధ్యమగును కాని కేవలము మనము చేయుచున్న పాపములను బాపుకొనుటకై ఒక మహాపురుషుని విగ్రహమును పూజించిగాని, ఒక దేవత నామమును స్మరించిగాని దానివలన లాభమును పొందగోరుట అజ్ఞానము భగవ దుపాసనము సహితము ఆత్మసంస్కారమునకై చేయవలయును, కాని ఒక మూలనుండి పాపకార్యములను చేయుచు ఆ చేసిన పాపముల దుష్ఫలముల నివారించుటకై ఉపా సనము చేయుట వ్యర్థము. ఖుర్ ఆనులో ప్రతిచోట భగవంతునియందు విశ్వాసముంచి సత్కార్యములు చేయుమని ఉపదేశింపబడినది దుష్కార్యములు చేయుచు భగవం తుని ప్రార్థించుట వ్యర్థము మనము చేసిన దుష్కర్మలఫలమును నివారించుటకై దేవతాదులను పూజించుట అజ్ఞానమని భగవద్గీత సహితము బోధించుచున్నది దేవ తలు పరిమితమైన శక్తికలవారనియు, ప్రకృతి ధర్మబద్ధులనియు, వారిని పూజించుట వలన ముక్తి లభించదనియు భగవద్గీత చెప్పుచున్నది

శ్లో॥ కామైస్తైస్తైర్హృతజ్ఞానాః
ప్రపద్యంతే ఽన్యదేవతాః
తంతం నియమ మాస్థాయ
ప్రకృత్యా నియతాః స్వయా
శ్లో॥ అంతవత్తు ఫలం తేషాం
తద్భవత్యల్పమేధసామ్
దేవాన్ దేవయజో యాంతి
మద్భక్తా యాంతి మామపి

౭—౨౦ ౨౩

ఖుర్ ఆన్ మరియొక అడుగు ముందుకు వెళ్ళి మానవునకును భగవంతునకును మధ్య తెరల నన్నింటిని చించివైచినది మానవుడు తన కర్మలకు తానే బాధ్యుడు ఈ

* తమతమ ప్రకృతులచే నియమితులై ఆయా కోరికలచే వివేకమును కోల్పోయినవారు ఆయా కోరికల కనుగుణములగు నియమములను ఆశ్రయించి పరమాత్మకంటె భిన్నమగు ఇతర దేవతలని పొందుచున్నారు

ఆ కోరికలను కోరునట్టి స్వల్పబుద్ధులయొక్క కర్మంఫలము నశించు స్వభావముకలది శాశ్వతమైనది కాదు ఇట్టి దేవతల నారాధించువారు దేవతలనే పొందుచున్నారు నాయొక్క భక్తులు నన్నే పొందుదురు.

ఫలము భగవంతునిచే నియమితమైన కొన్ని ధర్మములకు లోబడియున్నది ఆ ధర్మములకు లోబడియే మానవుడు కర్మఫలమును పొందుచున్నాడు ప్రవక్తకూడ ఈవిషయమును అతి స్పష్టముగ వివరించిరి ఒకప్పుడు ఒక అరబ్బు ఆయనకడకువచ్చి 'ప్రవక్తా' నాకు సంతానములేదు నాకొక పుత్రుని ప్రసాదింపుడు' అని ప్రార్థించెను ప్రవక్త అరబ్బునుద్దేశించి 'ఓయీ! నీ చెప్పుకొలుకు ఒక దారము కావలసివచ్చినను భగవంతునే అర్థింపుము అతడే సమస్తమును ఇచ్చువాడు నేను కేవల మనుష్యమాత్రుడను భగవంతునకు తప్ప మరెవ్వనికిని దేనినైనను ఇచ్చు అధికారములేదు' అని సెలవిచ్చిరి ఇస్లాం మతముయొక్క ప్రత్యేకత ఇందే కలదు.

౨౦ ఈ ఖండమునందు పేర్కొన బడిన రెండవ ఆధ్యాత్మికసత్యము భగవంతునియొక్క అగోచరత్వము భగవంతుడు చర్మచక్షువులకు అగోచరుడన్న సత్యము ప్రతి మతముయొక్క వేదాంతమును అంగీకరించినది కాని భగవంతుని ప్రత్యక్షముగ చూచిన కాని అంగీకరించుటకు అనేకులు నిరాకరించియున్నారు కొందరు బుద్ధితో భగవంతుని అగోచరత్వమును ఒప్పుకొన్నను క్రియకు వచ్చునప్పటికి అగోచరుడైన భగవంతుని నిరాకరించుచున్నారు అవయవరహితుడును, అగోచరుడును అగు భగవంతుని ఉపాసించుటయు, ఊహించుటయు, అసాధ్యమని వీరు వాదించుచున్నారు ఈ వాదమును ప్రతిఘటించుటకుబదులు ఆర్యధర్మశాసకులు దేవతామూర్తిపూజలను సామాన్యులకొలకు అంగీకరించిరి దీనిని ఒకవిధముగ సమర్థించిరికూడ భగవంతుడు సర్వవ్యాపియగుటచే దేవతాది సమస్తమూర్తులును భగవంతుని విభూతులని సమర్థింపబడినది

"స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్" ౭-౨౨

అని సర్వదేవతలును భగవంతుని మూర్తులేయనియు ఆయాదేవతలచే ఈయబడిన కోరికలు నిజముగ భగవంతునిచే ఈయబడినవే అనియు భగవద్గీత చెప్పుచున్నది దేశములో ప్రబలియుండిన బహుదైవతోపాసనమునకును ఉపనిషత్కాలమున వర్ధిల్లిన ఏకేశ్వర భావమునకును భగవద్గీతచేసిన సంధి "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" అని వాక్కునకు మనస్సునకు సహితము అందడని వర్ణింపబడిన భగవంతుని అర్జునుడు చూడగోరినపుడు "నతుమాంచక్షుషేద్రష్టు మనేనైవ స్వచక్షుషా" (ఈ ప్రాకృతమైన నీ కన్నులతో నన్ను చూడలేవు) అని శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా భగవద్గీత వాకొనుచున్నది ప్రత్యక్షభగవంతునే చూచి సంతృప్తిపడగోరిన పౌరాణిక మనస్తత్వమును గీత ఈవిధముగా సంతృప్తిపరచినది. కాని ఖుర్ ఆన్ను భగవంతుని ప్రత్యక్షముగ చూడకయే మానవుడు భగవంతుని ఉపాసించ

వచ్చునను సిద్ధాంతమును పూర్తిగా అంగీకరించి ఇస్రాయీలీయులకు భగవద్దర్శనము కలిగించదాయెను ఈవిషయములో ఖుర్ఆను విస్పష్టమైన మార్గమును సూచించినది విద్యుచ్ఛక్తి కంటికికనబడదు అంతమాత్రమున దాని అస్తిత్వమును నిరాకరించుటకాని లేక దానివలన లాభముపొందుటగాని మనము మానుటలేదుకదా అటులనే భగవంతుడు మన కంటికి కనబడనంతమాత్రమున ఆతనిని ఆరాధించుట అసాధ్యమని చెప్పుట అజ్ఞానము కనిపించినంతమాత్రమున తద్భిన్నమగు వేరొక పదార్థమునుకాని వేరొక తత్త్వమును కాని భగవంతుడని పూజించుట రజ్జుసర్పభ్రాంతియేఅగును విద్యారణ్యస్వామి నిరాకారుడును నిర్గుణుడును అయిన భగవంతు నుపాసించుటసాధ్యమగునా ! కాదా ? యను విషయము తన వేదాంతపంచదశిలో అతిసమర్థతతో చర్చించినారు (చూ ధ్యానదీప ప్రకరణము) బ్రహ్మము వాఙ్మనములకు గోచరింపని స్వరూపము కలది కనుక, దానిని ఉపాసించుట అసాధ్యమైనచో అది వాఙ్మనములకు గోచరింపని స్వరూపము కలదని యెందుకు ఉపాసింపకూడదు? అని విద్యారణ్యుని వాదము

"తిష్ఠంతుమూఢాః ప్రకృతా నిర్గుణోపాస్తిరీర్యతే,
విద్యైక్యాత్సర్వ శాఖాస్థాన్ గుణా నత్రోపసంహరేత్"

(మూఢులజోలి మన కక్కరలేదు అన్ని వేదములయందును నిర్గుణోపాసన ఒక్కటియే ప్రతిపాదింపబడినది దాని విశేషములు ఎచ్చటెచ్చట జెప్పబడినను వాటి నన్నిటిని ఉపసంహరించుకోవలెను) అని నిష్కర్షగా తన మతమును తెలిపినాడు ఇంతకూ చెప్పునదేమనగా ప్రతిదేశమందును నిరాకారుడును అద్వితీయుడును అగు బ్రహ్మమునే ఉపాసించు సిద్ధాంతము బోధింపబడినను అది ప్రజాసామాన్యముయొక్క అనుదిన జీవితములో ప్రతిఫలింపలేకపోయెను క్రైస్తవులు సహితము ఏసుక్రీస్తును, మేరీమాతను ఉపాస్యదైవములుగా గ్రహించుట, బౌద్ధులు బుద్ధుని బోధిసత్త్వులను ఆరాధించుట, హిందువులు వేలకొలది సంఖ్యగల దైవతములను పూజించుట పైన విద్యారణ్యుడు వివరించిన ఉన్నత తత్త్వము యొక్క అధఃపతనమును సూచించుచున్నది అంతమాత్రమున శుద్ధబ్రహ్మోపాసనమున ఎట్టికొరతయు కలుగదు "పురుషస్య అపరాధేన కిముపాస్తిః ప్రదుష్యతి ?"

ఖుర్ఆను వివరించిన పైకథలో ఇస్రాయీలీయులు భగవంతుని ప్రత్యక్షముగ చూపుమని మూసా ప్రవక్తను కోరిరి అప్పుడే వారు చూచుచుండగనే పిడుగులు కురిసెను. వారు నిర్ఘాంతులై స్పృహతప్పి పడిపోయిరి అనగా ఒక సామాన్యపు పిడుగుయొక్క శక్తిని సహింపజాలని మానవమాత్రునకు తన మహాచ్ఛక్తియందలి ఒక అణుమాత్రభాగముచే సమస్త సృష్టిని ఒనర్చిన భగవంతుని చూచుటకు శక్తికలదా?

అంతదూరమేల? సూర్యుని ప్రచండ తేజమును సహితము మనము కన్నెత్తి చూడ లేముగదా? భగవంతుడు ఇదే పాఠమును ఇస్రాయీలీయులకు చూపెనాడు

౨౧ ఈ ఖండమున తుది సూక్తియందు ఒక ముఖ్యవిషయము చెప్పబడినది ఇస్రాయీలీయులు మూసా వెలువరచిన సత్యగ్రంథమును తారుమారుచేసి తిరిగి దుష్పథమును అవలంబించిరి ఇది సామాన్యముగా ప్రపంచ చరిత్రయందు మనము చూచుచున్న విషయము ప్రపంచ మతగ్రంథములన్నియు ప్రక్షిప్తభాగములతో నిండియుండుట మనయందరి యనుభవము ఒక ఖుర్ఆను గ్రంథముతప్ప తక్కిన అన్ని గ్రంథములలోను ఎన్నోమార్పులు వచ్చినవి శ్రుతులని మనము పిలుచు ఉపనిషద్గ్రంథములు ఎట్లు అసంఖ్యాకముగ పెరిగి పరస్పర విరుద్ధముగా సిద్ధాంతములు ప్రతిపాదించుచున్నవో ఎల్లరకును తెలిసినదే అట్లే బైబిల్ గ్రంథము వివిధభాషలలో వివిధప్రక్షిప్తభాగములతో కూడి ఉన్నట్లు క్రైస్తవపండితులు చెప్పుదురు ఖుర్ఆన్ ఈ విషయమును అనేకచోట్ల నొక్కి వక్కాణించినది సత్యము అన్నికాలములందును ఒకటే అనియు, అదే సత్యము ప్రతి ప్రవక్తయు ప్రతిదేశమునను చాటెననియు, తమతమ ప్రవక్తల మరణానంతరము ప్రజలు ఆ సత్యములను తారుమారొనర్చి తిరిగి దుష్పథమును అవలంబించుచు వచ్చిరనియు ఖుర్ఆన్ చెప్పుచున్నది ఇప్పుడు మత చరిత్రపరిశోధకులందరు ఈ సత్యమును ధృవపరచిరి

౨౨ ఈ సూక్తియందే ఒక ముఖ్య సిద్ధాంతము ప్రతిపాదింపబడినది "వాస్తవముగ మోక్షము సత్యమునందు మీకు గల విశ్వాసముపైనను, స్వకీయమగు కర్మలపైనను ఆధారపడి యున్నది, కాని జన్మము, వంశము, మతాచారములు—వీటిపై ఆధారపడిలేదు సత్యమును విశ్వసించువారు ఎవ్వరైనను అగుదురుగాక, యూదు లగుదురుగాక, క్రైస్తవు లగుదురుగాక, గ్రహములను పూజించు సబాయీలగుదురుగాక, మరేమతస్థులైనను కానిమ్ము—దేవునిపైనను, కర్మపరీక్షాదినమునందును విశ్వాసముంచి, సత్కార్యాచరణము చేయువారైనచో దేవుడు వారికి దాని ఫలమును ఇచ్చును. వారిని ఏ విధమగు భయముగాని శోకముగాని అంటదు."

ఎంత విశాలభావము మతాచారములు వేరు సత్యము వేరు ఇప్పుడు మనదేశములో వస్త్రధారణభేదముల వలనను, భాషాభేదముల వలనను, ఆచారభేదముల వలనను మతభేదములు నిర్ణయింపబడుచున్నవి మతమునకు నిజమైన గీటురాయి మనము నమ్ము సత్యము, మన మాచరించు కర్మలు కాని మనము కట్టు దుస్తులు, అనుసరించు ఆచారము

లును కావు ఈ భావము ప్రజల హృదయములలో నాటుకొన్నచో మనదేశములో ప్రబలియున్న మత వైషమ్యము పూర్తిగ నశించును ఇస్లాం మానవైక్యతను బోధించుచున్నది మానవులందరు ఆదమ్‌యొక్క సంతతి అని చెప్పి మానవులకు పరస్పరభ్రాతృ సంబంధమును కూర్చినది ముస్లిములకు జాతీయతాదృష్టి లేదనియు, వారు టర్కీ, ఈజిప్టు, అరేబియా, పర్షియా దేశములవైపే తమ దృష్టిని మరల్చి ఉంచుదురనియు మన దేశములో జాతీయవాదులందరును చెప్పుటకలదు ముస్లిములకు నిజముగా జాతీయతా భావములేదు విశ్వమానవభ్రాతృత్వభావము వారికి ఉగ్గుపాలతో నేర్పబడిన పాఠము వారి మన స్తత్వములో జాతీయతా భావమునకు తావులేదు ముస్లిమ్‌దృష్టి విశ్వవిశాలము జాతి కులవర్ణభేదములు అతని కర్థముకావు అతనికి హరిజను డెంతయో బ్రాహ్మణుడును అంతయే చైనాముస్లిమెంతయో, అమెరికన్ ముస్లిముయును అంతే

౨౩. ఎనిమిదవ ఖండము తుది భాగములో గోయజ్ఞమును గురించి ఖుర్ ఆన్ ఒక కథను చెప్పుచున్నది ఇస్రాయీలీయులు గోవును పూజించుచుండిరి గోవును దేవునిగ ఆరాధించుట పాపమని మూసా ప్రవక్త బోధించెను. ఇస్రాయీలీయులు మూసా ప్రవక్త ఉపదేశమును పైకి గ్రహించిరి కాని వారికి ఆమాటయందు పూర్తిగ విశ్వాసము కుదురలేదు చిరకాలాగతమైన గోభక్తి వారిహృదయములనుండి తొలగించుట కష్టమాయెను వారియందలి ఈ మూఢభక్తిని తొలగించుటకై మూసా వారిచేతనే గోయజ్ఞముచేయించిన పిదప ఇస్రాయీలీయులకు మూఢభక్తి వదిలెను.

భారతదేశమున అనాదినుండియు గోవు గౌరవస్థానమును వహించియేయున్నది పాడియు, పంటయు ముఖ్యజీవనాధారముగల మన దేశమున గోవున కీ స్థానము సహజముగ లభించినది ఐనను చిరకాలమువరకు—ప్రాయశః జైనబౌద్ధమతప్రభావము వేదమతమును మార్చినంతవరకు—గోయజ్ఞమును, గోమాంసాశనమును నిషేధములై యుండలేదు వేదకాలమందును మహాభారతకాలమందునుకూడ గోమాంసము విరివిగ వాడబడుచున్నట్లైన్నో నిదర్శనము లాయా గ్రంథములనుండి యియ్యవచ్చును ఋగ్వేదమందలి ఈ క్రింది వాక్యములను పరికింపుడు :—

ఉక్ష్ణోహి మే పంచదశ సాకం పచంతి వింశతిం ఉతాహమద్మి
పీవ ఇదుభా కుక్షీ పృణంతి మే విశ్వస్మా దింద్రఉత్తరః
(ఋగ్వేదము 10_86-14)

( నా భార్యయైన ఇంద్రాణిచే ప్రేరితులై యష్టలు పదియేను వృషభములను, ఇరువది యెద్దులను వండుచున్నారు నేను వానిని భక్షించుచున్నాను తిని బలియుచున్నాను పైగా యాగకర్తలు సోమరసముచే నా డొక్కలు నిండించుచున్నారు. అందుచే లోకమంతటికంటె నేను గొప్పవాడనగుచున్నాను )

ఇట్లే వృషాకపి వసుక్ర భరద్వాజ సోమాహుతి దీర్ఘతమః ప్రభృతులగు ఋషుల వాక్యములనుబట్టి యజ్ఞహవిస్సుగా గోమాంసము భక్షించుటకలదని తెలియుచున్నది. తాఠ్కాణమున కీ క్రింది వాక్యములు చూడుడు —

"ఇంద్రుడు యజ్ఞపశువులైన వృషభములను భక్షించుగాక !" (ఋగ్వే. 40–86–13)

"ఇంద్రా ! నీ నిమిత్తము యజమానులు వృషభపశువులను వండుచున్నారు. వాని నారగింపుము" (ఋ 10–28–3)

"అగ్నీ ! ఋగూపమయిన హవిస్సు వృషభవసామాంసరూపముగా పరిణమించి నీ భక్షణమున కగుగాక" (ఋ 10–29–3)

"ఓ అగ్నీ ! గొడ్డావులచేతను, బలీవర్దములచేతను మీగండ్ల మెకములచేతను ఆరాధింపబడినవాడవైతివి" (ఋ 6-16-47)

"ఋభవులలో నొకడు రక్తముతీసి యావలపెట్టుచున్నాడు. అది రక్షో భాగము మఱియొకడు కత్తితో హృదయజిహ్వా వక్షస్థలములందలి మాంసమును కోయుచున్నాడు ఇంకొకడు కుక్షిస్థ మాంసమును వెలువరించుచున్నాడు ఋత్విగ్రూపులైన ఋభవు లిట్లు చేసినపిదప యజమాన దంపతులు చేయదగిన దింకేమున్నది ?"* (ఋ 1-161-10)

మహాభారతకాలమునకూడ గోమాంసభక్షణ ముండెడిదని ఈ క్రింది మహాభారత వాక్యలవల్ల తెలియుచున్నది,

"ఆరాళికో గోవికర్తా సూపకర్తా నియోధకః
ఆసం యుధిష్ఠిరస్యాహ మితి వక్ష్యామి పృచ్ఛతః"
(విరాట పర్వము)

(నేను పూర్వము ధర్మజు కొలువునందు వంటవాడనై, గోవులను ఖండించువాడనై, సూపకారుడనై, మల్లుడనైయుంటిని) విరాటుని కడ సేవకుడైపోవు భీముని విరటునికడ నీవేమి చేయగలవని ధర్మజు డడుగ భీముడు చెప్పిన మాటలివి

"ప్రాచీనయుగముననే కాదు భట్టమురారికవి కాలమునను బ్రాహ్మణ విద్యార్థులు గురువుల యజ్ఞములందు పశువిశసనముఁ జేయుచున్నట్లే చెప్పియున్నాఁడు చూడుఁడు :

* బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి "సంస్కృత వాఙ్మయచరిత్ర" (సం 1 పేజీ 153—4) నుండి ఇవి సంగ్రహింపబడినవి

తత్త్రాదృ క్తృణ పూల కోపనమిత క్లేశా చ్చిరద్వేషిభిః
మేధ్యా వత్సతరీ విహస్య వటుభిసోల్లుంరమాలభ్యతే ॥
(అనర్ఘరాఘవము 2 అం)

(గడ్డిమోపులఁ దెచ్చి మేఁపుటచేనైన కష్టమువల్ల బహుకాలమునుండి ద్వేషించుచుండిన బ్రహ్మచారులు నవ్వుచు రెండేండ్ల యీడుగల యావుదూడను జంపుచున్నారు)” అని బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసిరి మనుస్మృత్యాదులనుండియు ఇట్టి ఉదాహరణముల నెన్నిటినో చూపించవచ్చును మహారాష్ట్ర ద్రావిడదేశములందు బ్రాహ్మణులు మాంసాశనమును గొప్ప దోషముగను, దేశమం దెల్లెడలను గోమాంసభక్షణము మహాపాతకముగను భావించుచుండుట కలదు జైన బౌద్ధమత ప్రభావముచే నిటీవల వచ్చిన ఆచారపూర్వకమైన నిషేధములే గాని వేదములందు గాని ఇతర ప్రాచీన గ్రంథములందుగాని ఇట్టి నిషేధముండినట్లు కన్పించదని చూపుటయే ఇంత దీర్ఘముగ వ్రాయుటయందలి దీని ఉద్దేశము

౨౮ తొమ్మిదవఖండమున మత గ్రంథములను వ్రాయు విద్వాంసులను గురించి చెప్పబడినది ఇది ఇస్రాయీలీయులను ఉదాహరణముగ గ్రహించి చెప్పినప్పటికిని దీనిని సర్వదేశములకును అనువర్తింపజేయవచ్చును ప్రతి సత్యమును ఏదో యొక ఉదాహరణరూపమున బోధించి చెప్పుట ఖురాన్ పద్ధతి మన దేశములో ప్రతి పురాణమును, ధర్మశాస్త్రమును, ఉపనిషదాది గ్రంథములును బ్రహ్మయో శివుడో లేక ఒక మహర్షియో ప్రవచించినట్లుగా చెప్పుట యొక యాచారమైపోయినది ఈశ్వరోపదిష్టమైనదని చెప్పిననేగాని ప్రజాసామాన్యమునందది అంగీకృతము కాదని అభిప్రాయపడి ఈ గ్రంథకర్తలట్లు చేసియుందురు మతవైషమ్యములుకూడ దీనికి కారణము శైవ వైష్ణవాది వివిధ విరుద్ధమతములవారు ఒకరినొకరు దూషించుకొనుటయు, ఆ దూషణములను పురాణాది గ్రంథములందు జొప్పుటయు, ప్రజలకు వాటియందు విశ్వాసముగల్పించుటకై ఆ గ్రంథములను భగవదుపదిష్టములని చాటుటయు మనదేశమునందు సాధారణమైపోయినది. ఖురాన్ ఇట్లు చేయువారిని ఖండించుచున్నది ౨౮-౨౯ సూక్తములలో ఖురాన్ వీరి మనస్తత్వమును చిత్రించుచున్నది. దైవభీతి లేనివారే యిట్లు చేతురనియు, వీరు బండబారిన హృదయములు కలవారగుటచే దైవభీతి లేదనియు, అందుచే వీరు పాషాణములకన్న కఠినులనియు ఖురాన్ చెప్పుచున్నది.

౨౯ ౮౦_౮౨ సూక్తములలో ఖురాన్ మరొక ముఖ్య సిద్ధాంతమును ప్రతిపాదించుచున్నది మోక్షము కొన్నిజాతులకును అందులో కొన్ని ప్రత్యేక కులములకును సంబంధించినవారికే సాధ్యమను ఒక దురభిప్రాయము పెక్కు జాతులందు

నాడేకాక నేడుకూడ కలదు మన దేశములో వర్ణవ్యవస్థకీ భావముకూడ నొక యంగముగ నున్నది ఇస్రాయీలీయులుకూడ నిట్టి భావమునే కల్గియుండిరి ఖుర్ఆన్ ఈ భావమును ఖండించుచున్నది మోక్షము ప్రతి వ్యక్తియు చేయు పాపపుణ్యములపై ఆధారపడియున్నది, కాని జాతి కులభేదములచేత కాదని ఖుర్ఆన్ ఇందు స్పష్ట పరచినది

౨౬. పదవ ఖండమున కొన్ని నీతులు బోధింప బడినవి ఇందుపదిష్టమైన నీతివాక్యములు సర్వమత సమ్మతములు

౨౭. పదునొకండవ ఖండమున ౮౭—౯౧ సూక్తములలో ఖుర్ఆన్ సత్యమొకే మతమునకును, ఒకే గ్రంథమునకును పరిమితము కాదనియు, అనేకప్రవక్తలు వివిధ కాలములందు భగవత్సందేశమును వినిపించి యుండిరనియు చెప్పుచున్నది ఈ గ్రంథములు పరస్పరవిరుద్ధములుకాక ఒకదాని కొకటి ప్రోద్బలముగా నుండినవనియు, వివిధ ప్రవక్తలు పరస్పరవిరోధులు కాక ఒకే సత్యమును చాటు భగవద్దూతలనియు నిందు చెప్పబడినది

౨౮. తర్వాత (౯౨-౯౩) నోటితో చెప్పి హృదయమున నిరాకరించు పరోక్ష విషకుంభముల వంటివారిని ఖుర్ఆన్ ఖండించుచున్నది

౨౯. కేవలము జన్మమాత్రమున మోక్షము లభించదని ఖుర్ఆన్ మరొకసారి వాకొనుచున్నది (౯౪—౯౬) కర్మలు మోక్షమున కాధారముకాక కేవలము జన్మయే దైనచో కర్మక్షేత్రమగు ఈ ప్రపంచమున నుండుటెందులకు? నశ్వరమును బుద్బుదప్రాయమునునగు ఈ జీవితము నాశించుటేల? తమకై తెరచియున్న మోక్ష ద్వారమును ప్రవేశించుట కెందుకు జంకుదురు? దాని మన స్తత్వమును ఖుర్ఆన్ ఇట్లు వివరించుచున్నది "వా రిన్నాళ్ళు కూడబెట్టి యుంచిన దుష్కర్మలు వారినిట్లు చేయ నియ్యవు ....జీవితమునందు వారికి గల తృష్ణ మరెవ్వరికిని లేదు ........వెయ్యేండ్ల జీవితము నాశించు వారును వారిలో కలరు"

౩౦ పండ్రెండవ ఖండమున రెండు విషయము లుపదేశింపబడినవి మొదటిది:- ఖుర్ఆన్ భగవదాజ్ఞానుసారము జిబ్రాయీలు అను దేవదూత ప్రవక్త హృదయమునకు వ్యక్తీకరించిన సత్యము. రెండవది: దైవదత్తమగు సత్యగ్రంథమును విడిచి మంత్రతంత్రములందు నమ్మకము కలిగి యుండుట దౌర్భాగ్యము. మంత్రతంత్రములయందలి నమ్మకము నరకమునకు దారితీయును.

జిబ్రాయీల్ అను దేవదూత ఎవరు ? ఇతడు భగవదాజ్ఞాను సారము భగవదుప దేశములను ప్రవక్త హృదయమున కెట్లు వ్యక్తీకరించువాడు ? అన్నప్రశ్నలకు పూర్తిగ ప్రత్యుత్తరమిచ్చుట సాధ్యము కాదు ఎందుకనగా అది అనుభవైక వేద్యము ఆధ్యాత్మికరహస్యములు శబ్దములకు గాని తర్కమునకు గాని లొంగవు కాని అట్టి సత్య దర్శనమగు నప్పుడు ప్రవక్త ఎట్టి భౌతికస్థితియందుండు వారో, దానిని గురించి వారేమి సెలవిచ్చిరో తెల్పుట కాధారములుకలవు ప్రవక్తవచనములు పెక్కురు సంపుటములుగ ప్రకటించిరి వాటిని 'హదీస్' గ్రంథము లందురు అట్టి గ్రంథములలో 'బుఖారీ' గ్రంథము తలమానికము వంటిది ఇందు ప్రారంభముననే ఈ విషయమును గూర్చిన ప్రవక్త వచనములు కలవు 'భగవత్సందేశము మానవ హృదయమునకు వ్యక్తీకృత మగుట,' లేక 'సత్యసందర్శనము'నకు అరబ్బీలో 'వహీ' అందురు ఆంగ్లమున దీనికి 'రెవెలేషన్' అను శబ్దము కలదు సంక్షిప్తముగ నుండుటకై యీవివరణమున దీనిని 'సత్యసందర్శనము' అందును

అల్ హారిస్ ఇబ్నెహిషామ్ అను శిష్యుడు ప్రవక్త నిట్లడిగెను "ప్రవక్తా! మీకు సత్యసందర్శన మెట్లు కలుగును ?" ప్రవక్త ఇట్లు చెప్పిరి "ఒకొక్కప్పు డది గంటమ్రోతవలె వచ్చును——అది నా కత్యంత కఠినబాధ కల్గించును, ఆ బాధ వదలినప్పుడు నాకు ప్రోక్తమైన మాటలు స్మృతియందు నిల్చిపోవును ఒకొక్కప్పుడు దేవదూత నాతో ఒక మానవునివలె మాట్లాడును అవియు నేను జ్ఞాపక ముంచుకొందును"

ప్రవక్త భార్యామణియగు ఆయెషాదేవి ఇట్లనెను "ప్రవక్త సత్యసందర్శనము చేయుచుండగా నే నాయనను చూచితిని నా డపరిమితమగు చలియుండెను ఆయన ఫాలభాగము ముచ్చెమటలు గ్రమ్మెను"

ఆయెషాదేవి మరియు నిట్లనెను "ప్రవక్తకు మొట్టమొదటయైన సత్యసందర్శ నము స్వప్నావస్థలో వారి స్వప్నములు సత్యమైనవిగ నుండెను * వారి ప్రతి స్వప్న మును ప్రభాత సూర్యోదయము వంటిదే దీనితర్వాత వారికి ఏకాంతము ప్రియ మయ్యెను అందుచే వారు హీరా పర్వతగుహకు పోయి అక్కడ తపోనిష్ఠులైరి —— ... ... తుదకు వారు హీరా గుహయందుండగా సత్యసందర్శనమాయెను దేవదూత వారికడకు వచ్చి "చదువుము" అనెను "నేను చదువజాలను" అని వారు ప్రత్యుత్తర మిచ్చిరి

* ఈ స్వప్నములలో మొదటిది ప్రవక్త నలుబదవయేట, ఫిబ్రవరి ౬౧౦లో కలిగెనని చరిత్రకారుల మతము.

ప్రవక్త ఇట్లనెను "అప్పుడతడు (దేవదూత) నన్ను చేరదీసుకొని అదిమెను. నేను పూర్తిగ నీరసుడనై పోతిని. అప్పుడతడు నన్ను వదలి "చదువుము" అనెను. "నేను చదువజాలను" అని నేనంటిని. తిరిగి అతడు నన్ను చేరదీసుకొని నేను పూర్తిగ నీరసుడనగు నంతవరకు అదిమెను. తర్వాత నన్నతడు వదలి "చదువుము" అనెను. "చదువజాలను" అని నే నంటిని. అతడు నన్ను చేరదీసి మూడవసారి అదిమెను. తర్వాత అతడు నన్ను వదలి ఇట్లనెను: "చదువుము; నిన్ను పోషించుచున్నట్టియు, సృష్టించినట్టియు, మానవునొక్క బిందువుతో సృష్టించినట్టియు భగవంతుని నామస్మరణముతో చదువుము. నిన్ను పోషించువాడు సర్వసంప్రదాత."

తర్వాత మూడేండ్లవరకు ప్రవక్త కెట్టి సందేశమును రాలేదు తాను ముందు చూచినదియు విన్నదియు వట్టి భ్రమయేమోనని ప్రవక్త తలచిరి ఈ కాలమున ప్రవక్త తపోనిమగ్నులై యుండిరి. ఒకనాడు హఠాత్తుగ తిరిగి సత్యసందర్శన మాయెను ప్రవక్తవాక్కులలో —

"ఒకనాడు నేను నడచుచుండగా ఆకాశమునుండి యొక వాణి వినిపించెను. నేను తలయెత్తి పైకి చూచితిని హీరాగుహ యందు నాకు దృశ్యుడైన దేవదూతయే తిరిగి కన్పించెను. అతడు భూమ్యాకాశముల మధ్య ఒక పీఠముపై అధిష్ఠించియుండెను. అతడు నాకు భయముగొల్పెను. నే నింటికి మరలి ఇట్లంటిని: 'నాపై దుప్పటి కప్పుము, నాపై దుప్పటికప్పుము' అప్పు డీ వాక్యములు నాకు శ్రవణగతమాయెను: 'ఓ దుప్పటి కప్పుకొన్నవాడా! లెమ్ము. (మానవులను) పరాకుపుచ్చుము ................(ఇత్యాది.)' నాటి నుండియు మాటిమాటికి ఇట్టి మాటలు వినబడసాగెను. సత్యసందర్శనము త్వరత్వరగ కలుగసాగెను."

ఖుర్ఆన్ గ్రంథమంతయు నీవిధముగ దర్శించినదే అప్పుడప్పుడవసరానుసారము దర్శింపబడిన సూక్తులను ప్రవక్త దర్శకత్వముక్రింద శిష్యులు గ్రథితమొనర్పగా నేర్పడిన గ్రంథము ఖుర్ఆన్‌షరీఫ్

3౧ పండ్రెండవఖండమున ప్రవచితమైన రెండవవిషయము మంత్రతంత్రములకు సంబంధించినది మంత్రతంత్రములయందు నమ్మకము ప్రతి దేశమునందును కాన్పించుచున్నది యూరపుఖండమున మంత్రికత్తెలను సజీవముగ కాల్చివేయుచుండిరి మన దేశమున మంత్రతంత్రములను ప్రయోగించు ఆచార మెక్కువగ నున్నది మంత్ర తంత్రములు ప్రజలను మోసపుచ్చుటకును బాధించుటకును మాత్రమే ఉపయోగింపబడు చుండుట సర్వ విదితము అందుచే ఖుర్ఆన్ మంత్రతంత్రములను నిషేధించుచున్నది మంత్రతంత్రముల శక్తి స్వాభావికమైనది కాదనియు భగవదాజ్ఞ లేనియెడల నదియు పనిచేయదనియు ఖుర్ఆన్ బోధించుచున్నది

సులైమాను పూర్వకాలపు ఒక చక్రవర్తి క్రైస్తవు లాయనను 'సాలమన్' అందురు ఈయన అత్యంత వివేకశాలియనియు రాజర్షియనియు క్రైస్తవ వాఙ్మయము నందు కలదు ఖుర్ఆన్ సులైమానును ఒక ప్రవక్తగా పేర్కొనుచున్నది మహా పరాక్రమశాలియు, విద్వాంసుడును, ప్రజ్ఞాధురీణుఁడును నగు సులైమాను శక్తి యంతయు మంత్రమూలమని యూదులు పురాణకథలను కల్పించి సర్వశక్తులకును భగవంతుడే మూలమను భావమును మరపించిరి. హారూత్, మారూత్ అను బాబిలోని యా దేశపు ఖగోళశాస్త్రజ్ఞులు దేవతలనియు వారు మంత్రతంత్రములమూలమున దేవ రహస్యములను వెలిబుచ్చిరనియు కథలను కల్పించిరి యూదుల యీ కథలను, మంత్ర తంత్రములందు వారికిగల విశ్వాసమును ఖుర్ఆన్ ఖండించుచున్నది.

3౨ ౧౦౨ సూక్తమున ఆధ్యాత్మిక విషయములను గురించి కుతర్కములు చేయుట నిషేధింపబడినది మనుధర్మశాస్త్ర మట్టి కుతర్కములు చేయువారికి సంఘ బహిష్కారము శిక్షగా విధించుచున్నది

వేదః స్మృతిః సదాచారః స్వస్యచ ప్రియమాత్మనమ్
ఏతచ్చతుర్విధః ప్రాహుః సాక్షాద్ధర్మస్యలక్షణమ్
మను ౨. ౧౧

(ఏ ద్విజుడు ప్రమాణములైన శ్రుతిస్మృతులను హేతు తర్కవాదముచే చర్చించుచు దూషించునో అట్టి నాస్తికుని వేదదూషకుని సాధువులు బహిష్కరింప వలయును )

33 ౧౧౧—౧౧౩ సూక్తములందు ఖుర్ఆన్ ఒక గొప్ప సత్యమును మరొకసారి ఉపదేశించుచున్నది మోక్షము బడయుటకై ఒక ప్రత్యేకమతముయొక్క బాహ్యవేషమును ధరింప నక్కరలేదు సత్కార్యాచరణమే మోక్షమార్గము.

౩౮ పదునాల్గవ ఖండమున మతదురభిమానము ఖండింపబడినది ఖుర్ ఆన్ పెక్కుమతములున్నవని అంగీకరింపనే అంగీకరింపదు సత్యము ఒక్కటే మొదటి మానవునకు భగవంతుడు ఏ సత్యము నుపదేశించెనో అదే సత్యము నేటివరకును ఆచరణీయమై యున్నది ఏలననగా భగవంతుని వలెనే భగవంతుడు వెలువరచిన సత్యము కూడ అమృతము అది దేశకాలభేదములచే మారదు అందుచేతనే ప్రపంచమునందే కాలమున నే దేశమున జన్మించిన ధర్మప్రవక్తకులనైనను, ఖుర్ ఆన్ భగవంతునిచే పంపబడిన ధర్మప్రవక్తలనుగా నంగీకరించుచున్నది అట్లే సమస్త ధర్మగ్రంథములను భగవదుపదిష్ట గ్రంథములుగా నంగీకరించుచున్నది అందుచే మా మతము మంచిది, కాదు, మామతము మంచిది అని పోరాడుకొనుట తెలివితక్కువ మతము ఒక్కటే. అది మీదియు మాదియుగాదు అది అందరిది. సత్యమొకరిసొత్తెట్లగును ? 'ఐన నిప్పుడు కన్పించుచున్న భేదములేమి ?' అని మీ రడుగవచ్చును ఈ భేదములు సత్యమును గ్రహించుటయందును దాని నాచరించుటయందును కలవుగాని అసలు సత్యమునందు లేవు వెనుక నేను చూపినట్లు ఆర్షమతము ఏకేశ్వరు నొప్పుకొనినది క్రైస్తవమతమును, అట్లే సమస్త మతములును ఏకేశ్వరత్వము నొప్పుకొన్నవి క్రీస్తు తాను దేవుడని ఎక్కడైన చెప్పుకొనెనా ? ఆయన మరణించు నప్పుడు 'తండ్రీ! తండ్రీ! నన్నేల విడనాడితివి ?' అని పరమేశ్వరుడగు సర్వలోకపితను దీనముగ ప్రార్థింపడా ? మతము లన్నియును సత్కార్యాచరణమును చేయుమనియే చెప్పుచున్నవి ఇదియే అసలు మతము . ఏకేశ్వరునియందు విశ్వాసము, సత్కర్మాచరణము వివిధముగ కన్పించుచున్న మతము లన్నియు యీ రెండుసూత్రముల నొప్పుకొనుచుండగా మతములలో విభేద మెక్కడ నున్నది ? నిజముగ జూడ అది మన మా సత్యమును గ్రహించుటయందును, దాని ప్రకార మాచరింపకుండుట యందే కలదు ఏసుక్రీస్తు తాను భగవంతుని కుమారుడనని యెక్కడనైన చెప్పియుండెనా ? మన మెల్లరము భగవంతుని సంతతి యెట్లో ఏసుక్రీస్తుకూడ అట్లేభగవంతుని కుమారుడు భగవంతుడు సర్వలోకపిత ఇది స్పష్టముగ నుండగా క్రైస్తవులు ఏసుక్రీస్తుని దేవుని కుమారుడందురు ఖుర్ ఆన్ ఒకచిన్నవాక్యమునందు వీరి అజ్ఞానమును ఖండించినది "భూమ్యాకాశములలోనున్న సర్వస్వమును అతని సృష్టియేకదా ? అందరును అతని ఆజ్ఞకు బద్ధులై యున్నారుకదా ! అతనికొక కుమారుని గైకొనునంతటి కర్మమేమి పట్టెను ?"

ఖుర్ ఆన్ ఇదే విషయమును 15, 16 ఖండములలో చెప్పుచున్నది ఏ ప్రవక్త యూదులకు గురుస్వామియో, ఏ ప్రవక్త ఏసుక్రీస్తువంశమునకు మూల

పురుషుడో అట్టి ఇబ్రాహీం ప్రవక్తయే కాబా ప్రార్థనాలయమును నిర్మించి నాడు అట్టి కాబాను కేంద్రముగ నేర్పరచిన ఇస్లాంమతముతో వీరికి ద్వేషమేల ? ఇబ్రాహీమ్ ప్రవక్తయు, ఆయన తర్వాత వచ్చిన ప్రవక్తలును, ఇట్లు సమస్త ప్రవక్తలును బోధించినది ఒకేమతము

ఖుర్ఆన్ మరొక ముఖ్యవిషయమునుకూడ మరొకసారి నొక్కి చెప్పుచున్నది ఏదేని యొక మతాచారముల ననుసరించినంతమాత్రముననగాని, ఎవరేని యొక మహా పురుషుని అనుయాయు లనిపించుకొనినంతమాత్రమునకాని, లేదా ఒక మహాపురుషుని వంశమునందు జన్మించినంతమాత్రముననగాని మోక్షము లభించదు మోక్షము లభించవలె నన్న భగవంతునియందు శ్రద్ధా విశ్వాసములుంచి సత్కార్యాచరణము నొనర్చుట యొక్కటే మార్గము

"వా రొనర్చిన కర్మఫలము వారిది. నీ వొనర్చిన కర్మఫలము నీది. వారి కర్మలకు నీవు బాధ్యుడవుకావు."

# రెండవ భాగము

## వ్యాఖ్యానము

౩౮ ఏ దిక్కు వైపునకు మొగము త్రిప్పుదుమో ఆ దిక్కునకు అరబీభాషలో 'ఖిబ్లా' అందురు ఇది దీని వ్యుత్పత్త్యర్థము ఖుర్ ఆన్‌లో 'ఖిబ్లా' అనగా ప్రార్థన సలుపునప్పుడు ఏ దిశవైపు ముఖముంచుదుమో ఆ దిశ అని అర్థము పవిత్ర ప్రవక్త మక్కా నుండి మదీనాకు వలసపోయిన ౧౬ నెలల తర్వాత 'ఖిబ్లా'ను మార్చిరి దాని ప్రశంసయే యిందున్నది మొట్టమొదట 'జెరూసెలమ్' పట్టణమువైపు మొగము చేసి ప్రవక్త ప్రార్థనలు సలుపుచుండిరి మదీనాకు వలస పోయిన తర్వాత కాబా (మక్కా యందలి ప్రాచీన ప్రార్థనాలయము) వైపు ముఖము చేసి ప్రార్థనలు సలుపసాగిరి దీనికి కారణ మేమనగా మదీనాలో యూదులు ఎక్కువగ నుండుటయు, ప్రవక్త తమ పుణ్యక్షేత్రము వైపునకు మొగముపెట్టి ప్రార్థనలు సేయుటకు వారు పెడర్థములను కల్పించుటయు, దానిని తమ మూఢాచారముల వైశిష్ట్యమును ప్రకటించునదిగా నన్వయించుటయును ఒక్క విషయము నిక్కడ గమనింపవలెను కాబాను ఖిబ్లాగా నేర్పరచిన ఆ నాటికి 'కాబా' మక్కావాసుల దేవతా విగ్రహములతో నిండి యుండెను అప్పటికది పవిత్ర వశము కాలేదు ఐనను ఖుర్ ఆన్ దానిని 'ఖిబ్లా'గా నిర్ణయించినది ఎందుకనగా "తూర్పైనను పడమరైనను అన్ని దిక్కులు భగవంతునివే." అంతేకాని ఒకేదిక్కున భగవంతు డున్నాడనియు, ఒకే దిక్కు శ్రేష్ఠమైనదనియు కాదు ఖుర్ ఆన్ ఒక కేంద్రమును ఏర్పరుపదలచు కొన్నది అందరును ఒకే కేంద్రమువైపునకు ముఖము త్రిప్పుట ఆదర్శములయొక్కయు ఆశయముల యొక్కయు ఐక్యమునే కాక మానవైక్యమును కూడ తెల్పును. ఇక్కడ దిశ కాదు ప్రధానమైనది, కేంద్రము. కాబాకు పడమట నున్నవారి కది తూర్పునను, తూర్పుననున్నవారి కది పడమటను, ఉత్తరమున నున్నవారికి దక్షిణము నను, దక్షిణమున నున్నవారికి తూర్పునను ఉండును కదా.

* * * *

౩౯ ౧౧౫ సూక్తమున ప్రవచింపబడిన సత్యమే మరల చెప్పబడుచున్నది భగవంతునకు తూర్పు పడమరల భేదములేదు అతడు సర్వవ్యాపి, సర్వతోముఖుడు

* * * *

౩౬. 'స్వర్గముకేసి మొగమెత్తుట' అనగా ప్రవక్త ఈ విషయమున భగవదాజ్ఞకై నిరీక్షించుచుండెనన్న మాట

* * * *

౩౭. 'ఖిబ్లా' ను ఏర్పాటుచేయుటయం దుద్దేశము ఒక కేంద్రము నేర్పరచుట యూదులు కాబాను కేంద్రముగ నంగీకరింపరు ఆమాట వాస్తవమే కాని జెరూసెలమును మాత్రి మందరును కేంద్రిముగ స్వీకరించిరా యేమి ? "వారిలో ఒక తెగవారి ఖిబ్లాను మరొక తెగవా రంగీకరింపరు." అట్టివారు కాబాను కేంద్రముగ నెట్లంగీకరింతురు ? అని భావము

౩౮ బైబిల్ గ్రంథమున శ్రీ మొహమ్మద్ ప్రవక్త ఆగమనమును గురించిన భవిష్యసూచక వాక్కులు పెక్కు కలవు ఖుర్ఆన్ ఆవిషయమునే యిక్కడ ఉగ్గడించు చున్నది బైబిల్ పాతనిబంధనలో (Deut. 18 19) "మీ సోదరులనుండి మూసా వంటి ఒక ప్రవక్తను పుట్టింతును ......... . ..అతడు నా మాటలుగా చాటు నా ప్రవచనములు విననివారు తప్పక వినవలెను"

(" Whosoever will not hearken unto My words which he shall speak in My name, I will require it of him.")

అట్లే ఏసుక్రీస్తు రాబోవు ఒక ప్రవక్తను గురించి చెప్పుచు : "He will guide you into all truth for he shall not speak of himself, but whatsoever he shall hear that shall he speak" (John 16 13) పాత నిబంధనలో మరొక చోట (Acts 3 21—22) " Whom the heaven must receive until the time of restitution of all things, which God hath spoken by the mouth of all His Holy Prophets since the world began. For Moses truly said unto the fathers, A prophet shall the Lord your God raise up unto you **of your brethern like unto me** : him shall hear in all things whatsoever he shall say unto you."

యీ భవిష్యద్వచనములందు చెప్పబడిన ప్రవక్త శ్రీ మొహమ్మద్ ప్రవక్తయే యనుటలో నెట్టి సందేహమును లేదు ఇది క్రైస్తవ పండితులకును యూదు పండితులకును కూడ తెలియును

*    *    *    *

౩౯ 'సఫా' 'మర్వా' అనునవి మక్కాకు సమీపమందలి రెండు కొండలు ఇబ్రాహీం ప్రవక్త భార్యయు ఇస్మాయీల్ ప్రవక్త మాతయు నగు 'హాజరా' ఆ యెడారిలో నొంటరిగ దిగవిడిచిపెట్టబడినప్పుడు నీటికై ఆమె అటమటించిన స్థలములవి ఓర్పునకు కల్గు ఫలమున కివి చిహ్నములని ఖుర్ఆన్ వాకొను చున్నది 'హాజరా' నాడు వహించిన ఓర్పునకు ఫలితముగ నామె సంతతివారు మక్కాపట్టణ నిర్మాతలై మహామహులై ఆధ్యాత్మిక నాయకులైరి. నేటికిని మక్కాకు వెళ్ళిన యాత్రికు లీ కొండల ప్రదక్షిణము జేయుదురు.

ప్రవక్తకు పూర్వము కొండలపై విగ్రహములు ప్రతిష్ఠింపబడియుండెను అందుచే పల్వురు ముస్లిము లా కొండల ప్రదక్షిణము తప్పేమోనని యెంచుచుండిరి. కాని ప్రవక్త మక్కాను వశము పరచుకొనిన తర్వాత ఆ విగ్రహము లక్కడనుండి తీసివేయబడెను 'హాజరా' మాత ఓర్పునకు చిహ్నమైన యా కొండల ప్రదక్షిణము చేయుట తప్పు కాదనియు, ఆ కొండల ప్రదక్షిణము 'హాజరా' మాత పడిన శ్రమలను, ఆమె వహించిన శాంతిని జ్ఞాపకము తెచ్చుననియు ఖుర్ ఆన్ చెప్పుచున్నది

* * * *

౮౦ ఖుర్ ఆన్‌లో ప్రతిపాదింపబడిన ఏకేశ్వరత్వమునందు ఎట్టి ద్వైధీభావమునకును తావులేదు యీశ్వరుడు అసమానుడు, సర్వస్తుతిపాత్రుడు, సర్వపూజార్హుడు, ఏకైకపూజ్యుడు ప్రథమాధ్యాయ వివరణమున నీ విషయము విపులముగ చర్చించితిని మనదేశమున సాధారణముగ 'దేవునివలె వచ్చినావు', 'యీ మహాత్ముడు భగవంతుని అవతారము', 'ఇతడు అవతారపురుషుడు' ఇత్యాది వాక్యములు వినబడుచుండును మన దేశమున అవతారపురుషులుగ భావింపబడుచున్న మహాపురుషుల సంఖ్య లక్షోపలక్షలుండుననిన అతిశయోక్తికాదు మహాపురుషులను 'భగవాన్' ఇత్యాది యీశ్వరార్థమగు నామముల నుపయోగించుటయు, యీశ్వరార్హమగు భక్తిశ్రద్ధలతో వారిని పూజించుటయు మనము చూచుచున్నాము ఇది ఒక్క హిందూమతస్థులందే కాక సర్వసాధారణముగ నన్ని మతములందును కాన్పించుచున్నది ఖుర్ ఆన్ దీనిని కఠినముగ నిషేధించుచున్నది ఎంతటి మహాపురుషునైనను, ఆతనిని భగవంతుడనిగాని, భగవంతుని అవతారమని గాని, భగవత్సమానుడనికాని భావించుటను ఖుర్ ఆన్ కఠినముగ నిషేధించుచున్నది కొందరు మొహమ్మదీయులుసైతము 'వలీ' లనబడు మహాపురుషులను అత్యంత భక్తిభావములతో కొలుచుటయు అట్టి మహాపురుషుల సమాధులను పుణ్యక్షేత్రములుగ భావించుటయు ఖుర్ ఆన్ మతము ననుసరించి నిషేధమే

* * * *

౮౧ ౨౧వ ఖండమున ముఖ్యముగ నిషిద్ధాహారములను గూర్చి చెప్పబడినది మన దక్షిణదేశమున శాకాహారమే ఉత్కృష్టమైనదనియు, మాంసాహారము హింసాపూర్వకమగుటచే హేయమైనదనియు, ఒక భావము వ్యాపించియున్నది నిజముగ చూడ హిందూమతమునందు మాంసాహారనిషేధము లేదు బంగాళము, బీహారు కాశ్మీరము మున్నగు దేశముల బ్రాహ్మణులు నేటికి సైతము మాంసాహారులుగ నున్నారన్న విషయము సుప్రసిద్ధము మన దేశమున యజ్ఞమతము అనగా వేదమతముండినంత కాలము మాంసాహారము వేదవిహితమగుటచే సర్వవర్ణములవారును మత్స్య మాంసాదులను యథేష్టముగ భుజించుచుండిరి తరువాత జైన బౌద్ధమతముల ప్రభావముచే కొన్ని దేశముల బ్రాహ్మణ వైశ్యులందు మాంసాశన నిషేధము క్రమముగ వచ్చెను మను

స్మృత్యాది ధర్మశాస్త్రములందు మాంసాశన నిషేధము లేకపోవుటయేగాక, ఒక విధముగ మాంసయుక్తమగు కర్మలు శ్రేష్ఠతరమైనవని చెప్పబడినది.

పార్వణ శ్రాద్ధనియమమును వర్ణించుచు మనుస్మృతి శ్రాద్ధమందు నిమంత్రితులైన బ్రాహ్మణులను వివిధముగ పూజించి "వ్యంజనములు, పప్పు, కూరగాయలు మొదలగువానిని పెరుగు, పాలు, తేనె వీనిని పరిశుద్ధుడై పాత్ర యందు వేర్వేఱుగా దెచ్చి అన్నముంచుటకు ముందే యుంచి,

''భక్ష్యం భోజ్యంచ వివిధం మూలానిచ ఫలానిచ
హృద్యానిచైవ మాంసాని పానాని సురభీణి చ

మను 3 ౨౨౭

"పిండివంటలను, పాయసాదులను, మూలఫలములను హృద్యములగు మాంసములను * పానీయములను తెచ్చి చుట్టు నుంచవలెను." అని చెప్పుచున్నది అదే అధ్యాయమున మనువు హవిస్సు ఎవ్విధమున నాచరించిన నెంత కాలము పితృదేవతలకు సంతృప్తి కలుగునో చెప్పుచు ఇట్లు వివరించుచున్నాడు —

తిలైర్వ్రీహియవైర్మాషై రద్భిర్మూలఫలేన వా
దత్తేన మాంసం తృప్యంతి విధివత్పితరో నృణామ్

ద్వౌమాసౌ మత్స్యమాంసేన త్రీన్ మాసాన్ హారిణేనతు
ఔరభ్రేణాథ చతురః శాకునే నాథ పంచ వై

షణ్మాసాం శ్ఛాగమాంసేన పార్షతేన చ సప్తవై
అష్టావేణస్య మాంసేన రౌరవేణ నవైవతు

దశ మాసాంస్తు తృప్యంతి వరాహ మహిషామిషైః
శశకూర్మయోస్తు మాంసేన మాసా నేకాదశైవతు

సంవత్సరం తు గవ్యేన పయసా పాయసేనచ
వార్ధ్రీణసస్య మాంసేన తృప్తి ర్ద్వాదశ వార్షికీ,

కాలశాకం మహాశల్కాః ఖడ్గలోహామిషం మధు
ఆనంత్యాయైవ కల్పంతే మున్యన్నా ని చ సర్వశః.

(మను. 3 : ౨౬౭-౨౭౨)

* 'మాంసాని' అనుదానికి 'హృదయస్యప్రియాణి మాంసాని' అని కుల్లూక భట్టాచార్యుని వాఖ్య.

(తిలలు, ధాన్యము, యవలు, కాయగూరలు, నీళ్లు, దుంపలు, పండ్లు వీనిని పితృప్రీతికై బ్రాహ్మణునకు దానమొసగినచో దాతల పితృదేవత లొకనెల తృప్తినొంది యుందురు

మత్స్యమాంసదానముచే రెండు నెలలును, జింకమాంస దానముచే మూడు నెలలును, గొఱ్ఱెమాంసదానముచే నాలుగు నెలలును, ద్విజులు భక్షింపదగిన పక్షుల మాంసముచే నైదు మాసములును,

మేకమాంసముచే నాఱు మాసములును, చారల జింకమాంసముచే నేడు మాసములును, దుప్పి మాంసముచే తొమ్మిది మాసములును,

ముండ్లపంది, అడవిదున్న వీని మాంసముచే పది మాసములును, కుందేలు, తాబేలు వీని మాంసముచే పదునొకండు మాసములును,

గోసంబంధమైన పాలు, పెరుగు, నెయ్యి వీనితోను శ్రాద్ధమొనర్చిన పండ్రెండు సంవత్సరముల కాలమును, వార్ధ్రీణసమను ముసలిమేకపోతు మాంసముచే శ్రాద్ధ మొనర్చిన పండ్రెండు సంవత్సరముల కాలమును పితరులు తృప్తినొందెదరు

కాలశాకమను శాకమును, ముండ్లుగల చేపలును, ఖడ్గమృగము, ఎఱ్ఱని పొట్టేలు వీని మాంసమును, నెవ్వరి ధాన్యమును, తేనెయు మున్యన్నములు — వీనితో శ్రాద్ధమొనర్చిన పితరులు తుదిలేనంతకాలము తృప్తినొందెదరు )

మరియొకచో మనువు ప్రయత్నపూర్వకముగనైనను మాంసమును సంపాదించి మాసికశ్రాద్ధమును నొనరింపవలెనని చెప్పుచున్నాడు. చూడుడు మనువు వచనములు —

> పితౄణాం మాసికం శ్రాద్ధ మన్వాహార్యం విదుర్బుధాః
> తచ్చామిషేణ కర్తవ్యం ప్రశస్తేన ప్రయత్నతః

(పితృదేవతలనుగూర్చి నెలనెలకు చేయునట్టి మాసిక శ్రాద్ధము నన్వాహార్యమందురు ఆ యన్వాహార్య శ్రాద్ధము జేయబోవునపుడు ప్రశస్త మాంసమును సంపాదించి దానితో ప్రయత్నపూర్వకముగ శ్రాద్ధమొనరింపవలెను )

(మను 3 —౧౨౩)

మరియొకచో —

> "యజ్ఞార్థం బ్రాహ్మణైర్వధ్యాః ప్రశస్తా మృగపక్షిణః
> భృత్యానాం చైవ వృత్త్యర్థ మగస్త్యో హ్యాచరత్పురా"

(బ్రాహ్మణులు యజ్ఞము నిమిత్తమును, పోష్యవర్గమును పోషించుటకును శాస్త్ర విహితములైన మృగ పక్షులను వధింపజనును తొల్లి యగస్త్యమునీంద్రుడు తన పోషణ యందున్న తల్లి—దండ్రుల పోషణమునకై యట్లు శాస్త్రవిహిత మృగపక్షులను జంపెను )

(మను ౫—౨౨ )

మరియొకచో — ౫ . ౩౫

"నియుక్తస్తు యథాన్యాయం యో మాంసం నాత్తిమానవః
సప్రేత్య పశుతాం యాతి సంభవానేక వింశతిం"

(శ్రాద్ధవిధానము చెప్పున శ్రాద్ధమధుపర్కములందు నియమింపబడిన ద్విజుడు మాంసమును భక్షింపడేని, అతడు దేహాంతరమున నిరువదియొక జన్మములు పశువుగా జన్మింపగలడు )

భక్ష్యాభక్ష్య మాంసవిచారముచేయుచు మనువు (౫-౨౮ ) —

"స్థావరం జంగమంచైవ సర్వం ప్రాణస్య భోజనం"

(ఈ స్థావర జంగమ పదార్థములెల్ల జీవునికి భోజ్యములే) యని చెప్పు చున్నాడు

ఖుర్ ఆన్ ఈ విషయమునే ఈ క్రింది మాటలలో చెప్పుచున్నది —

"ఓ మానవులారా ! భూమిపైనున్న వస్తువులలో ధర్మవిహితములును మంచి వియు నగు వాటినే భుజింపుడు "

ఖుర్ ఆన్ సూకరమాంసమును నిషేధించుచున్నది. "అది అపరిశుభ్ర మైనది" అని దానికి కారణము చెప్పుచున్నది పందిమాంసము బైబిల్ లోను ఆర్ష గ్రంథములందును కూడ నిషేధింపబడినది

(మను ౧౦ · ౧౫౬, ౫ · ౧౯ )

ఇంకొక విషయము ఖుర్ ఆన్ ఒక దేశమునకుగాని, ఒక జాతికిగాని ధర్మము నుపదేశించుటలేదు దాని సందేశము సర్వప్రపంచమునకు అందుచే దాని ఉప దేశములు సర్వశీతోష్ణపరిస్థితులకును, సర్వదేశములకును అనుకూలించి యుండవలెను కూరగాయ లెక్కువగా పండని దేశములలో మాంసభక్షణము చేయరాదనిన జీవితము సాధ్యమగునా ? ఏ పదార్థమైనను అమితముగ భక్షించుటయందు దోషముకలదు గాని మితభోజనము దోషముకాదు ఖుర్ ఆన్ పెక్కుచోట్ల మితభోజనమును బోధించు చున్నది. శాకాదు లమితముగ లభించు ప్రదేశములందు మాంసాహారము చేయనివారు

పల్వురుండుట సహజము ఆహారముయొక్క ప్రయోజనము దేహమునకు బలము నిచ్చుట అందుచే పుష్టికరమును, ఆరోగ్యప్రదమును, అన్యథా నష్టకారకమునుకాని ఆహారమునే మానవుడు భుజింపవలెను జీవహింసయను పదము శాస్త్రజ్ఞాన మెక్కువగ వ్యాపించిన ఈ కాలములో అర్థశూన్యమైనది ఎందుకనగా చెట్టుచేమలయందుసైతము ప్రాణమున్నదనియు అవికూడ జంతువులవలెనే సుఖదుఃఖాదులను, బాధా సంతోషములను అనుభవించుచున్నవనియు సర్ జగదీశ చంద్రబోసు మున్నగు ఆధునిక వృక్షశాస్త్రవేత్తలు కనిపెట్టిరి. "A plant is an anchored animal and an animal is a walking plant" అనికిదా కీర్తిశేషులగు సర్ జగదీశ చంద్రబోసుగారు చెప్పిరి చేతనాచేతనములనియు, స్థావర జంగమములనియు భేదము చూపవచ్చును గాని ప్రాణులు అప్రాణులని భేదము చూపుట ఆధునిక శాస్త్రమర్యాద కానప్పుడు జీవహింసయని మాంసాశనము నిషేధించుట వివేకముకాదని నా మనవి

* * * *

౪౨ పూర్వుల మార్గానుసరణ, పూర్వాచార పరాయణత్వము, శ్రేష్ఠమైన భావము, యుక్తాయుక్తవిచక్షణజ్ఞానమును నిర్మూలమొనర్చును ఖుర్ఆన్ సాంప్రదాయములకు కాక స్వబుద్ధికి ప్రాధాన్య మొసగుచున్నది సంప్రదాయమైనంత మాత్రమున ఒక ఆచారము మంచిది కాజాలదని ఖుర్ఆన్ బోధించుచున్నది.

* * * *

౪౩ ఉపవాస మన్నిమతములందును విహితమైయున్నది ఖుర్ఆన్ సంవత్సరమున కొక మాస ముపవాసమును విధించుచున్నది మత నియమములు రెండువిధములు — విధులు, నిషేధములు విధులనగా మంచిపనులను చేయుటకై ఆజ్ఞలు, నిషేధము లనగా చెడుపనులు చేయకుండుటకై ఆజ్ఞలు. మానవుడు మంచినిచేయును, చెడుగులను చేయును అందుకై విధినిషేధము లేర్పడినవి కాని మన ఇంద్రియములకును అంతఃకరణమునకును క్రమశిక్షణయుండనిచో నవి మానవుని చెడుదారికి పోనివ్వక సన్మార్గమునకే త్రిప్పును ఉపవాస మిట్టి క్రమశిక్షణ నొసగుచున్నది దినమునకు ౧౩ మొదలు ౧౪ గంటలకాలము వరకు ఆహారపానీయాదులను పూర్తిగ వర్జించి, విషయలోలత్వము దరిచేరక, మనోవాక్కాయకర్మల నెట్టి చెడుగును చేయక భగవద్ధ్యాననిమగ్నుడై యుండుట ఎంతో గొప్ప క్రమశిక్షణమని వేర చెప్పనక్కరలేదు రంజాన్ నెలలో ఖుర్ఆన్ అవతరించుటకు ప్రారంభమగుటచే అది పవిత్రమాసముగ పరిగణింపబడినది. అందుచే ఆ నెల ఉపవాస మాసముగ నియమింపబడినది

* * * *

౪౪ యుద్ధము రెండువిధములు:— స్వసంరక్షణార్థము చేయునదొకటి, పరపీడనార్థము చేయునదొకటి ధర్మరక్షణము, అబలాదుర్బలరక్షణము, దుష్టసంహారము — వీటికొఱకై చేయు యుద్ధములుకూడ మొదటి తరగతి క్రిందకే

వచ్చును, ఖుర్ ఆన్ ఈ యుద్ధమును ధర్మముగ విధించుచున్నది రెండవ తరగతి యుద్ధమును నిషేధించుచున్నది "మితిమీరకుడు ఎందుకనగా హద్దుల నతిక్రమించిన వారిని భగవంతుడు ప్రేమించడు" "దౌర్జన్యము స్థిరపడుట తాత్కాలిక రక్తపాతముకంటె చెడ్డది" "ఒకసారి వారు యుద్ధము మానుకొనినచో మీరుకూడ యుద్ధమును మానుకొనుడు దౌర్జన్యము చేయువారితోడనే పోరాడవలెను" ఇవి ఖుర్ ఆన్ వచనములు

మతవ్యాప్తికై మహమ్మదీయులు యుద్ధములు చేసిరను తప్పభిప్రాయ మొకటి మన దేశములో వ్యాపించియున్నది ఖుర్ ఆన్ గ్రంథమందలి ఈ క్రింది సూక్తమును చూడుడు —

"వారి దౌర్జన్య మణగు వరకు వారితో యుద్ధము చేయుడు మతము భగవంతునకు సంబంధించినది వారి మతపరివర్తనమునకై యుద్ధము చేయవలదు ఎందుకనగా మతమువిషయములో భగవంతుడే బాధ్యత వహించును ఒకసారి వారు యుద్ధము మానుకొనినచో మీరు కూడ యుద్ధమును మానుకొనుడు దౌర్జన్యము చేయువారితోడనే పోరాడవలెను.

"విశ్వాసముగలవారును, యూదులును, విగ్రహారాధకులును, క్రైస్తవులును, మేగియనులును, బహుదైవతారాధకులును — వీరి నందరిని గుణించి తుదిదినమున భగవంతుడే పరిష్కరించును భగవంతుడు సర్వసాక్షి" ఖు ౨౦ : ౧౬

ఖుర్ ఆన్ మతస్థాపనమునకై యుద్ధమును విధించుటలేదని పై సూక్తుల వలన స్పష్టమగుచున్నది పూర్వపు రాజులును చక్రవర్తులును హిందూరాజులతో పోరాడుటకు కారణము మతము కాదు వారి రాజ్యకాంక్షయు ధనకాంక్షయును మాత్రము ఏదేని ఒక మతమునకు చెందినవాడు దౌర్జన్యమొనర్చినంత మాత్రమున ఆ మతము దౌర్జన్య ప్రేరకమైనదని చెప్పవచ్చునా ? ఇస్లామ్ మతము ఖడ్గబలముచే ప్రపంచమున వ్యాప్తమైనదను తప్పభిప్రాయముకూడ కలదు ఈ వాదమును ఖండించుచు సర్ టి ఆర్నాల్డు పండితుడు 'The Preaching of Islam' అను ఉద్గ్రంథమును వ్రాసినాడు జిజ్ఞాసువు లీ గ్రంథమును పఠించనగును

* * * *

౪౯ సాధారణముగ అన్నిమతములందును వైరాగ్యము ఆదర్శముగను, సన్యాసము ఉత్కృష్టాశ్రమముగను భావించిరి కాని ఖుర్ ఆన్ వైరాగ్యమును సన్యాసమును నిషేధించుచున్నది ఇహమునే ఆశించి పరమును విడచుటయు, పరమునే ఆశించి ఇహమును విడచుటయు ఈ రెండునూ గర్హ్యములేనని ఖుర్ ఆన్ బోధించుచున్నది ఇహపరములకై సమాన ప్రయత్నము చేయవలెనని ఉపదేశించుచున్నది.

* * * *

౪౬. ఇస్లామ్ మతముయొక్క మరొక గొప్ప సిద్ధాంత మీ సూక్తమున ప్రతిపాదింపబడినది అదియే సర్వమానవ సౌభ్రాతృత్వము ఇస్లామ్ మతమున జాతి దేశ కులభేదములు లేవు అన్ని జాతులును, అన్ని దేశములును, అన్ని భాషలును, అన్ని మతములును సమాన గౌరవమునకు అర్హతగలవే ఒక జాతి ఉన్నతమైనదనియు ఒకజాతి నీచమైనదనియు, ఒక దేశము పుణ్యదేశమనియు, మరొకటి పాపదేశమనియు, ఒకభాష దేవభాషయనియు, మరొకటి మ్లేచ్ఛభాషయనియు, ఒక మతము సర్వోత్కృష్టమైనదనియు మరొకటి బొత్తిగా పనికిమాలినదనియు ఇస్లామ్ మతమనదు అట్లనుట కంగీకరింపదు ఏకేశ్వరత్వము, సర్వమానవ సౌభ్రాతృత్వము దాని పునాదులు

మనువు ఆర్యావర్తమే యజ్ఞములకు యోగ్యమైన ప్రదేశమనియు, దీని కావల నుండునది మ్లేచ్ఛదేశమనియు, అది యజ్ఞార్హమైనది కాదనియు శాసించు చున్నాడు (మను ౨ : ౨౩) అట్లే అనార్యులగు శూద్రులకు హిందూధర్మశాస్త్రము లెట్టి స్థాన మిచ్చినవో విద్వాంసు లెల్లరకును తెలిసినదే శూద్రుని నామము నిందా వాచకమై యుండవలెననియు (౨ ౩౧) దాస శబ్దముతో అంతమైనదై యుండ వలెననియు (౨ ౩౨) శాస్త్రపరనము వారికి నిషేధమనియు (౨ ౧౬) ఇహసాధకములగు అర్థశాస్త్రాదులు సైతము నభ్యసింపరాదనియు (౪ ౮౦) అతడు ధర్మప్రవక్తగగాని, ధర్మ వివేచకునిగగాని యుండకూడదనియు (౮ ౨౦, ౪) అతని చే దాసకర్మ చేయించవలెననియు (౮ ౪౧౩) అతడు దాస కర్మనుండి ఎన్నడును ముక్తుడుకాడనియు (౮ ౪౧౪) అతనికి ధనమున కర్హత లేదనియు (౮, ౪౧౬; ౧౦ ౧౨౯) మనువు శాసించుచున్నాడు ఇట్టి శాసనములే పెక్కితర స్మృతుల యందును కలవు రాజకీయ పరిస్థితులును కాలపరిస్థితులును మారుటచే నిప్పు డీ శాసనములు చాలమట్టుకు పాటించబడకపోయినను హిందూఆచారములు నేటికిని ఇట్టి భేదములపై నిర్మింపబడినవి పరమతస్థులను నీచముగ చూచుటయు, తమలో తామే ఒకరితో నొకరు సహభోజనాదులను సైతము చేయకుండుటయు స్పృశ్యా స్పృశ్యములు మున్నగు విషయములు సర్వవిదితములు వాటిని వేరే వివరింపనక్కరలేదు ఈ విభేదములను, ఈ హెచ్చుతగ్గులను, నిమ్నోన్నతములను ఖుర్ఆన్ రూపుమాపినది ఖుర్ఆన్ మరియొకచో (౪౯, ౧౦—౧౩) ఇట్లు ప్రవచించుచున్నది —

“విశ్వాసవంతులు సోదరులు. అందుచే మీలో మీరు సోదరులవలె కలసిమెలసి శాంతియుతులై యుండుడు. భగవంతుని యెడ మీ విధులను నెరవేర్పుడు. భగవంతుడు మిమ్ములను కరు

ణించును ..........ఓ మానవులారా! మిమ్ములను ఒక పురుషుని నుండి ఒక స్త్రీ నుండి (ఒకే తల్లిదండ్రులనుండి) పుట్టించి జాతులుగను తెగలుగను విభజించితిని. అట్లు చేసినది మీ సౌకర్యమునకే మీ రొకరి నొకరు గ్రహించుకొనుట కట్లు చేసితిని. మీలో ఎవరు ఎక్కువ భగవద్భక్తి విశ్వాసములు కలవారో వారే ఎక్కువ శ్రేష్ఠులు. నిశ్చయముగ భగవంతుడు సర్వజ్ఞుడు."

ఇదే మూలసూత్రమిప్పుడు ముస్లిమ్ అంతర్జాతీయ సంఘమును బంధించుచున్నది. ఇస్లామ్ మతశతృవులు సైత మీ విషయమును గ్రహించిరి ఇంటర్నేషనల్ మిషనరీ కౌన్సిల్ వారు ప్రకటించిన "నేటి ముస్లిమ్ ప్రపంచము" అను పుస్తకములో ఏడెన్ విశ్వవిద్యాలయాచార్యుడగు డాక్టర్ స్నోక్‌హుర్‌గ్రోంజీగారు 'ఇస్లామ్-జాతిసమస్య' 'Islam and the Race Problem' అను తన వ్యాసమున ఇట్లు వ్రాయుచున్నాడు —

" The league of nations founded on the basis of Mahammad's religion took the principle of equality of all human races so seriously as to put to shame other communities White man's churches kept closed to coloured Christians, a missionary boycotted on account of his marrying a negro woman, and the habit of lynching, are often quoted by Muslims as instances of the backwardness of Christian society. The ideal of a league of human races has indeed been approached by the Muslim Community more nearly than by any other " (P. 90)

(మొహమ్మద్ ప్రవక్తమతము పునాదిగా నిర్మింపబడిన నానాజాతిసమితి సర్వ మానవ జాతులయొక్కయు సమానత్వమును సంపూర్ణముగ స్వీకరించినది దీనిని చూచి ఇతర మతస్థులు సిగ్గుపడవలసివచ్చినది తెల్లవారి చర్చీలలో నల్లవారికి ప్రవేశము లభించకపోవుటయు, నీగ్రోస్త్రీని పెండ్లాడిన మిషనరీలను వెలివేయుటయు, తెల్ల స్త్రీలు నీగ్రోలను పెండ్లాడినపుడు నల్లవానికి చేయు చిత్రవధయు క్రైస్తవసంఘము వెనుకబడియుండుటకు ఉదాహరణముగ ముస్లిములు చూపుదురు మానవజాతులకు సమానత్వమను ఆదర్శపూర్తిని ముస్లిముసంఘము సమీపించినంత మరే సంఘమును చేరలేదు )

సర్వమానవ జాతి సమ్మేళనము ఆదర్శముగ సైతము వెనుకటి వా రంగీకరింప కైరి ఇస్లామ్ దాని నాదర్శముగ ముస్లిముల ముందుంచుటయే గాక ఆ ఆదర్శమును

ముస్లిమ్ జీవితమున కొక ముఖ్యాంగముగ నొనర్చినది దేశ వర్ణ జాతి భాషాభేదము లున్నను ప్రపంచము నందలి ముస్లిము లందరును ఒక అంతర్జాతీయ సౌభ్రాతృత్వ బంధముచే కట్టబడియుండుట మనము చూచుచున్నదే డాక్టర్ హుర్ గ్రోంజిగారు అదే వ్యాసమున —

" The Muslims all over the world show a remarkable unity in most respects, and the importance of their unanimous acknowledge ment of the all embracing system as the ideal of their international community can hardly be over-rated "

(ప్రపంచమునందలి ముస్లిములందరును పెక్కువిషయములలో ఆశ్చర్యకరమైన ఐకమత్యమును చూపుదురు తమ అంతర్జాతీయ సంఘమునకు ఆదర్శమైన తమ సంపూర్ణ మతమును ఐక్యకంఠముతో అంగీకరించుట ఒక గొప్ప విషయము దాని విలువ చెప్ప నలవిగానిది.)

మరియొకచో —

" Practically in the Muslim world neither birth nor colour has prevented men from reaching the highest positions. Persians, Turks, Mongolians, Berbers and Negroes have occupied the most important state offices and acquired the greatest fame in scholarship Islam offered a chance to all races, and all of them have availed themselves of it in the measure of their talents In the mosque of Mecca during the lecturing hours students and professors with all gradations of complexion coal-black, green (As the Arabs call a some what brighter nuance), brown, yellow and white may be seen fraternally gathering, and the same variety is shown by the citizens of the Holy city, sometimes even by the members of one family" (P 89).

(ముస్లిమ్ ప్రపంచములో జన్మముగాని జాతిగాని ఎవరైనను అత్యున్నతపదవి నొందుటయం దాటంకము కల్గించలేదు పారసీకులు, టర్కిదేశస్థులు, మంగోలులు, బెర్బరులు, నీగ్రోలు అత్యున్నతపదవుల నలంకరించుటయేకాక, విద్వాంసులుగ నత్యంత కీర్తిని బడసిరి ఇస్లామ్ అన్నిజాతులవారికిని సమానావకాశములను కల్గించినది. తమతమ శక్త్యనుసార మందరును ఆ అవకాశము నుపయోగించుకొనిరి. ఉపన్యాసములు జరుగుచున్నప్పుడు మక్కానగరమునందలి మసీదులో ప్రతి విధవర్ణమునుగల విద్యార్థులును విద్వాంసులును కాన్పింతురు మసిబొగ్గువంటి నలుపు, పచ్చ, చామనచాయ, పసుపుపచ్చ మున్నగు సమస్తవర్ణములవారును సోదరభావమును కలిసియుండుటను చూడవచ్చును మక్కానగర వాస్తవ్యులలోకూడ ఇంతకంటె అధిక

వర్ణ భేదములు కన్పించును. ఒక్కొక్కప్పుడు ఒకే కుటుంబమువారిలో నిట్టి భేదములు చూడవచ్చును.)

రాకపోకల సౌకర్యములు బాగుగా హెచ్చిన ఈకాలములోసైతము జాతివర్ణ భాషా భేదములు మరింత తీవ్రతరమగుచున్నవి. దానితో వివిధజాతులమధ్య పోరాటము కూడ తీవ్రమగుచున్నది జర్మన్ జాతి ఉత్కృష్టమైనదనియు, తక్కిన జాతులు నీచమైనవనియు, తెల్లజాతులు శ్రేష్ఠమైనవనియు, తక్కిన జాతులు నిమ్న జాతులనియు, మున్నగు నానావిధ జాతీయభావములు తీవ్ర సంఘర్షణమును కలిగించి ప్రపంచమును రక్తపంకిల మొనర్చుచున్నవి. ఇంకను మన దేశములో హిందూ మొహమ్మదీయ విభేదములే కాక భాషాభేదములపైనను, ఆర్య ద్రావిడ భేదములపైనను బ్రాహ్మణ అబ్రాహ్మణ భేదములపైనను తీవ్రసంఘర్షణలు జరుగుచున్నవి ప్రతి కులమును, ప్రతి జాతియు, ప్రతి భాషా కుటుంబమును — ఇట్లు వందలకొలది సంఘములు ఒకరిపై నొకరు కత్తులను దూయుచున్నారు. ఖుర్ఆన్ ప్రతిపాదించిన అమృతతుల్యమగు ఈ సూత్రమును అన్నిజాతులును స్వీకరించినచో ఈ ఘోర యుద్ధములు తప్పిపోయెడివి కదా

* * *

౧౪ విడాకులకు 'తలాఖ్' అరబీమూలము దీనికి 'భర్తనుండి విడిపోవుట' అని అర్థము వివాహబంధచ్ఛేదనమున కీ మాట పారిభాషిక పదముగ వాడబడుచున్నది తలాఖ్ విషయములో క్రైస్తవ ధర్మమునకును ఇస్లామీయ ధర్మమునకును ఒక ముఖ్యభేదము కలదు క్రైస్తవ ధర్మమున స్త్రీ విడాకుల నడుగరాదు పురుషుడు స్త్రీకి విడాకుల నివ్వవచ్చును ఇస్లామీయ ధర్మములో స్త్రీకి కూడ ఈ విషయమున సమానమగు హక్కివ్వబడినది స్త్రీ తన భర్తతో వివాహచ్ఛేదము గావించుకొనుటను 'ఖులా' అందురు

స్త్రీ తాను పెండ్లాడిన భర్తను ప్రేమించజాలననుకొనినంతమాత్రమున వివాహచ్ఛేదమును (ఖులా) కోరవచ్చును సాబిత్ బిన్ ఖైస్ భార్యయగు జమీలా తన భర్తను తాను ప్రేమించుటలేదనియు అందుచే తాను వివాహచ్ఛేదమును కోరుచుంటిననియు శ్రీప్రవక్తతో చెప్పెను 'అతని ప్రవర్తనమునందుగాని మతాచరణమునందుగాని నాకు లోపము పొడకట్టదు కాని నే నాతని ప్రేమించను" అని ఆమె ప్రవక్తతో విన్నవించుకొనెను సాబిత్ బిన్ ఖైస్ ఆమె కిచ్చిన తోటను ఆమె అతనికి తిరిగి ఇచ్చివేయు షరతుపై (శ్రీప్రవక్త) ఆమె వివాహచ్ఛేదమున కొప్పుకొనెను (బుఖారీ) ఇట్లు స్త్రీ యొక్క ప్రేమ పావిత్ర్యమునకు ఇస్లామ్ ఉచ్చస్థాన మిచ్చినది ఈ విధముగ స్త్రీలకు

ఇస్లామ్ ఇచ్చినంత స్వాతంత్ర్యము ప్రపంచము నందలి ఏ మతమునందుగాని ఏ సంఘము నందుగాని ఇవ్వబడలేదు

ఖురాఆన్ స్త్రీల కిచ్చిన హక్కులను గురించి పంచమాధ్యాయ వ్యాఖ్యానమున వివరింతును.

'తలాఖ్' విధివిహితమైనను అనివార్యకారణము లుండినగాని వివాహచ్ఛేదము చేసుకొనకుండునట్లు ఇస్లామ్ పెక్కు నిబంధనలను కల్పించినది

"మానవులకు విధివిహిత మొనర్చిన వానిలోకెల్ల భగవంతున కెక్కువ అయిష్టకరమైనది తలాఖ్." అని ప్రవక్త సెలవిచ్చినమాటలు ఇందలి ధర్మరహస్యమును తెలుపుచున్నవి ఈ మాటలు పై ఖురాఆన్ వాక్యమునకు వ్యాఖ్యానమని చెప్పవచ్చును.

# హైదరాబాదు ఆంధ్ర సాహిత్య పరిషత్తు

అధ్యక్షులు ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు, ఆంధ్రాచార్యులు.
ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు (దక్కన్).

ఈ పరిషత్తు తెనుగున 'హైదరాబాదు ఆంధ్ర సాహిత్య పరిషత్తు' అనియు, నాంగ్లమున 'హైదరాబాదు తెలుగు ఎకాడమీ' అనియు పిలువబడును పరిషత్తు కార్యస్థానము హైదరాబాదునగరమున నుండును

## ఉ ద్దే శ్య ము లు :

(అ) హిందూ మొహమ్మదీయులు పరస్పర మొకరి సంస్కృతి నొక రర్థముచేసికొనుట కుపకరించు గ్రంథముల నాంధ్రమున ప్రచురించుట.

(ఆ) ఆంధ్రమున నుత్తమరచనలను ప్రచురించుట

(ఇ) నిజాంరాజ్యమున లభించు ప్రాచీన తాళపత్రగ్రంథములను సేకరించి వానిని భద్రపరచుట।

(ఈ) ఆంధ్రసంస్కృతి, ఆంధ్రభాష, ఆంధ్రవాఙ్మయము వీని యందు పరిశోధనలు సల్పుట.

(ఉ) ఒకటి ఆంగ్లముననను, నొకటి యాంధ్రముననను రెండు త్రైమాసపత్రికల ప్రచురించుట. పరిషత్సభ్యుల పరిశోధన లిందు ప్రచురింపబడును.

ఆంగ్లపత్రికయందు తెలుగుభాషను గురించియు, సాహిత్యమునుగూర్చియు పరదేశస్థులకు తెలియుటయు, ఆంధ్రప్రతిభ యనాంధ్రులకు తెలియజేయుటయు మొదలుగాగల యుద్దేశములతో వ్రాయబడిన యుత్తమవ్యాసములు ప్రచురింపబడును. ఆంధ్రేతర సాహిత్యములనుండి గొప్ప కావ్యములయొక్క యనువాదములను, నాంధ్రేతర భాషాచరిత్రలు, మున్నగు నాంధ్రభాషాభివృద్ధికి తోడ్పడు నితర విషయములును తెనుగుపత్రికయందు ప్రచురింపబడును

(ఊ) వార్షికోత్సవములను జరిపి ఆంధ్రసంస్కృతికి సంబంధించిన విషయములపై ప్రఖ్యాత పరిశోధకుల చర్చలను ఏర్పాటుచేసి చిత్రకళాపుస్తకప్రదర్శనములను జరిపి, అన్నివిధముల ఆంధ్రసంస్కృతి విస్తృతికి తోడ్పడుట.

**మొహమ్మద్ ఖాసింఖాన్**, ఎం ఏ,
కార్యదర్శి.

పరిషత్ప్రచురణము ౮.

بسم الله الرحمن الرحيم

صحفا مطهرة فيها كتب قيمة

పవిత్రమైన ఈ పుటలలో సమస్త సత్యవేద (సార)ము గలదు.

# ఖుర్ఆన్ షరీఫ్

## సవివరణ ఆంధ్రానువాదము

( లఘువ్యాఖ్యాన సహితము )



**మొహమ్మద్ ఖాసింఖాన్, ఎమ్. ఏ.**



రెండవ సంపుటము

హైదరాబాదాంధ్రసాహిత్య పరిషత్తు

హైదరాబాద్ (దక్కన్)

**1943**

بسم الله الرحمن الرحيم

# మనవి

అనుకొనినంతత్వరలో రెండవ సంపుటమును ప్రచురింపజాలక పోతిని. ఆలస్యము అనివార్యమైనది.

ఐతే ప్రథమసంపుటములో రెండు భాగములే యుండెను. ఈ సంపుటములో మూడు భాగములకు పైగా ఉన్నవి.

పారాయణసౌకర్యమునకై ఖుర్ఆన్ గ్రంథము 30 భాగములుగ విభజింపబడినది. ఇది విషయవిభజనము కాదు. ఒకొక్కప్పుడు ఒక విషయముమధ్య ఒక భాగము పూర్తియైపోవును. అందుచే సంపుటమునకు రెండేసి భాగముల చొప్పున ప్రకటించు ఉద్దేశమును మానుకొని అధ్యాయముల ననుసరించి సంపుటవిభాగమును చేయ దలచితిని. ఈ సంపుటములో నాల్గు అధ్యాయములు పూర్తియైనవి.

పని తొందరపడి చేయదగినది కాకపోవుటచే తక్కిన గ్రంథమంతయు ఎంతవరకు పూర్తిచేయగలనో చెప్పజాలను. అల్పజ్ఞుడనగు

పై నీ మహాత్కార్యమును చేయఁబూనుట భగవదనుగ్రహమేకాని మఱొకటి కాదు.

ఈసారి 'తఫ్సీరె ఇబ్నెకసీర్' అను గొప్ప అరబ్బీభాష్యమును పెక్కు ఇతర ఉద్గ్రంథములను చదివి అందలి పెక్కు విశేషాంశము లను వ్యాఖ్యానభాగమున చేర్చితిని. అభిప్రాయభేదములనుకూడ ఉల్లేఖించితిని.

మిత్రులు, హితాభిలాషులు పల్వురు ప్రథమ సంపుటమందలి నా అనువాద వ్యాఖ్యానముల మంచి చెడ్డలను విమర్శించి తమ అభి ప్రాయముల నిచ్చిరి. వారికి మిక్కిలి కృతజ్ఞుడను. ఈ సంపుటమును కూడ అట్టి విమర్శకదృష్టితోనే పరిశీలించి నా ఉద్యమమునకు తోడ్పడుదురుగాక యని వారి నర్థించుచున్నాను. సుహృద్భావముతో చేసిన ఎట్టి సూచనమైనను నాకు శిరోధార్యమే.

గ్రంథమంతయు పూర్తియైనపిదప, అంతవరకు మిత్రులు సూచించు సవరణ లన్నిటితోను పునర్ముద్రింతును. మిత్రులు, పండి తులు, భాషాభిమానులు, జిజ్ఞాసువులు దీని నొక చిత్తుప్రతిగ భావిం తురుగాక !

నా యీ ఉద్యమమునకు చేయూత నొసగుచున్న పల్వురు అభిమానులకు నా కృతజ్ఞతలు. ప్రత్యేకముగ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు, ఆచార్య కుతుగంటి సీతారామయ్యగారు, ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిలుగారు చూపిన అవ్యాజమగు ఆదరాభిమానములు నాకెంతో ప్రోత్సాహమును కల్గించినవి. వారికి నా వందనములు.

నాంపల్లి,<br>హైదరాబాద్, దక్కన్.<br>1—8—43

మొహమ్మద్ ఖాసింఖాన్

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

# మూడవ భాగము

253 (నా) ప్రవక్తలగు వీరిలో కొందరిని తక్కినవారికంటె అధికుల నొనర్చితిని. భగవంతుడు వారిలో కొందరితో మాటలాడెను. (అనగా వారికి భగవత్ప్రోక్తమగు గ్రంథము లభించెను) కొందరికి ఇతరులకంటె (వారి కాలపరిస్థితుల ననుసరించి కొన్ని విషయములలో) ఉన్నత స్థానముల నిచ్చెను. (ఓ ప్రవక్తా!) నీకు పూర్వము మరియమ్ కుమారుడైన ఈసాకు నేను విస్పష్టమగు ఉపదేశములను† ప్రసాదించితిని. పరిశుద్ధాత్మ* సహాయమును చేకూర్చితిని. దేవు డిచ్ఛయించినచో ఈ ప్రవక్తల తర్వాతి తరములవారు (సన్మార్గముయొక్క) విస్పష్టబోధనలను పొందియు, పిదప విభేద విద్వేషములలో తగులొని పరస్పరము తగువులాడుకొనకుందురు (కాని మానవునకు భగవంతుడు సంకల్పశక్తియు కర్మాధికారమును ప్రసాదించి స్వతంత్రు నొనర్చినాడు. ఇట్లతని కిచ్చిన స్వేచ్ఛాశక్తిచే) ఈ ప్రవక్తలపిదప కొందరు పరస్పరము విరోధములు పెంచుకొని (సత్యమార్గమున ఐకమత్యమును కలిగియుండక) కొందరు సత్యమునందు శ్రద్ధాళువులైరి; మరికొందరు సత్యమును నిరాకరించి (దుర్మార్గులై) రి. భగవంతు డిచ్ఛయించినచో వారు పరస్పరము జగడములాడుకొని యుండరు. కాని భగవంతుడు తా నెట్లిచ్ఛయించిన అట్లు చేయును.

## ముప్పది నాల్గవ ఖండము

254. ఓ విశ్వాసవంతులారా! (నశ్వరమగు మీ జీవితవ్యవధి అంతమై) ఆ (తుది) దినము వచ్చుటకుముందే మీకు నే నిచ్చియుండిన

† "సత్యచిహ్నములు" అనియు కొంద రర్థము వ్రాసిరి.

* 'రూహిల్ ఖుదిసి' అను మూలమునకు "ఈశ్వర ప్రేరిత జ్ఞానము" అనియు "ఇంజీల్" లేక భగవద్గ్రంథము అనియు కొంద రర్థము వ్రాసిరి.

(ధన ధాన్య సంపదల) నుండి (మీ ప్రాపంచిక సౌఖ్యములకే కాదు, భగవన్మార్గమునకూడ) ఖర్చుపెట్టుడు.[౨౭] రాబోవు ఆ దినమున (ఈ ప్రపంచమునందు వలె) క్రయవిక్రయములు సాగవు. (వెల యిచ్చి మోక్షమును మీరు కొనజాలరు) ఎవ్వరి బాంధవ్యమైనను స్నేహమైనను సరే నాడు పనికిరాదు. ఎవరి శిఫార్సుగాని రక్షణగాని నాడు లాభింపదు. (నాడు కేవలము మీ కర్మలే మీకు పనికివచ్చును. మీ కర్మలే మీకు మోక్షము నిచ్చును అని జ్ఞాపక ముంచుకొనుడు.) (ఈ సత్యమును నిరాకరించు) అవిశ్వాసులు—నిశ్చయముగ వారు తమకు తామే నష్టకరచుకొనుచున్నారు.

**255.** అల్లాః తప్ప ఆరాధింప దగిన దేవుడెవ్వడును లేడు. అతడు (ఆదిమధ్యాంతములు లేని) నిత్యుడు; స్వయంపూర్ణుడు; (సమస్త సృష్టికి నతడే మూలాధారము. అతని అస్తిత్వము దేనిపైనను ఆధారపడిలేదు; అతడు అనంతుడు.) అతనికి కునుకుగాని కూరుకుగాని లేదు. భూమ్యాకాశములలో నున్న సమస్తమునకును అతడే స్వామి. (అతని అదుపాజ్ఞలకే సమస్తమును లొంగియున్నది)

అతడు అనుజ్ఞ ఇచ్చిన తప్ప ఎవరు అతని సమక్షమున (మోక్షము నిప్పించుటకు) శిఫార్సుచేయ బూనుకొనగలరు ? మానవుని భూత భవిష్యద్వర్తమానముల నాతడెఱుగును. (భగవంతుడు) మానవునకు ఎంత జ్ఞానమును ప్రసాదింప దలచి ఇచ్చునో అంతేతప్ప మరే ఇతరజ్ఞానమును అతనికి లేదు. భగవంతుని జ్ఞానము భూమ్యాకాశముల (సమస్త వైశాల్యము) నావరించి యున్నది. వాటిని కాపాడుట యందు అతడెంతమాత్రము అలసట చెందడు; భగవంతుడు మహామహిమోపేతుడు; మహాద్యశుడు.[౨౮]

**256.** మతము విషయములో నెట్టి బలాత్కారమును చేయదగదు.[౨౦] (శ్రద్ధా విశ్వాసములు హృదయపూర్వకముగ కలుగవలెను కాని బలాత్కారమున కలుగవు.) సత్యమును అసత్యమును స్పష్టముగ వేరుచేయబడియున్నవి. (సత్యాసత్య విచక్షణము కష్టముకాదు, ఇప్పుడు సత్యాసత్యములు రెండును మీ ముందున్నవి. ఈరెంటిలో దేనిని గ్రహింతురో గ్రహింపుడు.)

తప్పుదారిని నడిపించు సైతానును తిరస్కరించి, ఎవరు భగవంతుని యెడ విశ్వాసమును చూపిరో వారికి నిశ్చయముగ దృఢతమమైన పట్టుగొమ్మ లభించినట్లే. (ఈ పట్టుగొమ్మ) ఎన్నటికిని విరుగనిది. (ఇది జ్ఞాపక ముంచుకొనుడు) భగవంతుడు సమస్తమును వినువాడు, సర్వమును తెలిసినవాడు.

257. విశ్వాసవంతులకు భగవంతు డేడుగడ; వారి నతడు చీకటినుండి వెలుగులోనికి తెచ్చును.

అవిశ్వాసులకో దుష్టులు సహాయులు, వారు వారిని వెలుగునుండి చీకటిలోనికి నడిపింతురు. వారు నరకాగ్నియం దుండువారు. వారి కందే నిత్యనివాసము.

## ముంప్పది ఐదవ ఖండము

258. (ఓ ప్రవక్తా!) ఇబ్రాహీముతో భగవంతునిగూర్చి వివాద మొనర్చిన వారిని గూర్చి యోచించితివా? భగవంతు డతనికి రాజ్యము నిచ్చుటచే (అధికార ప్రమత్తతచే గర్విష్ఠియై) అతడా వాదనకు దిగెను.[30]

అప్పుడు వానితో ఇబ్రాహీమ్ ఇట్లనెను: "(సమస్త జీవులకును) ప్రాణము నిచ్చి తిరిగి మృత్యువును కలిగించునట్టివాడే నా భగవంతుడు."

దానికి అతడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను: "బ్రతికించువాడను చంపువాడను నేను. (నా యిష్టము వచ్చినవారిని చంపి నా ఇచ్ఛ వచ్చిన వారిని బ్రతుకనిచ్చువాడను నేను.)"

దానికి ఇబ్రాహీమ్ ఇట్లు బదులు చెప్పెను: "అల్లాహ్‌నచో భగవంతుడు తూర్పున (భూమిపై) సూర్యు నుదయింప జేయుచున్నాడు. నీవు పడమట నుదయింపజేసి చూపుము. (అప్పుడు నీవు శక్తిమంతుడ వనుకొందును.)"

(రాజ్యగర్వముచే భగవంతునియందు) విశ్వాసమును విడచి పెట్టిన అతడు దానికి నిరుత్తరుడాయెను. అధర్మప్రవర్తకులకు భగవంతుడు (మోక్షవిజయముల) సన్మార్గమును చూపడు.

259. ఓ ప్రవక్తా! కప్పులు సైతము శిథిలమైన ఇండ్లుగల పట్టణముగుండా వెళ్ళుచుండిన ఆ మనుష్యుని స్థితినిగూర్చి యోచింపుము.²⁻³ (శిథిలావస్థలో నున్న ఆ పట్టణమును చూచి) అత డిట్లనెను. "ఇది ఇట్లు విధ్వంసమైన పిదప దీనిని భగవంతు డెట్లు పునరుజ్జీవింపజేయును ?"

తర్వాత భగవంతు డామనుష్యుని నూరేండ్లపాటు మృతునొనర్చి యుంచెను. పిదప అతనికి ప్రాణదాన మొసగెను. అప్పుడు భగవంతు డతని నిట్లడిగెను : "ఎంతకాల మీస్థితియం దుంటివి ?" దానికి ప్రత్యుత్తరముగ అత డిట్లువిన్నవించెను : "ఒక దినమో లేక కొన్ని ఘడియలో." భగవంతు డిట్లుసెలవిచ్చెను : "అట్లు కాదు. నూరేండ్లు నీ వాస్థితియం దుంటివి. నీ అన్నపానములవంక చూడుము. సంవత్సరములపాటు ఇవి పడియుండినట్లు అందెట్టి చిహ్నములును కన్పించుటలేదు. (నీకు వాహనమైన) గాడిదనుకూడ చూడుము. మానవులలో నీ వొకదృష్టాంతముగ నుండుటకై (ఇట్లు చేసితిమి )

మరియు దేహముయొక్క అస్థులనుగూర్చి యోచింపుము. ఎట్లు వాటి నొకఅస్థిపంజరముగా తయారుచేసితిమి ! ఎట్లు (వానినొక అస్థిపంజరముగా చేసి) నిలబెట్టితిమి. (ఎట్లు ఒక సంపూర్ణజీవి వ్యక్తమగునట్లు) దానిపై మాంసమును తొడిగింపజేసితిమి!

అప్పు డామనుష్యునకు ఈసత్యము తేటతెల్ల మయ్యెను. వెంటనే అత డిట్లుచెప్పసాగెను : "నిస్సంశయముగ భగవంతుడు సర్వశక్తిమంతు డని నేను తెలిసికొంటిని."

260. ఒకప్పుడు ఇబ్రాహీమ్ ఇట్లనెను : "ప్రభూ ! నీవు మృతుల నెట్లు జీవితుల నొనర్తువో నాకు చూపుము."

(దానికి) భగవంతు డిట్లనెను : "ఏమి! నీకు దీనియందు విశ్వాసము లేదా ?"

ఇబ్రాహీమ్ ఇట్లు విన్నవించుకొనెను : "నాకు నిశ్చయముగ విశ్వాసమున్నది. ఐనను నాకు మనస్తృప్తి కలుగవలెనని (ఇట్లు ప్రార్థించితిని )"

దానికి భగవంతు డిట్లుసెలవిచ్చెను : "అట్లైన నాల్గు పక్షులను పట్టుకొమ్ము. అవి నీవెంట వచ్చునట్లు వాటిని మచ్చికపరుపుము. తర్వాత నాల్గింటిలో ప్రతి ఒకొ్కక్కదానిని ఒకొ్కక్క కొండపై దూరముగ కూర్చుండబెట్టుము.[౨౩] అప్పుడు వాటిని పిలువుము. (అవి ధ్వని వినగానే) నీ దగ్గఱకు ఎగిరివచ్చును. (బుద్ధిలేని సామాన్యపక్షులు నీతో కొన్నాళ్ళు మచ్చికపడినంత మాత్రమున నీ ధ్వనిని గుర్తుపట్టి నీవు పిలువగనే నీవెంట పరుగెత్తుకొనిరాగా సత్యబోధనవల్ల మానవులు నీవైపునకు వచ్చుట ఆశ్చర్యమా ?) జ్ఞాపకముంచుకొనుము భగవంతుడు సర్వశక్తిమంతుడు; సర్వజ్ఞుడు.

## ముప్పది ఆఱవ ఖండము

261. దేవుని మార్గమున తమ ధనమును వెచ్చించువారి సుకృతి నిట్లు పోల్చవచ్చును : ఒక గింజ భూమిలో నాటబడినది. నాటిన గింజ ఒకటేదైనను మొక్క మొలిచి దానికి ఏడు కంకు లాయెను. ప్రతి కంకి యందును నూరు గింజ లుత్పన్నమాయెను. అట్లే ఒకటి ఖర్చుపెట్టిన దానికి శతాధికమగు ఫలమును భగవంతు డిచ్చును.[౨౪] తనకు ప్రియులైన వారికై వారి సుకృతమును భగవంతుడు ద్విగుణీకృత మొనర్చును. భగవంతుడు అమితముగ నిచ్చువాడు. సర్వజ్ఞుడు.

262. (కాని హృదయపూర్వకముగను, సన్మార్గమునను చేయు దానమే దానము. అందుచే) భగవన్మార్గమున వ్యయపరచువారు ఎవరు తమ దానమును గూర్చి మాటిమాటికి గొప్పగా చెప్పుకొనరో, ఎవరు

(ప్రతి గృహీతకు మనోవాక్కాయ కర్మముల) ఎట్టి కష్టమును కల్గించరో (అట్టివారిదే నిజమగు దానము). భగవంతుడు వారికి దాని ప్రతిఫల మిచ్చును. వారి కెట్టి భయముగాని దుఃఖముగాని అంటదు.

263. మృదు వాక్కును, క్షమయు, హింసాపూర్వకమైన దానముకంటె శ్రేష్ఠమైనవి భగవంతుడు ఎట్టి కామ్యములును లేని వాడు, మహాత్ముమి.

264. ఓ విశ్వాసవంతులారా ! దానము చేసితి మని మాటి మాటికి చెప్పికొనియు, (ప్రతిగృహీతను) నొప్పించియు దాన ఫల మును వ్యర్థము చేయకుడు. లోకమునకు ప్రదర్శించుటకై ధనమును వ్యయపెట్టువానివలెను, భగవంతునిపైనను తుదిదినమునందును విశ్వా సములేనివానివలెను, సుకృతమును వమ్ముచేయకుడు. వారు కొద్దిగా మన్నుకల కఠినశిలవంటి వారు. దానిలో విత్తనము నాటబడినను పెద్ద వర్షము కురిసినప్పుడు ఆ మట్టియు విత్తనమును కూడ కొట్టుకొని పోయి (కఠిన) శిల మాత్రము మిగులును. (వీరి స్థితియు నిట్టిదే!) అట్టి వారు (దానాది సత్కర్మలచేత) గడించిన దంతయు (నిట్లు) పాడుచేసి కొందురు. విశ్వాసమార్గమును విడనాడిన వారికి భగవంతుడు మోక్ష మార్గమును తెరువడు.

265. కాని తమ ధనమును ఎవరు (లోకమునకు చూపుటకు కాక) భగవంతుని ప్రీతికొఱకును, తమ ఆత్మల స్వాస్థ్యమునకును ఖర్చు పెట్టుదురో వారి దాన మొక ఉన్నత భూఖండముపై సారవంతమగు నేలను నాటిన ఆరామము వంటిది. బాగుగ వర్షించెనా అది ద్విగుణీ కృతముగ ఫల పుష్ప సంభరితమగును; అట్లు మంచివర్షము కురియక ఏకొన్ని చినుకులు పడినను అది శుష్కింపక ఫలపుష్పములనిచ్చును. (దానికి ఏకొద్ది నీరైనను చాలును. అది ఫలపుష్పశోభితమై యుండగలదు.)

(జ్ఞాపక ముంచుకొనుడు) మీరు చేయుచున్న దంతయు భగవం తుని దృష్టినుండి గుప్తమై లేదు.

266. మీలో ఎవరైన జరాభారముచే క్రుంగిపోయి, శక్తి హీనులై, వ్యవసాయకార్యములను నిర్వహింపజాలని పసిపిల్లలుగల వారై యున్నప్పుడు, ఖర్జూర వృక్షములు ద్రాక్ష పందిళ్లు కలిగి కాలువలు ప్రవహించుచున్నదై సమస్త ఫలసంభరితమై యున్న మీ తోట వేడి తుపానుగాడ్పులచే అకస్మాత్తుగ మాడి చెడిపోవుటను ఎవరు చూడగోరెదరు ? (తన జీవితకాల మంతయు కేవలము లోకమునకు చూపుటకై దానధర్మములనుచేసి పరలోకమున ఇవన్నియు పనికి వచ్చునని భ్రమించువానికి ఇది ఒక తార్కాణము కాని మీరు కావించిన దంతయు అవసాన దినమున పై యుదాహరణమందలి తోటవలె మాడిపోవును అనగా భగవంతుడు అట్టివారి దానధర్మములను స్వీకరింపడు ) మీరు పర్యాలో చింతురని భగవంతు డిట్టి ఉదాహరణములనిచ్చి విస్పష్టవాక్యములలో మీకు బోధ కలుగజేయును.

## ముప్పది ఏడవ ఖండము

267. ఓ విశ్వాసవంతులారా ! మీరు కష్టపడి సంపాదించిన దానినుండియు, మీకై మేము భూమియం దుత్పత్తిగావించిన వాని నుండియు, మంచివస్తువులనే ఖర్చుపెట్టుడు (మీరు భగవన్మార్గమున దానముచేయగోరుచో మంచివస్తువునే దానముచేయుడు ) (మీకు పండిన ఫలధాన్యములనుండి) దానముచేయుటకై పొల్లునుతీయ నుద్దేశింపకుడు. (పారవేయుటకుబదులు, భగవన్మార్గమున దానముచేసి పుణ్యమునైన గడింతుముగాక! అను ఉద్దేశముతో అట్లుచేయకుడు ) మీకే అట్టి పొల్లువస్తువులనిచ్చినచో కండ్లుమూసుకొని తీసుకొందురేమోగాని సంతోషపూర్వకముగ స్వీకరింపరు కదా! (మీ కయిష్టమగువస్తువు మీ బీదసోదరుల కిష్టమగునని మీరెంతురా? జ్ఞాపకముంచుకొనుడు.) భగవంతునకు కామ్యములు లేవు. అతడు సర్వస్తుతిపాత్రుడు.

268. దారిద్ర్యభీతి గొల్పి సైతాను మిమ్ములను చెడునడవడి నలవరచుకొన ప్రోత్సహించు చున్నాడు కాని భగవంతుడు మీ పాపములను క్షమించి మీయెడ అనుగ్రహమును చూపు వాగ్దాన

మొసగుచున్నాడు. (అందుచే సైతాను ఉరుల జిక్కక భగవన్మార్గమున నడువుడు. జ్ఞాపకముంచుకొనుడు:) భగవంతుడు వరదుడు; సర్వజ్ఞుడు.

**269.** తన ఇచ్ఛవచ్చిన వారి కతడు విజ్ఞానమును ప్రసాదించును. అట్లు విజ్ఞానము ప్రసాదింప బడినవాడు మహా భాగ్యమును గాంచిన వాడనుట నిశ్చయము. వివేకవంతులు తప్ప ఇతరు లీ సందేశమును గ్రహించ లేరు.

**270.** దానపూర్వకముగ ఎట్లు ఖర్చుపెట్టినదియు, భక్తిపూర్వకముగ ఎట్లు నివేదించుకొనినదియు, భగవంతు డంతయు నెఱుగునని నమ్ముము. దుర్మార్గుల కెవ్వరును సాహాయ్యులై రారు.

**271.** మీరు బహిరంగముగ దానముచేసినను మంచిదే. కాని రహస్యముగ పేదసాదలకు దాన మిచ్చుట మిక్కిలి ప్రశస్తము. మీ చెడుగులను కొన్నిటి నది తొలగించును. మీరు చేయునదంతయు భగవంతుడు బాగుగ నెఱుగును. (అతడు సర్వజ్ఞుడు.)

**272.** (ఓ ప్రవక్తా!) ప్రజలు (అందరును) నీఉపదేశమును(తప్పక) స్వీకరించు బాధ్యత నీపై లేదు. (వారికి సన్మార్గము చూపుటయే నీ విధి.) భగవంతుడే తన ఇచ్ఛవచ్చిన వారిని సన్మార్గగాములను చేయును. (మరి నీవు ప్రజలతో ఇట్లు చెప్పివేయుము) "మీరు ప్రశస్తమగు రీతిని దానము చేయుచో (దానివలన నా కేమియు లాభము కలుగదు.) మీ ఆత్మలకే అది లాభము చేకూర్చును. భగవత్ప్రీతికై మాత్రమే మీరు దానము చేయుడు. మీరు ఏది దానము చేసినను దాని ప్రతిఫలము మీకు పూర్తిగ లభించును ** (ఇట్టిదానము చేయుటవలన లాభమే కలుగును గాని) దానివలన మీ కెట్టి బాధయు కలుగదు.

**273.** భగవన్మార్గమున నుద్యుక్తులై నిరుపేదలైనవారే అసలు దానమునకు పాత్రులు. వారు (సంపాదనమునకై వర్తకము మున్నగు వృత్తులను స్వీకరించి) దేశసంచారము చేయ నవకాశము లేని వారు. (కాని వారు నిర్లిప్తు లగుటచే తమ దారిద్ర్యమును ఎవ్వరితోడను చెప్పుకొనరు.) అజ్ఞానులు వారిని సంపన్నులనియే భావింతురు. ఎందుకనగా వారు

(అభిమానముచే ఎవ్వరిముందును) చేయి చాచరు. మీరు వారి (ముఖ) చిహ్నములను చూచియే వారిస్థితిని గ్రహించగలరు. కాని వారు ప్రజలను పీడించి (దానము) నడుగరు మీరుచేయు ఏ సత్పాత్ర దానమైనను భగవంతుడు నిశ్చయముగ నెఱుగును.

## ముప్పది ఎనిమిదవ ఖండము

274. రేబవళ్లు బహిరంగముగను రహస్యముగను దాతృత్వమున తమ సంపదనుండి వ్యయపరచు వారికి వారిప్రభువు కడ బహుమానము కలదు. వారికి ఎట్టి భయముగాని శోకముగాని అంటదు.

275. (బీదసాదలకు సాయమొనర్చుటకు బదులు వారికి అప్పుల నిచ్చి వారి కడనుండి) ఎవరు వడ్డీని తీసుకొని పొట్టపోసికొందురో వారు స్థిరముగ నిలువజాలరు. వారు నిలువబడినను (దుర్గర్వముచే) పిశాచమావేశించి ఉన్మాదులైన వారి వలె నిలువబడుదురు. ఎందుకనగా (వడ్డీ అన్యాయార్జనమని అంగీకరింపక) వారు ఇట్లందురు : "(క్రయవిక్రయములతో కూడిన) వర్తకము కూడ (అప్పిచ్చి) వడ్డీ తీసికొనుటవంటిదే!" కాని భగవంతుడు వర్తకమును ధర్మయుక్తమొనర్చి వడ్డీని నిషేధించినాడు.[౨౬] (రెండును ఒక్కటే ఎట్లగును?) అందుచే (ఇప్పుడు) ఈ భగవదాజ్ఞయైన తర్వాత ఎవరు వడ్డీ తీసుకొనుట మానివేతురో, ఇంతకు ముందు (వడ్డీ తీసికొనుటవలన ఐన) వారి పాపము క్షమింపబడును. అట్లుకాక ఎవరు అదే పాపమును చేయుదురో వారు నరకాగ్ని పాలగుదురు. అందే వారికి స్థిరనివాసము.

276. భగవంతుడు వడ్డీని సర్వశుభములనుండియు రిక్తమొనర్చినాడు. దాతృత్వమును సర్వశుభోపేత మొనర్చినాడు. కృతఘ్నులను, క్రూరులను భగవంతుడు ప్రేమింపడు.[౨౭]

277. (భగవంతుని యందు) విశ్వాసవంతులై సత్కార్యాచరణమొనర్చి, నిత్య ప్రార్థనలయందు దృఢమనస్కులై జకాతు నిచ్చు

చుండినచో భగవంతుడు వారిని బహూకరించును. వారికి భయము గాని శోకముగాని అంటదు.

278. ఓ విశ్వాసవంతులారా! మీరు నిజముగ విశ్వాస వంతులైనచో దైవభీతి గలిగి (మీ ఋణస్థులనుండి) మీకు రావలసిన వడ్డీ మొత్తములను విడిచిపెట్టుకొనుడు.

279. మీరట్లు చేయనిచో మరి భగవంతుని తోడను, ప్రవక్త తోడను యుద్ధము చేయుటకు సిద్ధపడుడు. (భగవదాజ్ఞల నతిక్రమించుట భగ వంతునితో యుద్ధము చేయుటవంటిదే) అట్లు కాక మీరు ఈ అతిక్రమణ మార్గమును విడిచి పశ్చాత్తాపపడి సన్మార్గమునకు వచ్చినయెడల మీ అసలు మొత్తములు మీకు లభించును. మీరన్యాయము చేయ నిచో మీకును అన్యాయము జరుగదు.

280. ఋణస్థుడు కష్టపరిస్థితులలో నున్నచో అతనికి తెరిపియై తీర్పజాలినంతవరకు వ్యవధి నిండు. మీరు ప్రబోధమనస్కులై ఔదార్య దాతృత్వములతో ఋణమును క్షమించినయెడల అంతకంటె మీకొఱకు ప్రశస్తమైనది మరొకటి లేదు.

281. మీరు భగవంతుని సమక్షమునకు తేబడు ఆదినమునకు భయపడుడు నాడు ఎవరు గడించినది వారనుభవింపవలసినదే. నాడెవరికిని అన్యాయము జరుగదు.

## ముప్పది తొమ్మిదవ ఖండము

282. ఓ విశ్వాసవంతులారా! ఒక నిర్ణీతకాలమునకై మీరు పరస్పరము అప్పు ఇచ్చిపుచ్చుకొను వ్యవహారమును జరిపినచో దానిని (ఆ ఒడంబడికను) వ్రాతమూలముగ భద్రపరుపుడు. ఇరుపక్ష ములమధ్య ఒక వ్రాయసకానిచే ఉన్నదున్నట్లు జాగ్రత్తగా ఒడం బడిక పత్రమును వ్రాయింపుడు. వ్రాయసకా డెన్నడును వ్రాయ నిరాకరింపరాదు భగవంతు డతనికెట్లు లేఖనవిద్యను ప్రసాదిం చెనో అట్లే అతడు (అతని వ్రాతపొరపాట్లవలన తరువాత తగువులు సంభ

వించకుండ) వ్రాయవలయును. ఋణస్థుడు దస్తావేజు మతలబును చెప్పుచుండగా (వ్రాయసకాడు వ్రాయుచుండవలెను.) అప్పుడతడు దైవభీతిని మనస్సుననిల్పి తా నివ్వవలసిన మొత్తము నెంతమాత్రమును తగ్గింపక సరిగా చెప్పవలెను. ఒకసారి ఋణస్థుడు బుద్ధిహీనుడుగాని బల హీనుడుగాని యైనపక్షమునను, తాను దస్తావేజును వ్రాయించ జాలనిపక్షమునను, అతని సంరక్షకుడు అతనికై న్యాయముతప్పక వ్రాయించవలెను. (అట్లుచేసి) మీనుండి ఇద్దరిని సాక్షులుగ నుంచవలెను. ఒకసారి ఇద్దరు పురుషులు సాక్షులుగా లభించకపోయినచో ఒక పురుషుడు, ఇద్దరు స్త్రీలు మీ-ఇష్టమువచ్చిన వారినుండి ఏర్పాటుచేయవచ్చును ఒకసారి ఆ ఇద్దరిలో నొక స్త్రీ పొరపడినను మరొక స్త్రీ జ్ఞాపకముచేయవచ్చును.

సాక్షులు(సాక్ష్యము చెప్పుటకై)పిలువబడినపుడు వారు రా నిరాకరింపరాదు. మొత్తము చిన్నదైనను పెద్దదైనను అది చెల్లింపబడవలసిన తేదీతో సహా వ్రాయుటకు వెనుదీయకుడు. భగవంతుని దృష్టిలో ఈపద్ధతి ఎక్కువ న్యాయయుక్తమైనది. (ఎందుకనగా దీనివలన) మంచి ప్రమాణము లభించుటయేగాక, తరువాత మీకు సందేహములు కలుగకుండుట కిది మిక్కిలి అనుకూలమైనది.

ఒకసారి అప్పటికప్పుడు వ్యాపారవస్తువులు ఒకరి చేతినుండి మరొకరి చేతికి మారి (నగదు బేరమైన పక్షమున) వ్రాత మూలకముగ పత్రముంచుకొనకుండుట దోషము కాదు. కాని మీరొకరి వస్తువుల నొకరు ఒకదాని బదులొకటి మార్చుకొనునప్పుడు సాక్షుల నుంచుకొనుడు. వ్రాయసకానికి గాని, సాక్షులకుగాని ఎట్టి ఆపదయు రానీయకుడు. అట్లుకాక వారికి (హాని) కలిగించినచో తప్పక అది భగవదాజ్ఞోల్లంఘనమే.* అల్లాయెడ శ్రద్ధవహింపుడు. ఎందుకన అల్లా మీకు (ధర్మము) నుపదేశించుచున్నాడు. అతడు సర్వస్వము నెఱిగినవాడు.౨౮౦

* "పాపకృత్యము" అనియు అర్థము చెప్పవచ్చును.

283. ఒకప్పుడు మీరు ప్రయాణములోనుండి, వ్రాయసకాడు లభింపని పక్షమున ఏదేని ఒక వస్తువును కుదువబెట్టి (దానిని ఋణదాత) స్వాధీనము చేయుడు. మీలో ఒకడు మరొకనిని నమ్మి కుదువపెట్టి నచో అతడు తనకడ దాచిపెట్టిన సొత్తును తిరిగి (కుదువపెట్టిన వానికి) ఇచ్చివేయవలెను. తన ప్రభువైన అల్లాః యెడల భయభక్తులు కలిగి యుండవలెను.

సాక్ష్యమును దాచకుడు. ఎవడట్లు (సాక్ష్యమును) దాచునో నిశ్చయముగ వాని హృదయము పాపపంకిలమైనది. మీరు చేయున దంతయు భగవంతు డెఱుగును.

## నలుబదియవ ఖండము

284. భూమ్యాకాశములలోనున్న సమస్తమును భగవంతునిదే యైయున్నది. మీహృదయములలో నున్నది, దానిని మీరు దాచి యుంచినను వెలిబుచ్చినను భగవంతు డెఱుగును. దాని ప్రకారము మీకర్మల నతడు గణించును (మీహృదయములలోని పాపములను లోకము నకుతెలియకుండదాచగలరు. కాని భగవంతునకదంతయు సుస్పష్టమే.) తరువాత తన యిచ్ఛవచ్చినవారిని భగవంతుడు క్షమించును. తన యిచ్ఛవచ్చిన వారికి శిక్ష నిచ్చును. సమస్త వస్తువులపైనను భగవంతునకు సంపూర్ణాధికారము కలదు.

285. భగవత్ప్రవక్త తనకు ప్రోక్తమైన ఈ వచనములను విశ్వసించుచున్నాడు. విశ్వాసవంతులుకూడ అట్లే విశ్వసించుచున్నారు. వారందరు అల్లాఃను, అతని దేవదూతలను, అతని (చే ప్రోక్తమైన) గ్రంథములను, అతని ప్రవక్తలను అట్లే విశ్వసించు చున్నారు. (వారిట్లందురు :) "ఏ ప్రవక్తయెడను మేము భేదభావమును చూపము. (అందరియెడను సమాన గౌరవ విశ్వాసములను చూపుదుము )" మఱియు వారిట్లందురు : "(ప్రభూ ! మేము నీ ఉపదేశములను) వింటిమి. మేము నీకు విధేయుల మగుచున్నాము. నీక్షమార్పణమునే మేము వేడుచున్నాము. ప్రభూ ! నీవే మాకు తుది గమ్యము."

286. ఏ వ్యక్తి పైనను అతనిశక్తికిమించిన భారమును భగవంతుడు వేయడు. ప్రతి ఆత్మయు అది గడించిన ప్రతి సత్కృతి యొక్క ఫలమును అనుభవించును. అట్లే ప్రతి దుష్కృతి ఫలమును కూడ అనుభవించును.

(విశ్వాసవంతు లిట్లు ప్రార్థన సల్పుదురు :)

"ప్రభూ ! మామరుపులకును, మాతప్పిదములకును మమ్ముల శిక్షింపక క్షమింపుము.

ప్రభూ ! మాకు మోయశక్యముకాని భారమును పూర్వము వారిపైవలె మాపై వేయకుము.

ప్రభూ ! బలహీనులమగు మాపై మోయశక్యముకాని భారమును వేయకుము.

ప్రభూ ! మా పాపములను తుడిచివేయుము. మమ్ము క్షమింపుము. మమ్ము కరుణింపుము నీవే మాకు పోషకుడవు. విశ్వాసహీనులకు వ్యతిరేకముగ మాకు సాహాయ్యము చేయుము."

# మూడవ అధ్యాయము

# ఆలె ఇమ్రాన్

లేక

# ఇమ్రాన్ వంశము

بسم الله الرحمن الرحيم

# అధ్యాయము 3

## ఆలె ఇమ్రాన్
## లేక
## ఇమ్రాన్ వంశము

(మదీనాయందు ప్రోక్తమైనది.)

(౨౦౦ సూక్తులు, ౨౦ ఖండములు)

కరుణామయుడును వరప్రదాయకుడును అగు
అల్లాః నామస్మరణముతో (ప్రారంభించుచున్నాను)

1. అలిఫ్ . లామ్ . మీమ్ .

2. అల్లాః తప్ప ఆరాధింపదగిన దేవుడెవ్వడును లేడు. అతడు (ఆదిమధ్యాంతములులేని) నిత్యుడు. స్వయంపూర్ణుడు. (సమస్త సృష్టికి నతడు మూలాధారుడు అతని అస్తిత్వము దేనిపైనను ఆధారపడిలేదు.)

3. అతడే సత్యసంపూర్ణమగు (ఖుర్ ఆన్) గ్రంథమును మీకు ప్రవచించినాడు. (ఈ గ్రంథము) ఇంతకుముందు ప్రవచింపబడిన సత్య గ్రంథములను నిర్ధారించుచు ప్రవచితమైనది. (ఇది వెనుకటిగ్రంథములకు వేరైనదికాదు. అవి అసత్యగ్రంథములని చెప్పునదియు గాదు. నీకంటె పూర్వు లగు) మానవుల ఉపదేశమునకై భగవంతుడు తౌరీతు, ఇంజీల్ గ్రంథములను ప్రవచించెను.— ఆ భగవంతుడే సత్యాసత్యవిచక్షణము చేయు (ఖుర్ ఆన్) గ్రంథమును వెలువరచెను.

4. ఎవరు భగవత్సూక్తులను* నిరాకరించి (అసత్యము ననుస

---

* ఇక్కడ 'ఆయాత్' అను మూలశబ్దమునకు 'చిహ్నములు' అనియు అర్థము చెప్పవచ్చును. ఖుర్ ఆన్ సూక్తులు 'ఆయాత్' అనబడుచున్నవి. 'భగవదుపదేశ వాక్యములు' అనియు దీనికి అర్థము చెప్పవచ్చును.

రింతురో) వారు కఠినశిక్షకు పాత్రులగుదురు. భగవంతుడు మహా మహిమోపేతుడు పాపులను కఠినముగ శిక్షించువాడు.

5. భూమియందుగాని ఆకాశములందుగాని భగవంతుని ఎదుట ఏదియు గుప్తముగ లేదు.

6. మిమ్ములను గర్భకోశములలో తన ఇచ్ఛవచ్చినట్లు రూపములను సవరించువాడతడే. అతడుతప్ప మరేదేవుడును లేడు. అతడు మహామహిమోపేతుడు, ప్రజ్ఞానిధి.

7. భగవంతుడే (ఈ ఖుర్ఆన్) గ్రంథమును ప్రవచించెను. ఇందులో కొన్నిసూక్తులు(శబ్దస్వరూపమునందుగాని, అర్థమునందుగాని చిక్కులు లేని స్పష్టమైన మౌలిక సూక్తులను) మూలసిద్ధాంతములను ప్రతిపాదించునవి. ఇవి ఈగ్రంథముయొక్క పునాదులు♦. రెండవతరగతివి దృష్టాంత రూపకములు — ఎవరి హృదయములలో వక్రతా వైపరీత్యములు కలవో అట్టి వారీదృష్టాంత రూపకమగు (సూక్త) భాగమునే అనుసరింతురు. అందు చిక్కులు కల్పింపగోరి లేని పోని గూఢార్థములను లాగి (క్రింద మీదు చేయుదురు ) ఆ సూక్తుల గూఢార్థములను భగవంతుడు తప్ప మరెవ్వరు నెఱుగరు నిశ్చయజ్ఞానముగల వివేకులగు విద్వాంసులు ఇట్లందురు: "మేము భగవద్గ్రంథమును విశ్వసింతుము. భగవద్గ్రంథము పూర్తిగ భగవంతునిచేతనే ప్రోక్తమైనది." నిశ్చయబుద్ధిగలవారు తప్ప తక్కిన వారీ భగవత్సందేశమును గ్రహింపరు.

8. (నిశ్చయబుద్ధియు శ్రద్ధాభక్తులును కలవారు) ఇట్లందురు: "ప్రభూ! మాకు సన్మార్గమును చూపిన పిదప తిరిగి మాహృదయములను డోలాందోళిత మొనర్పకుము. నీ సాన్నిధ్యమునుండి మాకనుగ్రహమును ప్రసాదింపుము. నీవే పరిమితములేని శ్రేయస్సును కూర్చువాడవు.

♦ 'ఉమ్మున్' అను ఇక్కడి మూలమునకు 'తల్లి' 'మాతృక' అని అర్థము. ఇక్కడ 'ఉమ్ముల్ కితాబ్' అనగా 'గ్రంథమునకు తల్లి' లేక 'గ్రంథమునకు మాతృక' అని అర్థమువచ్చును. అనగా ఈ సూక్తులు మూలసిద్ధాంతములను ప్రతిపాదించునవి. తక్కిన ధర్మము లన్నియు వీటిపైననే ఆధారపడియున్నవి. దీనిపై వ్యాఖ్యానమును చూడుడు.

9. "ప్రభూ! నిశ్చయముగ వచ్చు ఆ తుదిదినమున మానవుల నందరను ఒకే చోట కూడబెట్టువాడవు నీవే. భగవంతు డెన్నడును వాగ్భంగ మొనర్పడు."

రెండవ ఖండము

10. విశ్వాసమును ధిక్కరించు వారికి వారి ఆస్తిపాస్తులుగాని వారి సంతతిగాని భగవంతుని సమక్షమున నేమియు చేయజాలవు. (అట్లు ధిక్కరించు) వారు నరకాగ్ని కింధనములగుదురు.

11. వీరి ప్రవర్తనము ఫిర్ఔను ప్రజలయొక్కయు వారి పూర్వులయొక్కయు ప్రవర్తనమువలె నున్నది. వారు భగవంతుని చిహ్నములను ధిక్కరించిరి. భగవంతుడుకూడ వారి దుష్కర్మల ఫలము వారికి కుడువబెట్టెను. భగవంతుడు కఠినముగ (పాపులను) శిక్షించువాడు.

12. విశ్వాసమును ధిక్కరించువారితో నిట్లుచెప్పుము: "మీరు త్వరలో పరాజయము నొందుదురు. నరకమునందు కూడబెట్టబడుదురు. (నరకవాసుల) నివాస మెంత ఘోరమైనది!"

13. యుద్ధరంగమున కలిసిన ఈ రెండు సైన్యములందు (మీకప్పుడే ధర్మవిజయమున) కొక తార్కాణము గోచరించినది. ఒక సైన్యము భగవన్మార్గమున పోరాడుచుండెను. మరొకటి భగవంతునకు వ్యతిరేకముగ. (బదర్ యుద్ధరంగమున భగవన్మార్గమున పోరాడు) వారు తమకంటె రెండింతల సైన్యమును శత్రుపక్షమున నుండుటను కండ్లార చూచిరి.—భగవంతుడు తన కిష్టులగు వారికి (దైవికశక్తి) నిచ్చి సహాయ మొనర్చును. చూచుటకు కండ్లున్న వారికి దీనియందొక గుణపాఠము కలదు.

14. స్త్రీలు, పుత్రులు, వెండి బంగారముల రాసులు, ఉత్తమ జాతి గుఱ్ఱములు, పశుసంపద, సస్యసంపన్నమగు భూమి— ఇవే ఐహికజీవితముయొక్క సంపదలు కామ్యములగు ఈ వస్తువులయం

దలి మోహమే మానవుని దృష్టిలో ప్రియమైనది. (కాని జ్ఞాపకముంచు కొనుడు) భగవంతుని సమీపమునకు పోవుటే అత్యుత్తమమగు గమ్యము. (అదే మీరు వాంఛింపదగినది)

15. (ఓ ప్రవక్తా! వారితో) ఇట్లు చెప్పుము. "మీకీ ఐహికవస్తువులకంటె ప్రశస్తమైన దేదో చెప్పుదునా? దైవభక్తిపరుల కొఱకు వారి భగవంతునికడ స్వర్గారామములు కలవు. అందు నిర్ఝరులు ప్రవహించుచున్నవి వారందు నిత్యనివాసులై యుందురు అందు వారికి పవిత్రలగు భార్యలు లభింతురు. (అన్నిటికంటె ప్రశస్తమైనదగు) భగవంతుని అనుగ్రహము వారికి కల్గును. (జ్ఞాపకముంచుకొనుడు.) దైవ భక్తిపరులు నిరంతరము భగవంతుని దృష్టిలో నుందురు.

16. (దైవభక్తిపరులగు) వారు ఇట్లందురు: "ప్రభూ! మేము విశ్వాసమార్గమునకు వచ్చితిమి. ఇక మా పాపములను క్షమింపుము. మమ్ములను నరకాగ్నినుండి రక్షింపుము."

17. ఎవరు క్షమాపూర్ణులై, (నిశ్చయదార్ఢ్యమును ఆత్మసంయమనమును కలవారో*) ఎవరు(మనోవాక్కాయకర్మముల)సత్యవంతులో, ఎవరు భక్తిశ్రద్ధలతో ప్రార్థనము సల్పుదురో, ఎవరు (భగవన్మార్గమున) వ్యయపరతురో, ప్రభాతవేళలందు క్షమార్పణమునకై (భగవంతుని) ప్రార్థింతురో (వారే దైవభక్తిపరులు)

18. అల్లాః ఒక్కడే ఆరాధ్యుడు; మఱెవ్వరును ఆరాధ్యులు కాజాలరు. దీనికి భగవంతుడే సాక్షి. అట్లే దేవదూతలును, నిశ్చయజ్ఞానము కలవారును (దీనికి సాక్షులు) భగవంతుడు న్యాయమును పాలించువాడు. అల్లాః తప్ప మఱెవ్వరును ఆరాధ్యులు లేరు. అతడు సర్వశక్తిమంతుడు; సర్వజ్ఞుడు.

19. నిశ్చయముగ భగవంతునికడ నిజమైనమతము ఇస్లామ్. -- (యూదులు క్రైస్తవులు మున్నగు) జ్ఞానగ్రంథము నెఱిగిన వారు తమకు

* 'సాబిరీన్' అను మూలశబ్దమునకు "క్షమ, నిశ్చయదార్ఢ్యము, ఆత్మసంయమనము కలవారు" అని అర్థము.

విజ్ఞానము కల్గిన తర్వాతకూడ ఆ సత్యమును స్వీకరించకపోవుటకు కారణము వారి పరస్పర మాత్సర్యమే. భగవత్ప్రవచితమగు ఈ సందేశమును† ఎవరు విశ్వసింపరో వారిని భగవంతుడు సత్వరముగ శిక్షించును.

20. మరి వీరు నీతో వివాదమునకు దిగినయెడల (ఓ ప్రవక్తా! వారితో) ఇట్లనుము :

"నా ఆత్మ సర్వస్వమును నేను భగవంతున కర్పించితిని. నన్ననుసరించు వారందరును అట్లే అర్పించిరి"

జ్ఞానగ్రంథముల ననుసరించువారితోడను, విద్యావిహీనుల తోడను ఇట్లనుము : "మీరు కూడ నావలెనే వినతులగుదురా ?"

వారట్లు వినతులగుచో వారు సన్మార్గమున నున్నవారు; అట్లుకాక వారు వ్యతిరేకించినచో నీ విధ్యుక్తము ఈ సందేశమును బోధించుట మాత్రమే దైవభక్తిపరు లెప్పుడును భగవంతుని దృష్టియందే ఉందురు.

## మూడవ ఖండము

21. ఎవరు భగవత్సందేశమును నిరాకరించి, అన్యాయముగ ప్రవక్తలను చంపి, న్యాయముగను ధర్మముగను ప్రవర్తింపు డని ప్రబోధించువారిని వధించి (దుర్మార్గులై ప్రవర్తింతురో) వారికి అత్యంతమగు కఠినశిక్ష కలుగునని తెలియజెప్పుము.

22. ఇట్టివారేమిచేసినను ఇహమునను పరమునను కూడ వమ్మే యగును. వారి కెవ్వడును సహాయముచేయరాడు.

23. (ఓ ప్రవక్తా!) భగవద్గ్రంథముయొక్క ఒక భాగము మాత్రమే ప్రసాదింపబడిన వారిస్థితిని గమనించితివా ?* సత్య

† 'భగవచ్చిహ్నములను' అని కూడ అర్థము చెప్పవచ్చును

* మూసాప్రవక్త కివ్వబడిన 'తౌరీతు' గ్రంథమును, ఈసాప్రవక్తకు ప్రవచితమైన 'ఇంజీల్' గ్రంథమును పర్వసంపూర్ణమగు ధర్మగ్రంథములు కావు. అవి ఆయా కాలములకును జాతులకును గల అవసరములకు అనుగుణముగా ప్రోక్తమైనవి.

గ్రంధము వారి సంశయములు తీర్చి సత్యాసత్యవిచక్షణము చేయు ననియు, దానిని స్వీకరించుడనియు వారాహ్వానింపబడిరి. కాని వారిలో కొందరు విముఖులైరి. (భగవద్గ్రంథమును) నిరాకరించిరి.

24. వా రిట్లు నిరాకరించుటకు కారణమేమనగా (వారి విశ్వాస మిది. అది వారి మాటలవలన తెలియును.) వారిట్లందురు: "మమ్ములను నరకాగ్ని అంటదు. (ఒకసారి అంటినను) అది యొక పరిమిత కాలము నకే. (కాని శాశ్వతము కాదు)" స్వకపోల కల్పితమగు వారిగ్రంథమే మతవిషయమున వారినిట్లు మోసగించుచున్నది.†

25. కాని నిశ్చయముగవచ్చు ఆ దినమున వారి నందరిని ఒకచో కూడబెట్టినప్పుడు వారేమిచేయుదురు? నా డెవరుచేసిన కర్మముల ఫలము వారి కివ్వబడును. ఎవ్వరికిని అన్యాయము జరుగదు. (దుష్కృతులకు శిక్షయు, సత్కృతులకు బహుమానమును సరిగా ఇవ్వ బడును. అంతేకాని జాతి కుల మత వంశపక్షపాతముగాని అభిమానముగాని చూపబడదు.)

26. (ఓ ప్రవకా!) ఇట్లనుము: "సమస్త శక్తులకును సమస్తాధి కారములకును ప్రభుడవగు ఈశ్వరా! నీకు ప్రియులైనవారికి శక్తిని అధికారము నిత్తువు. నీ కిష్టులుకానివారిని అధికారమునుండి తొలగింతువు. నీకు ప్రియులైనవారికి గౌరవమును ప్రసాదింతువు, నీ కిష్టులుకానివారిని హీనాతిహీనమగు దశకు తెత్తువు. సర్వశ్రేయ శ్శుభములును నీ హస్తగతములు. సమస్త వస్తువులపైనను నీకు శక్తికలదు.

27. "రాత్రిని పగటి యందును, పగటిని రాత్రి యందును చొనుపువాడవు నీవే. మృత (పదార్థము) నుండి జీవము నుత్పన్నము చేయువాడవు నీవే. జీవులను మృతులను చేయువాడవు నీవే. నీకిష్టులైన వారికి పరిమితములేని ధనధాన్యసంపదల నొసగువాడవు నీవే."

† వారు తమ అసలుగ్రంథమందు స్వకపోల కల్పితములను చేర్చిరి. అవే వారిని సందేహములందును వివాదములందును పడవేసెను.

28. విశ్వాసవంతులు (సోదరసమానులగు తమతోడి) విశ్వాసవంతులనువిడిచి విశ్వాసహీనులను సహాయులుగను స్నేహితులుగను స్వీకరింపదగదు.—— మీరట్లు (విశ్వాసహీనులను) సహాయులుగ గైకొనుచో భగవత్సహాయమెద్దియు మీకు కలుగదు. మీరు వారి దౌర్జన్యమునుండి తప్పించుకొనుటకు ఆత్మసంరక్షణమునకై (వారితో సఖ్యము చేసుకొనిన చేసికొనుడు) భగవంతుడు కూడ (తన ఆజ్ఞల నుల్లంఘించుటవలన కలుగు దుష్ఫలితములనుండి) భయపెట్టుచున్నాడు (అని మరువకుడు.) తుదకు భగవంతునికడకే (అందఱును) మరలవలసియున్నది.

29. (ఓ ప్రవక్తా ! వారితో ఇట్లు) చెప్పుము : మీహృదయములలో నున్నది మీరు వెలిబుచ్చినను దాచియుంచినను భగవంతుడంతయు నెఱుగును. ఆకాశములందును భూమియందును గల సమస్తము నతడెఱుగును. భగవంతునకు సర్వవస్తువులపైనను అధికారము కలదు.

30. ప్రతిజీవికిని అతడొనర్చిన సమస్తసత్కృతులును, సమస్త దుష్కృతులును అతని ముందు ప్రత్యక్షమగు ఆ దినమునుండి తానెంతయో దూరముగ నుండగోరును. భగవంతుడు (తన ఆజ్ఞల నుల్లంఘించుటవలన కలుగు దుష్ఫలితములనుండి) భయపెట్టు చున్నాడు. (ఈభయపెట్టుటయు మీయందనుగ్రహముచేతనే ఎందుకన) తన భక్తులయెడ భగవంతుడు సంపూర్ణానుగ్రహము గలవాడు.

## నాలుగవ ఖండము

31. (ఓ ప్రవక్తా ! వారితో) నిట్లనుము : "మీరు భగవంతుని ప్రేమించుచో నన్ననుసరింపుడు. భగవంతుడు మిమ్ములను ప్రేమించి మీపాపములను క్షమించును. భగవంతుడు మహాక్షమి. కరుణానిధి.

32. (ఓ ప్రవక్తా !) వారితో నిట్లనుము : "భగవంతునకును అతని ప్రవక్తకును విధేయులు కండు." అట్లుచేయక వారు ధిక్కరించి విముఖులైనచో (జ్ఞాపకముంచుకొనుడు) అట్టివారిని భగవంతుడు ప్రేమింపడు.

33. భగవంతుడు ఆదమునకును, నోహాకును, ఇబ్రాహీము వంశమునకును, ఇమ్రాను వంశమునకును ప్రపంచమంతటియందును ఔత్కృష్ట్యమును ప్రసాదించెను.

34 ఒకరినుండి ఒకరు ఉద్భవమైన వీరందరును ఒకే జాతికి చెందినవారు. భగవంతుడు సర్వ(ప్రార్థనముల)ను వినువాడు; సర్వము తెలిసినవాడు.

35. ఇమ్రాన్ భార్య* ఇట్లు ప్రార్థించెను: "ప్రభూ! నా గర్భముననున్న శిశువును (సంసారబాధ్యతలనుండి) స్వేచ్ఛనొసగి నీ ప్రత్యేక సేవకై అర్పణము చేయుచున్నాను. నాకై దీనిని స్వీకరింపుము. నీవు సమస్తమును వినువాడవు. సర్వజ్ఞుడవు.

36. ఆమె ప్రసవమైన పిదప ఇట్లు విన్నవించెను: "ప్రభూ! నేను స్త్రీ శిశువును కంటిని. (ఇక నేనేమిచేయుదును.)" పుట్టినదానిని గురించి భగవంతుడు బాగుగ నెఱుగును. (శిశువు స్త్రీయైనప్పటికిని మహిమాఢ్య కాగలదైయుండెను కాని ఆమెతల్లి పురుషశిశువును భగవంతునకు కైంకర్యము చేయగోరియుండగా స్త్రీశిశువు జన్మించెనే యని వాపోయెను) (నేను వాంఛించిన) కుమారుడు ఈ కుమార్తెవంటివాడు కాడు. (ఐనను) నేనీ శిశువునకు 'మరియమ్' అని పేరుపెట్టి, ఈమెను ఈమె సంతతిని నీ సంరక్షణక్రింద కైంకర్యము చేయుచున్నాను. ధిక్కృతుడగు సైతానునుండి వీరు నీచే రక్షింపబడుదురుగాక!

37. ఆమె ప్రభువు ఆ శిశువును తన కృపాసంపూర్ణతతో స్వీకరించెను. ఆమె బాగుగా ప్రవర్ధమాన యయ్యెను జకరియా రక్షణక్రింద కామె ఇవ్వబడెను. అతడు ఆమెను చూచుటకై ఆమె (దైవధ్యాననిమగ్నయైయుండు) గదిని ఎప్పుడు ప్రవేశించినను ఆమెకై ఆహారము సిద్ధముగనుండుటను చూచుచుండెను. ఆమెను అతడిట్లడిగెను: "మరియమ్! ఈ ఆహారము నీ కెక్కడనుండి వచ్చుచుండును?"

* "ఇమ్రాన్ వంశపుస్త్రీ" అనియు అర్థము చెప్పవచ్చును.

ఆమె దాని కిట్లనెను : "ప్రభువు కడనుండి. ఎందుకన తనకిష్టులైన వారికి భగవంతుడు పరిమితములేని ఆహారము నిచ్చును"

38. అక్కడ జకరియా భగవంతునిట్లు ప్రార్థించెను : "ప్రభూ! (మరియమ్‌వంటి) పవిత్రమగు సంతతిని నాకు ప్రసాదింపుము. నీవు మా మొరల నాలించువాడవు."

39. అతడిట్లు ఆగదియందు నిలువబడి ప్రార్థించుచుండగా దేవదూత లతని నిట్లు సంబోధించిరి : "నీకు యహాయా అను సుపుత్రుడు కాగలడని భగవంతుడు శుభవార్తను పంపుచున్నాడు. అతడు భగవద్వాక్కు* (సత్యము) ను నిరూపించును. అతడు నాయకుడును, జితేంద్రియుడును, పవిత్రచరిత్రులలో ఒక ప్రవక్తయునైయుండును

40. (దానికి జకరియా) ఇట్లనెను : "ప్రభూ ! నేను వృద్ధుడను, నా భార్య వంధ్య : నాకు కుమారుడెట్లు కల్గును?"

దానికి భగవంతుడిట్లు సెలవిచ్చెను : "ఇట్లే భగవంతుడు తన ఇచ్ఛవచ్చినట్లుచేయును."

41. దానికి జకరియా ఇట్లు విన్నవించెను : "ప్రభూ ! ఈవిషయమున నాకేదైన ఒక చిహ్నమును ప్రసాదింపుము."

దానికి భగవంతు డిట్లు సెలవిచ్చెను : "నీవు మూడుదినముల వరకు మౌనవ్రతమూనుము. (అవసరమైనచో) సంజ్ఞలు మాత్రము చేయుచుండుము. భగవన్నామస్మరణమునందు మగ్నుడవై యుండుము. ప్రాతస్సంధ్యలయందు భగవంతుని మహత్తును కొనియాడుచుండుము."

## ఐదవ ఖండము

42. మరియమ్‌తో దేవదూత లిట్లనిరి : "ఓ మరియమ్ నిన్ను భగవంతుడు ఎన్నుకొని, పావిత్ర్యము నొసగి, ప్రపంచము నందలి స్త్రీలలో ఔత్కృష్ట్యతను ప్రసాదించెను.

* 'ఈశా ప్రవక్త' అనియు దీని అర్థమును కొందరు వ్రాసిరి.

43. "ఓ మరియమ్! ఇతర భక్తులతో నీవును భగవంతునకు సాష్టాంగపడుము. వినయ వినమితవగుము. ఇతర భక్తులతో పాటు శ్రద్ధాభక్తులతో భగవద్ధ్యానమున మగ్నవై యుండుము.

44. (ఓ ప్రవక్తా!) నీకీ ప్రవచనముద్వారా వెలువరచుచున్న ఈ విషయములు గుప్తమైనవి. (ఏసుప్రవక్త తల్లి మరియమును తీసుకొని ప్రార్థనాలయమునకు వెళ్లినప్పుడు అక్కడి పురోహితులు) మరియమ్ ఎవరి వంతుకు రావలెనో పరిష్కరించుటకు బాణములతో చీట్లువైచినపుడు నీవక్కడ లేవుకదా? తర్వాత వారు (మరియమునకు రక్షకులగు విషయములో) పరస్పరము వివాదపడినప్పుడుకూడ నీవక్కడ లేవు.

45. దేవదూతలు (మరియముతో) ఇట్లనిరి: "ఓ మరియమ్! (నీకొక కుమారుడు కల్గునని) భగవంతుడు తన మహాద్వాక్కుద్వారా శుభవార్తను పంపుచున్నాడు. మరియమ్ కుమారుడైన 'ఈసామసీః' అని అతడు పిలువబడును. అతని కిహపర లోకములందుకూడ గౌరవ స్థానము లభించును. భగవత్సాన్నిధ్యభాగ్యము గన్నవారిలో నతడొకడై యుండును.

46. అతడు బాల్యమునను, పెద్దవయస్సునను (నడివయస్సునను) ప్రజలతో మాట్లాడును (ప్రబోధించును) అతడు పుణ్యులలో నొకడై యుండును.

47. అప్పుడు (మరియమ్) ఇట్లు విన్నవించెను: "నా ప్రభూ! నన్నే పురుషుడు నింతవరకు స్పృశింపలేదు, నాకు పుత్రుడెట్లు కల్గును?"

(దానికి భగవంతుడు) ఇట్లనెను: "భగవంతుడిచ్ఛించినచో అట్లే సృష్టించును. అతడేదైనను చేయగోరినప్పుడు (కేవలము) 'అగుము' అని (మాత్రము) చెప్పును. అది (తత్ప్రకారము) వెంటనే అగుచున్నది.

48. (దేవదూతలు మరియు నిట్లనిరి) 'భగవంతుడు అతనికి (నీ కుమారునకు) భగవద్గ్రంథమును ప్రసాదించును; విజ్ఞానమును (ప్రసాదించును) తౌరీత్ ఇన్‌జీల్ గ్రంథవిజ్ఞానమును గఱపును.'

49. ఇస్రాయీలీయుల కొఱకై అతనిని ప్రవక్తగ నియమించును. (అత డీసందేశము నిచ్చును:)

"భగవచ్చిహ్నముల గొని నేను మీ భగవంతునికడనుండి వచ్చితిని. మీకొఱకు నేను పక్షి యాకృతిగల ఒక మట్టిబొమ్మను తయారుచేసి దానిని ప్రోక్షింతును అది భగవదాజ్ఞచే పక్షియైపోగలదు. మఱియు భగవదాజ్ఞచే అంధులకు దృష్టిని, కుష్ఠురోగుల కారోగ్యమును కలుగజేతును. మృతులకు భగవదాజ్ఞచే జీవచైతన్యము నొసగుదును మీ రేమి తినునదియు, మీయిండ్లలో నేది భద్రపరచుకొని యుంచుకొన్నదియు మీకు చెప్పగలను. మీరు విశ్వసించుచో ఈమహాత్మ్యములందు భగవచ్చిహ్నము కలదు.

50. "నాకు ముందువచ్చిన తౌరీతు గ్రంథమును నిర్ధారించుటకై (నేను వచ్చితిని) మీకై నిషేధింపబడిన కొన్నివస్తువులను విధివిహితము లొనర్చుటకు వచ్చితిని. నేను మీభగవంతుని చిహ్నమును గైకొని మీకడకు వచ్చితిని. భగవంతునకు భయపడుడు, నన్ననుసరింపుడు.

51. భగవంతుడే మీకును నాకును ప్రభువు, పరిపోషకుడు. భగవంతునే ఆరాధింపుడు. అదియే (భగవంతుని) ఋజుమార్గము."

52. వారిలో అవిశ్వాసమును గాంచి ఈసా వారి నుద్దేశించి ఇట్లనెను : "నాకీ భగవత్కార్యమున సహాయపడగల్గువా రెవ్వరు ?" ఆయన అనుయాయులగు కొందరిట్లనిరి : "మేము భగవంతుని (కార్యమున)సాహాయ్యులమై యుండగలవారము. మేము భగవంతునియందు విశ్వసింతుము. నీసాక్షిగా మేము భగవంతునకు సర్వమును అర్పించినవారమగుచున్నాము*.

53. "మాప్రభూ ! నీవు వెలువరచిన సత్యమును మేము విశ్వసించుచున్నాము. మేము నీప్రవక్త (యగు ఏసు) ననుసరింతుము. మమ్మకూడ సత్యమును ధృవపరచువారిలో గణింపుము."

* 'ముస్లిమూన్' 'ముస్లిములు' అని అరబీమూలము.

54. కాని (విశ్వాసహీనులగు యూదులు ఏసుకు వ్యతిరేకముగ) కుట్రలు పన్నిరి. భగవంతుడుకూడ రహస్యోపాయములకు తగు ప్రతీకార మొనర్చెను. ఉపాయశాలులలో భగవంతుడే ఘనుడు.

## ఆరవ ఖండము

55. (ఏసు శత్రువులకు పట్టుబడి ఆందోళిత మనస్కుడై యుండి నప్పుడు) భగవంతు డిట్లు సెలవిచ్చెను.“ఓ ఈసా!* నీవు (సహజముగనే) మరణించునట్లు చేయుదును. (నీ శత్రువులచే జిక్కి నీవు బలవన్మరణము నొందకుండ చేయుదును ) (అంతేకాదు) నాసమక్షమున నీకుచ్చస్థితిని ప్రసాదింతును; నీశత్రువుల అపవాదములనుండి నిన్ను పరిశుద్ధు నొనర్తును. నిన్ననుసరించినవారికి నీశత్రువులపై ప్రళయకాలమువరకు ఆధిక్యము నిత్తును. అప్పుడు మీరందరును నాసమక్షమునకే మరలి వత్తురు. మీరు పరస్పరము వివాదపడుచున్న విషయములను ఆనాడు నేను పరిష్కరింతును.౮౩

56. “ఎవరు విశ్వాసమార్గమును నిరాకరింతురో వారిని ఇహమునను పరమునను కూడ కఠినముగ శిక్షింతును. వారి కెవ్వరును సహాయము చేయరారు.”

57. “ఎవరు విశ్వాసమార్గమునను౦డి సత్కృతుల నొనర్తురో వారిని భగవంతుడు పూర్తిగబహూకరించును. దుర్మార్గులను భగవంతుడు ప్రేమింపడు.”

58. (ఓ ప్రవక్తా!) నీకు వినిపించుచున్న దిదంతయు విజ్ఞానసందేశము; భగవత్ప్రోక్తము.

59. భగవంతునికడ ఈసాకు తార్కాణము ఆదమ్. (భగవంతుడు) ఆదమును మట్టితో సృష్టించి “అగుము” అని మాత్రమనెను. అంతట నతడాయెను.౮౪

---

* ‘ఏసు’ లేక ‘జీసస్ క్రైస్టు’ అను నామము అరబీలో ‘ఈసా’ అని వ్రాయబడును. తెలుగులో యెక్కువగ ‘ఏసు’ అనియు ‘ఏసుక్రీస్తు’ యనియు మనము వాడుచున్నాము.

60. సత్యము భగవంతునికడనుండియే వచ్చును. అందుచే సంశయాత్ములలో నొకడవు కాకుము.

61. ఇట్లు సంపూర్ణ విజ్ఞానము మీకు లభించిన పిదప కూడ ఎవ్వరైనను మీతో (ఏసు మానవమాత్రుడను) ఈ విషయమున వివాద పడినచో వారితో నిట్లనుము: (ఏసు మానవుడే ననుటకు నాకు నిస్సందేహ మగు నిశ్చయజ్ఞానము కలదు మీరుకూడ అతడు భగవంతుడను నిశ్చయవిశ్వా సము కలవారైనచో) రండు; (ఇట్లు మన వివాదమును పరిష్కరింతము) మా పుత్రులు, మీపుత్రులు, మాస్త్రీలు, మీస్త్రీలు, మేము, మీరు ఇట్లు మనమందరము (ఒక మైదానమున) సమావేశమగుదము. అట్లు కూడి భగవంతుని సమక్షమున 'అనృతవాదులు శాపహతులగుదురు గాక !' యని ప్రార్థింతము."ఇ

62. ఓ ప్రవక్తా! ఈ చెప్పబడినదంతయు నిస్సంశయముగ సత్యకథనము. అల్లాః తప్ప ఆరాధ్యుడగు భగవంతుడు మరొకడు లేడు. భగవంతుడు అందరికంటె నధికుడు. ప్రజ్ఞానిధి.

63. (వీరు పరిష్కారమునకీ పద్ధతి నంగీకరింపక) వెనుదీయుచో భగవంతుడు నిశ్చయముగ తగవులమారులను బాగుగ నెఱుగును (అని వారితో చెప్పుము)

## ఏడవ ఖండము

64. (ఓ ప్రవక్తా! వారితో నిట్లు) చెప్పుము: "భగవద్గ్రంథము లివ్వబడిన ప్రజలారా! (ఓ క్రైస్తవులారా! యూదులారా!) (వ్యర్థవాదము లను మానుడు) మీకును మాకును సాదృశ్యముగలట్టి(యు) (మీరును మేమును అంగీకరించినట్టివియు నగు మూలసిద్ధాంతముల) వైపునకు రండు: (అవి) భగవంతునితప్ప మరెవ్వరిని ఆరాధింపము, (భగవంతునకు) సమానులను కల్పింపము. మాలో కొందరియెడ (భగవదర్హమగు) భక్తి ప్రపత్తులతో ప్రవర్తించుచు భగవంతుని విడిచి వారిని పోషకులు గను ప్రభువులుగను భావింపము" (ఈ మూలసిద్ధాంతములను సైతము నిరాకరించి) వీరు మొగము త్రిప్పుకొనినచో వారితో నిట్లు చెప్పుము;

"మీరే సాక్షులై యుండుడు. (సత్యము నిరాకరించినవారు మీరు,) భగవంతునకుమాత్రమే లొంగినవారము మేము." (స్వీయమనఃకల్పితులగు తుచ్ఛదేవతలకును, తోడి మానవులకును, వారెంతటి మహాత్ములైనను శిరస్సును వంచము.)[31]

65. భగవద్గ్రంథమును పొందిన (ఓ క్రైస్తవ యూదులారా!) ఇబ్రాహీము (యూదుల మతస్థుడనియు, కాదు, క్రైస్తవ మతస్థుడనియు) ఆయనను గురించి మీరేల వివాద పడెదరు? యూద క్రైస్తవ మతముల మూలగ్రంథములగు ఇన్జీల్ (బైబిల్) తౌరీత్ (తోరా) గ్రంథము లప్పటికి వెలువడనే లేదుకదా? అవి (ఇబ్రాహీమ్ ప్రవక్త) తర్వాత (ఎంతోకాలమునకు) కదా వెలువడినవి? (మీమతములే అప్పుడు లేనప్పుడు ఇబ్రాహీము ప్రవక్త మీ రెండు మతములందేదో ఒకమతము ననుసరించినవా డెట్లు కాగలడు?) మీరు (ఈపాటి) గ్రహింపజాలరా?

66 మీకు కొద్దియో గొప్పయో తెలిసియున్న విషయము లనుగూర్చి సైతము మీరు వివాదపడువారు అట్టిచో మీకేమియు తెలియని విషయములనుగురించి మీరేల వివాదపడుదురు? సర్వము నెఱుగువాడు భగవంతుడు. మీరేమియు నెఱుగనివారు.

67. ఇబ్రాహీము యూదుడును కాడు, క్రైస్తవుడును కాడు. అతడు సత్యమార్గప్రవర్తకుడు; ముస్లిమ్ (భగవదిచ్ఛకు శిరస్సును వంచిన వాడు): అతడు బహుదైవతారాధకుడు కాడు.[32]

68. (జ్ఞాపకముంచుకొనుడు) మానవులలో ఎవరు ఇబ్రాహీమ్ మార్గము ననుసరింతురో వారే నిస్సందేహముగ నతనికి సన్నిహితులు. ఇబ్రాహీమ్ భగవత్ప్రవక్త, అతని మార్గానుయాయులు విశ్వాసవంతులు. నిశ్చయముగ విశ్వాసవంతులను భగవంతుడు రక్షించును.

69 భగవద్గ్రంథమును పొందిన (క్రైస్తవయూదులలో) కొందరు మిమ్ములను సత్యమార్గమునుండి తప్పింపగోరుదురు. కాని (వారు మిమ్ము లను చెడగొట్టగోరి) తామే పతితులగుదురు. కాని వారు గ్రహింపరు

70. భగవద్గ్రంథమును పొందిన (ఓ క్రైస్తవయూదులారా!) మీ సాక్షులైయున్న ఈ భగవచ్చిహ్నములనే మీరేల నిరాకరింతురు ?

71. భగవద్గ్రంథమును పొందిన (ఓ క్రైస్తవయూదులారా!) తెలిసియుండియు మీరు సత్యమును అసత్యముతో కప్పి సత్యము నేల ప్రచ్ఛన్న మొనర్తురు ?

## ఎనిమిదవ ఖండము

72. (చూడుడు) భగవద్గ్రంథ మివ్వబడిన వారిలో (క్రైస్తవ యూదులలో) ఒక పక్షమువారు (తమ అనుయాయులతో) ఇట్లందురు: "(ముసల్మానులను మోసగించుటకై) (మీరిట్లుచేయుడు) ఉదయమున వారి భగవద్గ్రంథముయెడ విశ్వాసము చూపి సాయంకాలమున దానిని నిరాకరింపుడు. (మీరు ఇస్లామును నిరాకరించుటను చూచి ఇస్లామును విడిచి ముసల్మాను లగు) వారుకూడ మరలి పోవచ్చును."

73. (తమ యనుయాయులతో మరియు వారిట్లందురు) "వారు మీ మతము ననుసరించు వరకు వారిని నమ్మకుడు."

(ఓ ప్రవక్తా! వారితో నిట్లు) చెప్పుము: "నిజమైన సన్మార్గము భగవత్ప్రతిపాదితమగు మార్గము."

(వారు తమ యనుయాయులతో నిట్లనుచున్నారు:) "మీకు ప్రోక్తమైన ధర్మమువంటి ధర్మము మరెవ్వరికిని ప్రోక్తమైనదని మీ రొప్పుకొనకుడు మీకు వ్యతిరేకముగ భగవంతుని సమక్షమున ఎవ్వ రేది చెప్పినను చెల్లునని ఒప్పుకొనకుడు."

(ఓ ప్రవక్తా! వారితో నిట్లు) చెప్పుము: (మీరీ దంబములేల పల్కెదరు?) సమస్త అనుగ్రహములను ప్రసాదించువాడు భగవంతుడు (కదా!) తన ఇచ్ఛవచ్చిన వారి నత డనుగ్రహించును. భగవంతుడు అందరియెడలను జాగ్రత్తవహించువాడు. (తన అనుగ్రహమునకు ఎవరు పాత్రులో, ఎవరనర్హులో అతడే నిర్ణయించును.)

74. అతడు సమస్తము నెఱిగినవాడు. తన మహాదనుగ్రహ మును కురిపించుటకై తన ఇచ్ఛవచ్చినవారి నతడెన్నుకొనుచున్నాడు భగవంతుని అనుగ్రహము మహామహిమోపేతము.

75. భగవద్గ్రంథమును పొందిన (క్రైస్తవయూదులలో) కొందరు (న్యాయబుద్ధి కలవారున్నారు) వారికడ మీరు వెండి బంగారు రాసులను సైతము భద్రపరుపపెట్టినచో మీకవసరము వచ్చినప్పుడు వారిచ్చివైతురు. వారిలో మరికొందరికడ మీరొక్క దీనారము దాచిపెట్టి కొన్నను గొంతుపై నిలబడినగాని వారు మీకు తిరిగి ఇవ్వరు.

(వీరీ దుర్వ్యాపారము) ఎందుకు చేయుదురనగా "విశ్వాసహీనులతో వ్యవహరించు నప్పుడు ధర్మయుతముగ ప్రవర్తించుట మాకు విధివిహితము కాదు." అని వారందురు. కాని వారు భగవంతుని యెడ అపవాదు కల్పించి అబద్ధము చెప్పుచున్నారు. నిజమేదియో వారికి తెలియక పోలేదు.

76. ఎవరు తమ వాగ్దానములను తప్పక పూర్తిచేతురో ఎవరు సత్ప్రవర్తకులో (అట్టివారేజాతికి ఏమతమునకు చెందినవారైనను సరే వారిని భగవంతుడు ప్రేమించును) సత్ప్రవర్తకులనే భగవంతుడు ప్రేమించును.

77. ఎవరు భగవంతునియెడ గల విశ్వాసమును, తమ వాగ్దానమును అతిస్వల్పమూల్యమునకైనను అమ్మివైతురో వారికి పరలోక (సౌఖ్యములందెట్టి) భాగమును లభింపదు. తుదిదినమున భగవంతుడు వారితో సంభాషింపడు; వారిని (దయాదృష్టితో) చూడడు, వారి (పాపములను తుడిచివైచి) పరిశుద్ధుల నొనర్పడు. వారికి ఘోరశిక్ష కలుగును.

78. క్రైస్తవయూదులలో (వారి పండితులు) కొందరు కలరు వారు భగవద్గ్రంథమును చదువుచు దానిలో ప్రక్షిప్తములను కల్పించి అర్థమును తారుమారొనర్తురు వారు చదువుచున్నది) భగవద్గ్రంథ మందలి

ఒక భాగమనియే మీకు భ్రమ కల్గునట్లు చేతురు కాని అది భగవ ద్గ్రంథమందలి భాగము కాదు. వారిట్లందురు : "ఇదంతయు భగవత్ప్రోక్తము." కాని అది భగవత్ప్రోక్త మెంతమాత్రమును కాదు. వారు భగవంతునిగూర్చి అబద్ధములు చెప్పుచున్నారు. వారబ ద్ధము చెప్పుచున్నదియు వారికి తెలియును.౭౮

79. (మానవబోధకై) భగవంతు డొకమానవునకు భగవద్గ్రంథ మును, అధికారమును, ప్రవక్తృత్వమును ప్రసాదించినప్పుడా మాన వుడు ప్రజలతో "భగవంతుని విడిచి నన్ను పూజింపుడు" అని చెప్పుట సాధ్యముకాదు తద్వ్యతిరేకముగ (అతడిట్లనును) "నిజమైన సర్వసం పోషకుడగు భగవంతునే మీరారాధింపుడు. ఎందుకనగా మీరే భగవద్గ్రంథమును బోధించుచున్నారు. దాని పఠనపారములయందు నిమగ్నులై యున్నారు."౭౯

80. (ప్రవక్తయైనవాడు) ఎవడును దేవతలను, ప్రవక్తలను దైవ తములుగ భావించుడని ఆజ్ఞాపింపడు. ఏమి! మీరు విశ్వాసులైన (భగవదాజ్ఞలకు శిరస్సులను వంచిన) పిదప మిమ్ములనతడవిశ్వాసమార్గ మున నడపించునా!

## తొమ్మిదవ ఖండము

81. చూడుడు! భగవంతుడు (ఇస్రాయీలీయుల కడనుండి) ప్రవ క్తలనుగూర్చి♦ ఇట్టి ఒడంబడిక గైకొనెను :

"మీకొక గ్రంథమును, విజ్ఞానమును ప్రసాదింతును. తర్వాత మీదగ్గరనున్నదానిని స్థిరపరచుచు మీకడకొక ప్రవక్త వచ్చును. మీరతనియందు విశ్వసించి అతనికి చేయూతనొసగుడు."

(తర్వాత) భగవంతు డిట్లు సెలవిచ్చెను : "మీరు దీని కంగీక రించి ఈ ఒడంబడికకు బద్ధులై యుందురా ?"

వారంద రిట్లనిరి : "మే మొప్పుకొంటిమి."

---

♦ "ప్రవక్తలద్వారా" అనియు అర్థము చెప్పవచ్చును.

అప్పుడు భగవంతు డిట్లు సెలవిచ్చెను : "అట్లైనచో మీరు సాక్షులై యుండుడు. నేను కూడ మీతో సాక్షినై యుందును."

82. దీని తరువాత కూడ ఎవరైనను సత్యమార్గమును నిరాకరించినచో వారు బుద్ధిహీనులగు దుర్మార్గులు.

83. భగవంతుని మతమును విడిచి వీరు వేరొక మతమును వెతకగోరెదరా? వాస్తవమునకు భూమ్యాకాశములందలి సమస్త జీవులును ఇష్టమున్నను, ఇష్టము లేకపోయినను భగవంతుని నియమములకు లొంగియున్నవి కదా? తుదకు అందరును భగవంతుని సమక్షమునకు మరలవలసియే యున్నది.

84. (ఓ ప్రవక్తా! వారితో నిట్లు) చెప్పుము : "మేము భగవంతుని యందును, మాకు ప్రోక్తమైన ఈసత్యమునందును, ఇబ్రాహీమ్, ఇస్మాయీల్, ఇస్హాక్, యాకూబు, యాకూబ్ సంతతియందలి (ప్రవక్తల) యందును; మూసాకును, ఈసాకును, భగవంతుడంపిన ఇతరప్రవక్తలకును ఈయబడిన దాని (గ్రంథముల) యందును విశ్వసింతుము. వారిని భేదభావముతో చూడక (సమానగౌరవదృష్టితో చూచెదము.) (ఒకరిని గౌరవించి మరొకరిని ధిక్కరింపము ) మేము భగవంతునకే వినతుల మగుదుము.

85. (ఎవరు, ఎప్పుడు, ఎక్కడ చెప్పినను సత్యమైనంతనే దానిని స్వీకరించి. తత్ప్రవక్తను గౌరవింప బోధించు) ఇస్లాం మతమును ఎవడు విడనాడగోరి మరొక మతమును వాంఛించునో అట్టివాని మతమును భగవంతుడు స్వీకరింపడు అట్టివారు తుదిదినమున సమస్తపారలౌకికఫలమును కోల్పోయినవారిలో నుందురు.

86. ఒకసారి విశ్వాసమార్గము ననుసరించి, ప్రవక్త సత్యప్రవక్తయేయని అతనికి వచ్చిన స్పష్టచిహ్నములను (కన్నులార) చూచి, సాక్ష్యమిచ్చి, విశ్వాసమును విడనాడువారికి భగవంతు డెట్లు మార్గదర్శి కాగలడు? అధర్మప్రవర్తకులకు భగవంతుడు మార్గదర్శిత్వ మొనర్పడు. (అది భగవంతుని నియమము.)

87. వారు భగవంతునిచేతను, దేవదూతలచేతను, సమస్త మానవకోటిచేతను శపితులగుదురుగాక! అట్టివారికదే బహుమానము.

88. వారు (ఆ స్థితి) యందే నిరంతరముందురు. వారి శిక్ష యెంతమాత్రమును తగ్గదు వారి కెన్నడును విశ్రాంతి లభింపదు.

89. ఐతే ఎవ రీస్థితియందుకూడ పశ్చాత్తప్తులై, తమదోష ములను సవరించుకొందురో (వారిని భగవంతుడు కరుణతో క్షమించును.) భగవంతుడు మహాక్షమి; కరుణానిధి.[౩౬]

90. ఎవరు ఒక్కసారి విశ్వాసమార్గము ననుసరించి, తర్వాత సత్యమును నిరాకరించి, విశ్వాసము ధిక్కరించుటయందు క్రమ క్రమముగ ప్రబలు లగుదురో వారి పశ్చాత్తాపముసైతము స్వీకరింప బడదు. ఎందుకనగా వారు (ఉద్దేశపూర్వకముగ) దుష్పథముల ననుసరిం చిన వారు.

91. ఎవరు విశ్వాసమార్గమును ధిక్కరించి, ఆ స్థితియందే మరణింతురో తమ (పాపమున) కు ప్రాయశ్చిత్తముగ భూమియందలి బంగారమునంతను ఇచ్చియు ముక్తినందలేరు. ఘోరశిక్ష వారికై వేచియున్నది. వారి కెవ్వరును సహాయులు లభింపరు.



# నాల్గవ భాగము

## పదవ ఖండము

92. మీకు ప్రియమైన వస్తువులను భగవన్మార్గమున వ్యయ పెట్టినగాని మీకు సుకృతి లభింపదు. మీరు వ్యయపరుచుచున్నదాని నంతటిని నిశ్చయముగ భగవంతుడెఱుగును

93. ఇస్రాయీలీయులకు (సాధారణముగ తిండికై ఉపయోగించు) ఆహారపదార్థము లన్నియు భోజ్యములేయై యుండెను. కాని ఇస్రాయీలీయులు* తౌరీత్ గ్రంథము (తమకు) ప్రోక్తము కాకపూర్వము తమపై తాము కొన్ని ఆహారపదార్థముల విషయములో నిషేధమును విధించుకొనిరి. (కాని భగవంతుడు వాటిని నిషేధించి యుండలేదు. ఓ ప్రవక్తా! ఈ విషయమున యూదులు నీతో వివాదము చేసినచో వారితో) ఇట్లనుము: "మీరు నిజము చెప్పుచున్నా మనుచో తౌరీత్ గ్రంథమును తీసుకొని రండు. దానిని విప్పి చదువుడు. (మీరు నిషేధము లనుకొనుచున్న వస్తువులందు నిషేధింపబడినవో లేదో చూడుడు)

94. దీని తర్వాత కూడ ఎవరు ఒక అబద్ధమును సృష్టించి దానిని అల్లాకు ఆపాదింతురో వారు నిశ్చయముగ అధర్మపరులు.

95. (ఓ ప్రవక్తా! వారితో) ఇట్లనుము: "భగవంతుడు సత్యమును ప్రవచించెను. (మీ మనస్సులలో సత్యముయెడ గౌరవము ఏమాత్ర ముండినను) మీరు సన్మార్గప్రవర్తకుడగు ఇబ్రాహీమ్ ప్రవక్తమార్గము ననుసరింపుడు. అతడు బహు దైవతారాధకుడు కాడు.

96 నిశ్చయముగ (భగవదారాధనమునకై కేంద్రముగ) మొట్ట మొదట మానవజాతికై ఏర్పరచిన ప్రార్థనాలయము మక్కా-యందలి

---

* 'ఇస్రాయీల్' అనియు అర్థము చెప్పవచ్చును. అప్పుడు "తౌరీత్ గ్రంథము ప్రోక్తము కాకపూర్వము ఇస్రాయీల్ తనపై తాను కొన్ని ఆహారపదార్థముల విషయములో నిషేధమును విధించుకొనెను" అని వాక్యము చదువవలెను.

(కాబా ప్రార్థనభవనము ) ఇది పవిత్రమైనది. సర్వప్రపంచమునకు ఉప దేశము నొసగునది.

97. ఇందుస్పష్టమగు చిహ్నములు కలవు: ఇబ్రాహీమ్ (నిలు వబడి ప్రార్థన సలిపిన) స్థలము. (ఇది నాటినుండి నేటివరకు శిధిలము కాక ఎప్పటి యట్లు నున్నది.) దీనిని ఎవరు ప్రవేశింతురో వారు సురక్షితులై యుందురు. (అందుచే) అక్కడకు వెళ్లగలిగిన శక్తిగల ప్రతివ్యక్తికిని ఆ ప్రార్థనాలయమును దర్శించుట భగవంతునిచే విధివిహిత మొనర్ప బడినది. దీని తర్వాత ఎవరైనను (ఈస్థలముయొక్క పావిత్ర్యమును గణించక) దీనిని నిరాకరించినచో (జ్ఞాపకముంచుకొనుడు) భగవంతున కభిలషితార్థము లేవియు లేవు. ప్రపంచములలో ఆతఁడు వాంఛించు నదేదియు లేదు.

98. (ఓ ప్రవక్తా, వారితో) ఇట్లనుము: "భగవత్ప్రోక్తమగు గ్రంథ మివ్వబడిన ఓ ప్రజలారా! మీరు (తెలిసియుండియు)భగవంతుని ఈచిహ్నముల నేల నిరాకరింతురు? మీరు చేయుచున్న దంతటికిని భగవంతుడు సాక్షియై యున్నాడు."

99. (మరియు) ఇట్లనుము: "భగవత్ప్రోక్తమగు గ్రంథముగల ఓ ప్రజలారా! అల్లాః యొక్క ధర్మ మార్గమున నడువగోరు వానిని మీ రేల ఆటంకపరతురు? మీరు సాక్ష్యులై యుండియు వారినేల వక్రిమార్గమున నడిపింప గోరెదరు? మీరు చేయుచున్నదానికి భగ వంతుడే మఱి లేడు."

100. ఓ విశ్వాసవంతులారా! భగవత్ప్రోక్తమగు గ్రంథము గల వారిలో ఒక పక్షమువారిమాట వినినచో వారు మిమ్ములను ధర్మమార్గము నుండి తప్పించివేతురు. మీరు మొదట విశ్వసించి, తర్వాత నిరాకరణ మార్గము నవలంబింతురు.

101. భగవత్ప్రోక్తమగు ఈ వచనములు వినిపింప బడు చున్నవి మీ కేకదా? ప్రవక్తకూడ మీ మధ్యనే ఉన్నాడు కదా?

మరి మీరెట్లు విశ్వాసమును నిరాకరింతురు? ఎవరు దృఢనిశ్చయులై భగవంతు ననుసరింతురో వారికి తిన్నని మార్గము తప్పక లభించును.

## పదునొకండవ ఖండము

102. ఓ విశ్వాసవంతులారా! భగవంతుని యెడ భయభక్తులతో ప్రవర్తింపుడు. నిజమైన భయభక్తులు కలిగియుండుడు. ముస్లిములు కాకుండ మరణింపకుడు.

103. (చూడుడు) అందరును కలసి ఐకమత్యముతో భగవద్రజ్జువును దృఢముగ పట్టుకొనుడు. (మీలోమీరు విభేదములు కల్పించుకొని) విడివిడిగా చెదరిపోకుడు. మీకు భగవంతుడు చూపిన అనుగ్రహమును కృతజ్ఞతతో స్మరింపుడు: మీరు (ఒకరికొకరు) శత్రువులై యుండిరి. భగవంతుడు మీ హృదయములను కలిపి తన అనుగ్రహముచే మిమ్ముల సోదరుల నొనర్చెను. (మీస్థితి ఇట్లుండెను) మీరొక అగ్నిగుండపు అంచుపై నుండిరి. (కొంచెము కాలుజారిన మీరందు పడియుండెడివారు) భగవంతుడు మిమ్ము దానినుండి రక్షించెను. దీనివలన మీరు సన్మార్గము ననుసరింతురని ఈవిధముగ అల్లాః తన సందేశమును మీకొఱకు విస్పష్టమొనర్చును.

104. మీలో సన్మార్గమునకు పిలుచువారును, మంచిని విధించువారును, చెడుగును నిషేధించువారును కొందరి ఒకసంఘముండవలెను. ఇట్టివారికే సంపూర్ణమగు సాఫల్యము కల్గును.

105. (చూడుడు) భగవద్గ్రంథము యొక్క విస్పష్ట బోధకల్గినప్పటికిని పరస్పర విభేదములు కల్పించుకొని (ఐకమత్యముతో సత్యమగు భగవన్మార్గమున కూడియుండుటకు బదులు) వివాదపడి (చీలిపోయిన) వారివలె కాకుడు. ఇట్టివారికి ఘోరశిక్ష కలుగును.

106. ఆ (ప్రళయ) దినమునాడు ఎందరి ముఖములలో (సత్కృతి వలన కలిగిన) శుభ్ర (తేజస్సుచే విభ్రాజమాన) మగును, ఎందరి ముఖములలో (పాపపంకిలముచే) నల్లపడును. నల్లపడిన ముఖములు కలవారు

(ఇట్లు ప్రశ్నింపబడుదురు:) "ఒకసారి విశ్వసించి మీరు తిరిగి అవిశ్వాస మార్గము బట్టిరా? మరి మీ అవిశ్వాసమునకు (ఉచితమగు) ఈశిక్ష ననుభవింపుడు"

107. శుభ్ర (మగు తేజస్సుచే) (విభ్రాజమాన)మగు ముఖములు కలవారు భగవంతుని అనుగ్రహ (ఛ్ఛాయలక్రిందకు) గైకొనబడుదురు. వారికందే (నిత్య) నివాసము.

108. (ఓ ప్రవక్తా!) ఇవి భగవత్ప్రవచనములు. యథాతథముగ మీకివి వివిపింపబడుచున్నవి భగవంతుడు జీవుల కన్యాయమొన ర్పగోరడు.

109. (జ్ఞాపకముంచుకొనుడు.) భూమ్యాకాశములందున్న సమస్తమును భగవంతునిదే. భగవంతుని కడకే సమస్త వ్యవహారములును (తీర్పుకై) మరలును.

## పండ్రెండవ ఖండము

110. (ఓ విశ్వాస వంతులారా!) మానవుల (సంస్కారమున) కై పంపబడిన జనులలోకెల్ల మీరు అత్యంత శ్రేష్ఠులు. మీరు మంచిని విధించి, చెడుగునునిషేధించి భగవంతునియందు విశ్వాసముంచువారు. ఇంతకుముందు భగవద్గ్రంథ మివ్వబడిన వారు విశ్వసించి యుండినచో వారి కది ఉత్తమమై యుండెడిది. వారిలో కొందరు విశ్వాసవంతులుగను ఉన్నారు. కాని వారిలో పల్వురు దుర్మార్గము ననుసరించిన వారు.

111 మీకు వారు (ఎంత హానికల్గింపగోరియు) మీ కించుక చిరాకు తప్ప మరేహానియు కల్గింపజాలరు; వారు మీతో యుద్ధమొనర్చియు తుదకు వెనుజూపుదురు. (మూర్ఖులగు) వారికి ఎట్టి సహాయమును లభింపదు.

112. భగవంతుని వాగ్దానకారణమునగాని, మానవులవాగ్దాన కారణమునగాని (వారికి ఆశ్రయము లభించివ) తప్ప, తకిున్నచో ఎక్క

యున్నను సరే వారికి (యూదులకు) అధోగతికల్గును. వారు భగవదాగ్రహమునకు పాత్రులైరి. వారి కధోగతి కలిగెను. ఎందుకనగా వారు భగవత్సందేశమును నిరాకరించి అన్యాయముగ ప్రవక్తలను చంపిరి; అవిధేయులై (తమ) హద్దుల నతిక్రమించి నందుకు వారి కివ్వబడిన శిక్ష ఇది.

**113.** వారందరును ఒకేవిధమైనవారు కారు. భగవత్ప్రోక్తమగు గ్రంథము లభించిన వారిలో (క్రైస్తవ యూదులలో) సన్మార్గ ప్రవర్తకులును కొందరు కలరు. వారు భగవత్సూక్తులను రాత్రులందు పారాయణము సేతురు. వారు (భగవంతునకే) వినతులగుదురు.

**114.** వారు భగవంతునియందును, తుది దినమునందును విశ్వసింతురు. వారు మంచిని విధించి చెడుగును నిషేధింతురు. సత్కార్యాచరణమునందు ఒకరికంటె యొకరు ముందడుగు వేయుదురు. వీరు సత్పురుషులు.

**115.** వారుచేయు యేమంచి యైనను (దానిఫలము) వారికి నిరాకరింపబడదు. సన్మార్గ ప్రవర్తకులను భగవంతు డెఱుగును.

**116.** ఎవరు సత్యమును నిరాకరించిరో వారి ధనసంపదలుగాని, సంతానముగాని వారిని భగవంతుని (ఆగ్రహము) నుండి తప్పింపజాలవు. వారు అగ్ని కింధనము లగుదురు. వారికందే (నిత్య) నివాసము.

**117.** (అవిశ్వాసులు) ఏమి ఖర్చుపెట్టినను ప్రాపంచిక జీవితములో అది (వమ్మై నిష్ఫలమగుటలో) వారిస్థితి ఈ (క్రింది) తారాకాణమునకు పోలియున్నది: (కష్టపడి పెంచినవారి) చేలకు అతిశీతలమగు గాలి సోకి (అచేలను) విధ్వంస మొనర్చెను. (అదేవిధముగ వీరు చేయు దానాదులుసైతము వమ్మగును.) వారు ఆత్మవినాశ మొనర్చుకొనిరి. భగవంతుడు వారికి (ఎట్టి) అన్యాయమును చేయలేదు. వారు తమకు తామే చెడగొట్టుకొనిరి.

**118.** ఓ విశ్వాసవంతులారా! మీ (సంఘము) లోని వారు

కానప్పుడు వారితో ఎక్కువ గాఢమైత్రి సలుపకుడు. మిమ్ము వారు చెడగొట్టుట కెంతమాత్రము వెనుదీయరు. మీ వినాశమునే వారు కోరుదురు. వారప్పుడే అపరిమిత ద్వేషమును వెళ్ళగక్కిరి. వారి హృదయములలో అంతకంటె అధికమైన ద్వేషము గుప్తమైయున్నది. మీరు జ్ఞానవంతులైనచో నిశ్చయముగ భగవత్సందేశము మీకు విస్పష్టపరపబడినది.

119. చూడుడు! వారిని మీరు ప్రేమింతురు. కాని వారు మిమ్ముల ప్రేమింపరు. మీరు భగవత్ప్రోక్తమగు గ్రంథమునంతటిని పూర్తిగ విశ్వసించువారు. (కదా) వారు మిమ్ములను కలిసినప్పుడు ఇట్లందురు: "మేము (మీవలెనే) విశ్వసించుచున్నాము." కాని వారొంటరిగ నున్నప్పుడు మీయందలి కోపద్వేషములచే గోళ్ళు రక్కకొందురు. (వారితోనిట్లు)అనుము: "మీ ఆగ్రహమున మీరు నశింపుడు. మీ హృదయములలో నున్న సమస్త రహస్యములను భగవంతు డెఱుగును."

120. మీకు శ్రేయశ్శుభము లొనగూడినచో వారు దుఃఖితులగుదురు. మీకాపద తటస్థించినచో వారానందపరవశు లగుదురు. మీ రోర్పువహించి సత్ప్రవర్తకులై మెలగినచో వారి కుతంత్రములు మిమ్ములను రవ్వంతయు బాధింపవు. వారుచేయుచున్న సమస్తమును నిశ్చయముగ భగవంతు డెఱుగును.

### పదమూడవ ఖండము

121. (ఓ ప్రవక్తా! ఆ సమయము జ్ఞాపకము తెచ్చుకొనుము.) నీవు ప్రాతఃకాలముననే ఇల్లు విడిచి (ఒహోద్) మైదానమున ముసల్మానులను యుద్ధమునకై పంక్తులను తీర్చుచుంటివి. అల్లాః సమస్తమును వినువాడు; సర్వజ్ఞుడు.౬౯

122. మీలో రెండు తెగలు ధైర్యము కోల్పోయి భగవంతుడు వారి సహాయ మొనర్చుచున్నను వెనుజూప నిశ్చయించెను. విశ్వాసవంతులు ఎల్లవేళలందును భగవంతునే నమ్మియుండవలెను.

123. బదర్ యుద్ధరంగమున మీరు మిక్కిలి బలహీనులై యున్నప్పుడు భగవంతుడు మీకు సహాయ మొనర్చెను. (అప్పుడు మీరు జయము గొందురను అనుమానమైనను లేకుండెను ) అందుచే అల్లాఃకే భయ పడుడు. భగవదాజ్ఞల నతిక్రమింపకుడు. అప్పుడే మీరు భగవంతు నకు కృతజ్ఞులై యుందురు.

124. (ఓ ప్రవక్తా! ఆ సమయము కూడ జ్ఞాపకముంచుకొనుము.) నీవు (యుద్ధరంగమున) విశ్వాసవంతులతో నిట్లనుచుంటివి: (శత్రువు యొక్క మూడువేలమంది సైనికుల నెదుర్కొనుటకై) మూడువేల దేవ దూతలను దింపి భగవంతుడు మీకు సహాయమొనర్చిన అది మీకు చాలదా?"

125. తప్పక అట్లే మీరు ఓర్పు వహించి, సన్మార్గప్రవర్త కులై యుండినచో, అప్పుడు మీపై హఠాత్తుగ శత్రు వెత్తి వచ్చిన యెడల, మీ భగవంతుడు (మీకు మూడువేల దేవదూతల తోడనే కాదు) ఐదువేలమంది భయంకర దేవదూతలను పంపించి సహాయము చేయును. (మీ శత్రువుల బలము మిమ్ముల నేమియు చేయజాలదు )

126. (జ్ఞాపకముంచుకొనుడు.) మీకు (విజయ) శుభవార్త నిచ్చుటకును దానివలన మీకు మనస్థైర్యము కల్గించుటకును చెప్పిన మాట యిది. తోడ్పా టేదైన సరే అది భగవంతుని కడనుండియే వచ్చును. భగవంతుడు సర్వశక్తిమంతుడు; ప్రజ్ఞానిధి.

127. (మీకు భగవంతుడు యుద్ధమున సహాయము చేయుట మరియు నిందుకొఱకు:) అవిశ్వాసవంతుల సంఘము యొక్కయు బలము యొక్కయు ఒక భాగమును నశింపజేసి వారిని నీచపరచి వారు (ముసల్మానులను సమూలముగ నశింపజేయవలెనను తమకోరికను నెరవేర్చుకో లేక) భగ్నాశులై మరలి పోవునట్లు చేయుటకు.

128. (ఓ ప్రవక్తా! సత్యమునకు శత్రువులగు) వీరు క్షమింపబడుట, శిక్షింపబడుటను గుఱించిన ఈ వ్యవహారములో నీకేమియు జోక్య

ము లేదు. (భగవంతుడు తన ఇచ్ఛవచ్చినవారిని పశ్చాత్తప్తులైనచో క్షమించును తాను తలచినచో శిక్షనిచ్చును:) ఎందుకన వారు దుష్టులు.౧౦

129. భూమ్యాకాశములందున్న సమస్తమును భగవంతుని కొఱకే యున్నది. తన ఇచ్ఛవచ్చిన వారి నతడు క్షమించును; తన ఇచ్ఛవచ్చిన వారిని శిక్షించును. భగవంతుడు మహాక్షమి; కరుణాళువు.

## పదునాల్గవ ఖండము

130. ఓ విశ్వాసవంతులారా! వడ్డీ తినకుడు. (అప్పు యొక్క అసలుతో కలిసి) అది రెండింతలు నాల్గింతలై పోవును. భగవంతునకు భయపడుడు. (భగవదాజ్ఞను నతిక్రమింపకుడు.) అప్పుడే మీకు జయశ్రీ లభించును

131. అవిశ్వాసులకై సిద్ధపరుపబడిన నరకాగ్నికి భయపడుడు.

132. భగవంతునకును అతని ప్రవక్తకును విధేయులై యుండుడు. మీరు కరుణింపబడుదురు.

133. భగవంతుని క్షమార్పణమువైపునకు సత్వర గమనమున సాగుడు; స్వర్గమువైపునకు సాగుడు. సమస్తాకాశములును భూమియు కలిసి యెంత విశాలముగ నున్నవో అంత విశాలమైన దా స్వర్గము. సన్మార్గ ప్రవర్తకుల కొఱకు (అది) సిద్ధపరుపబడినది.

134. ఎవరు భాగ్యవంతులుగ నుండినను, పేదరికమునందున్నను (యథాశక్తి తమ కున్నదానిని) ఖర్చుపెట్టుదురో, ఎవరు క్రోధమును నిరోధించి (క్రోధపారవశ్యమున నిరంకుశులై పోవరో), ఎవరు తమతోడి మానవుల (తప్పులను) క్షమించి వేయుదురో (అట్టివారే సన్మార్గ ప్రవర్తకులు. వారికొఱకే స్వర్గము సిద్ధపరుపబడినది ) భగవంతుడు సన్మార్గ ప్రవర్తకులను పరోపకారపారీణులను ప్రేమించును.౧౧

135. ఎవరు ఏదైన ఒక గొప్ప పాపమొనర్చి లేక ఆత్మ

వంచన మొనర్చుకొని పశ్చాత్తప్తులై భగవత్స్మరణము గావించుచు తమ తప్పిదములను మన్నించుటకై (భగవత్సమక్షమున దీనులై) వేడుకొందురో, తాము చేసినది తప్పని తెలిసియూ, అందే పట్టుదల వహించి యుండరో అట్టివారు సన్మార్గ ప్రవర్తకులు. భగవంతుడు తక్క మరెవ్వరు పాపములను క్షమించును ?

136. నిశ్చయముగ ఇట్టి సజ్జనులకే భగవంతుడు క్షమార్పణము బహుమతిగా ననుగ్రహించును. (అంతేకాదు వారికొఱకు) స్వచ్ఛమగు నిర్ఝరులు ప్రవహించుచున్న స్వర్గోద్యానము నిత్యనివాసమునకై (ప్రసాదించును.) (భగవన్మార్గమున) పనిచేయువారికి కలుగు ఫలమెంత శ్రేష్ఠమైనది !

137. చూడుడు. మీకు పూర్వము కూడ ప్రపంచములో (జాతుల జీవన్మరణముల, ఔన్నత్య పతనముల) నియమములు, జీవిత విధానము లుండెను. (అదే ధర్మమిప్పుడును పనిచేయుచున్నది మీరుకూడా దానికే లోనైయున్నారు.) మరి దేశాటనము చేయుడు. (భగవదాజ్ఞలను) ధిక్కరించినవారిగతి తుదకేమైనదో చూడుడు.

138. ఇది మానవుల కొరక స్పష్టమైన బోధన; సన్మార్గ ప్రవర్తకులకిది మార్గదర్శకమును, ఉపదేశమునునై యున్నది.

139. మీరు ధైర్యమును కోల్పోకుడు, దుఃఖింపకుడు; మీరు పూర్తిగా విశ్వాసవంతులే నైనచో అందరికంటె మీదే పై చేయియగును.

140. మీరు (ఉహోద్ యుద్ధరంగమున) గాయపడి యుండినచో మీ శత్రువులకుకూడ (బదర్ యుద్ధరంగమున) అట్టిగాయములే తగిలెను. (అట్టిచో మీ రా పరాజయమున కింత ఖిన్నులగుచున్నారేల ?) వాస్తవమేమనగా (జయాపజయముల) కాలములను (ఒకప్పుడొక పక్షమునకును మరొకప్పు డింకొక పక్షమునకును) మేము మార్చుచుందుము. (అంతేగాని దీనికొఱకు దుఃఖింపబనిలేదు.) మరియు (ఈ పరాజయము ఉపాయహీనమును కాదు) ఎందుకనగా దీనివలన ఎవరు నిజమైన విశ్వాసము కలవారో

(ఎవరుకాదో) తేలెను. (అది వారికొాక పరీక్షయైనది) భగవంతుడు దీనికి మిమ్ములనే సాక్షులుగా గ్రహించెను. భగవంతుడు దుర్మార్గులను ప్రేమింపడు. ౧౪౦

141. (దీనివలన) విశ్వాసవంతుల నుండి వంచకులను తొలగించుటయు, విశ్వాసహీనులను నశింపచేయుటయు నైనది.

142. (ఓ విశ్వాసవంతులారా! కేవలము విశ్వసించితిమని చెప్పినంత మాత్రమున) మీరు స్వర్గమును ప్రవేశింతురనుకొందురా? (స్వకర్మలచే తమ విశ్వాసముయొక్క దార్ఢ్యమును నిరూపింప నవసరము లేదందురా?) అల్లాః మిమ్ములను పరీక్షించి ఎవరు భగవన్మార్గమున పూర్తిగ శ్రమించువారో, ఎవరు కష్టకాలములందు నిశ్చలమనస్కులై యుండు వారో చూపుకాల మింకను రానైన లేదు.

143. మరణము నెదుర్కొను సమయము రాకపూర్వము (భగవన్మార్గమున) మరణించుటకు మీరువ్విళ్ళూరుచుండిరి. మరి మరణము మీ కన్నులముందు వచ్చినప్పుడు మీరు చూచుచు నుండి పోయిరి!

పదునైదవ ఖండము

144 మొహమ్మద్ కేవల మొక ప్రవక్త మాత్రమే. అతని ముందెంతో మంది ప్రవక్తలు గడచిపోయిరి. అట్టిచో (మొహమ్మద్) ఒకసారి చనిపోయిన గాని మరణించిన గాని మీరు వెను జూపుదురా? అట్లు వెను జూపినవాడు (తనకు తానే నష్టపరచుకొనుచున్నాడు.) భగవంతున కేమాత్రము నష్టము కల్గింపడు. (అట్లు తమ ధర్మము వేమఱక) కృతజ్ఞులై యుండువారిని భగవంతుడు బహుమానించును. ౧౪౪

145. భగవదాజ్ఞ లేనిదే ఏ ప్రాణియు మరణింపదు. (ప్రతిప్రాణి కొఱకును జీవిత) కాలము నిర్ణయింపబడినది. (మరి మరణభీతిచే మీ రేల వెనుకకు మరలిరి?)

ఎవడు ఐహికలాభము నిచ్ఛించునో వానికి ఐహిక ఫలి

మిత్తుము. అట్లుగాక ఆముష్మిక ఫలము నాశించు వానికి ఆముష్మిక ఫలమే ప్రసాదింపబడును. కృతజ్ఞులై యుండువారిని మేము బహూకరింతుము.

146. మున్ను ఎందరు ప్రవక్తల గూడి భగవద్భక్తిపరులు (భగవన్మార్గమున) యుద్ధము చేయలేదు? వారికి భగవన్మార్గమున ఏవైన కష్టములు వచ్చినప్పుడు వారు ధైర్యము గోల్పోవరైరి. దుర్బల (హృదయులు) కారైరి, నీచులు కారైరి. భగవంతుడు ఓర్పు వహించి స్థితప్రజ్ఞులైన వారిని ప్రేమించును.

147. (ఎన్ని కష్టములు వచ్చినను) వారి నోట ఈ మాటలు మాత్రము వెడలుచుండెను: "ప్రభూ! మా తప్పిదములను క్షమింపుము. మా కర్మలలో (నీ ఆజ్ఞలకు వ్యతిరేకముగ) ఏవైన హెచ్చు తగ్గులైనచో వాటిని కూడ క్షమింపుము. (భవన్మార్గమున) మమ్ములను చలింపని పాదములు కలవారిగా నొనర్పుము. సత్యమును నిరాకరించిన ఈ ప్రజల (దౌర్జన్యము నెదుర్కొనుటకై) మాకు తోడ్పడుము."

148. (విశ్వాసమునందును, సత్కార్యాచరణమునందును ఇంత నిశ్చల చిత్తులైన) వీరికి భగవంతుడు ఐహిక ఫలమును చేకూర్చుటయే కాక (అంతకంటెను) ప్రశస్తమగు పారలౌకిక ఫలమును ప్రసాదించెను. సత్కార్యాచరణ పరులను భగవంతుడు ప్రేమించును.

## పదిఆరవ ఖండము

149 ఓ విశ్వాసవంతులారా! (శత్రువుయొక్క బలమునుచూపి మిమ్ములను భయపెట్టి యుద్ధమునందు పాల్గొన వలదని మీకు బోధించు)అవిశ్వాసుల మాట వినినచో వారు సత్యమార్గమునుండి మిమ్ముల త్రిప్పివేయుదురు. దానికి ఫలితముగ మీరు (విజయమోక్షముల మార్గమును విడిచి) పతితులై నష్టపోదురు.

150. (ఈధర్మ శత్రువులు మీమిత్రులు కాజాలరు) మీ పోషకుడు అల్లాః యొక్కడే. (మరి భగవంతునందే మీ సమస్తాశల నుంచుడు) సహాయకులలో భగవంతుడే ఎక్కువ సహాయము చేయువాడు.

**151.** సత్యమును నిరాకరించు వారి హృదయములలో మేము త్వరలో అడలు పుట్టింతుము. ఎందుకనగా వారు అల్లాహ్‌తో సమానులను కల్పించి (వారిని కొలుచుచున్నారు) (అట్లుచేయుటకు వారి కడ) భగవంతుడెట్టి అధికారమును పంపియుండలేదు. (ఐనను అట్లు పూజింప) వారి నివాసము నరకాగ్ని. దుర్మార్గుల నివాసము కఠోరమైనది.

**152.** భగవంతుడు తన సహాయ వాగ్దానమును పూర్తి చేసెను. అప్పుడు మీరు భగవదాజ్ఞచే శత్రువులను వధించుచుండిరి. (మీరు అన్నివిధముల జయమును పొందుచుండిరి) కాని మీకు అత్యంత ప్రియమగు విజయము లభించిన పిదప మీరు దుర్బల హృదయులై (మీకివ్వబడిన) ఆజ్ఞను గుఱించి మీలో మీరు వివాద పడసాగిరి. (ఒక పక్షమువారు 'ఇప్పుడు రంగముపై నిలువవలసిన అవసరమేమున్నది?'అనిరి. మరొక పక్షమువారు 'కాదు. మేము చివరివరకు స్థిరులమై యుద్ధమున నిల్చియుందు' మనిరి) తుదకు (తమ నాయకుడైన ప్రవక్త) ఆజ్ఞానుసారము వర్తింపరైరి.

మీలో కొందరు ఈ ప్రపంచమును (దోపిడి సామగ్రిని)ఆశించిరి. మరికొందరు పారలౌకిక సుఖమునే ఆశించిరి. అప్పుడు భగవంతుడు మిమ్ములను శత్రువులకు విముఖుల నొనర్చి మిమ్ము (దీనివలన) పరీక్షింప గోరెను. (ఈవిధముగ మీ విజయము పరాజయముగ మారెను.) మీరిట్లు చేసినను భగవంతుడు మీతప్పిదమును క్షమించెను. విశ్వాసవంతులయెడ భగవంతు డపార కృపను చూపును.

**153.** మీరు (యుద్ధరంగమునుండి అడలిపోయి) మరొకరిని వెనుక తిరిగి చూడకుండనైతము పారిపోవుచుండిరి. మీప్రవక్త మిమ్ములను వెనుకకు పిల్చుచుండెను. (మీకు గుణపాఠముగ నుండుటకై) భగవంతుడు మీకు దుఃఖముపై దుఃఖము కల్గించెను. (ఇకముందు) మీచేతుల నుండి జారిపోయిన దానికొఱకు దుఃఖింపకుడు. వచ్చిన (దుఃఖమునకును) వాపోవకుడు. మీరు చేయుచున్నదంతయు భగవంతుడెఱుగును.

**154.** దుఃఖము తర్వాత భగవంతుడు మీకు శాంతిని ప్రసా

దించెను. మీలో కొందరు (పూర్తిగ నిర్భీతులై) నిద్రచే మైమరచిరి. మరి కొందరకు ప్రాణభీతి వదలనేలేదు. వారు భగవంతునిగూర్చి అంధకారయుగమునం దెట్టి మూఢభావములు కల్గియుండిరో అట్టి భావములనే ప్రకటింపసాగిరి. వీరిట్లనిరి: "ఈ జరిగినదానిలో మా అధికార మేముండెను ?" (ఓ ప్రవక్తా! వారితో) ఇట్లనుము: "అధికారము సర్వస్వమును భగవంతునకే కలదు. (భగవంతుడే ప్రతివిషయమునను కార్యకారణసంబంధమును కల్పించినాడు.)" (వాస్తవ మేమనగా) వారి హృదయములలో ఉన్నదానిని వారు నీతోచెప్పక దాచియుంతురు. వారిట్లు చెప్పుదురు: '(ఆ వ్యవహారములో) మాజోక్యమేదైన యుండి యుండినచో మేము వధింపబడక పోదుము' (ఓ ప్రవక్తా! వారితో ఇట్లు) చెప్పుము: 'మీరు మీ ఇండ్లయందుండి పోయియుండినను (యుద్ధమునందు) వధింపబడ నిర్దేశింపబడినవారు ఇల్లువిడిచివెళ్లి తమ నిర్ణీత వధ్యస్థలమును తప్పక చేరియుందురు.

(ఒహోద్ యుద్ధములో జరిగినదంతయు భగవదిచ్ఛ ననుసరించి జరిగినది) దానివల్ల మీ హృదయములలో దాగియున్న భావములకు ఒకపరీక్ష కల్పించుటయు మీ హృదయములలో పెరిగిన అపవిత్రతను తొలగించుటయు భగవదిచ్ఛయై యుండెను. హృదయములలో గుప్తమై యున్నదంతయు భగవంతుడెఱుగును.'

155. ఇరుపక్షముల సైన్యములు ముఖాముఖి ఎదుర్కొనిననాడు మీలో వెనుజూపి పారిపోయినవారు వారి దౌర్బల్య కారణమున సైతాను వారిని దారితప్పించెను. (అంతేకాని వారి విశ్వాసములో కొదువకల్గలేదు) నిశ్చయముగ భగవంతుడు వారిని క్షమించెను. భగవంతుడు మహాక్షమి. (మానవుని తప్పులను దౌర్బల్యములను) ఎక్కువగ సహించువాడు. ౨౪

## పదునేడవ ఖండము

156. ఓ విశ్వాసవంతులారా! అవిశ్వాసమార్గము నవలంబించినవారు తమ బంధువులు ప్రయాణము కట్టిపోయినప్పుడును, యుద్ధము

చేయబోయినప్పుడును వారిని గురించి (ఇట్లందురు) : "వారు (ఇల్లు విడిచిపెట్టిపోకయు, యుద్ధము చేయకయు) మాతో ఉండి యుండినచో చావక ఉండియుందురు. (వారి నెవ్వరు) వధింపకుండ నుందురు." ఓ విశ్వాసవంతులారా! మీరు వీరివలె కాకుడు (భగవంతునియందు భక్తివిశ్వాసములు గల వారికిట్టి భయమే యుండదు ఐనను మీకిట్లుపదేశ మొనర్చుటకు కారణము మీ నిర్భయత్వమును, విశ్వాసదార్ఢ్యమును, నిశ్చలతను చూచి) అవిశ్వాసుల హృదయములలో మచ్చరపు మచ్చపడునట్లు చేయుట. (జ్ఞాపక ముంచుకొనుడు.) మరణము, జీవితము కూడ భగవంతుని హస్తగతములు. మీరు చేయునదంతయు భగవంతుడు చూచుచునే యున్నాడు.

**157.** ఒకసారి మీరు భగవన్మార్గమున చనిపోయినను, వధింపబడినను, (అవిశ్వాసులగు) వీరు గడించి కూడబెట్టియుంచిన దానికంటె భగవంతుడు ప్రసాదించిన క్షమాకారుణ్యములు శ్రేష్ఠతరమైనవి.

**158.** మీరు చనిపోయినను, వధింపబడినను భగవంతుని సమక్షమున మీరందరు సమావేశపరుపబడుదురు.

**159.** (ఓ ప్రవక్తా!) వీరియెడ నీవింతదయతో ప్రవర్తించుటయు వారిపై భగవంతుని దాక్షిణ్యమే. నీవు వారియెడ కటువుగను, హృదయకాఠిన్యముతోడను ప్రవర్తించియుంటివా వారందరు నీకడ నుండి పారిపోయి యుందురు. అందుచే వారి తప్పులను క్షమింపుము. వారిని సంరక్షింపుమని (భగవంతుని) ప్రార్థింపుము. (యుద్ధము, శాంతి మున్నగు) ముఖ్య విషయములలో వారితో మంత్రణముసేయుము. మీరేదేని విషయమున నిశ్చయించుకొనినచో భగవంతునియందు నమ్మకముంచుము. (మీరు నిశ్చయించుకొనినదానిని తప్పకచేయుడు.) తను నమ్మియుండు వారిని భగవంతుడు ప్రేమించును.

**160.** భగవంతుడు మీకు సహాయము చేసినచో మిమ్ముల నెవ్వరును ఓడింపలేరు. అట్లుకాక భగవంతుడే మిమ్ములను విడిచి

వైచెనా అతని తర్వాత మీకు ఎవరు సహాయము చేయగలరు ? అందుచే విశ్వాసవంతులు భగవంతునే నమ్ముకొని యుండవలెను.

161. భగవంతుని ప్రవక్త ఎన్నడును విశ్వాస ద్రోహము చేయడు. విశ్వాస ద్రోహము చేయువాడు (లోకుల కన్నులలో ఎంత కారము కొట్టినను) తుదిదినమునాడు (తన విశ్వాసద్రోహమును) దాచి యుంచలేడు. దాని నత డక్కడకు తెచ్చును. నాడు ప్రతిజీవియు తాను గడించిన దాని ప్రతిఫలమును పూర్తిగ పొందును. ఎవరికిని నాడు అన్యాయము జరుగదు.

162. భగవంతుని సంతోషపరచు మార్గము నవలంబించిన వాడును, (తన దుష్కార్యములచే) అల్లాః ఆగ్రహమునకు పాత్రుడైన వాడును ఒకటే ఎట్లగుదురు ? (అల్లాః ఆగ్రహమునకు పాత్రుడైన) వాని నివాసము నరకము. అది ఎంత దుష్టనివాసము !

163. వారు భగవంతుని సమక్షమున వివిధ తరగతులుగ నున్నారు. ఎవరి కర్మ లెట్టివో వారి (నావిధముగ) భగవంతుడు చూచుచున్నాడు.

164. వారి నుండియే ఒక ప్రవక్తను పుట్టించుట విశ్వాస వంతులకు భగవంతుడు చూపిన మహాదనుగ్రహము. (ఆప్రవక్త) వారికి భగవత్ప్రోక్తమగు వాక్కులను వినిపించుచున్నాడు; వారిని (సమస్తదోషములనుండియు) పరిశుద్ధుల నొనర్చుచున్నాడు; భగవద్గ్రంథము బోధించుచున్నాడు, జ్ఞానము నిచ్చుచున్నాడు. అంతకు ముందు వారు స్పష్టమగు దౌష్ట్యమున మగ్నులై యుండిరి.

165. (ఒహోద్ యుద్ధరంగమున) మీ కొక ఆపద తటస్థించి నప్పుడు—— (బదర్ యుద్ధరంగములో) మీ శత్రువులపై ఇంతకు రెండింతలు ఆపద మీరు తెచ్చిపెట్టియుండిరి. (ఐనను) మీరిట్లు మొరపెట్టు కొంటిరి : "ఈ (ఆపద మాపై ఎక్కడనుండి) వచ్చిపడినది ?" (ఓప్రవక్తా ! నీవు వారితో) ఇట్లనుము : (ఆపద ఐతే వచ్చిపడిన మాట వాస్తవమే. కాని) మీరు

చేతులతో తెచ్చిపెట్టుకొన్నదే కదా ఇది. (మీరు దౌర్బల్యము చూపక, భగవదాజ్ఞోల్లంఘనము చేయకపోయినచో ఈఆపద తటస్థింపకుండెడిది.) జ్ఞాపక ముంచుకొనుడు, భగవంతుని శక్తికి సమస్తమును లోబడియున్నది.

166-7. రెండు సైన్యములు ఒకదానినొకటి (ఒహోద్ యుద్ధ రంగములో) ఎదుర్కొనినప్పుడు జరిగినదంతయు భగవదాజ్ఞానుసారమే జరిగినది. (జయాపజయముల నియమ మిదే విధముగ నిర్ణయింపబడినది.) విశ్వాసవంతుల పరీక్షకై ఈసంఘటన జరిగినది. వంచకులకు కూడ (ఇదొక పరీక్ష.) దీనివల్ల వారి వంచకబుద్ధి (తెలిసి పోయెను.)

"రండు; భగవన్మార్గమున (బయటకు వచ్చి) యుద్ధముచేయుడు; లేదా (పట్టణములో ఉండి దానిపై శత్రువులదాడి) జరుగకుండ చేయుడు" అని వారితో చెప్పబడెను.

(దానికి వారిట్లు జవాబు)చెప్పిరి: "యుద్ధము తప్పక జరుగునని మాత్రము తెలిసియుండినచో* మేము తప్పక మీకు తోడైయుం దుము." (ఈ మాటలు వారన్న)నాడు వారు విశ్వాసమునకంటె అవిశ్వా సమునకే ఎక్కువ చేరువనుండిరి. వారు పైకి చెప్పు ఈమాటలు నిజముగ వారి హృదయములలో లేనివి. వారు (తమ హృదయములలో) దాచునదంతయు భగవంతు డెఱుగును.

168. తాము (యుద్ధరంగమునకు పోక) ఇండ్లలోనుండి (యుద్ధ రంగమునకు పోయిన) తమ సోదరుల నుద్దేశించి వారిట్లందురు: "వారు మామాట వినియుండినచో వధింపబడకుండ నుందురు." (ఓప్రవక్తా! వారితో) ఇట్లు చెప్పుము: "మీరు చెప్పుచున్నది నిజమే యైనచో మీకు మృత్యువానన్నమైనప్పుడు దానినుండి తప్పించుకొనుడు."

169. (ఓ ప్రవక్తా!) భగవన్మార్గమున వధింపబడిన వారిని గురించి వారుచనిపోయిరని భావింపకుము. వారు బ్రతికియేయున్నారు.

* 'మాకు యుద్ధముచేయుటయే వచ్చియుండినచో' అనియు, 'యుద్ధమే జరిగి నచో' అనియు మూడువిధముల దీని అర్థము చెప్పవచ్చును.

(మూజిహుల్ ఖుర్ అన్. పుట 70)

7

వారు తమ భగవంతుని సమక్షమున (ఆధ్యాత్మికమగు) ఆహారమును బడయుచున్నారు.

170. భగవంతుడు అనుగ్రహముతో ప్రసాదించినదానితో వారు *సుఖముగనున్నారు. వారితో ఇంకను (వెళ్ళి) కలియక ప్రపంచమున వారి వెనుక దిగబడినవారు కూడ — వారికెట్టిభయశోకములును లేవని సంతోషముతో నున్నారు.

171. వారు భగవంతుని ప్రసాదమునకును అనుగ్రహమునకును ఆనందపరవశులగుచున్నారు. విశ్వాసవంతుల సత్కార్యముల ఫలమును భగవంతుడు వ్యర్థమొనర్పడు.

## పదునెనిమిదవ ఖండము

172. భగవంతునియొక్కయు, అతని ప్రవక్తయొక్కయు పిలుపునకు తలయొగ్గి క్షతగాత్రులయ్యు యుద్ధమునకు సిద్ధపడిన వారిని, వారిలో సత్కార్యాచరణపరులును, దైవభీతిపరులును అగు వారిని భగవంతుడు బహూకరించును.

173. వీరితో కొందరిట్లనిరి: "వారు (మీ శత్రువులు) మిమ్ములను ఎదుర్కొనుటకై (ఒకపెద్ద సైన్యమును) కూడబెట్టినారు. అందుచే వారికి భయపడుడు (వారి నెదుర్కొనుటకు బయటకురాకుడు") (కాని ఈ మాట విని వారు భీతావహులగుటకు బదులు) వారివిశ్వాసము మరియు దృఢతరమాయెను. వారు (నిర్భయులై ఇట్లు) చెప్పసాగిరి: "మాకు అల్లాః (ఆశ్రయముండిన) చాలును. (భగవంతుడు) అత్యుత్తముడగు వ్యవహర్త. (మా వ్యవహారములను చక్కబెట్టుటకు భగవంతుని కంటె మంచి వ్యవహర్త మాకులేడు.)

174. (తర్వాత నిర్భీతులై యుద్ధరంగమునకు బయలుదేరి) వారు భగవంతుని బహుమానమును, అనుగ్రహమును బడసి (విజయముతో) మరలిరి. వారి నెట్టిబాధయు స్పృశింపలేదు. వారు భగవంతుని ఇష్ట

* అనగా భగవన్మార్గమున మరణించిన యోధులు.

మునకై పాటుపడిరి. (ఇది భగవదనుగ్రహము ) భగవంతుడు గొప్పగా అనుగ్రహము చూపువాడు.

175. దుష్టుడగు సైతానే తన మిత్రులకు భయపడు డని మిమ్ముబోధింపవచ్చును. మీరు విశ్వాసవంతులైనచో వారికిని, (సైతాను అనుయాయులకును) భయపడక నాకే భయపడుడు. (మీరు భగవంతునకు మాత్రమే భయపడినచో మిమ్ములను ఈ ప్రపంచపు ఏ శక్తియు భయపెట్టజాలదు.)

176. (ఓ ప్రవక్తా!) తొందరపడి అవిశ్వాసమార్గమున పోవు వారిని చూచి ఖిన్నమనస్కులు కాకుడు. వారు భగవంతుని దేమియు చెఱుపజాలరు. (వారు తమకు తామే నష్టపడుచున్నారు.) పరలోకమున (అక్కడి సౌఖ్యములందు) వారికెట్టి భాగమును లభింపజేయకుండుట భగవంతు నిష్టము. తుదకు వారికి ఘోరశిక్షకలదు.

177. విశ్వాసమును అమ్మి, అవిశ్వాసమును కొనువారు భగ వంతున దేమియు చెఱుపజాలరు. వారికి దుఃఖకరమగు శిక్షకలదు.

178. మేము అవిశ్వాసులకిచ్చు గడువు తమకు మంచిదేయని వారు అనుకొనకుందురు గాక! (తమకిచ్చిన అవకాశమును పోగొట్టుకొని దుర్మార్గముననే యున్నచో) వారి పాపములు (మరింత) హెచ్చుటకే మేము గడువు నొసగెదము. (తుదకు) వారికి లజ్జాకరమగు శిక్షకలదు.

179. పవిత్రులను అపవిత్రులనుండి వేరుపరచునంతవరకు విశ్వాసవంతులను ఇప్పుడు మీకున్న (దు)స్థితియందే భగవంతుడు విడిచిపెట్టడు.

అతీంద్రియములగు విషయములను (సామాన్యులగు) మీ (యందర)కు తెలియజేయుట భగవంతుని విధానము కాదు. (కాని ఈ రహస్యవిద్యను ప్రసాదించుటకై) భగవంతుడు తనప్రవక్తలలో ఇష్టము వచ్చినవారిని ఎన్నుకొనును.౮౫

అందుచే (ఓ వంచకులారా!) భగవంతుని, అతని ప్రవక్తలను విశ్వసింపుడు. (ఇప్పుడైనను మీరు పశ్చాత్తాపపడి) విశ్వాసము కుదుర్చుకొని, సత్కార్యాచరణ పరులైనచో మీకు మిక్కిలి గొప్పఫలము లభించును.

180. భగవంతుడు తన అనుగ్రహముచే ప్రసాదించిన (ధన ధాన్య విద్యా) సంపదలను దానము చేయునెడ లోభము చూపువారు ఆ లోభబుద్ధి తమకు లాభకరమని అనుకొనకుందురు గాక! వాస్తవముగ అది వారికి (నష్టము కలిగించు) ఒక దుర్గుణము. ఏసంపదను వ్యయపరచుటయం దిక్కడ లోభించిరో, ఆ సంపదలు (వారికి శాస్తియగునట్లు) తుదిదినమున వారి మెడలకు సంకెళ్లుగా చేయబడి వ్రేలాడగట్టబడును. (జ్ఞాపక ముంచుకొనుడు. ఇది నాది, అది నాది అని మీ రనుకొనుచున్న దేదియు వాస్తవముగ మీది కాదు.) భూమ్యాకాశము లందున్న సర్వస్వమును భగవంతునిసొత్తే (అని మరువకుడు.) మీరు చేయుచున్న దంతయు భగవంతుడెఱుగును.

## పందొమ్మిదవ ఖండము

181. "(మాటిమాటికి దేవునిపేర దాన మర్థింపబడుచున్నది. కాబోలు) భగవంతుడు యాచకుడు, మేము ధనికులము" అని చెప్పువారి ఎత్తిపొడుపును నిశ్చయముగ భగవంతుడు విని యేయున్నాడు. వారి ఈ మాటలను మేము వ్రాసియుంతుము. (అంతేకాదు;) వారు (సన్మార్గము నుపదేశించు) ప్రవక్తలను అన్యాయముగ వధించినదియు (వ్రాసియుంతుము.) (వారి ఈ కర్మలు పరిపాకమైన పిదప) "దుఃఖభాజకమైన ఈ నరకాగ్నియొక్క శిక్షను చవిచూడుడు" అని మేమందుము.

182. మీ రింతకుముందు మీ చేతులతో చేసుకొనినదాని ఫల మిది. అంతేకాని భగవంతుడు తన సేవకులను హింసింపడు.

183. "అగ్నిచే గ్రసింపబడిన హవిస్సును తెచ్చినగాని ఎట్టి ప్రవక్తనైనను విశ్వసింప వలదని మా కడ భగవంతుడు వాగ్దా

నము గైకొనినాడు." అని చెప్పువారితో (ఓ ప్రవక్తా!) ఇట్లనుము: "నాకు పూర్వము స్పష్టమగు చిహ్నములతోడను, మీరడుగుచున్న దానితో సైతము ప్రవక్తలు వచ్చిరి. మీరు సత్యమే పలుకుచుండినచో వారిని మీరేల వధించిరి? (చెప్పుడు)"

184. (ఓప్రవక్తా!) ఇప్పుడు వీరు నిన్ను నిరాకరించుచున్నచో (అది వీరికి క్రొత్తకాదు. వీరు నిరాకరించినది నిన్నొక్కనినే కాదు.) నీకు పూర్వము స్పష్టమగు చిహ్నములతోడను, (జ్ఞానపూర్ణమగు చిన్నచిన్న) గ్రంథముల* తోడను, (ధర్మ) ప్రకాశకమగు గ్రంథముతోడను వచ్చిన ఎందరో ప్రవక్తలు వీరిచే నిరాకరింపబడిరి.

185. (ఓవిశ్వాసవంతులారా! జ్ఞాపకముంచుకొనుడు.) ప్రతిప్రాణియు చావు చవిచూచి తీరవలెను. మీరు చేయు కర్మఫలమును (మరణానంతరము) తుదిదినముననే పూర్తిగా పొందుదురు. ఎవడు ఆ నాడు నరకాగ్నినుండి దూరముగ తొలగింపబడి స్వర్గోద్యానమున ప్రవేశము పొందునో అతడే సాఫల్యభాగ్యము నందినవాడు. ఈ ఐహిక జీవితము (విషయవాంఛలతోకూడిన) మోసపు సామగ్రిగాని వేరొంండు కాదు.౧౮

186. మీధనములతోడను ప్రాణములతోడను మీరు తప్పక పరీక్షింపబడుదురు. మీకు పూర్వము భగవద్గ్రంథమును పొందిన వారియొక్కయు, బహుదైవతారాధకులయొక్కయు తిట్లు తినవలసి వచ్చును. మీరు ఓర్పు వహించి దౌష్ట్యమునుండి తొలగి చరింపుడు నిశ్చయముగ ఇది మిక్కిలి మనోదార్ఢ్యముతో కూడిన విషయము.

---

* కొందరు ప్రవక్తలు చిన్న చిన్న ధర్మగ్రంథములును, కొందరు పెద్ద ధర్మగ్రంథములను ఆయాకాలముల అవసరములను బట్టి తెచ్చిరని ఇక్కడ భావము.

"జబుర్" అనగా "పలకలు" లేక "వ్రాయబడిన పలకలు" అని అర్థము.

"జబూర్" దావూదు ప్రవక్తకు ప్రోక్తమైన గ్రంథము పేరు

ఇక్కడ 'జబురి' అను శబ్దమునకు ధర్మగ్రంథములని అర్థము.

187. భగవద్గ్రంథము ఎవరికి ప్రసాదింపబడెనో భగవంతుడు వారి కడ (ఈవిధమగు) సమయము గైకొనెను:

"(ఈగ్రంథములో నున్న సర్వవిషయములను) మానవు లందరకు బాగుగాబోధించి చెప్పుడు. (భగవద్గ్రంథమును) దాచకుడు"

కాని వారు భగవద్గ్రంథమును (ఉపేక్షాభావముతో) వెనుకబడ వైచిరి. దానిని నీచమగు మూల్యమునకు అమ్మివైచిరి. (సత్యము నిట్లు విక్రయించుటవల్ల వచ్చిన) ఈ మూల్యము ఎంత దుష్టమైనది!

188. (ఓ ప్రవక్తా!) తమ చేష్టలకు సంతోషించుచు తాము ఎన్నడును చేయని కార్యములకు ప్రశంసింపబడవలెనని కోరు వీరు (రాబోవు) శిక్షనుండి తప్పించుకొనగలరని అనుకొనకుము. వారికొఱకు దుఃఖదాయకమగు శిక్ష కలదు.

189. భూమ్యాకాశముల రాజ్యమంతయు భగవంతునిదే. సమస్తవస్తువులపైనను భగవంతున కధికారమున్నది.

## ఇరువదియవ ఖండము

190. భూమ్యాకాశముల సృష్టిలో, రాత్రింబగళ్ల మార్పులో నిశ్చయముగ బుద్ధిమంతులకొఱకు (భగవంతుని) చిహ్నములు కలవు.

191. నిలిచియుండియు, కూర్చొనియుండియు, (ప్రక్కలపై) పరుండియు భగవన్నామ చింతనము చేయువారు భూమ్యాకాశముల సృష్టినిగూర్చి తరచి, ఆలోచించి (ఇట్లందురు):

"ప్రభూ! ఇదంతయు నీవు వ్యర్థముగ సృష్టింపవైతివి. నీవు పరిశుద్ధుడవు. (నీవుచేయు ఏదియు వ్యర్థముగాని, దోషయుతముగాని కాజాలదు.) (ప్రభూ!) మమ్ములను నరకాగ్నియొక్క దుఃఖమునుండి రక్షింపుము."

192. "ప్రభూ! నీవు నరకాగ్నియందు ఎవనిని ప్రవేశింపజేసితివో వాని నెంతయు అవమానమునకు పాల్పరచినావు. (అప్పుడు) దుర్మార్గులకు ఎవరును సహాయము చేయరారు."

193. "ప్రభూ ! నిశ్చయముగ విశ్వాస మార్గము వైపునకు పిల్చు ఒక ఆహ్వాయకుని పిలుపును వింటిమి."

'మీరు ప్రభువైన భగవంతుని యెడ విశ్వసింపుడు.' (అని ఆ ఆహ్వాయకుడు పిల్చెను.)

"(మేము మా పిలుపు విని తత్ప్రకారము) విశ్వసించితిమి. కాన, ప్రభూ! మా పాపములను క్షమింపుము. మా కుచేష్టలను కప్పిపుచ్చుము. సత్పురుషులతో మేముమరణించునట్లు వరము ప్రసాదింపుము."

194. "ప్రభూ ! నీవు మా కిచ్చెద నని నీ ప్రవక్తలద్వారా వాగ్దానమిచ్చిన వన్నియు మాకు ప్రసాదింపుము. తుదిదినమున మేము అవమానితులము కాకుండునట్లు చేయుము. నిశ్చయముగ నీవు వాగ్దానభంగ మొనర్పవు."

195. వారి ప్రభువు వారి ఈ ప్రార్థనల నాలించెను. (అట్లు ప్రార్థనల నాలించి భగవంతు డిట్లు సెలవిచ్చెను )

"నిశ్చయముగ నేను మీలో ఎవరైననుసరే కావించిన కర్మలను వ్యర్థపుచ్చను. (చేయునది) స్త్రీ యైనను పురుషు డైనను సరే. ఎందుకన మీరొకరినుండి యొకరుద్భవమైనవారు. (కర్మఫలముల విషయములో అందరును సమానులే.)

"అందుచే (భగవన్మార్గమున) తమఇండ్లు విడిచిపెట్టి వెళ్ళిపోయిన వారియొక్కయు, ఇండ్లనుండి వెళ్ళగొట్టబడిన వారియొక్కయు, నామార్గమున బాధింపబడిన వారియొక్కయు, (నామార్గమున) పోరాడి హతులైనవారి యొక్కయు (వారి సత్కృతులు వ్యర్థముకావు. అంతేకాదు వారి) కుచేష్టలను (సైతము) నేను తప్పక కప్పిపుత్తును. వారిని తప్పక నిర్ఝరులు ప్రవహించు సుందరోద్యానములందు ప్రవేశింపజేతును. అది అల్లాః ప్రసాదించు ఫలము. అల్లాఃయే శ్రేష్ఠమగు ఫలములను ప్రసాదించువాడు."

196. విశ్వాసహీనులు (భోగభాగ్యములతో తులతూగుచు) నగరములలో విహరించుచుండుటను చూచి మోసపోకుడు.

197. వారి యీ భాగ్యము తాత్కాలికము. దాని తర్వాత వారి నివాసము నరకము. నరకమెంతటి తుచ్ఛనివాసము !

198. కాని ఎవరు భగవంతునియెడ భయభక్తులుకలిగి (తమ విధ్యుక్తములను శ్రద్ధాభక్తులతో నిర్వర్తింతురో) వారికొఱకు నిర్ఝరులు ప్రవహించు సుందరోద్యానము లివ్వబడును. వారి కందే నిత్యనివాసము కలదు. వారిప్రభువు వారికిచ్చు ఆతిథ్యమది. అల్లాః ప్రసాదించు ఫలము అత్యంత శ్రేష్ఠమైనదేయగును.

199. భగవద్గ్రంథము ప్రసాదింపబడిన వారిలో కొందరు భగవంతునియందును, నీకు ప్రోక్తమైనదాని (సత్యగ్రంథము) యందును, వారికి (ఇంతకుముందు) ప్రసాదింపబడిన భగవద్గ్రంథమునందును విశ్వసింతురు. వారు అల్లాః సమక్షమున వినయ వినమితాంగులైన వారు. వారు భగవదాదేశములను నీచమూల్యమునకై విక్రయించి వేయు (మూఢులవంటి) వారుకారు. నిశ్చయముగ (అట్టివారి కెట్టి భయ శోకములు నంటవు.) వారిని భగవంతుడు బహూకరించును. భగవంతుడు (పుణ్యపాపఫలముల) లెక్కనుంచుటలో ఆలసింపడు.

200. ఓ విశ్వాసవంతులారా ! క్షమా ధైర్యస్థైర్యములను వహించియుండుడు.* దృఢనిశ్చయులై యుండుడు. నిశ్చలచిత్తులై యుండుడు. భగవంతునికే భయపడుడు. మీకప్పుడే జయశ్రీ లభించును.

---

* ఇక్కడ 'ఇస్బిరు' అను శబ్దమును "క్షమా ధైర్య స్థైర్యములు వహించియుండుడు" అని తెనిగించితిని. 'సబ్రుఞ్' శబ్దమునకు "క్షమ, ధైర్యము, స్థైర్యము, ఆత్మసంయమనము, నిశ్చయదార్ఢ్యముకలిగి యుండుట" అని పూర్తిఅర్థము.

بسم الله الرحمن الرحيم

# అధ్యాయము ౪

# స్త్రీలు*

## (అన్నిసా)

(మదీనాయం దవతరించినది. ౨౪ ఖండములు.)

(౧౭౬ సూక్తులు)

కరుణామయుడును వరప్రదాయకుడును అగు

అల్లాః నామస్మరణముతో (ప్రారంభించుచున్నాను.)

1. ఓ మానవులారా! అల్లాః (ఆజ్ఞల నుల్లంఘించుటవలని దుష్ఫలితమున) కు భయపడుడు. (భగవంతుడు) మిమ్ములనందరిని ఒకే ప్రాణినుండి సృష్టించెను. అదే ప్రకృతినుండి వానికి జోడై యుండుటకు (స్త్రీని) పుట్టించెను. వారి ఇద్దరినుండియు పెక్కండ్రు పురుషులను స్త్రీలను (పుట్టించి ప్రపంచమంతటను) వ్యాపింపజేసెను. (ఈ విధముగ ఒకే తలిదండ్రులనుండి ఉద్భవించినను మానవకుటుంబము వివిధజాతులుగ వర్ధిల్లి ప్రపంచమంతయు అల్లుకొనెను.) ఏ అల్లాః పేర మీరు ఒకరిపై ఒకరికి గల హక్కులను కోరుచున్నారో అతనియెడ భయభక్తులతో ప్రవర్తించుచు మీ విధ్యుక్తములను నిర్వర్తింపుడు. (మీలో ఒకరితో నొకరికి గల) బాంధవ్యముల (విషయములో ఉపేక్షవహింపకుడు.) (వారి హక్కులను కాపాడుడు.) భగవంతుడు మీకు సంరక్షకుడైయున్నాడు.౯౦

2. తల్లిదండ్రులులేని అనాథుల ఆస్తిపాస్తులను (న్యాయబుద్ధితో వారికి) ఇచ్చివేయుడు. (వారి) మంచి వస్తువులను (మీరు) తీసుకొని మీ చెడ్డవస్తువులను వారి కియ్యకుడు. వారి ధనమును మీధనముతో కలిపి అనుభవింపకుడు. ఇట్లుచేయుట గొప్ప పాపకార్యము.౯౧

---

* వ్యాఖ్యానభాగములో ఈ అధ్యాయముపై వ్రాసిన టీకను చూడుడు.

3. (మీరొకసారి వివాహమాడదలచినయెడల) తలిదండ్రులు లేని బాలికలయెడ న్యాయముతో ప్రవర్తింపజాల మను అనుమాన మున్నచో (వారిని వివాహమాడకుడు) మీకు నచ్చిన (ఇతర) స్త్రీలను పెండ్లియాడుడు. (ఒకేసారి) ఇద్దరేసినిగాని, నల్గురేసినిగాని పెండ్లాడ వచ్చును. (మీరు వారితో న్యాయముగ ప్రవర్తించి అందరిని సమానముగ చూడ గలుగుటయు, పోషింపగలుగుటయు మాత్రము షరతు) ఒకసారి మీరు న్యాయము చేయలేమను భయ మున్నచో ఒకే (స్త్రీని) పెండ్లా డుడు. లేక (యుద్ధములో ఖైదీలుగా కొనబడి) మీకు దాసీలై వచ్చిన వారిని (వివాహమాడుడు.) మీరు అన్యాయమార్గము పట్టకుండుటకై మీకిది ఉచితప్రవర్తనము.౯౨

4. స్త్రీలకు మెహర్ ధనమును (శుల్క-ద్రవ్యమును) హృదయ పూర్వకముగ బహుమానముగ ఇచ్చివేయుడు. (మీభార్యలు తల్లిదండ్రులు లేనివా రని వారి నిస్సహాయతవలన లాభమును పొంది వారి శుల్క-ద్రవ్యము నెగ గొట్టకుడు.) ఒకసారి వారు స్వేచ్ఛగా అందులో కొంత విడిచిపెట్టి వైచినచో మీరు దానిని సంతోషముతో వినియోగించుకొనుడు. (అది దోషముకాదు.) ౯౩

5. భగవంతుడు ఆస్తిపాస్తులను మీకు బ్రతుకుతెరువుగా ప్రసాదించినాడు. అందుచే మీరు ద్రవ్యమును బుద్ధిహీనులగు* వారికి ఇచ్చివేయకుడు. (ఒకసారి వారు చిన్నపిల్లలైయున్నచో) వారి ద్రవ్యములనుండి వారి అన్నవస్త్రముల ఏర్పాట్లు చేయుడు. మంచి వియు, ధర్మవిహితమును అగు మాటలు వారికి చెప్పుడు. †

---

* ఇక్కడ "సుఫహా" అను శబ్దమునకు 'బుద్ధిహీనులు' అని అర్థము. యుక్త వయస్సురాని పిల్లలు, ఉన్మాదులు, మతి స్థిరముగాలేనివారు, దుశ్శీలురు, దుర్వ్యయము చేయువారు కూడ ఈ శబ్దార్థము క్రిందికి వత్తురని ఇబ్నె కసీర్. స్త్రీలుకూడా ఈ అర్థము క్రిందికి వత్తురని కొందరి అభిప్రాయము.

(ఇబ్నె కసీర్ సం. 4 పుట 70)

† 'వారికి విద్యాబుద్ధులు గరపుడు' అని దీని భావము. 'వారితో మధురముగ భాషింపుడు' లేక 'వారితో మంచిమాటల నాడుడు' అనియు కొంద రర్థమువ్రాసిరి.

6. తల్లిదండ్రులు లేని పిల్లల స్థితిగతులను విచారించుచు వారికి యుక్తవయస్సు♦ వచ్చువరకు (వారి ప్రవర్తనమును) పరీక్షించుచుండుడు. (అప్పుడు) వారిలో యోగ్యత కన్పించినచో వారిఆస్తిపాస్తులను వారికి ఇచ్చివేయుడు.

పిల్లలు వయస్సునకు వచ్చినతర్వాత అడుగుదురను భయముచే త్వరత్వరగ వ్యర్థవ్యయమొనర్చి వారి ఆస్తిపాస్తులను, ద్రవ్యమును మ్రింగివేయకుడు. ధనికుడైనవాడు (తల్లిదండ్రులులేనిపిల్లల ధనమును) ఎంతమాత్రమును (స్వంతమునకై) వినియోగించరాదు. బీదవాడు (తల్లిదండ్రులులేని పిల్లల ధనముయొక్క వ్యవహర్తయైనచో) న్యాయబద్ధమగు (ఒకచిన్న) మొత్తమును వ్యయపరచుకొనవచ్చును. (అట్టి పిల్లల) ద్రవ్యమును, ఆస్తులను వారికి తిరిగి ఇచ్చివేయునప్పుడు (కొందరు) సాక్షుల నుంచుకొనుడు. (జ్ఞాపక ముంచుకొనుడు.) భగవంతుడే లెక్కపెట్టుటకు చాలును. (మీరు చేయుచున్న లెక్కలకు భగవంతుడు సాక్షియై యున్నాడనియు, భగవంతునికంటె ఎక్కువలెక్కలను చూచువా రెవ్వరును లేరనియు జ్ఞాపకముంచుకొనుడు.)

7. తల్లిదండ్రులును, దగ్గరి బంధువులును విడిచిపెట్టివెళ్ళిన ఆస్తియందు పురుషులకు భాగము కలదు; తల్లిదండ్రులును దగ్గరి బంధువులును విడిచిపెట్టి వెళ్లిన ఆస్తియందు అదేవిధముగ స్త్రీలకును భాగము కలదు. అది చిన్నదైనను, పెద్దదైనను సరే. ఈ భాగము (భగవంతునిచే) నిర్ణీతమైనది.

8. ఆస్తివిభజన సమయములో (దూరపు) బంధువులును, (మీవంశమునకు చెందిన) తల్లిదండ్రులు లేని పిల్లలు, బీదలును ఉండినచో వారికి కూడ కొద్దియో గొప్పయో ఇయ్యుడు. వారితో ప్రేమతో మాట్లాడుడు.

9. (హక్కు గలవారి హక్కును భంగపరచుటకు) వారు భయపడుదురుగాక! ఒకసారి వారు బలహీనులగు సంతానమును విడిచిపెట్టి

♦ 18 వ ఏడు దాటిన మైనారిటీ దాటునని హనఫీ మతము.

వెళ్లినచో వారిని గుఱించి వారెంత భయపడుదురు! (అట్లే ఇతరుల విషయములో కూడ అని భావింపదగును.) అందుచే అల్లాఃకు భయపడుడు. న్యాయయుక్తమగు మాటలనే చెప్పుడు.

10. ఎవరు తల్లిదండ్రులు లేని పిల్లల ఆస్తిని అన్యాయముగ తిందురో వారు తమ కడుపులను నిప్పుతో నింపుకొనుచున్నారు. మరి వారు ప్రజ్వలితమగు అగ్నిని ప్రవేశింతురు.

## రెండవ ఖండము

11. మీ సంతానము (యొక్క వారసత్వపు హక్కు) ను గుఱించి భగవంతుడు (ఇట్లు) ఆజ్ఞాపించుచున్నాడు:— పురుషుడు ఇద్దరు స్త్రీలకు సమానమగు భాగమున కర్హుడు.

ఒకసారి ఇద్దరికంటె ఎక్కువమంది కూతుళ్లున్నచో వారికి పైతృకములో మూడింట రెండు పాళ్లు రాదగును.

ఒకసారి ఒక్కతే కూతురున్నచో ఆమెకు సగము భాగము రావలెను.

మరణించినవాని తల్లిదండ్రులకు ప్రతియొక్కరికి ఆరవభాగము లభించును. ఇది మరణించినవానికి సంతానమున్న పక్షమున. ఒకసారి సంతానము లేకపోయి అతని వారసులు కేవలము తల్లిదండ్రులే యైనచో తల్లికి మూడవవంతు (లభించును. తక్కినది తండ్రిది)

ఒకసారి (తల్లిదండ్రులేకాక) మరణించినవానికి ఒకరికంటె ఎక్కువ అన్నదమ్ములుగాని, అక్కచెల్లెండ్రుగాని ఉన్నచో తల్లికి ఆరవవంతు మాత్రము లభించును. (తక్కినది తండ్రిది.)

కాని (మరణించిన వ్యక్తి) మరణశాసనము (వ్రాసియుండినచో దాని) ప్రకారము జరిపి, (అతనిపై ఉన్న) అప్పులను తీర్చి (మిగిలినదాని నుండియే పైవిధముగ భాగించవలెను.)

(చూడుడు:) మీ తండ్రులును, మీ సంతానమును వీరిలో (ఐహికమును ఆముష్మికమును అగు) లాభమునుబట్టి ఎవరిసంబంధము మీ కన్నిటికంటె సన్నిహితమో (దానినిబట్టి ఎవరికి ఎక్కువ హక్కు లభించవలెనో, ఎవరికి తక్కువ లభించవలెనో భగవంతుడే నిర్ణయించగలడు.) అది మీకు తెలియదు. (అందుచేతనే) భగవంతుడు (ఎవరెవరి కెంతభాగము లభించవలెనో ఆయా) భాగములను ఈ విధముగ నిర్ణయించినాడు. భగవంతుడు సర్వజ్ఞుడు; ప్రజ్ఞానిధి.

12. మీ భార్యలు విడిచిపెట్టి పోయినదానిలో, వారికి సంతానము లేనిపక్షమున, మీకు సగముభాగము లభించును. సంతానమున్నచో నాల్గవభాగము (లభించును.) కాని ఈ విభాగము (ఆమె చేసిపోయిన) మరణశాసనము ప్రకారము జరిపి, (ఆమె చేసిపోయిన) అప్పులు తీర్చినతర్వాత మిగిలినదానికి మాత్రము చెల్లును.

మీరు (భర్తలు) విడిచిపెట్టిన దానిలో, మీకు సంతానము లేకపోయినచో, భార్యలకు నాల్గవభాగము లభించును. (మీకు) సంతానమున్నచో (భార్యలకు) ఎనిమిదవభాగము (మాత్రము లభించును.) మీరు చేసిన మరణశాసనము ననుసరించి జరిపి, మీరు చేసిపోయిన అప్పులను తీర్చిన పిదప (పైచెప్పిన విధమున) విభాగము జరుగవలెను.

పురుషుడైనను స్త్రీయైనను ఏదైన (ఆస్తిని, సొత్తును) విడిచిపెట్టి పోయినప్పుడు, అతనికిగాని ఆమెకుగాని తల్లితండ్రులుగాని సంతానము గాని లేనిపక్షమున, ఒక సోదరుడుగాని ఒక సహోదరిగాని ఉండిన పక్షమున (ఈవిధముగ విభాగము జరుగవలెనని) ఆజ్ఞ: సోదరీ సోదరులలో ప్రతి ఒక్కరికి ఆరవభాగము. ఒకసారి (సోదరీ సోదరులు) ఒకరికంటె ఎక్కువగనున్నచో (ఆస్తిని మూడుభాగములుచేసి అందలి) ఒక మూడవ భాగములో అందరును సమానభాగములు వేసుకొనవలెను.

కాని మరణించిన వ్యక్తి విడిచిపెట్టి వెళ్లిన మరణశాసనము ప్రకారము జరిపి, చేసివెళ్లిన అప్పులను తీర్చగా మిగిలినదానిపై

(పై నుదహరించిన విభాగము చెల్లును.) షరతు ఏమనగా (మరణశాసనము యొక్కయు అప్పుయొక్కయు) ఉద్దేశము (హక్కుదారులకు) నష్టముకలిగించుట కాకుండ నుండవలెను.

ఇది (ఆస్తి విభాగవిషయములో) భగవంతుడు ప్రసాదించిన ఆజ్ఞ: (జ్ఞాపకముంచుకొనుడు) భగవంతుడు సమస్తమును తెలిసిన వాడు. (మానవుని దౌర్బల్యమును గుర్తించి తన ఆజ్ఞలను ప్రసాదించుటలో) దాక్షిణ్యమును చూపువాడు.

13. ఇవి భగవంతు డేర్పరచిన హద్దులు. ఎవరు భగవంతుని యొక్కయు అతని ప్రవక్తయొక్కయు ఆజ్ఞలకు బద్ధులై యుందురో అట్టివారు స్వర్గమును ప్రవేశింతురు. అందు స్వచ్ఛమైన నిర్ఝరులు ప్రవహించుచున్నవి. వారి కందే స్థిరనివాసము.

వీరిదే మహావిజయము.

14. (అట్లుకాక) ఎవడు భగవంతుని యొక్కయు అతని ప్రవక్తయొక్కయు ఆజ్ఞల నుల్లంఘించి విధివిహితమగు హద్దుల నతిక్రమించునో వాడు నరకాగ్నిని ప్రవేశించి అందే యుండును. వానికి అత్యంత అవమానకరమగు శిక్ష లభించును.

## మూడవ ఖండము

15. మీ స్త్రీలలో ఎవతెయైన దుష్ప్రవర్తకురాలైనచో* (ఆమె దుష్ప్రవర్తనమునుగూర్చి) మీ నుండి నలుగురను సాక్ష్యుల నుంచుకొనుడు. (ఆ నలుగురు) సాక్షులు సాక్ష్య మిచ్చినచో అట్టి స్త్రీలను ఇండ్లలో నిర్బంధించి యుంచుడు. మృత్యువు వారి ఆయుస్సును హరించువరకుగాని, భగవంతుడు వారికొఱకై దైన మంచి మార్గము చూపించు వరకు (అట్లే కట్టి యుంచుడు.)

* ఇక్కడ 'ఫాహిషిత' అను శబ్దమునకు 'వ్యభిచారము చేసినచో' అనియు కొంద రర్థముద్వ్రాసిరి. 'స్త్రీలు స్త్రీలతో వ్యభిచరించుట' అనియు కొంద రర్థము వ్రాసిరి. (చూ. అబుల్ కలాం, సం. 1 పుట 333.)

16. మీలో ఎవరైన ఇద్దరు పురుషులు పరస్పరము కామాసక్తులై ప్రవర్తించినచో వారిని శిక్షింపుడు. ఒకసారి వారు పశ్చాత్తాపపడి సరియైన మార్గమునకు వచ్చినచో వారిని పోనిండు. భగవంతుడు పశ్చాత్తప్తులను క్షమించువాడు; కరుణామయుడు ౯.

17. ఎవరు అజ్ఞానముచే తప్పొనర్చి, వెంటనే పశ్చాత్తప్తులగుదురో వారియెడ భగవంతుడు దయచూపును. భగవంతుడు సర్వము నెఱిగినవాడు; ప్రజ్ఞానిధి.

18. (ఎడతెగకుండ తమజీవితకాలమంతయు) పాపకృత్యములొనర్చువారి పశ్చాత్తాపము (నిజమైన పాపఖేదము) కాదు. వారిలో ఎవనికైన మృత్యు వాసన్నమైనప్పుడు వాడు "ఇప్పుడు నేను పశ్చాత్తాపపడుచున్నాను." అనును. అవిశ్వాసులై మరణించువారి (పశ్చాత్తాపము కూడ పశ్చాత్తాపము) కాదు. వీరందరికొఱకు కఠినమగు శిక్ష సిద్ధపరుపబడియున్నది.

19. ఓ విశ్వాసవంతులారా! (మరణించిన వాని) స్త్రీలను వారసత్వముక్రింద వారి ఇష్టమునకు వ్యతిరేకముగ స్వాధీనపరచుకొనుట మీకు నిషేధింపబడినది.

మీరు స్త్రీలకు ఇచ్చివేసిన (ఆస్తియు, సొత్తయు) వారి నుండి తిరిగి తీసుకొనుటకు వారిని నిర్బంధించి యుంచకుడు. వారుస్పష్టముగ దుష్ప్రవర్తకురాండ్రైన తప్ప (వారిపై కాఠిన్యము చూపి, వారిని నొక్కియుంచుటకు ప్రయత్నింపకుడు.)

స్త్రీలతో వ్యవహరించునప్పుడు దయాదాక్షిణ్యములతోడను న్యాయముతోడను ప్రవర్తింపుడు. ఒకసారి వారనిన మీకు (ఏకారణముచేనైనను) అయిష్టముగ నున్నచో (హద్దుల నతిక్రమించకుడు.) మీకు వారిలో ఒక్క విషయము అయిష్టముగనుండిన నుండవచ్చును. కాని భగవంతుడు దానియందే మీ కెంతో శ్రేయస్సు సమకూర్చవచ్చును. ౯౦

20. ఒకసారి మీరు (మీ కిష్టములేక సంతోషపూర్వకముగ సంసారముచేయజాలక) ఒక భార్యను విడిచి ఆమెకు బదులు మరొక భార్యను పెండ్లాడ నిశ్చయించినచో, ప్రథమభార్యకు మీరు (వెండి బంగారముల) ఒకరాశియైనను (మెహర్ రూపమునను, ఆభరణాదులుగను) ఇచ్చియుండినచో (ఆమెను విడిచిపెట్టునప్పుడు) దానిలో ఎంత మాత్రమును తిరిగి పుచ్చుకొనరాదు. ఆమెపై అపవాదమును మోపిగాని, విస్పష్టమగు పాపమునకు గడగిగాని మీ రామె కిచ్చిన ధనమును తిరిగి సంగ్రహింప గోరెదరా ?

21. మీ రొకరితో నొకరు భార్యాభర్తలవలె వర్తించిన తర్వాత, (మీ భార్యల వివాహకాలమందు వారి హక్కులను గూర్చి మీకడ) విధిపూర్వకమైన ఒడంబడికగైకొన్న తర్వాత, వారి కిచ్చిన ధనమును తిరిగి మీ రెట్లు పరిగ్రహింపగలరు ? ౯౯

22. మీతండ్రులు పెండ్లాడిన స్త్రీలను మీరు పెండ్లాడకుడు. (ఈ ఆజ్ఞ ప్రసాదింపబడక) పూర్వము జరిగినదానిని పోనిండు. (ఇకముందు జ్ఞాపకముంచుకొనుడు.) ఇది మిక్కిలి సిగ్గుమాలిన పాపకృత్యము. దుష్టమగు దురాచారము.౧౦౦

## నాల్గవ ఖండము

23. (చూడుడు) మీకొఱకు (ఈక్రింది చుట్టరికము గల స్త్రీలు) వివాహమునకై నిషేధింపబడినారు :

మీ తల్లులు;
మీ కూతుండ్లు;
మీ అక్కచెల్లెండ్రు;
మీ తండ్రి అక్కచెల్లెండ్రు;
మీ తల్లి అక్కచెల్లెండ్రు;
మీ అన్నదమ్ముల కూతుండ్లు;
మీ అక్కచెల్లెండ్ల కూతుండ్లు;

మీకు పాలిచ్చిన తల్లులు
మీ తల్లి (లేక పాలిచ్చినతల్లి) పాలుత్రాగిన అక్కచెల్లెండ్రు;
మీ భార్యల తల్లులు

మీ భార్యల (ఇతర భర్తలవల్ల కలిగి) మీ ఒడులలో పెరిగిన సంతానము. (వారు మీకు పుట్టకపోయినను వారి తల్లులను మీరు పెండ్లాడుటచే వారు మీకు సంతానముతో సమానమైనవారు.)

ఒకసారి వారి తల్లులతో మీరు సంగమించని పక్షమున (వారిని వివాహమాడినచో) అది పాపము కాదు.

మీకు పుట్టిన పుత్రుల భార్యలు (మీకోడండ్రు).

ఒకేసారి ఇద్దరు అక్కచెల్లెండ్రను వివాహమాడుటకూడ నిషేధము.

(ఈ ఆజ్ఞ ప్రసాదింపబడక) పూర్వము జరిగినదేదో జరిగినది భగవంతుడు దానిని క్షమించును. భగవంతుడు దయాదాక్షిణ్యపూర్ణుడు.

---

## ఐదవ భాగము

24. ఇతరుల భార్యలు కూడ మీకై నిషేధింపబడినారు. మీకు యుద్ధములో ఖైదీలుగా పట్టుబడ్డవారితో మీరు వివాహము చేసుకొనవచ్చును.

ఇది భగవంతుడు మీకై నిర్ణయించిన ధర్మము.

మీరు కోరి, వారికి మీకు గల సంపదనుండి కానుకలనిచ్చి విషయలాలసత్వమునకాక పవిత్రబుద్ధితో వివాహమాడ దలచినచో (పైన పేర్కొనబడిన) ఈ స్త్రీలు తక్క తక్కిన స్త్రీలందరును మీకు వివాహయోగ్యలు. మీరు (వివాహమాడి) వారివలన లాభము పొందినందుకు వారికి నిర్ణీతమగు మెహెర్ ధనమును వారి కిచ్చివేయుడు. మెహెర్ ధనమును నిర్ణయించుకొని, దాని పిదప మీరు

పరస్పరము (దానిని గూర్చి) ఒడబడినచో మరేమియు బాధలేదు. భగవంతుడు సర్వమును తెలిసినవాడు; ప్రజ్ఞానిధి.

25. విశ్వాసవతులగు స్వేచ్ఛాస్త్రీలను వివాహమాడగల ధన సంపద మీకడ లేకపోయినచో యుద్ధములందు చెరబట్టబడిన విశ్వాస వతులగు స్త్రీలలో నెవతెనైన పెండ్లాడుడు. (మీకు యుద్ధమున లభించిన బానిసస్త్రీతో పెండ్లాడుట గౌరవహీనమైన పని యని భావింపకుడు. అసలు కావలసినది విశ్వాసము. ఇతరవిధములైన గౌరవములు నిజమైన గౌరవములు కావు.) భగవంతుడు మీ విశ్వాసమును ఎఱుగును. (విశ్వాసవతియగు ఒక బానిసకత్తె సత్ప్రవర్తకురాలగుటయు, గొప్ప ఇంట పుట్టిన స్త్రీ సత్ప్రవర్తనము నందు లోపముకలదిగా నుండుటయు సాధ్యము. అందుచే బానిసకత్తెయైనంత మాత్రమున వివాహమాడుటకు జంకకుడు అంతేకాక) మీరు అందరు ఒకే (మానవ) జాతికి చెందినవారు (కదా!)(మానవులగుటచే అందరు సమానులే) ఇట్టి స్త్రీలను వారి యజమానుల అనుమతితో (నిస్సందేహముగ) పెండ్లాడుడు. ఆచారము ననుసరించి వారి కుచితమగు మెహెరును వారి కిచ్చివేయుడు. వారు స్వచ్ఛమగు (వివాహ) నియమములకు బద్ధులై జీవితము గడపువారై ఉండవలెను. అంతేకాని కులటలు కాకూడదు. చాటుచాటున వ్యభిచారము చేయువారై యుండరాదు. (ఇదంతయు జాగ్రత్తగ గమనించి వారు పవిత్రలని విశ్వాసము కుదిరిన పిదప వివాహమాడుడు.)

అట్టిస్త్రీలను వివాహమాడినప్పుడు ఆ స్త్రీలు వ్యభిచరించినచో, స్వేచ్ఛాస్త్రీల కివ్వవలసిన శిక్షయందు సగము శిక్ష వారికి విధించవలెను.

(వివాహమాడనిచో) చెడునడత కలవడుదుమను భయము కల వారికి (ఈ) ఆజ్ఞ ఇవ్వబడినది. అట్లుకాక మీరు ఓర్పువహించి (అను

---

* అనగా నిర్ణీతమైన మెహెర్ ధనమునుగూర్చి భార్యాభర్త లిరువురును ఒడబడి అందులో హెచ్చుతగ్గులు చేసికొనినగాని లేక భార్య తన భర్తయెడ తనకు గల ప్రేమచే తన మెహర్ హక్కులో కొంతభాగమునుగాని పూర్తిగాగాని వదలుకొనినను వదలుకొనవచ్చును. అట్లుచేయుట నిషేధము కాదు అని భావము.

కూల పరిస్థితులు కలుగునంతదాక ఆగినచో) అది శ్రేష్ఠతరమైనది. భగవంతుడు (మానవుని దౌర్బల్యమును) క్షమించువాడు; దయాపూర్ణుడు.

## ఐదవ ఖండము

26. మీకు పూర్వము గడచిపోయిన (సత్పురుషులైన) వారి మత (ధర్మ) ములను మీకు భగవంతుడు స్పష్టముగ వివరించి వారి మార్గమును మీకు చూపగోరుచున్నాడు. (భగవంతుడు) మీపై (దయా) దృష్టి బరప గోరుచున్నాడు. అల్లాః సర్వజ్ఞుడు; ప్రజ్ఞానిధి.

27. భగవంతుడు మీపై (దయా) దృష్టిబరపగోరుచున్నాడు. (మీరిప్పుడు మునిగియున్న చెడుగులనుండి విడివడి మీరు పవిత్రులగుట భగవంతు నిష్టము.) కాని విషయవాంఛల ననుసరించువారు (వారివలెనే) మీరు (కూడ విషయవాంఛలవైపునకు) పూర్తిగా ఒరిగిపోగోరెదరు.

28. అల్లాః మీ (బరువును) తేలికయొనర్ప గోరుచున్నాడు. (ఎందుకన) మానవుడు దుర్బలుడుగా సృష్టింపబడినాడు.

29. ఓ విశ్వాసవంతులారా! ఒకరిసొత్తు నొకరు అన్యాయముగ పొట్టవేసుకొనకుడు. (క్రయవిక్రయరూపమైన) వాణిజ్యమున పరస్పరాంగీకారముతో (కలుగు లాభము మాత్రము అనుభవింపదగినది.)

ఒకరి ప్రాణముల నొకరు హరించుకొనకుడు.*

నిశ్చయముగ అల్లాః మీయెడ దయాదాక్షిణ్యములు కలిగియున్నాడు.

30. దౌర్జన్యమునకును, అన్యాయమునకును పాల్పడి ఇట్లు చేసినచో వారిని త్వరలో నరకాగ్నియందు పడవేతును.

భగవంతున కిది సుకరమే.

31. మీకు నిషిద్ధములగు అతినింద్యమగు (మహాపాతకముల)

---

* "మీప్రాణములను మీరు హరించుకొనకుడు" అనియును అర్థము చెప్పవచ్చును. అనగా ఆత్మహత్య గావించుకొనకుడు అని అర్థము వచ్చును.

నుండి మీరు తప్పించుకొనినచో, మీయందలి తక్కిన చెడుగుల నన్ని టిని తొలగించివైతును. మిమ్ములను గౌరవస్థానమున ప్రవేశింప జేయుదును.౧౦౧

32. భగవంతుడు మీలో ఒకరిపై ఒకరికి అధిక్యత ప్రసాదించి (ఒకరికంటె మరొకరికి విద్యాగౌరవములు అధికముగ నిచ్చి) నాడని (ఒకరినిచూచి యొకరు) అసూయపడకుడు. పురుషులు వారు సంపాదించుకొన్న దాని ఫలితమును వారనుభవింతురు. (అట్లే) స్త్రీలు (కూడ) వారు సంపాదించుకొన్న దానిని వారనుభవింతురు. (ఇట్లు ఎవరు గడించినది వారనుభవింతురు. ఇతరుల కున్నదని అసూయపడుటకంటె మీకు కూడ ప్రసాదించుమని) భగవంతుని అనుగ్రహమునకై వేడుకొనుడు. నిశ్చయముగ భగవంతుడు సర్వము నెఱుగును.౧౦౨

౩౩. తల్లిదండ్రులును, సన్నిహితబంధువులును విడిచిపెట్టివెళ్లిన ఆస్తిలో మేము ప్రతియొక్కరికిని (లాభము కలుగునట్లు) వారసులను నియమించితిమి. మీరు గావించుకొనిన ఒడంబడికలను వాగ్దానములను అనుసరించి వారికా భాగముల నిండు.* (జ్ఞాపకముంచుకొనుడు) భగవంతుడు సర్వసాక్షి. (భగవంతుని దృష్టినుండి యేదియు గుప్తముగ నుండజాలదు.)

---

* "అఖదత్ ఇమానుకుమ్" అను ఇక్కడి మాటమునకు 'మీకుడిచేతులు చేసుకొనిన ఒడంబడికలు' అని అర్థము ఒడంబడిక చేసుకొనునపుడు చేతిపైచేయి వేయుట ఆచారము. అందుచే 'చేతిపై చెయ్యి వేసి చేసుకొనిన ఒడంబడిక లేక వాగ్దానము' అని అర్థమగును. సూక్తి మొదటిభాగములో వారసత్వముయొక్క నిర్ణీతభాగముల ప్రసంగమును, తరువాతి భాగములో ఒడంబడికలు వాగ్దానములు పూర్తిచేయుటను గూర్చినప్రసంగమును చేయబడినది. ఈ ఒడంబడికలందును వాగ్దానములందును భర్తలు భార్యలతో వివాహసమయమునను, తర్వాతను చేసిన వాగ్దానములు కూడ చేరును. ప్రత్యేకముగ ఈఒడంబడికలే ఇక్కడ భావమని మౌలానా అబుల్ కలాం అజాద్, మౌలానా మొహమ్మదలీగార్ల అభిప్రాయము.

(చూ. అబుల్ కలాం, తర్జుమానుల్ ఖుర్ఆన్, సం. 1, పుట 340, మొహమ్మద్ అలీ, బయానుల్ ఖుర్ఆన్ సం. 1, పుట 500)

## ఆరవ ఖండము

34. పురుషులు స్త్రీలను భరించువారు.♦ ఎందుకనగా భగవంతుడు కొందరిని కొందరిపై ఆధిక్యతను ప్రసాదించినాడు. (ఎందుకన పురుషులు) తాము సంపాదించిన సొత్తును (స్త్రీలకై) వ్యయపరచి (వారిని పోషింతురు) ఉత్తమస్త్రీలందుచేతనే (తమభర్తలకు) విధేయులైయుండి భగవంతుడు భద్రపరచి ఇచ్చిన తమ శీలమును రహస్యముననుు పరోక్షముననుు కూడ భద్రపరచుకొందురు.౧౦౩

మిమ్ములనెదిరించి, మిమ్ము విడిచి లేచిపోవుదురని మీకు భయమున్న స్త్రీలను (మనస్సువిరిగి వెంటనే విడిచిపెట్టివేయకుడు,) వారికి (మొట్టమొదట ప్రేమతోడను మెత్తదనము తోడను) అనునయించి బుద్ధిచెప్పుడు. తర్వాత వారితో శయ్యాగారమున వేరుగానుండుడు; (అంతకును వారు కుదురనిచో వారిని భయపెట్టుటకై హానికలుగనట్లు) కొట్టుడు.* అప్పుడు వారు మీ మాట వినినచో (కాఠిన్యము వహించి) వారిపై నేరములు మోపుటకై మార్గముల నన్వేషింపకుడు. భగవంతుడు అందరికంటె ఎక్కువ మహిమాపావిత్ర్యములతో మీ అందరిపైనున్నాడు (అని జ్ఞాపకముంచుకొనుడు). ౧౦౪

35. వారిద్దరి (భార్యాభర్తల) లో విచ్ఛేదము కల్గుట తప్పదని మీకు తోచినప్పుడు ఒక మధ్యవర్తి భర్తపక్షమువానిని, ఒక మధ్యవర్తి భార్యపక్షమువానిని ఇట్లు ఇద్దరిని పరిష్కరించుటకై నియమింపుడు. వారు సమాధానపడుట కిచ్ఛగించినచో భగవంతుడు వారి

---

♦ ఇక్కడ "ఖవ్వామూన" అనుమాటమునకు "ఆహారము చేకూర్చువాడును, కాపాడువాడును, స్త్రీసహజమైన అవసరములను పూర్తిచేయువాడును" అని అర్థము.

* కొట్టిన తర్వాత దెబ్బకనపడునట్లుగాని, గాయమువచ్చునట్లుకాని, ఏదేని అవయవము విరుగునట్లుగాని కొట్టరాదని శ్రీప్రవక్త దీనిని వ్యాఖ్యానించినారు.

చిన్న చిన్న అపరాధములకు తమ భార్యలను కొట్టు పురుషులు సజ్జనులు కారని శ్రీప్రవక్త ఉపదేశము (ఇబ్నెకసీర్. సం. ౯. పుట 21.)

మధ్య అన్యోన్యతను తప్పక కల్గించును. నిశ్చయముగ భగవంతుడు సర్వజ్ఞుడు. సమస్తవిషయముల నరయువాడు.[౧౦౫]

36. భగవంతుని సేవింపుడు. (అసమానుడైన) అతనికి సమానులను కల్పింపకుడు. తల్లిదండ్రులయెడలను, బంధువులయెడలను, తల్లిదండ్రులులేని పిల్లలయెడలను, బీదసాదలయెడలను, బంధువులైన మీ పొరుగువారియెడలను, అపరిచితులైన మీ పొరుగువారియెడలను, సహవాసులయెడలను†, స్నేహితులయెడలను, ప్రయాణీకులయెడలను మీ స్వాధీనములో నున్న (సేవకులు• మొదలైన) వారియెడలను ఉపకారబుద్ధితో ప్రవర్తింపుడు (ధనమదముచే తల్లిదండ్రులను, బంధువులను, బీదసాదలను, ఇరుగు పొరుగువారిని నిరాదరణము చేయు) గర్విష్ఠులను, అహంకారపూరితులను భగవంతుడు ప్రేమింపడు.

37. లోభులను, (తమతోపాటు) ఇతరులను కూడ లోభులై యుండుడని బోధించువారిని, భగవంతుడు తన అనుగ్రహముచే ప్రసాదించిన దానిని (వ్యయపరచుటకు బదులు) దాచియుంచువారిని (కూడ భగవంతుడు ప్రేమింపడు.) (భగవత్ప్రసాదితమగు అనుగ్రహములకు కృతజ్ఞులై యుండుటకు బదులు) కృతఘ్నుత చూపువారికి అవమానకరమగు శిక్ష సిద్ధపరచబడియున్నది.

38. కేవలము ప్రపంచమునకు చూపుటకొఱకు (పేరు ప్రతిష్ఠల కోసము దానధర్మములపై) ధనమును వ్యయపరచుచు, వాస్తవముగ భగవంతునిపైనను తుదిదినముపైనను విశ్వాసములేనివారిని (కూడ భగవం

† "సాహెబి బిల్ జన్బి" అను ఇక్కడ మూలశబ్దమునకు "స్త్రీలు" అని కొందరు వ్యాఖ్యాతలు. "అతిథులు" అని మరికొందరు.

• పెంపుడు జంతువులను పక్షులనుకూడ ఇందు చేర్చవచ్చును—అనువాదకుడు

తుడు (ప్రేమింపడు)* అట్టివారు సైతాను సహవాసులు. సైతాను ఎంతటి దుష్టసహవాసి!

39. (ఈదానధర్మములు చేయువారు) భగవంతునియెడలను, తుది దినముయెడలను విశ్వాసముంచి, భగవంతుడు వారికి ప్రసాదించినదాని నుండి (భగవత్ప్రీతికై) వ్యయపరచియుండిన వారికేమి (నష్టము) కలిగెడిది? భగవంతుడు (వారు చేయుచున్నది) అంతయు నెఱుగును.

40. భగవంతుడు సత్కృతుల ఫలము నొసగుటలో అణుమాత్రమైన నన్యాయముచేయడు (అన్యాయము చేయకపోవుటయే కాదు) ఏపాటి మంచిచేసినను దాని ఫలమును ద్విగుణీకృత మొనర్చును. తాను స్వయముగ మిక్కిలి గొప్పగా బహుమానించును.

41. (ఓప్రవక్తా! తుదిదినమునాడు) ప్రతిజాతినుండియు (ఆయాజాతికి పంపబడిన ఆదేశకుడైన ప్రవక్తను) సాక్షిగా పిలిచి, నిన్నుకూడ వీరి ప్రవర్తనమునకు సాక్షిగా పిలిచినప్పుడు (వీరి స్థితి) ఏమగును?

42. నాడు సత్యమును నిరాకరించి దుష్పథము నవలంబించి, (తమ) ప్రవక్త ఆదేశములను విననివారు (సిగ్గుచేతను, భయముచేతను అయ్యో! మేము భూమిలో పూడుకొనిపోయి) భూమి మమ్ములను కప్పివేసిన ఎంత బాగుండెడిది! అని వాపోవుదురు. నాడు వారు భగవంతుని నుండి (తమ) ఒక్క మాటయు దాచిపెట్టలేరు.

## ఏడవ ఖండము

43. ఓ విశ్వాసవంతులారా! మత్తుగొని మీ మాటల

* ఎందుకనగా భగవంతునియందు వారికి నిజముగ విశ్వాసమున్నచో భగవత్ప్రీతికై కాక పేరుప్రతిష్ఠలకును, లోకులకు తమ గొప్పతనమును చాటుటకును దానధర్మములు చేసియుండెడివారు కారు. అట్లే తుదిదినమునందు విశ్వాసమున్నయెడల నాడు భగవంతునిచే దానధర్మములకు ప్రతిఫలముగా ఒసగబడు బహుమానము నాసించి ఆ సుకృతిని అతడు చేసియుండువాడు కాని, లోకప్రీతికొఱకు చేసియుండెడివాడు కాడని భావము.

యర్థమును మీరు గ్రహించగలుగునంతవరకు* ప్రార్థన (నమాజు) చేయ నమకట్టకుడు. అదేవిధముగ మీరు స్నానము చేయవలసిన ఆవశ్యకత కలిగినప్పుడు అట్లు స్నానము చేయునంతవరకు నమాజు చేయకుడు. మీరొకసారి బాటసారులై మార్గమునయున్నచో (అది వేరుమాట. అప్పుడు మీరు తయమ్మమ్† విధి ననుసరించవచ్చును.) మీరు జబ్బుపడియున్నప్పుడును, ప్రయాణమునందున్నప్పుడును, మలమూత్ర విసర్జనము చేసినప్పుడును, స్త్రీస్పర్శ♦ చేసినప్పుడును, మీకు నీరుదొరకని పక్షమున పరిశుద్ధమైన మట్టితో (పరిశుద్ధులుకండు. దానితో) మీ ముఖములను చేతులను తుడుచుకొనుడు. నిశ్చయముగ భగవంతుడు పాపములను క్షమించువాడు; మహాక్షమి.

44. భగవద్గ్రంథమునందలి ఒకభాగము ప్రసాదింపబడినవారి స్థితిని నీవు చూడలేదా ? వారు (సత్యమును వదలుకొని) మార్గభ్రంశతను ఎట్లు కొనుచున్నారు ! మీరు కూడ (వారివలెనే) మార్గభ్రంశులు కావలెనని వారు కోరుదురు.

45. మీ శత్రువులను భగవంతుడు బాగుగా ఎఱుగును. అల్లాః రక్షకుఁడగుట చాలును. అల్లాః సహాయుడగుటయే చాలును.

---

* మత్తుపదార్థములు వెనుక ౨ : ౨౧౯ లోను ౫ : ౯౦, ౯౧ లోను నిషేధింపబడినవి ఐదవ అధ్యాయమందలి సూక్తమిది —

"ఓ విశ్వాసవంతులారా ! మత్తుపదార్థములు, జూదము తత్సంబంధమైనఆటలు, శిలాప్రతిమలకు బలులు, బాణములతో జోస్యము మున్నగునవి చెప్పుట — ఇవన్నియూ అపవిత్రములు, సైతానుచేయు పనులు. మీరు మోక్షకాములైనచో వీటిని విడిచిపెట్టుడు. మత్తుపదార్థములచేతను, జూదము మొదలగు ఆటలవల్లను సైతాను పరస్పర విద్వేషమును వైరములను కల్గించి మిమ్ములను భగవత్స్మరణమునుండియూ, భగవద్ధ్యానమునుండి దూరుల నొనర్పగోరును మరి మీరు వాటిని విడిచిపెట్టరేల?"

౫ : ౯౦—౯౧

† ఈ సూక్తము చివర చెప్పబడిన మంటితో పరిశుద్ధపరచుకొను విధానమును 'తయమ్మమ్' అందురు.

♦ దీని యర్థము 'స్త్రీసంగమ'మని కొందరు వ్యాఖ్యాతలు. కామాసక్తితో స్త్రీని స్పృశించుటయూ ఈ శబ్దార్థమున చేరును.

46. యూదులలో కొందరు శబ్దములను వాటి సందర్భముల నుండి మార్చివైతురు. (మీతో కలిసినప్పుడు) సత్యమగు మీ మతమును హేళనచేయుటకు మాటలను విరిచి శబ్దములకు పెడర్థములు వచ్చునట్లు ఇట్లు చెప్పుదురు : "(మీఉపదేశములను) వింటిమి. వాటిని శిరసావహించితిమి" ఈ మాటలను "(మీఉపదేశములను) వింటిమి. కాని వాటిని మే మనుసరింపము" అను అర్థము వచ్చునట్లు వికటముగ నుచ్చరింతురు. అట్లే (ఇంక వారి అనుయాయులతో) వినుడు : భగవంతుడు మీకు చెడుమాటలను విన్పింపకుండుగాక!" అను అర్థముగల మాటను "వినుడు : మీ రీ మాటలను పెడచెవిని బెట్టుడు" అను అర్థము వచ్చునట్లు ఉచ్చరింతురు. అట్లే 'మాయెడ సుముఖులుగండు' అను మాటను 'ఓ పశులకాపరీ !' అను అర్థమువచ్చునట్లుచ్చరింతురు. (వీ రీకుటిలత్వమునకు పాలుకాక) "మేము (మీ ఉపదేశమును) వింటిమి. మేము దాని ననుసరింతుము." అనియు, తమ అనుయాయులతో "(ఈ ఉపదేశములను) వినుడు, (ఈ ఉపదేశములను గ్రహించిన) మమ్ము చూడుడు." అని చెప్పియుండినచో ఎంతయో బాగుగను సత్యముగను ఉండెడిది. కాని సత్యనిరాకరణము చేసినట్టివారు భగవంతునిచే శపితులైరి. వారిలో కొలదిమందితప్ప తక్కినవారు విశ్వసించనైరి

47. భగవద్గ్రంథమును పొందిన ఓ ప్రజలారా ! (మొహమ్మద్ ప్రవక్తకు) ప్రోక్తమగుచున్న ఈ గ్రంథము ఇప్పుడు మీకడ నున్నదానిని నిరూపించి చూపుచున్నది. దానిని (నిరాకరింపక) విశ్వసింపుడు. మీ ముఖములను మార్చివైచి♦ మీరు వెన్ను త్రిప్పి పలాయతులగునట్లు చేయకపూర్వమును‡ సబ్బాతును నిరాకరించిన

♦ 'మీ నాయకులను విధ్వంసమొనర్చి' అని దీని భావార్థము.

‡ యూదులు నిలువనీడలేక ఒకదేశమునుండి మరొకదేశమునకు వెళ్లగొట్టబడుటయు, పూర్వకాలముననేకాక నేటివరకు యూదులు యూరపుఖండమున హింసింపబడి ఒకదేశమునుండి మరొకదేశమునకు పలాయతులగుచుండుటయు సర్వవిదితము.

వారిని శపించినట్లు శపించుటకు పూర్వమును (ఖుర్ఆనును విశ్వసింపుడు.) భగవంతుడు కావించిన ఆజ్ఞ అయితీరును.

48 భగవంతునితో సమానులను నిలబెట్టు పాపమును భగవంతుడెంత మాత్రమును క్షమింపడు. ఇదిగాక మరేపాపమునైనను భగవంతుడిచ్ఛించుచో మన్నించును. భగవంతునితో ఎవడు సమానులను నిలబెట్టునో వాడు నిశ్చయముగ మహాపాతకము చేసినవాడు.

49. (ఓ ప్రవక్తా!) తామేపవిత్రులమని గర్వించువారిని గమనించితివా? (ఒక కులమునందును, ఒక జాతియందును జన్మించినంత మాత్రమున పావిత్ర్యము కలుగదు.) వాస్తవమేమనగా భగవంతుడు తన ఇచ్ఛవచ్చిన వారిని (చెడుగులనుండి రక్షించి) పవిత్రులను చేయును. (ఎవరు చేసినదానికి వారికి తగు ప్రతిఫల మిచ్చుటలో భగవంతుడు) ఆవగింజంత హెచ్చు తగ్గైనను చేయడు.

50. (భగవంతుడు తమ్మో జన్మపవిత్రులను చేసెనని) భగవంతునిపై ఎట్టిఅబద్ధములను వీరు చెప్పుచున్నారో చూడుడు. (పావిత్ర్యమును, సద్గతియు విశ్వాసమునైనను సత్ప్రవర్తనమునైనను ఆధారపడియున్నది, కాని ఒక కులమునందు గాని ఒక జాతియందుగాని జన్మించినంతమాత్రమునకాదు) వారు స్పష్టముగ పాపిష్ఠు లనుటకు ఈనిదర్శన మొకటి చాలును ౦౦-

## ఎనిమిదవ ఖండము.

51. (ఓ ప్రవక్తా!) భగవద్గ్రంథమందలి ఒకభాగము మాత్రము ప్రసాదింపబడిన వీరిస్థితిని గమనించితివా? వారు (ఎట్లు) దేవతావిగ్రహములను, దయ్యములను దుష్టశక్తులను (కట్టుబడి మొదలైన దుష్టమంత్ర తంత్రములను) నమ్ముచు, అవిశ్వాసులను ఇట్లనుచున్నారు: "విశ్వాసవంతులకంటె వీరే సత్యమార్గమున నున్నారు."

52. భగవంతునిచే శపితులైనవారు వీరు. ఎవనిని అల్లాః శపించునో వానికి ఎవ్వరును సహాయము చేయజాలరు.

53. (సత్యము ననుసరించు మీతో ఇంతగా వైరముబూనిన వీరికి) రాజ్యములో ఏదైన భాగముకలదా? అట్లుండియుండినచో వారు రవ్వంతైనను ప్రజల కిచ్చియుండెడివారుకారు.♦

54. లేక, ఎవరికేని భగవంతుడు తనఅనుగ్రహముచే ప్రసాదించిన దానిని చూచి వీరు ఈర్ష్యపొందుదురా? నిశ్చయముగ ఇబ్రాహీమ్ సంతతివారికి మేము భగవద్గ్రంథమును, ప్రజ్ఞాపాటవమును ప్రసాదించితిమి. వారికొక గొప్పరాజ్యమును కూడ ప్రసాదించితిమి.

55. వారిలోకొందరు అతనియందు (ఇబ్రాహీమ్ ప్రవక్తయందు)* విశ్వసించిరి. కొందరు అతనిని నిరాకరించిరి. (నిరాకరించువారికొఱకు) ప్రజ్వలించుచున్న నరకాగ్ని చాలును.

56. నా సందేశములను విశ్వసించక నిరాకరించువారిని నరకాగ్నియందు ప్రవేశింపజేతును. వారికి శిక్ష రుచి (బాగుగా) తెలియునట్లు ఎన్నిమార్లు వారి చర్మములు కాలినవో అన్నిమార్లు వారికి క్రొత్త చర్మములుకలిగించుచుందును.† నిశ్చయముగ భగవంతుడు సర్వశక్తిమంతుడు, ప్రజ్ఞానిధి.

57. (అట్లుకాక నా సందేశమును) విశ్వసించి, సత్కార్యాచరణశీలురైనవారికి నిర్ఝరులు ప్రవహించు సుందరోద్యానముల ప్రవేశింపజేతును. అందే వారికి స్థిరనివాసము. పవిత్రలగు సహచారిణులు వారికందు లభింతురు. వారికి మహత్సౌఖ్యానందములను ప్రసాదింతును.

58. (ఓ విశ్వాసవంతులారా !) మీానమ్మకముపై మీాకడ దాచి

♦యూదులు మహాలోభులు. వారికి రాజ్యాధికారమే ప్రసాదింపబడి యుండినచో వారెవ్వరికైనను పరే రవ్వంత లాభము కలుగకుండ చేయుదురు. రాజ్యాధికారము లేనప్పుడే వారు నీతో ఇంతవైరము పూనియున్నారు. రాజ్యాధికారమే ఉండియుండెనా వీరింతయైనను పగబూని హింసించియుండెడివారు. అని దీనిభావము.

* మొహమ్మద్ ప్రవక్త యనియు దీని నన్వయించవచ్చును.

† వారికి నిరంతరాయముగు శిక్షలభించును,

ఉంచిన నిక్షేపములను ఎవరికివ్వవలెనో వారికిచ్చి వేయుడని భగవంతుడు మీ కాజ్ఞాపించుచున్నాడు. (హక్కుదారుని హక్కును నిరాకరింపకుడు.) ప్రజలమధ్య తీర్పు చెప్పునప్పుడు న్యాయముతో తీర్పు చెప్పుడు. భగవంతుడు కావించుచున్న ఈ ఉపదేశము ఎంతయు శ్రేష్ఠమైనది. నిశ్చయముగ భగవంతుడు సర్వమును వినువాడు; సర్వమును చూచువాడు.

59. ఓ విశ్వాసవంతులారా! భగవంతునకు విధేయులై యుండుడు. భగవంతుని ప్రవక్తకు విధేయులైయుండుడు. మీలో మీపై అధికారము వహించియున్నవారికి విధేయులై యుండుడు. ఏదైన విషయమునుగూర్చి మీరు (భేదాభిప్రాయపడి) జగడమునకు దిగినచో మీరు భగవంతునివైపునకును, ప్రవక్తవైపునకును మరలుడు. (భగవదాదేశములను, ప్రవక్తయొక్క ఉపదేశములను అనుసరించి మీవివాదములను పరిష్కరించుకొనుడు) మీకు భగవంతునిపైనను తుదిదినముపైనను విశ్వాసమున్నచో (ఇదే మీకొఱకు ఆచరణమార్గము.) (ఈ ఆచరణమునందే) మీకు శ్రేయశ్శుభములు కలవు. దీని పర్యవసానమును కూడ అత్యంత శుభప్రదమే యగును. ౧౦

## తొమ్మిదవ ఖండము

60. (ఓ ప్రవక్తా!) నీకు ప్రోక్తమైన దానియందును, నీకు పూర్వము ప్రోక్తమైన దానియందును విశ్వసింతుమని (పైకి) నమ్మజెప్పు (పయోముఖ విషకుంభములవంటి మోసగాండ్రైన) వారి స్థితిని గమనించితివా? వారు తమ జగడములను, వివాదములను తాము పూజించు శిలావిగ్రహముల కడకు తీసుకొని వెళ్లుదురు.* (ఆ విగ్రహములను) విడిచిపెట్టవలసినదిగా ఆజ్ఞాపింపబడినప్పటికిని (వారిటు చేయుచున్నారు) వారిని మార్గభ్రంశుల నొనర్చి, వారు సత్పథమునకు మిక్కిలి దూరులగుటను సైతాను కోరును.

---

* విగ్రహారాధకులు తమ తగవులను పరిష్కరించుకొనుటకు తమ దేవతావిగ్రహములకడకు వెళ్ళి బాణములతో ఒకవిధమైన సోడె చెప్పించుకొనుట అరేబియాలోను ఇతరదేశములందును ఆచార ముండెడిది.

61. "భగవత్ప్రోక్తమైన ఆదేశమును, ప్రవక్తను అనుస రింపుడు" అని వారిని ప్రబోధించినప్పుడు (పయోముఖ విషకుంభముల వంటి) వంచకులగు వీరు ద్వేషముతో ముఖము త్రిప్పుకొనుటను నీవు చూచెదవు.

62. తమ ఈ ప్రవర్తనమునకు ఫలితముగ† వారిపై (శిక్షారూపమైన) ఆపదవచ్చినచో అప్పుడు వారి స్థితి ఏమగును ? (ఓ ప్రవక్తా !) అప్పుడు వారు నీ దగ్గరకు పరుగెత్తుకొనివచ్చి దేవునిపేర ఒట్టుపెట్టుకొని (ఇట్లందురు :) మేము ఇదంతయు మంచికే (అనుకొని పరస్పర) సమా ధానమునకై ఇట్లు చేసితిమి."

63. (ఓ ప్రవక్తా !) వారి హృదయములందలి రహస్యములను భగవంతుడెఱుగును. వారి నంతగా గణింపకుము. వారికి సదుపదేశము చేయుచుండుము. వారి మనస్సులలో అచ్చొత్తుకొనిపోవునట్లు ఉప దేశింపుము.

64. (ఓ ప్రవక్తా! నిన్ను అనుసరించవలసినదిగా వీరికిచ్చిన ఆజ్ఞ వీరి కొక్కరికి మాత్రమే ఇచ్చిన ఆజ్ఞకాదు.) నేను ప్రపంచమునకు ఏ ప్రవ క్తను పంపినను నా ఆజ్ఞానుసారము (ఆప్రవక్త ప్రజలచే) అనుసరింపబడ వలెననియే పంపితిని. ఒకసారి వారు (నీ ఆదేశములకు విధేయులై యుండక) తమకు తాము నష్టపరచుకొని యుండినకాలములో (పశ్చా త్తప్తులై) నీకడకు వచ్చి (తమ తిరస్కృతికి) భగవంతుని క్షమార్పణ మును వేడుకొనినచో, భగవంతుని ప్రవక్తకూడ వారిని క్షమింపు మని భగవంతుని ప్రార్థించియుండును. భగవంతుడు మహా క్షమి యనియు, దయానిధియనియు అప్పుడు వారు తెలిసికొనియుందురు.

65. నీ భగవంతుని సాక్షి! వారు తమ వివాదములను (తీర్చుటకై) నిన్ను నాయకునిగా స్వీకరించనంతకాలము వారు (నిజ ముగా) విశ్వాసులు కానేరరు. (అంతేకాదు;) నీవు చేసిన తీర్మానమును

† "వారి చేతులు ముందే పంపినదాని ఫలితముగ" అని ప్రతిపదార్థము. అనగా "వారు స్వహస్తములతో చేసిన కర్మలకు తర్వాత కలిగిన ప్రతిఫలముగ అని అర్థము."

అంగీకరించి కించిన్మాత్రము వ్యతిరేకభావము లేక మనఃపూర్తిగ దానికి కట్టుబడి యుండనంతకాలము (వారు విశ్వాసులుకానేరరు.)

66 (భగవన్మార్గమున) "మీ ప్రాణముల నర్పింపుఁడు" లేక "మీ ఇండ్లు విడిచి దేశాంతరముల కేగుఁడు" అని వారి నాజ్ఞాపించినచో, వారిలో ఏ కొద్దిమందియో తప్ప తక్కినవారు ముందడుగు వేయకుండెడివారు. వారి కుపదేశింపబడిన దాని ననుసరించి వారు ప్రవర్తించి యుండినచో వారి కెంతయో శ్రేయస్కరమై యుండెడిది. (భగవన్మార్గమున) వారు దృఢముగ పాదుకొనియుండువారు.

67. (వారు ఈవిధముగ దృఢముగ భగవన్మార్గమున పాదుకొని యుండి యుండినచో) నిశ్చయముగ వారికి నాకడనుండి మిక్కిలి గొప్పపుణ్యము లభించియుండెడిది.

68 వారికి నిశ్చయముగ (శ్రేయశ్శుభముల నొడగూర్చు) ఋజుమార్గము లభించియుండెడిది.

69 అల్లాఃకును, ప్రవక్తకును విధేయులై యుండువారందరును నిస్సందేహముగ భగవదనుగ్రహమునకు పాత్రులైనవారితోనుందురు. (వారు) ప్రవక్తలతోను, సత్యవంతులతోను, దృఢవిశ్వాసులతోను ఉత్తమోత్తములతోను ఉందురు ♦ వీ రెంతటి శ్రేష్ఠతములగు సహచరులు !

70. భగవంతుని మహదనుగ్రహము (ఇట్టిది.) (అనుగ్రహించుటకు) సర్వజ్ఞుడగు భగవంతుడు చాలును.

---

♦ అధ్యాత్మికముగ ఉత్తమోత్తములు నాల్గు తరగతులుగ చెప్పబడిరి. అరబీలో వీరు ఆరోహణ క్రమములో 'స్వాలెహ్' 'షహీద్' 'సిద్దీఖ్' 'నబీ' అనబడుదురు.

శ్రీప్రవక్త మరణశయ్యపై నుండి "ఈశ్వరా ! నాకు ఉత్తమోత్తము లగువారి సాహచర్యమును ప్రసాదింపుము." అని ముమ్మారు ప్రార్థించి ప్రాణముల విడిచిరి.

(ఇబ్నేకసీర్ వ్యాఖ్యానమునుండి – సంపుటము ౨. పుట ౨౫.)

## పదవ ఖండము

71. ఓ విశ్వాసవంతులారా! మీరు (స్వసంరక్షణమునకై సంసిద్ధులై) జాగ్రతవహించి యుండుడు. (అవసరము వచ్చినప్పుడు శత్రువును) ఎదుర్కొనుటకై జట్టులుజట్టులుగా గాని లేక అందరు కలిసిగాని బయలుదేరుడు.

72. మీలో ఎవడైన నొకడు (యుద్ధమునకు పిలుపువచ్చినప్పుడు) వెనుకడుగు వేయువాడును తప్పక ఉండును. ఒకసారి (యుద్ధములో) మీకేదైన ఆపద సంభవించినచో (తాను సురక్షితముగ నుండుటకు సంతోషించి) "నేను వీరితో (యుద్ధమున) లేకపోవుట భగవదనుగ్రహము" అనును.

73. మీకు భగవదనుగ్రహమువల్ల శ్రేయశ్శుభములు కల్గినప్పుడు, తనకును మీకును మధ్య స్నేహానురాగముల ఎట్టి బంధమును లేనట్టే (అసూయా ద్వేషములతో) "నేను వారితో ఉండియుండినచో ఎంతయో గొప్ప లాభము సంపాదించి యుందును" అని వాపోవును.

74. పారలౌకిక ఫలముకొఱకు ఎవరు ఐహికజీవితమును (భగవంతునకు) అమ్మివైచిరో వారు (ఇట్టి వంచకులమార్గము ననుసరింపక) భగవన్మార్గమున యుద్ధమొనర్తురుగాక! ఎవడు భగవన్మార్గమున యుద్ధము సల్పునో అతడు వధింపబడినను విజయము పొందినను అతనికి మహత్తరమైన పుణ్యమును మేము ప్రసాదింతుము.

75. (ఓ విశ్వాసవంతులారా!) నిస్సహాయులగు ఇంతమంది పురుషులు, స్త్రీలు, పిల్లలు (దుర్మార్గుల హింసలకు తాళలేక) "ప్రభూ! మమ్ము ఇంతగా బాధపెట్టుచున్న హింసకులు గల ఈ పట్టణమునుండి మాకు ముక్తినిమ్ము, నీవు మాకొఱకు ఒక పోషకుని, ఒక సహాయ్యుని ప్రసాదింపుము." అని మొఱపెట్టుకొనుచుండగా (వారిని రక్షించుటకు) మీరు వారికొఱకు భగవన్మార్గమున యుద్ధముచేయుటకు వెనుదీయుచున్నారేల ?

7౬. విశ్వాసవంతులగువారు భగవన్మార్గమున యుద్ధము సేతురు. (వారు స్వలాభమునకైకాక సత్యముకొఱకును న్యాయముకొఱకును పోరాడుదురు.) విశ్వాసహీనులు సైతానుమార్గమున (అధర్మమునకై పోరాడుదురు. అందుచే సైతాను స్నేహితులతో పోరాడుడు. (వారి బలమును సంఖ్యను లెక్కపెట్టకుడు.) సైతాను పోరాట మెప్పుడును (పైకి చూచుట కెంత బలవంతమైనదైనను సత్యము నెదుర్కొన్నప్పుడు) దుర్బలమైనదే.

### పదునొకండవ ఖండము

77 (ఓ ప్రవక్తా! యుద్ధమునుండియు, రక్తపాతము నుండియు) మీ చేతులను కళంకిత మొనర్చుకొనక, ప్రార్థన సల్పుటయందు తత్పరులైయుండి, దానవిరతులైయుండుడు" అని ఆజ్ఞాపింపబడినవారి స్థితిని గమనించితివా? (ధర్మరక్షణార్థము) వారికి యుద్ధము విధింపబడి నప్పుడు, వారిలో కొందరు (తమవంటి) మనుష్యులనే చూచి భగవంతునకు భయపడినట్లు భయపడుచున్నారు, అంతకంటె అధికముగ కూడ. (అట్లు భయపడి) వారిట్లందురు: "ప్రభూ! మాకు యుద్ధము చేయుట నేల విధించితివి? మాకు మరికొన్ని దినములు (బ్రతుకు) గడువేల ఈయవైతివి?"

(ఓ ప్రవక్తా! వారితో) ఇట్లనుము: ("మీరు ఏప్రపంచమునందలి ప్రీతిచే మృత్యుభయము పొంది యిట్లు వెనుదీయుచున్నారో) ఆ లౌకికలాభము అత్యల్పమైనది. ఎవరు (మానవులకు బదులు) భగవంతునకే భయపడుదురో* అట్టివారికి ఆముష్మికఫలమే ఉత్తమమైనది. అక్కడ ఆవగింజంతైనను అన్యాయము జరుగదు.

78. మీ రెక్కడున్నను సరే మృత్యువు మిమ్ములను వెంబ

---

* "భగవద్భక్తిపరులకు లేక సన్మార్గప్రవర్తకులకు ఆముష్మికఫలమే ఉత్తమమైనది" అనియూ అర్థము చెప్పవచ్చును. 'తఖా' అను శబ్దమునకు 'భయము' 'సత్ప్రవర్తనము' 'భగవద్భీతి' అను అర్థములు కలవు.

డించి పట్టుకొనును. మీరు ఉన్నతమైన బలిష్ఠమగు దుర్గములలో దాగియున్నను సరే (మృత్యువువాతను తప్పించుకోజాలరు.)

వారి కేదైన శుభము కలిగినప్పుడు "ఇది భగవత్ప్రసాదితము" (ఇది మా చేతలకు భగవంతునిచే నిర్ణయింపబడిన ఫలము) అందురు. కాని వారి కేదైన కీడు మూడినా, "ఇది నీవల్ల కలిగినది," అందురు. (ఓ ప్రవక్తా!) వారితో ఇట్లు చెప్పుము: "అంతయు భగవంతుని కడనుండియే. (ఏది జరిగినను అది భగవత్కృతమే. భగవంతుని ప్రకృతిధర్మము ననుసరించి ఏఏచేతల కాయాఫలము కలుగుచుండును) ఈ ప్రజల కేమైనది? వారికి చెప్పబడినదానిని గూర్చి యోజింపనైన యోజింపరు!

79. (వాస్తవమేమనగా) మీకు ఏమంచి కలిగినను అది భగవత్ప్రసాదితము. ఏ నష్టము కలిగినను అది మీరు (స్వహస్తములతో) చేసుకొనినది. (అది మీ దుష్ప్రవర్తనముయొక్క ఫలితము.)

(ఓ ప్రవక్తా!) మేము నిన్ను ప్రవక్తనొనర్చి మానవులకొఱకు (ఒక సందేశమునిచ్చి) పంపితిమి. (నీపని నా సందేశము వినిపించుటమాత్రమే) దీనికి అల్లాహ్ యే సాక్షియగుట చాలును.

80. ఎవరు (భగవంతుని సందేశమును గొనివచ్చిన) ప్రవక్తకు విధేయులో వారు (వాస్తవముగ) భగవంతునకుకూడ విధేయులై యుందురు. ఎవరు (ప్రవక్త ఆజ్ఞలకు) విముఖత్వము చూపిరో (వారిని పోనిమ్ము) వారిపై నిన్ను రక్షకునిగాచేసి పంపలేదు.* (వారి నడవడికి నీవు బాధ్యుడవు కావు.)

81. (వీరు నీ ఎదుట మాత్రము నీ మాట విని) "(మీ ఆజ్ఞను) శిరసావహించితిమి" అని చెప్పుదురు. కాని నీఎదుటినుండి లేచిబైటకువెళ్ళి వారిలోకొందరు రాత్రులందు (రహస్యముగ) సమావేశమై నీవు చెప్పిన దానికి వ్యతిరేకముగ కుట్రలు పన్నుదురు. రాత్రులందు వీరుచేయు

* రక్షకుడు భగవంతు డొక్కడే, మరెవ్వరును కారని భావము.

సమావేశములలో వారు చేయునదంతయు(భగవంతుని ముందు రహస్యముగ లేదు. దానిని వారి కర్మపత్రములందు) భగవంతుడు వ్రాసియుంచును. అందుచే ఇట్టివారిని లెక్కగొనకుము. భగవంతునే నమ్మియుండుము. మీకు సంరక్షకుడగుటకు భగవంతుడు చాలును.

82. ఏమి! వీరు ఖుర్ఆన్(యొక్క ఉపదేశముల)నుగూర్చి శ్రద్ధతో యోచింపరా? ఇది అల్లాః కడనుండి కాక మరెవ్వరి కడనుండియైన వచ్చియుండినచో ఇందులో ఎన్నోచోట్ల స్వవచనవ్యాఘాతము లుండియుండును.[౧౦౮]

83. శ్రేయస్సుకు సంబంధించినది కాని భీతికి సంబంధించినది గాని వారికేదైన వార్త తెలిసినప్పుడు దానిని ప్రజలలో (అపవాద రూపమున) వ్యాపింపజేతురు. (దానికి బదులు) వారు తమ ప్రవక్తకును, తమలో అధికారము నందున్నవారికిని, కుశాగ్రబుద్ధులకును, చెప్పియున్నచో వారు (ఆవిషయమును తరచి దాని మంచిచెడ్డలను) గ్రహించువారు. (దానివలన ప్రజలలో భీతాహము కల్గెడిదికాదు.) భగవంతుడు మీపై అనుగ్రహము చూపి మిమ్ములను కరుణించియుండనిచో (మీ ఈ దౌర్బల్యముల వల్ల) మీలో కొందరు తప్ప తక్కిన వారెల్లరును సైతాను (యొక్క దుష్పథము) ను వెంబడించియుందువారు.

84. మరి (ఓ ప్రవక్తా! వీరు నీకు తోడ్పడుదురా లేక తోడ్పడరా అన్న విషయమును లెక్కచేయక) నీవు భగవన్మార్గమున యుద్ధమొనర్పుము. నీ బాధ్యత నీకుగాని, నీ కితరుల బాధ్యత లేదు. విశ్వాసవంతుల యందుఉత్సాహమునుపురికొల్పుము. విశ్వాసహీనుల ఈ యుద్ధపు ఉబలాటమును భగవంతుడు త్వరలో తగ్గించును. భగవంతుడు సర్వశక్తిమంతుడు. (ఇతరులకు గుణపాఠ మగునట్లు) శిక్షించుటలో కఠినుడు.

85. ఒక సత్కార్యములో మరొకనితో కలసి పనిచేయువానికి* దాని ఫలితములో భాగముకలదు. ఒక దుష్కార్యములో

* 'ఏదేని సత్కృతివిషయమున ప్రోత్సహించినచో' అనియు అట్లే తరువాతి వాక్యార్థమున 'ఏదేని దుష్కృతివిషయమున ప్రోత్సహించినచో' అనియు కొందరర్థము వ్రాసిరి.

మరొకనితో కలిసి అతని కందు తోడ్పడువాడు (ఆదుష్కార్యముయొక్క) ఫలితము ననుభవించవలసి వచ్చును. భగవంతుడు సర్వవస్తు సం శాసకుడు.

86. (ఓ విశ్వాసవంతులారా!) మీకు ఆశీః పూర్వకమైన వందన మాచరింపబడుచో, మీరు అంతకంటె మంచిమాటలతో ఆశీస్సును, వందనమును అర్పింపుడు.* లేదా (అధమము) అవేమాటలతో వందన మర్పింపుడు. ప్రతివస్తువును తప్పక భగవంతుడు గణించును. (మీరు కావించు ప్రతి చిన్న సత్కృతిని గణించి దానికి ఫలమును ప్రసాదించును.)

87. ఏకమాత్రుడగు భగవంతు డొక్కడు తప్ప మరెవ్వరును ఆరాధనమునకు (గాని స్తోత్రమునకుగాని) అర్హులుకారు. నిశ్చయముగ తుదిదినమునాడు మిమ్ములనందరను భగవంతుడు ఒకచోట (తన సమ క్షమున) చేర్చును. ఇందెంతమాత్రము సందేహము లేదు. (ఇది భగవ ద్వాక్కు). భగవంతునికంటె ఎవరు ఎక్కువ సత్యమును వచింప గలరు?

---

* "అస్సలాము అలైకుమ్" (మీకు శాంతి చేకూరుగాక!) ఇది ఖుర్ఆన్ నిర్ణయించిన వందనపద్ధతి దీనికి ప్రత్యుత్తరముగ "వ అలైకుముస్సలామ్ వ రహ్మతుల్లాహి వ బరకాతుహు" (మీకుకూడ శాంతి చేకూరుగాక! భగవంతుని అనుగ్రహమును శ్రేయశ్శుభములును కలుగుగాక!) అందురు మొదటి వందనముకంటె ప్రత్యుత్తర వందన ముత్తమముగ నుండుట స్పష్టము. ఈవిధముగ ఇస్లాములో వందన మాచరించురీతి ఒకరి శ్రేయశ్శుభముల నొకరు కోరుకొను ఒక పద్ధతియై పోయినది ఒక ముస్లిమ్ మరొక ముస్లిమ్‌ను కలిసినప్పుడు స్త్రీపురుష బాలవృద్ధ, ధనిక నిర్ధన అధికనీచభేదము లేకుండా వందనమాచరించుపద్ధతి ఇది. దీనివలన పరస్పరసద్భావమును, పరస్పర హితాభిలాషయు వెల్లడియగును.

ఈ ఆజ్ఞ ముస్లిమ్ సంఘమునకు మాత్రమేకాక అందరికిని వర్తించును. ఒక ముస్లిమ్ మరొక ముస్లిమ్‌ను కలిసినప్పుడే ఇట్లు చేయవలెనని కాదు దీని అర్థము. ఒక ముస్లిమ్ మరే మతమునకు ఏ జాతికి చెందిన వ్యక్తిచే వందన మాచరింపబడినను అంతకంటె మంచి మాటలలో దానికి ప్రత్యుత్తర మొసగవలెను. (హజరత్ ఇబ్నె అబ్బాస్ గారి వాక్యము లు ఇబ్నెకసీర్ భాష్యములో ఉద్ధృతము. సం. ౫. పుట. ౭౩.)

## పంద్రెండవ ఖండము

88. (ఓ విశ్వాసవంతులారా!) మీ కేమైనది? (పయోముఖ విషకుంభ ములవంటి) ఈ వంచకుల విషయములో మీరు రెండు పక్షములుగ చీలిపోయినారు? భగవంతుడు వారి చేతలకు ఫలితముగ వారిని (అవిశ్వాస మార్గమునకు) మరల్చినాడు. (అందుచే వారు సన్మార్గమును కోల్పోయిరి.) భగవంతుడు పతితుల నొనర్చిన వీరికి సన్మార్గము చూపదలతురా? (తన నియమముల ననుసరించి) భగవంతుడు ఎవరిని భ్రష్టుల నొనర్చునో వారికి మీరు సన్మార్గమును చూపలేరు.

89. తాము అవిశ్వాసులైనట్లే మీరుకూడ అవిశ్వాసులు కావలెనని వారి కోరిక. దీనివల్లమీరును వారితో సమానులైపోవలెనని (వారి ఉపాయము), అందుచే (వారు మీ శత్రువుల సాంగత్యమును విడిచి) భగవన్మార్గమున స్థలాంతరమునకు వలసపోయి (మీతోకలియ) నంతవరకు, వారితో ఎవరితోడను మైత్రిచేయకుడు.

మరి వీరు వలసపోవుటకు నిరాకరించినచో (జ్ఞాపకముంచుకొనుడు. యుద్ధకాలములో ఎవరు శత్రుపక్షమున శత్రువులతో కలసియుందురో వారుకూడ మీకు శత్రువులే. అందుచే) వారెక్కడ చిక్కినను వారిని పట్టుకొనుడు; వధింపుడు. వారిలో ఎవరితోడను మైత్రిచేయకుడు. వారిలో నెవరినైనను మీకు సహాయ్యులుగా నంగీకరింపకుడు. (అట్లుచేసిరేని వారు తొలుత మిత్రులవలె నటించి తర్వాత మీకు అపాయమును కల్గజేతురు.)

90. ఎవరు (మీశత్రువును విడిచి) మీతో సంధిచేసుకొని (తటస్థముగ) ఉన్న పక్షములతో కలియుదురో; లేక, ఎవరు మీతో పోరాడుటకు గాని, లేక (మీ పక్షముననుండి) తమవారితో దెబ్బలాడుటకు గాని రోసి, మీదగ్గరకు వచ్చిన యెడల (వారు పై నియమము క్రిందకు రారు. వారితో యుద్ధము చేయకుడు ) ఎందుకనగా భగవంతు డిచ్ఛించినచో వారుకూడ మీతో యుద్ధముచేసి మీపై ఆధిక్యతను సంపాదించి యుందువారు. అందుచే వారు తటస్థులైయుండి, మీతో సంధిచేసు

కొనుటకు రాయబారము పంపినచో మీరు అట్టివారితో వైరము పూని యుద్ధముచేయుట ఎంతమాత్రమును తగదు.*

91. వీరుకాక మరొక పక్షమువారున్నారు. వారు మీతో డను జగడము లేకుండ, తమవారితోను వైరములేకుండ (తటస్థులై) ఉండగోరెదరు. కాని వారి నెవరైనను చెడుదారి కీడ్చిరా♦ ఇంక దానిలో వారు వెనుకముందు లాలోచింపక దుడుకుతనములో దూకు దురు. ఇట్టివారు తటస్థులైయుండక, మీకడకు సంధి రాయబారము పంపక, మీతో కయ్యమునకు కాలుత్రవ్వినచో అట్టివారెక్కడ చిక్కిన నక్కడ పట్టుకొనుడు. ఎక్కడ చిక్కిన నక్కడవధింపుడు. వారితో యుద్ధముచేయుటకు మీకు స్పష్టమైన అధికారము నిచ్చి తిమి ౧౦౯

## పదమూడవ ఖండము

92. (ఒకసారి) పొరపాటున (అట్టి అకార్యము జరిగిన) తప్ప, లేనిచో ఒక విశ్వాసవంతుడు మరొక విశ్వాసవంతుని వధించుట ఎంతమాత్రము తగదు. ఒకసారి ప్రమాదవశమున ఒకవిశ్వాసవంతుడు మరొక విశ్వాసవంతుని వధించినచో ఒక ముసల్మాను బానిసకు స్వాతంత్ర్యము నొసగి, వధింపబడినవాని వారసులకు రక్తశుల్కము నొసగవలెను. వధింపబడినవాని వారసులు ఆ ధనమును దానముగ నిచ్చిన నివ్వవచ్చును ‡

ఒకసారి (వధింపబడిన)వాడు, మీ శత్రువు తెగవాడై, విశ్వాస

---

* "ఇట్టివారితో యుద్ధముచేయుటకు భగవంతుడు మీకై ఎట్టి మార్గమును విడిచిపెట్టలేదు" అని మూలము. అవిశ్వాసులైనను శాంతిపై యుండు గోరినవారితో యుద్ధము చేయరాదని ఇక్కడ భావము.

♦ "ముసల్మానులతో యుద్ధమునకు దింపబడినచో" అని భావము.

‡ "క్షమించవచ్చును" అని కూడ ఇక్కడ అర్థము చెప్పవచ్చును. అబుల్ కలాం ఆజాద్‌గారీ అర్థమునే గ్రహించిరి. అష్రఫ్ అలీ థానవీ, మొహమ్మద్ అలీ గారు నేను గ్రహించిన అర్థమును వ్రాసిరి.

వంతు డైనచో ఒక విశ్వాసవంతు డగు బానిసకు స్వాతంత్ర్య మిచ్చిన చాలును. (రక్తశుల్క మివ్వనక్కరలేదు. ఎందుకనగా వధింపబడిన వాడు ముసల్మానైనను అతని వారసు లందరును శత్రువర్గమున నుండి మీతో పోరాడుచున్నారు కదా !)

ఒకసారి (వధింపబడిన)వాడు, మీతో సంధిచేసుకొని తటస్థముగ నున్న తెగకు చెందినవాడైనచో, (వధించినవాడు వధింపబడిన) వాని వారసులకు రక్తశుల్కమును ఇవ్వవలెను. (అంతేకాదు) ఒక ముసల్మాను బానిసకు స్వాతంత్ర్య మివ్వవలెను.

ఒకసారి మీకడ బానిస లేకపోయినచో (అనగా బానిసకు స్వాతంత్ర్య మిప్పించుపాటి ధనము లేకపోయినచో) వరుసగా రెండు నెలల పాటు ఉపవాస ముంచవలెను. ఇది భగవంతుడు విధించిన ప్రాయశ్చిత్తము. భగవంతుడు సర్వజ్ఞుడు; ప్రజ్ఞానిధి.

93 ఎవడు ఉద్దేశపూర్వకముగ ఒక విశ్వాసవంతుని వధించునో వాని శిక్ష నరకాగ్ని. వానికందే స్థిరనివాసము. భగవంతుడు వానిపై తన ఆగ్రహమును బరపును. వానిని శపించును. వానికై ఘోరశిక్షను సిద్ధపరచును.

94 ఓ విశ్వాసవంతులారా ! మీరు భగవన్మార్గమున యుద్ధము చేయబోయినప్పుడు (మీ ప్రతిపక్షుల తెగలలో ఎవరు శత్రువులో ఎవరు మిత్రులో) బాగుగా విచారణ సేయుడు. మీకెవరు సలాము* చేయునో వానిని "నీవు ముసల్మానువు కావు" అనకుడు. ఏమీ ! మీరు (నశ్వరమగు) ఈ జీవితపు ఐహికసంపదల నాశించువారా ? (ఐహికసంపదలను పొందగోరినచో) భగవంతునికడ (న్యాయ మార్గమున

---

* "అస్సలామెు అలైకుమ్" మీకు శ్రేయమ్ముంతులగు గాక! అనుట ఖుర్ఆన్ విధించిన వందనపద్ధతి. సూక్తిపైని అడుగు టీకను చూడుడు.

‹ 'ఎవడు మీతో శాంతిపై నుండగోరునో' అనియు దీని కర్థము వచ్చును. కాని బహుళసంఖ్యాకులు గ్రహించు అర్థము నే నిచ్చితిని.

నార్జించుటకు) పుష్కలమగు సంపదలు కలవు. (మీరు ఐహికలాభమునకై రక్తపాతము నేల చేయవలెను?) మీరుకూడ పూర్వము ఇట్టి స్థితియందే ఉండిరికదా? (ముసల్మాననిపించుకొనుటకు మీకడ మరేచిహ్నముండెను?) తరువాత భగవంతుడు మిమ్ముల ననుగ్రహించెను. (ఒక ఇస్లామీయజీవిత విధానము మీకొఱకై విధింపబడెను.) అందుచే (మీరు యుద్ధ మారంభించుటకు పూర్వము ప్రజల మంచిచెడ్డలనుగూర్చి) బాగుగా విచారణ సేయుడు. మీరు చేయునదంతయు భగవంతు డెఱుగును.

95. (గాయపడినవారుతప్ప తక్కినవారిలో) ఎవరు ముసల్మానులతో
(జిహాదులో† చేరక) ఏ దుఃఖమును లేక ఇంట కూర్చొని యుండిరో
వారు, భగవన్మార్గమున చేయబడు జిహాదు కొఱకు తమ ప్రాణధన
ములను సమర్పించినవారితో సమానులు కానేరరు తమ ధనప్రాణ
ములతో జిహాదుచేయువారికి ఇంట కాళ్లు ముడుచుకొనియుండు
వారిపై భగవంతుడు ఆధిక్యత నిచ్చినాడు. (ఇంట కూర్చుండియుండినవా
రెంతటి యోగ్యులైనను సరే). భగవంతుడు (ఎట్టి సత్కార్యములకు అట్టి)
సత్ఫలము నిత్తునని వాగ్దానముచేసెను. (ఎవరి సత్కృతియు వ్యర్థము
కాదు. కాని ఫలములలో తరగతులును కలవు. అందుచే) జిహాద్ చేయు
వారికి ఇంట కూర్చొనియుండువారికంటె మిక్కిలి గొప్ప ఫలము
96 ప్రసాదించును. (ఈ) తరగతులు భగవంతు డేర్పరచినవి.
క్షమాకృపలు (కూడ భగవంతుని కడనుండియే వచ్చును.) ఎందుకన భగ
వంతుడు మహాక్షమి; కరుణానిధి.

## పదునాలుగవ ఖండము

97. (శత్రువుల సాంగత్యముననుండి) ఆత్మహాని గావించుకొనిన వారి ప్రాణములను హరించి దేవదూతలు "మీరెట్టి స్థితియం

---

† జిహాద్ అనగా యుద్ధముకాదు. 'శ్రమపడి ప్రయత్నించు', లేక 'ఉద్యమించు' అని వ్యుత్పత్త్యర్థము. "స్వసంరక్షణమును, స్వధర్మసంరక్షణమునకు ఉద్యమించుట, లేక ధర్మవిధ్వంసమునకై పాటుపడు దుష్టశక్తుల నణచుటకై శ్రమపడి ప్రయత్నించుట" అని ఇక్కడ అర్థము.

దుండిరి ?" అని అడిగినప్పుడు, వారిట్లు ప్రత్యుత్తరమిత్తురు : "(మేమేమి చేతుము?) మేము భూమియందు నిస్సహాయులమై యుంటిమి. (అందుచే మేము మా విశ్వాసము ననుసరించి జీవితమును గడుపజాలక పోతిమి )" దానికి దేవదూత లిట్లందురు : "మీరు మీ దేశమున నిస్సహాయులైయుండి యుండి నచో) ఏమి భగవంతుని భూమి మీరు వలసపోవుటకై విశాలముగ లేకపోయెనా ?" (మొత్తమునకు) ఇట్టివారి నివాసము నరకము. అదెంతటి తుచ్ఛనివాసము !

98-99. కాని పురుషులలోను, స్త్రీలయందును, పిల్లలయందును అశక్తులైన వారు స్వస్థలమునందే యుండుటకంటె వేరు గతి లేక (వలస) పోజాలని పక్షమున భగవంతుడు వారిని క్షమించును. ఎందుకన భగవంతుడు పాపములను తుడిచివేయువాడు, మహాక్షమి.

100. భగవన్మార్గమున (తమ ఇళ్లు వాకిళ్లు విడిచిపెట్టి) ఎవరు వలసపోవుదురో, వారికి తలదాచుకొనుటకై భూమిపై పెక్కు నివాస స్థానములును పుష్కలమగు సంపత్సాధనములును లభించును. తమ ఇండ్లు విడిచిపెట్టి భగవంతుని కొఱకును, అతని ప్రవక్త కొఱకును వలసపోవువారిలో ఎవరికైన (మార్గమధ్యమున) మృత్యువు సంభవించి నచో, అతనికి దాని ఫలము భగవంతుని సమక్షమున స్థిరపడిపోయి నది. భగంతుడు మహాక్షమి; దయానిధి.

## పదునైదవ ఖండము

101. మీరు (యుద్ధసన్నద్ధులై) భూమిపై ప్రయాణము చేయు బోయినప్పుడు, మీకు (శత్రువులగు) అవిశ్వాసులు అపాయము కల్గింతురని భయమున్నప్పుడు, ప్రార్థనల (సంఖ్య)ను తగ్గించినచో దోషము కాదు. నిస్సంశయముగ అవిశ్వాసులు మీకు బద్ధశత్రువులు (సమయము దొరకినప్పుడు వారు మీపై బడుదురు.)

102. (ఓ ప్రవక్తా!) నీవు (యుద్ధము జరుగుచుండగా) ముసల్మానులతో ఉండినప్పుడు నీవు వారికొఱకు నమాజు చేయగోరి నచో, (సైన్యములో) ఒక జట్టు తమతమ ఆయుధములను ధరించి

నీ వెనుక నిలువబడి యుండగా ప్రార్థన చేయవలెను. వారుసాష్టాంగ పడి అయిపోయినపిదప, వారు వెనుకకు వెళ్లిపోవలెను. అప్పుడు నీతో ప్రార్థనమునందు చేరని రెండవ జట్టప్పుడు ప్రార్థనకు రావలెను. వారు జాగరూకతతో మెలగియుండుటయు,శస్త్రధరులై యుండుటయు (అవసరము,)

అవిశ్వాస మార్గము నవలంబించిన (మీ శత్రువులగు) వారు మీరు ఆయుధములు ఇతర సామగ్రి విడిచి ఏ కొద్దిపాటు అజాగ్రత్త వహించినను మీపై అందరు కలిసి హఠాత్తుగ విరిగి పడజూతురు. (అందుచే మీరు ప్రార్థన చేయునప్పుడుకూడ జాగ్రత్తవహింపుడు.)

వర్షము కురియుచుండుటచే ఇబ్బందికల్గినను, రోగగ్రస్తులై యున్నప్పుడును మీరు ఆయుధములను దించి ప్రార్థన సలిపినను దోషముకాదు. మీరు స్వసంరక్షణమందు ఏమరపాటు నొందరాదు. సత్యమును నిరాకరించువారికొఱకు భగవంతుడు నిశ్చయముగ ఘోర మగు శిక్షను సిద్ధపఱచియున్నాడు.

**103.** మీరిట్లుప్రార్థనలను పూర్తిగాకావించినపిదప, నిలువబడి యుండినను, కూర్చొనియున్నను, పక్కలపై యుండినను, (ఏ స్థితియం దుండియు) భగవంతుని స్మరింపుడు. (ఒక్క ప్రార్థన కాలమునందేకాదు అన్ని వేళలయందును భగవంతుని స్మరించుచుండుడు.)

(శత్రుభయములేక) శాంతి నెలకొనినప్పుడు (ఎప్పటివలె) ప్రార్థ నలు సల్పుడు. నిస్సంశయముగ ముసల్మానుల కొఱకు నిర్ణీతకాల ములలో ప్రార్థనము విధింపబడినది.

**104.** శత్రువును వెన్నాడుటయందు అలసులు కాకుడు.* మీకు (యుద్ధములో) కష్టములు కల్గినచో, మీకు కష్టములు కల్గినట్లే వారికిని కష్టము కల్గుచున్నది కదా! కాని (వారికంటె మీ ఆధిక్యత ఏమ నగా) మీకు (విజయముయొక్కయు పుణ్యముయొక్కయు) ఫలమును భగ వంతుడు ప్రసాదించునను ఆశకలదు. వారికా ఆశలేదు. (ఎందు కనగా

*"ధైర్యమును కోల్పోకుడు" అనియు కొందరర్థము వ్రాసిరి.

మీరు భగవన్మార్గమున ధర్మసంస్థాపనమునకై పోరాడుచున్నారు. వారు స్వలాభమునకై మిమ్మలను హింసించుచున్నారు.) భగవంతుడు సర్వజ్ఞుడు, ప్రజ్ఞానిధి.

## పదునారవ ఖండము

105. (ఓ ప్రవక్తా!) సత్యమును బోధించు ఈ గ్రంథమును భగవదాదేశముల ననుసరించి ప్రజలమధ్య తీర్పుచెప్పుటకై మీకు వెలువరచితిని విశ్వాసద్రోహుల పక్షమున వాదించకుము.

106. భగవంతుని క్షమాభిక్ష వేడికొనుడు. భగవంతుడు మహాక్షమి; కరుణానిధి.

107. ఆత్మ ద్రోహులను వెనుకవేసుకొని వాదించకుడు. విశ్వాసఘాతకులను, పాపిష్ఠులను భగవంతుడు ప్రేమింపడు.

108. (విశ్వాస ఘాతకులు) మానవుల (దృష్టి) నుండి (తమ ద్రోహ చింతనమును, ద్రోహ కార్యములను) దాచిపుచ్చవచ్చును. కాని భగవంతుని (దృష్టి) నుండి దాచియుంచలేరు. (భగవంతుడు సర్వసాక్షి.) వారు రాత్రులందు కుట్రలు పన్నుటకై కూడి భగవంతున కిష్టములేని మాటలాడుకొనునప్పుడు భగవంతుడు అక్కడకూడ నుండును. వారు చేయునదంతయు భగవంతుడెఱుగును.

109. ఈ ప్రాపంచిక జీవితములో వీరి పక్షమున మీరు వాదించిరి. కాని తుదిదినమునాడు భగవంతుని ఎదుట వారి పక్షమున ఎవరు వాదించగలరు? ఆనాడు వారి నెవరు రక్షించగలరు?

110. ఏదేని దుష్కృతి నాచరించియు, లేక ఆత్మహాని యొనర్చికొనియు (పశ్చాత్తప్తుడై) భగవంతుని క్షమాపణమును వేడుకొనునో వానిని భగవంతుడు మన్నించును; కరుణించును.*

111. ఎవడు పాపముల నాచరించునో వాడు తన ఆత్మను తానే నష్టపరచుకొనును. భగవంతుడు సర్వజ్ఞుడు; ప్రజ్ఞానిధి.

* "అట్టివారు భగవంతుడు మహాక్షమి యనియు, కరుణాభువనియు తెలుసుకొందురు." అని ప్రతిపదార్థము.

112. ఎవడు పాపము నాచరించియు, తప్పిద మొనర్చియు (తాను తప్పించుకొనుటకై ఏపాప మెఱుగని) మరియొకనికి (ఆ పాపమునుగాని తప్పిదమునుగాని) అంటగట్టునో, వాడు అపవాదముయొక్కయు ఒక స్పష్టమైన పాతకముయొక్కయు భారమును వహించవలసియుండును.

## పదునేడవ ఖండము

113. (ఓ ప్రవక్తా!) మీపై భగవదనుగ్రహమును, దయయు లేకపోయియుండినచో వీరిలో ఒక పక్షమువారు (అసలు నేరస్థుని ప్రోద్బలమునకై ఏకమై) మిమ్ములను తప్పుమార్గమును పట్టించువారు. నీవును ఏపాప మెఱుగని వానిని నేరస్థుడనుకొని యుందువు.) నిజముగ వారు నిన్నుకాదు తప్పుమార్గము పట్టించినది, వారి ఆత్మలనే. నీకు వారెంతమాత్రమును హాని కలిగింపజాలరు. భగవంతుడు నీకు జ్ఞాన గ్రంథమును ప్రజ్ఞా వివేకములను ప్రసాదించెను. నీకు తెలియని విషయములను నేర్పెను. నీపై భగవంతుడు మహాదనుగ్రహముకలిగి యున్నాడు.౧౧౦

114. వారి ఈ రహస్యాలోచనములలో పెక్కాలోచనలు (వారికి సైతము) శ్రేయస్కరమైనవి కావు. ఐతే దానముచేయు మని గాని, అట్టి మరే సత్కృతి నొనర్పుమనిగాని ఆజ్ఞ ఇచ్చినను, లేక ప్రజలలో గల తగువులను మాన్చి వారిలో సమాధానము కుదుర్చుటకును (రహస్యాలోచనము చేసిన అది మంచిదే.) ఎవరు భగవత్ప్రీతికై ఇట్టి పనులు సేతురో మేము వారికి మిక్కిలి గొప్ప పుణ్యమును ప్రసాదింతుము.

115. ధర్మమార్గము స్పష్టముగ చూపబడిన పిదప కూడ ఎవడు ప్రవక్తకు వ్యతిరేకముగ వైరభావమును పూని, విశ్వాస వంతుల మార్గమును విడిచి ఇతరమగు దుష్టమార్గముల ననుసరించునో వానిని వాని ఇష్టమువచ్చిన మార్గమువైపునకే నడిపించి నరకమునకు చేర్తుము. ఇది ఎట్టి కఠోరమగు గమ్యస్థానము!

## పదునెనిమిదవ ఖండము

116. భగవంతునితో సమానులను నిలబెట్టుపాపమును భగవంతు డెంత మాత్రమును క్షమింపడు. ఇదిగాక మరేపాపమునైనను భగవంతుడిచ్ఛించుచో మన్నించును. భగవంతునితో ఎవడు సమానులను నిలబెట్టునో వాడు నిశ్చయముగ మహాపాతకముచేసినవాడు.౧౧౧

117. వీరు భగవంతుని విడిచి (జడములగు) స్త్రీవిగ్రహములు† ముందు మొఱపెట్టుకొందురు. వారు నిజముగా దుర్మార్గుడగు సైతాను ముందు మాత్రము మొఱపెట్టుకొందురు.౧౧౭

118. భగవంతుడు సైతానును శపించినాడు. కాని (సైతాను అట్లు శపితుడై భగవంతునితో) ఇట్లు విన్నవించుకొనెను. "మానవులను (త్రోవతప్పించుటలో) నేను ఒక నిర్ణీతభాగమును గైకొందును.

119. "వారిని నేను దారితప్పించి వారిలో తుచ్ఛమగు కోరికలను రేకెత్తింతును. వారిలో మూఢవిశ్వాసములను కల్గించి వారు జంతువుల చెవులను చీల్చి (దేవతల మొక్కుబడులను చెల్లించుటకై విడిచి పెట్టు మూఢత్వమునకు సైతము మొగ్గునట్లు) చేయుదును. వారు భగత్సృష్టిని మార్చునట్లు చేయుదును.* ఎవడు భగవంతుని విడిచిపెట్టి సైతా

---

† "ఇనాసా" అని మూలము ఈశబ్దమును నేను "(జడములగు) స్త్రీవిగ్రహములు" అని అనువదించితిని "ఇనాసా" అనగా "స్త్రీలు" అని అర్థము. అరబ్బులు స్త్రీవిగ్రహములను పూజించువారు. ఈ స్త్రీవిగ్రహములను దేవుని పుత్రికలని పిలుచువారు. ఈ విగ్రహములు దేవునికడకు తమ్ము గొంపోవునని వీరునమ్ముచుండిరి. (జహాక్) రాయి, కట్టె, మన్ను మున్నగు జడపదార్థములు 'ఇనాస్' అనబడునని కొందరు వ్యాఖ్యాతలు (ఇబ్నె అబ్బాస్, హసన్) "ఆరాధనమునకై ఏర్పడిన విగ్రహములు" అని కొందరు వ్యాఖ్యాతలు.

* "భగవంతునిచే చేయబడిన ఆకారమును చెడగొట్టుదని వారినందును" (తఫ్సీర మొహమ్మదీ) అని కొందరును, "భగవన్నిర్మితమగు (ప్రకృతి సహజమైన) ధర్మమును చెడగొట్టుదని వారినందును" అని కొందరును (ముజాహిద్, అక్రమా, అబ్దుల్లాబిన్ అబ్బాస్ ఇత్యాదులు) దీనికర్థముచెప్పిరి. ప్రతిమానవుడును ప్రకృతిసిద్ధముగ పవిత్రుడై

నును సంరక్షకునిగ గ్రహించునో వాడు పతితుడగును. వాడుపొందు నష్టము విస్పష్టమైనది.౧౧౯

120. సైతాను వారికి వట్టి ఆశలు కల్పించి తుచ్ఛమగు కోరి కలలో పడవేయును. సైతాను వారికి చూపిన ఆశలన్నియు మోస ముతో కూడుకొనినవి.

121. (తుదకు) నరకమునందు నివసింపవలసినట్టివారు వీరే. నరకమునుండి వీరికి ముక్తిమార్గము లభింపదు.

122. ఎవరు విశ్వాసవంతులై, సత్కార్యాచరణపరులై యుం దురో వారిని (శాంతి సౌఖ్యముల) నిర్ఝరులు ప్రవహించు ఉద్యానవన ములలో ప్రవేశింపజేతుము. వారికందే నిత్యనివాసము. (వారికక్కడ అక్షయమైన శాంతియు ఆనందమును చేకూరును.) భగవంతుని ఈ వాగ్దా నము సత్యము. ఎవరివాక్కు భగద్వాక్కుకంటె సత్యమైనది?

123 (ఓ విశ్వాసవంతులారా! ముక్తియు పుణ్యమును) మీహృదయ వాంఛలపైగాని క్రైస్తవయూదుల వాంఛలపైగాని (ఆధారపడి) లేదు. (అవి మీ విశ్వాసముపైనను స్వకీయ కర్మలపైనను ఆధారపడియున్నవి ) ఎవడు దుష్కార్యముల నాచరించునో (అత డెవడైననుసరే) దాని దుష్ఫలము నతడు అనుభవించక తప్పదు. భగవంతుడు తప్ప వారికి మరెవ్వడును బాంధవుడుగాని సాహాయ్యుడుగాని లభింపడు.

124. సత్కార్యాచరణపరులు—పురుషులైనను స్త్రీలైనను—

---

జన్మించుచున్నాడనియు అతని తల్లిదండ్రులతనిని అసత్యధర్మములలో ప్రవేశింప జేయుచున్నారనియు శ్రీ మొహమ్మద్ ప్రవక్త వచనము. 30 వ అధ్యాయమున ఖుర్ ఆన్ ఇట్లనుచున్నది. "ఈశ్వరుడు మానవునెట్టి ప్రకృతితో సృజించెనో, ఆ స్వభావ సిద్ధమైన స్థితియే మానవుని మతధర్మము. భగవత్సృష్టిలో మార్పులేదు. అదే సత్య మైన మతధర్మము. కాని పల్వురకది తెలియదు. అందుచే అదే ధర్మము వైపునకు మీరున్ముఖులుగండు" (30-30) ప్రకృతియందు స్థాపితమైయున్న ఈమతమునే ఖుర్ ఆన్ 'ఇస్లామ్' అని పిలుచుచున్నది. ఈసహజప్రకృతిని మార్చి కృత్రిమ మార్గము నందు నడుపుటయే సైతాను ప్రయత్నము.

విశ్వాసము కలవారైనచో వీరు స్వర్గమును ప్రవేశింతురు. వారి (పుణ్యకార్యములకు సత్ఫల మొసగుటలో) వారికి రవ్వంతయు అన్యాయము జరుగదు.౧౨౪

125. భగవంతునకు తన ఆత్మ సర్వస్వమును సమర్పించి సత్కార్యాచరణ మొనర్చువానికంటె సన్మత మెవరిది ? (వివిధ దేవతలను విగ్రహాదులను విడిచి) భగవన్మార్గమునే ఏకైక మార్గముగా గ్రహించిన ఇబ్రాహీము ననుసరించినవారు వీరు. భగవంతుడు ఇబ్రాహీమును తన మిత్రునిగ గ్రహించినాడు.౧౨౫

126. భూమ్యాకాశములలోనున్న సర్వస్వమును భగవంతునిదే. భగవంతుడు సర్వము నావరించియున్నాడు.

## పందొమ్మిదవ ఖండము

127. (ఓ ప్రవక్తా !) స్త్రీలను గూర్చి తీర్పుచెప్పవలసినదని మిమ్ములను వీరు కోరుచున్నారు.* (వారితో ఇట్లు) చెప్పుము: 'భగవంతు డీ విషయమున ఆజ్ఞాపించుచున్నాడు. §ఖుర్ఆన్‌లో అనాథలగు యువతుల పిల్లలను♦ గూర్చి (మీకు) విశ్రుతింపబడుచున్నది. (వారి విషయమున అన్యాయమునకు పాల్పడవలదని వెనుక చెప్పబడినది.)

* ౧౯ వ ఖండములో విషయము మారినది. అనాథస్త్రీల హక్కులనుగూర్చి అధ్యాయప్రారంభమున చెప్పబడిన ఆదేశములే ఇక్కడ తిరిగి చెప్పబడినవి. ఒకసారి ఈ విషయమున స్పష్టమగు ఆదేశము లివ్వబడినను కొందరు మాటిమాటికి ఈ విషయములను గూర్చి ప్రశ్నించుచుండుటచే వెనుకటి ఆదేశములనే అనుష్ఠించవలసినదని ఖుర్ఆన్ చెప్పుచున్నది.

§ ఈ అధ్యాయ ప్రారంభమున ఈ విషయమున ఇవ్వబడిన ఆదేశములే మీకు చదివి వినిపింపబడుచున్నవి. చర్వితచర్వణముగ ఈ ఆదేశములను ఇక్కడ మరొకసారి చెప్పవలసిన అవసరములేదని అభిప్రాయము. ఆ ఆదేశములనే అనుసరింపవలసినదని మరొకసారి ఆజ్ఞ.

♦ "యతామన్నిసాయి" అను ఇక్కడి మూలమునకు "విధవాస్త్రీలు" అనియు "తల్లిదండ్రులులేని స్త్రీలు" అని ఇట్లు మూడువిధములుగా అర్థము చెప్పవచ్చును.

వారికై నిర్ణయింపబడిన (వారసత్వమునందలి) వారి హక్కును వారికి ఇవ్వక, వారి (అస్తులను స్వాధీనపరచుకొనుటకై) ఎవరితో మీరు వివాహమాడదలచుకొనుచున్నారో† (మీ పోషణములోనున్న అట్టి అనాథ యువతులను గూర్చి వెనుకటి సూక్తమునందే చెప్పబడినది.)

(అట్లు) దుర్బలులగు దిక్కులేని (తల్లిదండ్రులు లేని) బాల బాలికలను గూర్చియు ఖుర్ ఆన్ లో (వెనుకటి సూక్తులలో ప్రవచితమైనది).

(అట్లే) తలిదండ్రులులేని పిల్లల విషయమున (వారు బాలికలైనను బాలురైనను, వారు మీ పోషణముక్రింద నున్నను లేకపోయినను) న్యాయబుద్ధితో ప్రవర్తింపుడు. మీరు చేయు సత్కృతుల నన్నిటిని భగవంతు డెఱుగును.

128. తన భర్త తన్ను నిరాదరించి తనయం దనురక్తుడు కాక విముఖుడై యున్నప్పుడు పరస్పరము (భార్యాభర్తలు) సమాధానపడి (ఒకరినొకరు ప్రేమగౌరవములతో చూచుకొనినచో) వారికి (ఇక) పాపము కాదు.* (ఎట్టి పరిస్థితులందైనను) సమాధానపడుటయే మిక్కిలి ఉత్త

† "(వారి ఆస్తులను స్వాధీనపరచుకొనగోరియు) ఎవరితో వివాహమాడుటకు వెనుదీయుచున్నారో" అనికూడ అర్థము చెప్పవచ్చును.

ఒకని పోషణక్రింద తల్లిదండ్రులులేని ఒక బాలిక ఆస్తిపరురాలున్నప్పుడు ఆమె ఆస్తిని ఆశించి ఆమెకు తాను తగిన వరుడుకాక పోయినను, ఆమె కిష్టములేకపోయినను ఆమెను బలాత్కారముగ వివాహమాడగోరుట యొకటి, ఆస్తిపరురాలగు తల్లిదండ్రులులేని బాలిక అందకత్తె కాకపోవుటచేతను, మరేకారణము చేతనైనను ఆమెను తాను వివాహమాడక, ఆస్తి తన చేతినుండి జారిపోవునను భయముచే ఆమెను మరొకని కిచ్చి వివాహము చేయకయుండుట యొకటి—ఈ రెండు తెరగుల ప్రవర్తనయు నిషేధింపబడినది. వీటికి సంబంధించిన ఆదేశములు అధ్యాయ ప్రారంభ ఖండములో ప్రవచింపబడినవి.

* భార్యాభర్తలు పరస్పరము ప్రేమించుకొనకుండుటయు, పరస్పరము గౌరవించుకొనకుండుటయు పాపకార్యములు. ఒకసారి అట్లు మనస్పర్థలు కల్గిన తరువాత పశ్చాత్తాపపడి సమాధానము కుదుర్చుకొని ఎప్పటియట్లు ఒకరియెడ ఒకరు ప్రేమగౌరవములతో ప్రవర్తించినయెడల అట్టివారి పాపములను భగవంతుడు క్షమించును అని ఇక్కడి అర్థము.

మము. ఆశాలోభములు మానవుని (ప్రకృతి)లో (సహజముగ) నున్నవి. మీరు (పరస్పరము) ఉపకారపారీణులై (ఒకరిపైనొకరు) దౌర్జన్యము నొనర్చుకొనక భగవద్భీతిపరులై యుండినచో (భగవంతుడు మీకు మీ సత్ప్రవర్తనముయొక్క ఫలము నొసగును.) భగవంతుడు మీ సమస్త కర్మలను గమనించుచునే యున్నాడు. ౧౨౮

129. (ఒకతెకంటె ఎక్కువమంది) స్త్రీల♦యెడల మీరెంతగా కోరినను (పూర్తిగా) న్యాయముతో ప్రవర్తింపజాలరు. అది మీ శక్తికి మించిన పని.† కాని ఒకే భార్యవైపునకు మొగ్గిపోయి రెండవయామెను ఇటూ అటూ కాకుండ§ విడిచిపెట్టకుడు. మీరు మీ భార్యలవిషయములో న్యాయయుక్తముగను, సమాధానపూర్వకముగను ప్రవర్తించుచు, దౌర్జన్యము చేయకుండినచో (మీ శక్తికి మించినట్టియు, సహజ దౌర్బల్యమువలన మీరు చేయునట్టియు అపరాధములను) భగవంతుడు క్షమించువాడు, కరుణానిధి.‡

130. ఒకసారి (భార్యాభర్తలలో పరస్పరము అనుకూలపడక ఒకరి నుండి యొకరు) వారు వేరైపోయినచో భగవంతుడు తన అనుగ్ర

♦ "భార్యలు" అని భావము.

† పురుషుడు తన భార్యలలో ఒకతెను ఎక్కువగ ప్రేమించుటయు మరొకతెను తక్కువగ ప్రేమించుటయు సహజము.

§ అనగా వివాహితవలె తన భర్త అనురాగమును బడసి అనుకూల దాంపత్య ధర్మములను నెరపునదియుకాక, అభర్తృకయై అనుకూలుడగు మరొక భర్తను పొందదగినదియును కాక మధ్యస్థముగ త్రిశంకు స్వర్గమున నుంచకుడు అని అర్థము.

‡ ఒకనికి ఇద్దరు భార్యలుండి వారిలో ఒకతె ఎక్కువ సౌందర్యవతియు, యౌవనవతియు, విద్యావతియునైయుండి గాని, మరేకారణముచేనైనగాని ఆమెను రెండవ యామెకంటె ఎక్కువప్రేమ గౌరవములతో చూచుట సహజము. అట్లు చేయుటయు దోషమే. ఐనను మానవుని ఈసహజ దౌర్బల్యమును భగవంతుడు క్షమించును. కాని పురుషుడు ఆహార, వస్త్ర, అలంకార, సంభోగాది విషయములందు తన భార్యలందరితోడను సమానముగ ప్రవర్తించుట మాత్రము విధి అట్లు చేయజాలక పోయినచో ఒకతెకంటె ఎక్కువమంది స్త్రీలను పెండ్లాడుట కతని కధికారములేదు.

హాముచే వారికి ఏలోపమును కలుగకుండ చేయును. (వారికై వారి కుచిత మగు ఏర్పాట్లుచేయును.) భగవంతుడు అందరను పోషించువాడు; ప్రజ్ఞానిధి ౧౧౩

131. (ఓ విశ్వాసవంతులారా!) భూమ్యాకాశములలోనున్న సర్వ స్వమును భగవంతునికొఱకే యైయున్నవి. (అవి కేవలము భగవదాజ్ఞాను సారము తమతమ విధ్యుక్తములను నిర్వహించుచున్నవి.) మీకంటెపూర్వము జ్ఞానగ్రంథము ప్రసాదింపబడినవారికిని, (అదేరీతిగ) మీకును, భగ వంతుని (ఆజ్ఞలను అతిక్రమించుటవల్ల కల్గు దుష్ఫలితములకు) భయపడుడని ఉపదేశించితిని. (భగవదాజ్ఞకు) విధేయులై యుండకపోయినచో (నష్టము మీదే.) భగవంతుడో భూమ్యాకాశముల మధ్యనున్న సర్వస్వము యొక్క ప్రభువు; నియంత. భగవంతుడు స్వయంసంపూర్ణుడు; సర్వ సంస్తుత్యుడు.

132. భూమ్యాకాశములందున్న సర్వస్వమును భగవంతుని కొఱకే యున్నవి. మీకు సంరక్షకుడుగా భగవంతుడు చాలును. (మీరు సంరక్షణమునకై మరెవ్వరి నర్థించనక్కరలేదు.)

133. ఓ మానవులారా! (జ్ఞాపకముంచుకొనుడు) భగవంతుడు తలచినచో మిమ్ములను నశింపజేసి మీ స్థానములో మరొకజాతిని తెచ్చిపెట్టగలడు. ఇట్లు చేయుట భగవంతుని శక్తికి మించినమాట కాదు. (అతడు సర్వశక్తిమంతుడు.)

134. ఎవడు ఐహికలాభమునుమాత్రమే వాంఛించునో, భగ వంతుడే ఐహికాముష్మికములు రెంటను శ్రేయశ్శుభములను కల్గిం చువాడని (తెలిసికొనునుగాక!) భగవంతుడు సర్వమును వినువాడు; సర్వమును చూచువాడు.౧౧౪

## ఇరువదవ ఖండము

135. ఓ విశ్వాసవంతులారా! న్యాయబుద్ధిని దృఢముగ చేపట్టుడు. భగవంతునికొఱకు (సత్యమగు) సాక్ష్యము నియ్యుడు.

స్వయముగ మీకు వ్యతిరేకముగను, (మీ) తల్లిదండ్రులకు వ్యతిరేకముగను, మీ సన్నిహితబంధువులకు వ్యతిరేకముగను (సాక్ష్యము చెప్పవలసి వచ్చినను) సరే, ధనికుడైనను, పేదవాడైననుసరే (సత్యమగు సాక్ష్యము నియ్యుడు) భగవంతుడు (మీకంటె) ఎక్కువగ వారిపై అనుగ్రహమును చూపువాడు. (ధనికుని ధనమునకు భయపడియు, బీదవాని దారిద్ర్యమునకు దయదలచియు అబద్ధ సాక్ష్యము నియ్యకుడు.) మీ విషయ వాంఛలు మీ న్యాయబుద్ధిని మార్చకుండుగాక! అట్లు కాక మీరు వక్రోక్తులను పలికి, న్యాయముచేయ నిరాకరించినచో (జ్ఞాపకముంచుకొనుడు) మీరు చేయునదంతయు భగవంతు డెఱుగును.౧౧౯

136. ఓ విశ్వాసవంతులారా! అల్లాః యందును, ప్రవక్త మొదలను, ప్రవక్తకు వెలువరచిన గ్రంథమునందును, ఇంతకు పూర్వము (వెనకటి ప్రవక్తలకు) వెలువరచబడిన గ్రంథములయందును విశ్వసింపుడు. భగవంతునియందును, అతని దేవదూతలయందును, అతని ప్రవక్తలయందును, తుదిదినమునందును విశ్వసింపక (సత్యమును) నిరాకరించువాడు సన్మార్గమునకు మిక్కిలి దూరుడైనవాడు.

137. ఒకసారి విశ్వాసమును ప్రకటించి, తిరిగి అవిశ్వాసమును చూపి, మరొకసారి విశ్వాసమును వెలువరచి, మరల విశ్వాసమును విడిచి, అట్లే అవిశ్వాసులైయుండినవారిని భగవంతుడు క్షమింపడు. వారికి (విజయ మోక్షముల) మార్గము చూపడు.

138. (ఓ ప్రవక్తా!) వంచకులగు వీరికి ఘోరమగు శిక్ష లభించునని తెలియజేయుము.

139. విశ్వాసవంతుల (పొత్తు) విడిచి, విశ్వాసహీనులను బంధువులుగా గ్రహించు ఈ వంచకులు అవిశ్వాసులకడ గౌరవము పొందగోరుచున్నారా యేమి? (అదే వీరి యుద్దేశమై యుండినచో వారిది తెలిసికొందురుగాక!) సమస్త గౌరవ (ప్రదాన) మును భగవంతుని వశమందే యున్నది. (గౌరవమిచ్చుట సత్యమునకు శత్రువులైన వంచకుల వశమందు లేదు.)౧౨౦

140. భగవంతుడు తన పవిత్ర ప్రవచనములో ఈ విధముగ మీ కాదేశించుచున్నాడు. (ఏ సభ లేక ఏ సమావేశమందు) భగవదాదేశములు నిరాకరింపబడుచున్నట్లును పరిహాసింపబడుచున్నట్లును, మీరు విందురో (అక్కడివారా చర్చను మాని) విషయాంతరమునుగూర్చి సంభాషించుకొన నంతవరకు వారితో కూర్చొనకుడు. (ఆసభనుండి లేచిపొండు. దుష్టసహవాసమున వారి దుష్ప్రభావము మీపైబడి) మీరుకూడ వారివలె కాగలరు. నిశ్చయముగ భగవంతుడు వంచకులను అవిశ్వాసులను నరకమున సమావేశపరచును.

141. మీకు (ఆపదలు సంభవించవలెనని ఎప్పుడును) వేచియుండు (వంచకులగు) వీరు, మీకు భగవంతుడు విజయమును ప్రసాదించినప్పుడు మీ (యెడ మైత్రిని నటించుచు) "మేము మీకు తోడైయుంటిమికదా ?" (అని వత్తురు.) అవిశ్వాసుల కొకసారి విజయము లభించినచో (వారిదగ్గరకు పరుగెత్తుకొనివెళ్ళి "విశ్వాసవంతులు యుద్ధములో) మీకు పైచెయ్యి యైనప్పుడు మిమ్ములను మేము వారిబారి నుండి రక్షించలేదా ?" (అందురు.) భగవంతుడు తుది దినమునాడు మీమధ్య పరిష్కరించును. (ఈ వంచకులు అవిశ్వాసుల కెంత సాయపడినను) అవిశ్వాసులు విశ్వాసులపై (విజయమును సాధించు) మార్గమును భగవంతుడు చూపడు.

## ఇరువదియొకటవ ఖండము

142. (ఈ విధముగ) వంచకులు భగవంతుని మోసగింపజూతురు.* వారి మోసమునకు తగు శిక్ష వారికి భగవంతుడిచ్చును.

వారు ప్రార్థనమునకై నిలువబడినప్పుడు అలసులై అశ్రద్ధతో నిలువబడుచున్నారు. (వీరు నిజమైన శ్రద్ధాభక్తులతో ప్రార్థనముచేయరు;) కేవలము లోకులకు చూపించుటకై ప్రార్థనము సల్పుదురు; నామమాత్రముగ భగవంతుని స్మరింతురు. (శ్రద్ధావిశ్వాసములతో కాదు. ౧౬౧

* అనగా ప్రవక్తను, విశ్వాసవంతులను మోసగింపజూతురు.

143. (వీరు విశ్వాసమునకును అవిశ్వాసమునకును)మధ్య ఇటూఅటూ అని (గోడమీద పిల్లివలె) ఏమియుతోచక నిలువబడియున్నారు. వీరి పక్షమునను కాక వారి పక్షమునను కాక యున్నారు. (అనగా విశ్వాసవంతుల పక్షమునను కాక, వారి శత్రువుల పక్షమునను కాక యున్నారు.) వాస్తవమేమనగా భగవంతుడే ఎవనిని దారి తప్పించెనో (అనగా భగవదాదేశానుసారము నడచినవారికి సన్మార్గమును, ఆ ఆదేశములకు విరుద్ధముగ ప్రవర్తించిన వారికి పతనమును కలుగునన్న భగవన్నియమము ననుసరించి వానికి పతనము కాగా) వానికి (శ్రేయశ్శుభముల) మార్గమును మీరు వెతికిపెట్టజాలరు.

144. ఓ విశ్వాసవంతులారా! విశ్వాసవంతులను విడిచి (మీతో పోరాడుచున్నట్టియు మీ వినాశమునే కోరుచున్నట్టియునగు) అవిశ్వాసులను బంధువులుగను సహాయులుగను గ్రహింపకుడు. భగవంతుని (శిక్షకై) మీకువ్యతిరేకముగస్పష్టముగకారణమునుచూపగోరెదరా?♦

145 వంచకులు నిస్సంశయముగ నరకమున నధోగతి నొందుదురు. (నాడు) వారికి ఎవరును సహాయముచేయరారు. (మరి మీరు ఇట్టి వారి ననుకరింతురా?)

146. ఐతే (వారిలో) ఎవరు పశ్చాత్తప్తులై, తమ ప్రవర్తనమును సంస్కరించుకొని, భగవంతుని (భక్తిని) దృఢముగ (హృదయమున) చిక్కబట్టి, ధర్మాచరణమున భగవంతునకే స్వాత్మార్పణమొనర్తురో వారు విశ్వాసులతోనుందురు. (సత్యమునందు) విశ్వసించి (సత్ప్రవర్తకులైయుండు) వారికి భగవంతుడు గొప్పగా బహూకరించును.

147. (మానవులారా!) మీరు (భగవంతునకు) కృతజ్ఞులైయుండి విశ్వాసవంతులై యుండినచో భగవంతుడు మిమ్ముల నేల శిక్షించును? భగవంతుడు మీ సత్కృతులను గ్రహించువాడు. (మీ అంతఃకరణమును) ఎఱిగినవాడు ౧౨౨

---

♦ మీరు పాపమొనర్చినారనుటకు ఇది స్పష్టమైన నిదర్శనము అని దీని భావము.

148. (నలుగురిలో) బహిరంగముగ వాచాలతతో చెడుగును చాటుట భగవంతున కిష్టముకాదు. కాని అన్యాయము జరిగినప్పుడు బాధితుడు (తనకు జరిగిన అపచారమును వెల్లడింపవచ్చును.) భగవంతుడు సర్వమును వినువాడు, సర్వజ్ఞుడు.౧౨౩

149. మీరేదైన సత్కృతిని బహిరంగముగ చేసినను, రహస్యముగ చేసినను లేక ఏదైన అపరాధమును క్షమించినను (మీ సత్కృతుల ఫలమును భగవంతుడు ప్రసాదించును. చూడుడు) భగవంతుడు సర్వశక్తిమంతుడయ్యు (పాపములను) క్షమించువాడు.

150. భగవంతుని, అతని ప్రవక్తలను నిరాకరించువారును, అల్లాఃకును అతని ప్రవక్తలకును మధ్య భేదభావమును కనబరచగోరి "మేము కొందరిని (ప్రవక్తలనుగా) విశ్వసించి మరికొందరిని విశ్వసింపము" అని చెప్పుచు ఒక మధ్యదారి తీయువారును—౧౨౪

151. వీరే నిజమైన విశ్వాసహీనులు. మేము అవిశ్వాసుల కొఱకు అవమానకరమగు శిక్షను సిద్ధపరచియుంటిమి.

152. అల్లాఃపైనను, అతని ప్రవక్తలపైనను విశ్వాసము గల వారికిని, వారిని (ప్రవక్తలను) పరస్పర భేదభావముతో చూడనివారికిని, నిశ్చయముగ త్వరలో మేము వారి (విశ్వాసమునకు తగిన) బహుమానమును ప్రసాదింతుము. భగవంతుడు మహాక్షమి. కరుణానిధి.

### ఇరువది రెండవ ఖండము

153. (ఓ ప్రవక్తా!) భగవద్దత్తమగు గ్రంధము పొందిన (యూదులు నీవు నిజమైన ప్రవక్తవనుటకు నిదర్శనముగ) 'ఆకాశమునుండి గ్రంథము దిగునట్లు చేయుడు.' అని నిన్నడుగుచున్నారు. వారు మూసాను ఇంతకంటె గొప్ప (మహాత్మ్యమును) చూపుడని కోరిరి. "మాకు భగవంతుని ప్రత్యక్షముగ చూపుము." అని (మూసాను) వారడిగిరి. వారి ఈ మౌర్ఖ్యము కతన వారిపై గొప్ప ధ్వనితో

పిడుగుపడెను. (దానితర్వాతకూడ వారు మౌర్ఖ్యమును దౌర్జన్యమును విడిచి పెట్టరైరి.) తర్వాత (సత్యమగు ధర్మముయొక్క) స్పష్టమగు నిదర్శనములు వారికి లభించినను వారు గోవత్సమును (ఆరాధ్యదైవతముగ) గ్రహించి (విగ్రహారాధనమునకు పాల్పడి) రి. దానినికూడ మేము క్షమించి (ధర్మ సంస్థాపనమునకు) మూసాకు స్పష్టమగు శక్తిని ప్రసాదించితిమి.

154. (భగవదాజ్ఞలను పాలింపుడని) వారికడనుండి ప్రతిజ్ఞను గైకొనినప్పుడు, 'తూర్' పర్వతశిఖరమును వారిపైకె మహోత్తర మొనర్చితిమి. (వారు భగవదాజ్ఞలను పాలింతుమని ప్రతిజ్ఞచేసిరి) దాని తర్వాత (మరొక సందర్భములో) "నగరద్వారమును (భగవంతునకు) వినయ వినమితులై ప్రవేశింపుడు" అని ఆజ్ఞాపించితిమి. "సబ్బాతు విషయమున అతిక్రమణ మొనర్పకుడు" అని (మరియొక సందర్భమున) ఆజ్ఞాపించి వారి కడ (ఈ ఆజ్ఞలను పరిపాలింతుమను) దృఢప్రతిజ్ఞను గైకొంటిమి.

155. వారు తమ ప్రతిజ్ఞలనుభంగమొనర్చినందులకును, భగవదాదేశములను నిరాకరించినందులకును, దౌర్జన్యముచే భగవత్ప్రవక్తలను చంపినందులకును (వారు దుర్గర్వముచే) "మా హృదయములపై తెరలు పడియున్నవి" (అని విఱ్ఱవీగుచు సత్యమును స్వీకరింప నిరాకరించి) పలికినందులకును (వారిపై భగవదాగ్రహము కల్గినది ) భగవంతుడు వారి హృదయములను వారి అవిశ్వాసము కారణముగా ముద్రాబద్ధితము నొనర్చినాడు. వారిలో కొద్దిమంది తప్ప తక్కినవారికి విశ్వాసమే లేదు.[౧౨౩]

156. వారు విశ్వాసమార్గమును నిరాకరించినందులకును, మర్యమ్‌పైవారు మిక్కిలి అసత్యాపవాదమును మోపినందులకును;

157. "మేము (తాము) భగవత్ప్రవక్త (యనిన) మర్యమ్ కుమారుడగు ఈసాను వధించితిమి" అని (డంబముతో) పల్కినందులకును (వారిపై భగవదాగ్రహము కల్గెను) —వాస్తవమేమనగా వారతనిని చంపనూలేదు, సిలువపై ప్రాణముల తీయనూలేదు. వారికా విషయము సందేహాస్పదము కావింపబడెను ఈ విషయమున వివాదపడినవారు

సందేహములలో మునిగియున్నారు. దానినిగూర్చి వారికడ నిశ్చయ జ్ఞానములేదు. వారికున్నది ఊహామాత్రజ్ఞానమే. వారు అతనిని చంప లేదనుట నిశ్చయము.[౧-౭]

158. కాదు, భగవంతుడు తన సమక్షమున అతనికి ఔన్నత్యమును ప్రసాదించెను. భగవంతుడు సర్వశక్తిమంతుడు; ప్రజ్ఞానిధి.[౧-౮]

159. భగవద్దత్తముగు గ్రంథ మీయబడినవారి (యూదుల)లో ఎవరును తమ మరణమునకు పూర్వము (వాస్తవము తెలిసికొని) దానిపై (ఈసా సత్యప్రవక్తయగుటపై) తప్పక విశ్వసింపనివా రుండరు. (మరణించు నప్పుడు వారు పశ్చాత్తప్తులగుదురు.) తుది దినమునాడు (భగవంతుని సమక్షమున) అతడు వారి విషయమున సాక్షియగును.

160. యూదుల ఈ చెడునడతకు ఫలితముగ (పెక్కు) మంచి వస్తువులను వారికై నిషేధించితిమి. (అంతకు పూర్వము) అవి నిషేధములై యుండలేదు. వారు భగవన్మార్గమున పెక్కుర నిరోధించుచు వచ్చుటయే (ఈ శిక్షకు కారణము)

161. (అంతేకాదు:) వారికి నిషేధింపబడినను వారు వడ్డీ తీసుకొన సాగిరి. అన్యాయముగ ఇతరుల సొమ్మున కొడిగట్టుకొనసాగిరి. వారిలో (ఈ విధముగ భగవదాదేశములను) నిరాకరించి (అధర్మప్రవర్తకులై)న వారికై కఠినశిక్ష సిద్ధపరచబడియున్నది.[౧-౯]

162. కాని (ఓ ప్రవక్తా!) వారిలో (భగవద్గ్రంథముయొక్క) విజ్ఞానముకలవారును విశ్వాసవంతులును నీకు ప్రోక్తమైన గ్రంథమును, నీకు పూర్వపు ప్రవక్తలకు ప్రోక్తమైన గ్రంథములను కూడ విశ్వసింతురు. ప్రార్థనములందు స్థిరచిత్తులైనవారును, జకాతు నిచ్చువారును, భగవంతునిపైనను తుదిదినముపైనను విశ్వాసముంచువారును—వీరికే మేము త్వరలో మిక్కిలి గొప్ప ఫలమును ప్రసాదింతుము.

## ఇరువది మూడవ ఖండము

163. (ఓ ప్రవక్తా!) నోహాకును, అతని తర్వాత వచ్చిన ప్రవ

క్తలకును పంపినట్లే నీకును ఈశ్వర ప్రేరిత జ్ఞానమును పంపితిమి. (అట్లే) ఇబ్రాహీమ్, ఇస్మాయీల్, ఇస్‌హాక్, యఅఖూబ్, యఅఖూబ్ సంతతి, ఈసా, అయ్యూబ్, యూసుఫ్, సులైమాన్ మున్నగు (ప్రవక్తలకు) కూడ (ఈశ్వర ప్రేరితజ్ఞానమును) ప్రసాదించితిమి. దావూదుకు జబూరు నిచ్చితిమి.

164. (అంతేకాదు, ఖుర్‌ఆనులో) ఇంతకుముందు కథితమైనట్టి ప్రవక్తలును, (ఖుర్‌ఆన్‌లో) కథితముకానట్టి ప్రవక్తలును (కూడ ఈశ్వర ప్రేరిత జ్ఞానమును బడసిరి. అదేవిధముగ) మూసాతో భగవంతుడు తన ప్రవచనములతో భాషించెను.

165. ఈ ప్రవక్తలు (అందరును భగవదారాధనము యొక్కయు సత్కృతులయొక్కయు ఫలముల)సువార్త నిచ్చువారును, (సత్యనిరాకరణము యొక్క దురంతమును వివరించి) భయపెట్టువారును అయిఉండిరి ప్రవక్తలు (వచ్చి మంచిచెడుగులను విప్పిచూపిన) తర్వాతకూడ, వారు భగవంతుని సమక్షమున (మాకు ధర్మమార్గమును చూపవైతివే!) అను సాకు చూపకుండుటకై (ఈ ప్రవక్తలు పంపబడిరి.) భగవంతుడు మహోన్నతుడు; ప్రజ్ఞానిధి.

166. (ఓ ప్రవక్తా! అవిశ్వాసులు సత్యసంధతను నిరాకరించిన నిరాకరింతురు గాక!) కాని భగవంతుడు నీకు ప్రసాదించిన జ్ఞానము దైవిక జ్ఞానమే ననుటకు భగవంతుడేసాక్షి. దేవదూతలును దీనికి సాక్షులు. భగవంతు డొక్కడు సాక్షియగుటయేచాలును.

167. ఎవరు (సత్యమును) నిరాకరింతురో, (ఎవరు) భగవన్మార్గమున రాకుండ (మానవులను) అడ్డుగొట్టుదురో, (వారు) నిస్సందేహముగ (సన్మార్గమును తప్పి)బహుదూరము పోయిపడినవారు.

168. ఎవరు విశ్వాస (మార్గ) మును నిరాకరించి, దుష్కార్యాచరణ మొనర్తురో భగవంతుడు వారిని క్షమింపడు. వారికి (శ్రేయశ్శుభముల) ఏమార్గమును చూపడు.

169. నరకమార్గముతప్ప (వారికి మరేదియులేదు) అందే వారికి నిత్యనివాసము. ఇట్లు చేయుట భగవంతునకు మిక్కిలి సులభము.

170. ఓ మానవులారా! నిస్సందేహముగ భగవంతుని కడనుండి సత్యమును తీసుకొని మీకడకు ప్రవక్త వచ్చినాడు. అందుచే అతనియందును, (అతడు మీకై నా కడనుండి తెచ్చిన సత్యమునందును) విశ్వసింపుడు. అది మీకే శ్రేయస్కరము. (అట్లుకాక) మీరు నిరాకరించినచో (జ్ఞాపక ముంచుకొనుడు) భూమ్యాకాశములందున్న సమస్తమును భగవంతుని వేయైయున్నవి. భగవంతుడు సర్వజ్ఞుడు; ప్రజ్ఞానిధి.

171. భగవద్దత్త గ్రంథము లివ్వబడిన (ఓ క్రైస్తవయూదులారా!) మీ మతములలో అతిశయోక్తులను నింపి హద్దుల నతిక్రమించకుడు. భగవంతుని గూర్చి సత్యముకాని విషయములను చెప్పకుడు. మర్యమ్ కుమారుడగు ఏసుక్రీస్తు భగవంతుని ఒక ప్రవక్తమాత్రము; కాని వేరుకాడు. (ఏసుక్రీస్తు) మర్యమునకు (సంతోషవార్తగా) ఇవ్వబడిన వాక్కుయొక్క ఫలము, భగవంతునికడనుండి వచ్చిన ఒకఆత్మ (కాని ఈసా మీరనుకొనుచున్నట్లు భగవంతుని కుమారుడుగాని, భగవదవతారము గాని కాడు. అత డొక ప్రవక్త.) అందుచే భగవంతునియందును భగవంతుని ప్రవక్తలయందును విశ్వసింపుడు. "భగవంతుడు త్రిమూర్తి (గా విభజింపబడినాడు)" అని చెప్పకుడు. ఇట్టి మాటలను కట్టిపెట్టుడు. మీకు శ్రేయశ్శుభములు కల్గును ఎందుకనగా ఏకైకుడగు భగవంతు డొక్కడే ఆరాధనార్హుడు. అతని మహిమా పావిత్ర్యములు కొనియాడబడుగాక! భగవంతునకు కుమారుడా? (అది అతని పావిత్ర్యమున కెంత దూరము?) భూమ్యాకాశములమధ్యనున్నదంతయు భగవంతునిదే. (విశ్వమునందలి సర్వస్వమును) రక్షించుటకు భగవంతుడు చాలును. (భగవంతునకును మీకును నడుమ మధ్యవర్తి అక్కరలేదు.)* ౧ ః౫

* పల్వురు క్రైస్తవులు మానవుల పాపములను క్షమించుటకును, వారిని రక్షించుటకును భగవంతునకును మానవలోకమునకును నడుమ ఏసుక్రీస్తు మధ్యవర్తియని భావింతురు. భగవంతుడు రక్షించువాడుండగా మధ్యవర్తులకోసరమేల దేవులాడుదురని ఖుర్ ఆన్ ప్రశ్నించుచున్నది.

## ఇరువదినాల్గవ ఖండము

172. ఏసుక్రీస్తు భగవంతుని సేవకుడై భగవంతునకే వినతుడగుటను చిన్నతనముగా భావించలేదు. భగవంతునకు సమీపమున నున్న దేవదూతలును అట్లనుకొనలేదు. భగవంతుని సేవను ఎవరు చిన్నతనమనుకొని గర్విష్ఠులైరో (వారు దుర్వ్యగ్రప్రమత్తులై ఎక్కడకు పోగలరు?) భగవంతుడు వారినందరిని (తుదిదినమున) తన సముక్షమునసే సమావేశపరచును.౧౩౦

173. భగవంతునిపై విశ్వాసము కలిగి సత్కార్యాచరణము చేయువారికి (ఆనాడు) భగవంతుడు (వారివారి సత్కర్మల) ఫలమును ప్రసాదించును. (అంతేకాదు) భగవంతుడు తన అనుగ్రహముచే ఇంకను ఎక్కువగ బహూకరించును.

ఎవరు భగవత్సేవను చిన్నతనమనుకొని గర్విష్ఠులైరో వారికి కఠినమగు శిక్షనిచ్చును.

174. నాడు భగవంతుడు తప్ప వారికి సంరక్షకుడుగాని సాహాయ్యుడుగాని లభింపడు.

175. ఓ మానవులారా! మీ ప్రభువు కడ నుండి మీయొద్దకు (సత్యముయొక్క స్పష్టమగు) నిదర్శనము వచ్చినది. మీకడకు స్పష్టమగు ఒక తేజస్సును పంపితిమి.

177. ఎవరు భగవంతునియెడ విశ్వసించి భగవదాశ్రయమునే గట్టి పట్టుకొమ్మగా గ్రహించిరో, వారికి తన మహదనుగ్రహమును ప్రసాదించి, దయాదాక్షిణ్యములను వారిపై ప్రసరింపజేసి, తనకడకు వచ్చు ఋజుమార్గమును భగవంతుడు చూపును.

177. (ఓ ప్రవక్తా: నిన్ను వారు (ఆస్తివిషయకమైన) తీర్మానమడుగుచున్నారు. (వారితో ఇట్లు) చెప్పుము: తల్లిదండ్రులుగాని సంతానముగాని లేనివానిని గూర్చి భగవంతుడు(ఇట్లు) తీర్మానించుచున్నాడు: ఒక పురుషుడు నిస్సంతానుడై మరణించినప్పుడు, వాని సోదరి

యున్నచో, ఆమెకు అతని ఆస్తియందలి సగభాగము లభించగలదు. అట్లు మరణించిన వ్యక్తి సంతానహీనయగు స్త్రీయైనచో ఆమె ఆస్తి అంతయు సోదరునకు సంక్రమించును.

ఒకసారి అక్కచెల్లెండ్రు ఇద్దరున్నచో వారిద్దరును ఆస్తిలో మూడింట రెండుభాగములను (సమానముగ పంచుకొనవలెను.)

ఒకసారి అన్నదమ్ములును అక్కచెల్లెండ్రును ఉన్నచో పురుషునకు ఇద్దరు స్త్రీలకు వచ్చునంత భాగము (వచ్చును,)

మీారు పొరపడుట కవకాశము లేకుండ భగవంతుడు (తన ఆజ్ఞలను) స్పష్టముగ చెప్పుచున్నాడు. భగవంతుడు సర్వస్వము నెఱుగును.



بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

# వ్యాఖ్యానము

# మూడవ భాగము

౪౮. వెనుక ఇదే అధ్యాయమున దానము విధింపబడినది. ఇక్కడ అదే ఆజ్ఞ మరియొకసారి ఆదేశింపబడుచున్నది. రెండు ఖండముల తర్వాత 36,37 ఖండముల రెంటి యందును దానము నందలి ధర్మసూక్ష్మములు వివరింపబడినవి.

దానమునకై ఖుర్‌ఆన్ ఎక్కువగ నాల్గుపదముల నుపయోగించుచున్నది. ఇఙ్ఫాఖ్ (పరహితేచ్ఛతో ఖర్చుపెట్టుట), ఇహసాఙ (ఉపకారము చేయుట) సదఖా (సత్యసంయుతమైన దాన కార్యము) జకాత్ (పావిత్ర్యము). దానము పరహితేచ్ఛతోడను, పరోపకారబుద్ధితోడను, పవిత్రబుద్ధితోడను చేయవలెనుట ఈ పదములందే స్పష్టీకరింపబడినది.

262, 263, 264 సూక్తములలో ఖుర్‌ఆన్ దానమెట్లు చేయవలెనో చూపుచున్నది. హింసించియు, దూషించియు, ఇతరవిధముల మనస్సును నొవ్వజేసియు చేసిన దానము దానముకాదు. దానము సౌహార్దముతో కూడిన మాటలతో చేయవలెను. ఒకసారి దానము గైకొనువాడు ఏదైన తప్పిదము చేసినను దానిని క్షమించవలెను. తాను దాతననియు, దానము గైకొనువాడు బిచ్చగాడనియు గర్వింపరాదు. అంతేకాదు. దానముచేసి దానివలన ప్రాపంచికమగు తుచ్ఛలాభములను బడయ గోరరాదు. కీర్తిని, పలుకుబడిని, గౌరవములను, ఇతర లాభములను ఆశించి చేయు దానము దానమే కాదు. భగవత్ప్రీతికై చేయు దానమే దానము. అట్టి దానమునకే భగవంతుడు బహుశతగుణముగ ఫలమును ప్రసాదించును (261.) అంతే కాదు. మంచివస్తువునే దానము చేయవలెను. పొల్లువస్తువులను దానమునకై యుంచి మంచి వస్తువులను స్వోపయోగమునకై యుంచుకొనుటయు కూడదు. మీకు ప్రియమైన వస్తువునే దానము చేయుడని ఖుర్‌ఆఙ ప్రబోధించుచున్నది. మీకప్రియమైన వస్తువు ఇతరుల కెట్లు ప్రియము కాగలదు ? అని ఖుర్‌ఆఙ ప్రశ్నించుచున్నది.

దానమునకు పాత్రులెవ్వరో ఖుర్‌ఆఙ ఇట్లు చెప్పుచున్నది · (బీద) బంధువులను అనాథబాలబాలికలను, నిరుపేదలను, మార్గస్థులను, బిచ్చగాండ్రను, ఖైదీలును (వారిని విడిపించుటకు) (II. 177.) భగవన్మార్గమునందాసక్తులై ఉదరపోషణము

నకై ఏదైన వృత్తి నవలంబించుట కవకాశము లేకయు, బిచ్చమునకై చేయి చాచకయు నుండు బీదలను ఖుర్ఆన్ ప్రత్యేకముగ దానార్హులుగ పేర్కొనుచున్నది. వారు నోటితో చెప్పనంతమాత్రమున వారు బీదలు కారనుకొనవలదనుచున్నది. వారి ముఖముపై గల చిహ్నములను బట్టి వారిని గుర్తించవచ్చునని ఖుర్ఆన్ చెప్పుచున్నది. ఎంతటి నున్నితమగు మనస్తత్త్వము ఖుర్ఆన్‌లో చిత్రింపబడినదో చూడుడు.

౪౯. ఈ సూక్తమును 'ఆయతల్ కుర్సీ' అందురు. ఇది మహామహిమోపేతమైన సూక్తమని ముసల్మానుల నమ్మకము. 'కుర్సీ' అనగా 'పీఠము' అనియు కొందరు అర్థము వ్రాసిరి. 'జ్ఞానము' అనియు పల్వు రర్థము వ్రాసిరి. నేను రెండవ యర్థమునే గ్రహించితిని. ఇబ్నెఅబ్బాస్, ముజాహిద్, ఇమామ్ అబూజఅఫర్, అబూఅబ్దుల్లా మున్నగు ప్రముఖభాష్యకర్తల మతమిది. (తఫ్సీరెమజ్మఉల్ బయాన్ సం. ౧. పు. ౧౪౭).- సూఫీప్రముఖుడగు ఇబ్నె అరబీగారు కూడ ఇదే అర్థమును వ్రాసిరి. (తఫ్సీరె ఇబ్నె అరబీ పు. ౪౯.)

* * * *

౫౦. ఇస్లామ్ ఖడ్గ బలముతో వ్యాపించెనన్న అపవాదము క్రైస్తవ చరిత్రకారులు మోపినది. ఖుర్ఆన్ ఈవిషయమున ఎంత స్పష్టమైన ఆదేశమిచ్చుచున్నదో చూపుటకు ఈ సూక్తమొక్కటి చాలును. మతవిషయమున ఎట్టి బలాత్కారమును చూపరాదన్న ఈ సిద్ధాంతము ఖుర్ఆన్‌లో ఈ అధ్యాయముననే వెనుక 193 సూక్తమున చెప్పబడినది.

శ్రీప్రవక్త అనుచరులలో ఒకరికి ఇద్దరు పుత్రు లుండిరి. వారు క్రైస్తవులు. 'వారిని ఇంచుక బలాత్కరించి ముసల్మానుల నొనర్తును. సెల వివ్వవలసినది' అని ఆయన ప్రవక్త అనుజ్ఞవేడెను. ప్రవక్త బలాత్కారమును నిషేధించుచు ఈసూక్తమును ప్రమాణముగా సెలవిచ్చిరి.

శ్రీ ప్రవక్త ప్రధాన శిష్యులలో ఒకరును, రెండవ ఖలీఫాయునగు హజరత్ ఉమర్ కడ 'అస్బఖ్' అను పేరుగల ఒక క్రైస్తవ బానిసయుండెను. హజరత్ ఉమర్ మాటిమాటికా బానిసకు ఇస్లామ్‌ను ఉపదేశించుచుండువారు. బానిస ఆయన మాటలను పెడచెవి పెట్టువాడు. తుదకు హజరత్ ఉమర్ 'మరి నీ ఇష్టము. ఇస్లామ్ బలాత్కారమును నిషేధించుచున్నది' అని చెప్పి ఊరకొనిరి. శ్రీప్రవక్తయొక్కయు వారి ప్రియానుచరుల యొక్కయు ఆచరణమును తెల్పు ఈ చరిత్రాంశములు ఈ సూక్తమునకు వ్యాఖ్యానములై యున్నవి.

* * *

౫౧. ఇందు పేర్కొనబడిన చక్రవర్తిపేరు 'నమ్రూద్' అని ప్రాచీన చరిత్రకారులు. ఇతడు బాబిలోనియాకు ప్రభువైయుండెను.

* *

౫౨. ఇందు పేర్కొనబడిన నగరము జెరూసెలమ్ క్రీ. పూ. 599 లో నెబూకాడ్ నెజ్జర్ విధ్వంస మొనర్చిన పిదప జెరూసెలమ్ నగరముయొక్క స్థితి యిందు వర్ణింపబడినది. ఇందు ఎజెకియల్ స్వప్నము వర్ణితమైనది. ఈ కథ బైబిల్ ప్రాత నిబంధనము 'ఎజెకియిల్'లో కూడ వర్ణింపబడినది. ఇది స్వప్నము కాదు వాస్తవమని కొందరు వ్యాఖ్యాత లభిప్రాయపడిరి. బైబిల్ కథ ననుసరించి చూచినను ఇది స్వప్నముగుట స్పష్టము ఖుర్ఆనులో ఇట్టి విషయములు సూచనమాత్రముగ నుండును. ఒక కథవల్ల మనము నేర్చుకోవలసిన గుణపాఠమే ఖుర్ఆనుకు ముఖ్యము కాని ఆ కథయొక్క వివరములు కావు. ఖుర్ఆనుకు ప్రధానమైనది కథ కాదు, దాని గుణపాఠము. అందుకై కథయొక్క ప్రత్యంశము తరచి శోధించు అవసరము కన్పించదు.

* * *

౫౩. 'ఫసుర్‌హున్న ఇలైక్' అనుటకు 'వాటిని ముక్కలు ముక్కలుచేయుడు' అనియు కొందరు వ్యాఖ్యాతలు అర్థము వ్రాసిరి. మౌలానా అబుల్ కలాం ఆజాద్, అల్లామా యూసుఫ్ అలీ, హాఫిజ్ గులాం సర్వర్, మౌలానా మొహమ్మద్ అలీ మున్నగు ఆధునిక వ్యాఖ్యాతలందరును నే నుల్లేఖించిన అర్థమునే గ్రహించిరి. వెనుక నేను చెప్పినట్లు కథలయొక్క ప్రత్యంశము విప్పి చెప్పుట ఖుర్ఆన్ ఉద్దేశమే కాదు. ఎంతవరకు తాను బోధింపనున్న సత్యమున కొక కథ ఉపకరించునో అంత కథాభాగమునే ఖుర్ఆన్ గ్రహించును. తక్కిన అంశములు ఖుర్ఆన్ దృష్టిలో అప్రస్తుతము. ప్రాచీనులకు అద్భుత కథనమునందును, మాహాత్మ్యము లందును ఎక్కువ ప్రీతి. అందుచే వారు సూచనలుగా ఇవ్వబడిన ఈ కథాంశములను పెంచి చిలవలు పలవలు పుట్టించి సంతోషపడిరి.

* *

౫౪. ఖుర్ఆను ఎంతటి హృదయంగమమగు ఉపమానములను ఇచ్చినదో గమనింపుడు. అట్లే 264, 265, 266 సూక్తములలో ఇచ్చిన ఉపమానములు నిరుపమానమైనవి.

* * *

౫౫. దానమునకు జాతిమతభేదములు లేవు పూర్వమున్ని మతములయందును ఇట్టి భేదములుండెను. ఉదాహరణమునకు మనువు

సమామబ్రాహ్మణే దానం ద్విగుణం బ్రాహ్మణబ్రువే
ప్రాధీతే శతసాహస్ర మనంతం వేదపారగే. (VII 85)

బ్రాహ్మణేతరుని కొసగిన దానమునకు దానికి సమానమైన ఫలమనియు, అనుష్ఠాన రహితుడైన బ్రాహ్మణున కొసగిన దాని ఫలము ద్విగుణమనియు, వేదాధ్యయనము చేయుచున్న బ్రాహ్మణున కిచ్చిన లక్షగుణముల ఫలమనియు, వేదపారగున కిచ్చినచో అనంతమగు ఫలము కల్గుననియు చెప్పుచున్నాడు. ఖుర్ఆన్ అట్లు కాక ఎవరైనను, ఏజాతికి, ఏ మతమునకు చెందిన వాడైనను సరే అతడు నిజముగా దరిద్రుడై సహాయము నర్థించు వాడైనచో అతని కివ్వవలసినదని ఆదేశించుచున్నది

శ్రీ ప్రవక్తశిష్యులు పల్వురు తమబంధువులలో ముస్లిములు కాని వారికి వారెంత బీదవారైనను వారికెన్నడును దానముచేయువారు కారు. ఈసూక్తము ప్రోక్తమైన పిదప ఏమతమునకు చెందిన వ్యక్తికైనను దాన మివ్వవలెనని శ్రీప్రవక్త ఆదేశించిరి. దాన ఫలము పరిగృహీతపై ఆధారపడి లేదు. ఎవరికి దానముచేసినను ఫల మొకటే.

పరిగృహీత గుణవంతుడైనను దుర్గుణుడైనను సరే అతనికి దానము చేయవచ్చునని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయము.

౨౬. ఇక్కడ ఖుర్ఆన్ వడ్డీని నిషేధించుచున్నది. ఆర్థికమగు చెడుగు లన్నిటికిని వడ్డీయే కారణమని అర్థశాస్త్రవేత్త లందరును ఒప్పకొని వడ్డీని తొలగించవలసినదని ఉద్ఘోషించుచున్న ఈ కాలములో భగవంతు డేర్పరచిన ఈ నియమము యొక్క ప్రాముఖ్యత నెక్కువగ నొక్కిచెప్పనక్కరలేదు వెనుకటి మతములన్నియు సర్వసాధారణముగ వడ్డీని నిషేధించియే యున్నవి ప్రాచీన విజ్ఞానులలో సుప్రసిద్ధులగు ప్లేటో, యారిస్టాటల్ అనుతాత్త్వికులు ఇద్దరును వడ్డీనిఖండించిరి. Laws అను తన ఉద్గ్రంథములో ప్లేటో ఒక ఆదర్శనగరమును వర్ణించుచు అందులో వడ్డీని నిషేధించుచున్నాడు. * యారిస్టాటల్ సుప్రసిద్ధమగు తన పాలిటిక్స్ అను గ్రంథములో వడ్డీని గురించి ఇట్లనుచున్నాడు "The most hated sort, and with the greatest reason, is usury, which makes a gain out of money itself, and not from the natural use of it. For money was intended to be used in exchange, but not to increase at interest. And this term usury, which means the birth of money from money, is applied to

* Laws V. 742, C, VIII 852, D. "Plato condemns usury with equal emphasis, he excludes it, in the *Laws*, from the ideal city described there."

James Bonar, Philosophy & Political Economy, P. 22.

(ప్లేటో వడ్డీని గట్టిగా నిషేధించెను. 'లాజ్' అను తన ఉద్గ్రంథములో వర్ణింపబడిన ఆదర్శనగరమునందు వడ్డీ నిషేధించెను.)

the breeding of money because the offspring resembles the parent. Wherefore of all modes of making money this is the most unnatural." (Politics I 10 5)

(డబ్బు గడించే పద్ధతులలో చాలా హేయమైనది వడ్డీ. ఆ విధంగా హేయంగా భావింపబడుట న్యాయమే. డబ్బుయొక్క ఉపయోగము వల్ల కాక డబ్బునుండియే డబ్బును పుట్టించు వృత్తి ఇది డబ్బు ఉపయోగపడుటకు ఏర్పడినది కాని, వడ్డీగా వృద్ధిపొందుటకు కాదు. డబ్బు గడించు పద్ధతులలో కెల్ల ఇది చాల ప్రకృతి విపరీతమైనది.)

ప్రాచీన రోమక్ సామ్రాజ్యములో మొట్టమొదట వడ్డీ ధర్మ్యమేమైయుండాను. కాని దానివల్ల నష్టములు కొన్నాళ్ళకు దుర్భరమాయెను. క్రీ. పూ. 450 లో ప్రకటింపబడిన లా ఆఫ్ ది ట్వెల్వ్ టేబుల్స్ లో అసలులో పండ్రెండవ భాగము మాత్రము వడ్డీగా గ్రహింపనగునని శాసింపబడెను. దీనివల్లకూడ ప్రజల ఇబ్బందులు తగ్గలేదు. క్రీ పూ 342 లో లెక్స్ జెనూషియా ననుసరించి వడ్డీ పూర్తిగ నిషేధింపబడెను. ఈ నిషేధము దాదాపు 300 ఏండ్లవరకు అమలులో నుండెను. ధనికుల ఒత్తిడి కాగలేక క్రీ. పూ. 50 లో తిరిగి రోమన్ శాసనసభ సాలుకు నూటికి 12 చొప్పున మాత్రము వడ్డీ తీసుకోవచ్చునని శాసించెను. అంతకంటె ఎక్కువ వడ్డీ తీసుకొనువారు శిక్షకు పాత్రులగుచుండిరి. *

ప్రాచీన ఈజిప్టులోకూడ వడ్డీపై ఎన్నో ప్రతిబంధకము లుండియుండినట్లు డయడోరస్ వ్రాయుచున్నాడు. డయడోరస్ క్రీ. పూ. ప్రథమ శతాబ్ద మధ్యమున ఈజిప్టుదేశము తిరిగియుండెను. (Diodorus Vol. 1. P. 81.)

---

* In B C 342 (interest) was abolished altogether by Lex Genucia. Although the prohibition of interest long remained law, it was found impracticable The Lex Unciaria of the Consuls Sulla and Rugus fixed the rate of interest at 12% per annum — By a decree of the Senate in B C 50 this became the legal limit throughout the Roman Provinces

(Palgrave's Dictionary of Pol Economy.)

(క్రీ. పూ. 342 లో లెక్స్ గెనూషియా వడ్డీని పూర్తిగా నిషేధించెను. వడ్డీ నిషేధము 'లా' లో ఉన్నప్పటికిని అది ఆచరణ సాధ్యము కాక పోయెను.. .. సల్లా రూగసులు కావించిన ఉన్కియారియా శాసనము ప్రకారము నూటికి సాలుకు 12 చొప్పున వడ్డీ తీసుకొనుట న్యాయ సమ్మత మొనర్పబడెను . . క్రీ. పూ. 50 లో ఈ వడ్డీ రేటు రోమక సామ్రాజ్యమంతటను శాసన సమ్మతమై యుండెను.)

ఆధునిక అర్థశాస్త్రజ్ఞులలో మేటియగు సర్ నార్మన్ ఏంజెల్ గారీ విషయమును గూర్చి తన The Story of Money అను ఉద్గ్రంథములో ఇట్లువ్రాయుచున్నాడు:

"One of the greatest events in the Story of Money is the change of ethical attitude in reference to loans, and interest thereon, and all that ecclesiastical ruling on such a matter implies We find it difficult to-day to realise that for long ages nearly all the great moralists and teachers, nearly all the great religious bodies, including the Roman Catholic Church, condemned the charging of interest as a vile crime comparable only to murder. It was no casual or incidental condemnation with which the Church and for centuries the secular state as well visited this offence Its heinousness has been the subject of a vast literature, of disputations carried on ardently from generation to generation, and age to age."*

(ఋణము దానిపై వడ్డీకి సంబంధించిన వాటియెడగల నైతిక వైఖరి యందు కలిగిన మార్పు ఆవిషయములపై క్రైస్తవచర్చి చేసిన నిబంధనములు ఆర్థికచరిత్రలో ఒక గొప్ప సంఘటనము. ఎంతో కాలము వరకు నీతిశాస్త్రవేత్తలు, విజ్ఞానులు, మత సంఘములు, రోమన్ క్యాథలిక్ చర్చివారు వడ్డీని ఒక గొప్పనేరమని, అది ఖూనీ కంటె తక్కువ నేరము కాదనియు ఖండించిరి. శతాబ్దముల పాటు చర్చివారును, మతమునకు సంబంధము లేకుండా రాజ్యములు వడ్డీని నిషేధించుట యాదృచ్ఛికముగా జరిగినదికాదు వడ్డీ నేరమని వ్రాసిన ఒక విశాల గ్రంథసంచయము కలదు. శతాబ్దముల తరబడి దీని దౌష్ట్యమును గూర్చిన చర్చలు కలవు.)

ఇట్లు క్రైస్తవ మతముయు, క్రైస్తవమతాచార్యులును కూడ దీనిని ఖండించిరి. వడ్డీని గురించి బైబిల్ ఏమనుచున్నదో చూడుడు

"If thou lend money to any of my people that is poor by thee, thou shall not be to him as an usurer, neither shall thou lay upon him usury" (Exodus 22 25)

(నా ప్రజలలో నీయొద్ద నుండు ఒక బీదవానికి సొమ్ము అప్పిచ్చినయెడల వడ్డికిచ్చువానివలె వారియెడల ప్రవర్తింపకూడదు, వానికడ వడ్డి తీసుకొనకూడదు )

"Unto a stranger thou mayest lend upon usury, but unto thy brother thou shall not lend upon usury that the Lord thy God may bless thee in all that thou settest thine hand to in the land whither thou goest to possess it." (Deut 23 20)

(క్రొత్తవానికి వడ్డీపై అప్పివ్వవచ్చును కాని నీ సోదరునికడ అప్పిచ్చి వడ్డీతీసుకొనకూడదు-ఇత్యాది)

* Quoted in Collin Brooks, "The Economics of Human Happiness," P. 48.

"He that hath not given forth upon usury, neither hath taken any increase, that hath withdrawn his hand from iniquity, hath executed true judgment between man and man" (Ezek 18 8.)

(వడ్డీకిఅప్పివ్వకయు, లాభముచేపట్టకయు, అన్యాయముచేయకయుండువాడునిజమైనన్యాయపరుడు)

"Hath given forth upon usury, and had taken increase shall he then live? He shall not live he has done all those abominations; he shall surely die, his blood shall be upon him. (Ezek 18-13)

(అప్పిచ్చి వడ్డీ పుచ్చుకొనుటయు, లాభము చేపట్టుటయు మున్నగుపనులు చేయువాడు బ్రదుకనా? బ్రతకడు ఈ హేయకార్యములు చేసెనుకనుక అవశ్యముగ వానికి మరణశిక్ష విధించవలెను)

పైవాక్యములన్నియు ప్రాత నిబంధనము (Old Testament)లోనివి. నూతన నిబంధనములో ఎక్కడను వడ్డీని గూర్చి స్పష్టముగ ఆజ్ఞాపింపబడలేదు. * కాని ప్రాత నిబంధనమునగల ఆజ్ఞనాధారముగా గొని క్రైస్తవాచార్యులు వడ్డీని నిషేధించిరి.

క్రీ. శ. ౧౩౧౧ లో వియన్నానగరమందు జరిగిన క్రైస్తవాచార్యుల మహాసభలో వడ్డీ సంపూర్ణముగ నిషేధింపబడెను. క్రైస్తవమత సంస్కర్తలలో అగ్రగణ్యుడగు మార్టిన్ లూథర్ వడ్డీని గురించి ఇట్లువ్రాయుచున్నాడు "Usury is a great huge monster, like a were-wolf, who lays waste all, more than any cacus, Geryon or Autacus—Since we break on the wheel, and behead highwaymen, murderers and house-breakers, how much more ought we to break on the wheel and kill—hunt down, curse and behead all usurers." (Quoted by Marx, Capital Vol. II P. 652)

(వడ్డీ ఒక పెద్ద రాక్షసి. ఇది సర్వనాశనము చేయును. మనము దోపిడిగాండ్రను హంతకులను, దొంగలను చంపుదుము కదా. అట్లైన ఈ వడ్డీ తీసుకొనువారి నేమి చేయవలెను? వారిని వేటాడి తలకాయలు నరకవలెను.)

---

* "The words of Jesus contain allusions to lending and borrowing, but as we should expect of one who refused to be a judge and divider (Luke 12-14)there are no direct precepts to guide the Christian conscience" *John Dow in the Encyclopaedia of Religion and Ethics*

(అప్పిచ్చుట, అప్పు తీసుకొనుట మున్నగు విషయములకు సంబంధించిన ఏసు క్రీస్తుమాటలు స్పష్టముగలేవు. తీర్పుచేయుటకు నిరాకరించిన (లూకా 12-14) ఏసు క్రీస్తు ఈ విషయమున క్రైస్తవుల అంతరాత్మకు మార్గదర్శకమగుటకు సూటియైన ఉపదేశము లేవియు ఇవ్వలేదు.)

యూరప్ ఖండపు కమర్షల్ లా మధ్యయుగములో ఇదే సిద్ధాంతముపై నిర్మింపబడెను. * కాని క్రమక్రమముగ క్రైస్తవాచార్యులు యూరప్ ఖండమున వ్యాపించిన క్యాపిటలిజమ్ ఒత్తిడి కాగలేక వడ్డీపై గల నిషేధమును తొలగించిరి. యాష్లే దీనినిగూర్చిఇట్లు వ్రాయుచున్నాడు, "The Prohibition of usury was clearly the centre of Canonist doctrine. That Prohibition, as it is ordinarily interpreted, and indeed as it was actually formulated in some few passages by some of the Fathers, would have prevented every sort of investment for the sake of gain (But soon) methods were found which did not conflict with the prohibition of usury, and which one after the other received the approval of the Church."

(Ibid P 396)

(క్రైస్తవ ధర్మశాస్త్రమునకు వడ్డీ నిషేధము స్పష్టముగ కేంద్రప్రాయమై యుండెను. ఆ నిషేధముయొక్క సాధారణ వ్యాఖ్యానము ననుసరించియు, క్రైస్తవాచార్యుల భావముల ననుసరించియు లాభము కొఱకు ఎట్టి పెట్టుబడినైనను అరికట్టి యుండెడిది . కాని వడ్డీ నిషేధమునకు వ్యతిరేకము కాని ఉపాయములు కనిపెట్టబడెను. అవి క్రమక్రమముగ చర్చివారి అంగీకారమును పొందెను—)

౧౪-వ శతాబ్దము నాటికి క్రైస్తవ చర్చి వడ్డీ నిషేధమును తొలగించెను. పదునైదవ శతాబ్దములో వడ్డీకి క్రైస్తవాచార్యులెల్లరును అంగీకరించిరి. † ఈ విధముగ చర్చి ఒక గొప్ప భగవదాజ్ఞను నిరాకరించివైచెను. క్రైస్తవమతము క్రైస్తవమతాచార్యుల ఇచ్ఛానుసారము ఎట్లు మారుచు వచ్చినదో చూపుట కిదొక తార్కాణము. ౧౫౪౫ లో సంవత్సరమునకు నూటికి ౧౦ వరకు వడ్డీ తీసుకొనవచ్చునని ఎనిమిదవ హెన్రీరాజు కావించిన శాసనమునకు వ్యతిరేకముగ క్రాలే అను ఒక ఆంగ్ల మహాశయుడు ౧౫౫౧ లో పార్లమెంటుకు సమర్పించిన విన్నప

* "On the fundamental points of usury and just price, commercial law in the later Middle Ages adopted completely the principles of the Canonists."(Ashley, Economic History Vol.I, Part II P.384)
(వడ్డీ, న్యాయసమ్మతమగు ధర మున్నగు ప్రధాన సమస్యల విషయములో మధ్యయుగములందు కమర్షల్ లా క్రైస్తవ ధర్మశాస్త్రమునే ఆధారముగా గ్రహించెను.)

† "During the following, the fourteenth, it could hardly be regarded as distinctly under the ban of the Church, and in the 15th it was certainly very generally accepted by the best theologians." (Ashley, P 401)
(14-వ శతాబ్దములో అది చర్చివారి నిషేధముక్రింద లేదు. 15-వ శతాబ్దములో గొప్ప క్రైస్తవాచార్యు లందరును వడ్డీని ఒప్పుకొనిరి.)

మండలి ఈ క్రింది మాటలు నేటికిని క్రైస్తవ మతస్థులకు చెల్లును. క్రాలే మహాశయుని మాటలివి "Now I will speak of the great and intolerable usury which at this day reigneth so freely this realm over all ...

Alas, that ever any Christian Assembly should be so void of God's Holy Spirit that they should allow for Lawful anything that God's Word forbiddeth Be not abashed worthy Counsellors, to call this act into question again

And again with regard to the Biblical Command I am not ignorant what glosses have been made upon this place, and how men have wrested and made it no precept but a Counsel of our Saviour, and therefore not to infer necessity to Christians, but to leave them at liberty either to do it or to leave it undone. Oh, merciful Lord! *What manner of religion is it that these men profess* .... — And doubt ye not, most worthy Counsellors, whatsoever he is that will defend or teach that any one little iota of the Counsels of Christ should be so vainly spoken that any of his flock might refuse to practise the same in his living to the uttermost of his power, is no less than a member of the Devil and a very Antichrist . . .."

(Quoted by Ashley. P. 465)

(మన దేశంలో అమూలాగ్రం వ్యాపకంలోవున్న దుర్భరమైన వడ్డీ వ్యాపారమును గురించి నేనిప్పుడు చెప్పెదను భగవంతుడు నిషేధించిన దానిని శాస్త్రసమ్మతంచేసి భగవదపచారం చేస్తున్న క్రైస్తవ సంఘములనుగురించి విచారపడవలయును.

బైబిల్లో వడ్డీ నిషేధం సలహామాత్రమే అనీ, ఆజ్ఞ కాదనీ మీరు అర్థం చెపుతున్నారు ఓ భగవంతుడా, వీరు అనుసరించే మతం ఏమిమతం?

ఏసుక్రీస్తు యొక్క ఉపదేశములు—ఏ కొద్దిభాగమైనను—నిరర్థకములని చెప్పి వారి శిష్యకోటి అనుసరించవలసిన అవసరములేదని చెప్పువారు క్రైస్తవులు కారు—పిశాచ కోటికి చెందినవారు.)

ఫ్రాన్సులో 1789 వరకు వడ్డీ నిషేధ శాసనములను తొలగించలేదు. అల్లే ఇంగ్లాండులో 1839 వరకు వడ్డీ నిషేధ శాసనములు అమలులో నుండెను.

ఋగ్వేద కాలములో కూడ వడ్డీ తీసుకొను పద్ధతి యుండినట్లే కన్పించుచున్నది. వడ్డీవల్ల కలుగు వినాశము ఋగ్వేద దశమమండలమున 34-వ మంత్రములో వర్ణింపబడినది. ఈ విషయమును గూర్చి డాక్టర్ బెరియెడేల్ కీత్ పండితుడు ఇట్లు వ్రాయుచున్నాడు "The rate of interest is unknown, a reference to payments of an eighth or a sixteenth may be referred either to interest or instalments of principal. At any rate, the debtor might as a result be reduced to slavery, as we learn from an interesting hymn (x.34)

where an unsuccessful dicer recites the fatal fascination for him of the dice and his consequent ruin and enslavement with its results for his family." (The Cambridge History of India Vol 1 P. 98)

(ఎంత వడ్డీ వసూలు చేయబడునది మనకు తెలియదు. అసలులో వడ్డీ ఎనిమిదో వంతో, పదహారవవంతు గానో తీసుకోవచ్చునని సూచన కనుబడుచున్నది. ఎలాగైనా అప్పులవాడు దాస్యంలోకి క్రమేణ గుంజివేయబడటం జరుగుతుంది, జూదమాడుట లోని మోజు దానికి ఫలితమై సర్వనాశనం ఒక మంత్రములో చెప్పబడియున్నవి (X 34). దాస్యం తప్పనిసరౌతుంది, తనకే గాదు, తన కుటుంబానికిగూడా )

ఆర్యధర్మశాస్త్రకారులు కూడ వడ్డీని కొంతవరకు నిషేధించిరి. మనువు ( ౧౧౬-౧౪)

'విద్యాశిల్పం భృతిస్సేవా గోరక్షం విపణిః కృషిః
ధృతిర్భైక్ష్యం కుసీదంచ దశ జీవనహేతవః

అని వడ్డీ జీవనము ఆపదలందు జీవికగ చెప్పుచు, బ్రాహ్మణ క్షత్రియులకు

"బ్రాహ్మణః క్షత్రియో వా పి వృద్ధిం
నైవ ప్రయోజయేత్"

అని ఆపదలందు సైతము వడ్డీకిచ్చి జీవనము చేయరాదను చున్నాడు. మరియొకచో మనువు (IV ౨౨౦.)

'విఘుష్టావార్ధుషికస్యాన్నం'

అని వడ్డీ వ్యాపారి అన్నము మలముతో సమాన మని చెప్పుచున్నాడు.

మనువు వలె ఆపస్తంబుడు కూడ వడ్డీ తీసుకొని జీవించువాని కడనుండి అన్నము స్వీకరించరాదనుచున్నాడు. (ఆపస్తంబ ధర్మసూత్రములు ౬. ౧౮. ౨౨) అంతే కాదు. వడ్డీపై డబ్బిచ్చువానికి ఆపస్తంబుడు ప్రాయశ్చిత్తము విధించుచున్నాడు. (౧౦ ౨౮. ౧౦.) యాజ్ఞవల్క్యుడు (౧ ౧౬౧), నారదుడు (౧ ౧౧౧) విష్ణువు (౪౦. ౧) ఇదేవిధముగ వడ్డీవృత్తి నిషేధించుచున్నారు. ఈ క్రిందివారు వడ్డీ చెల్లించ నక్కరలేదని ధర్మ శాస్త్రకారులు శాసించిరి (1) నిరంతరము యజ్ఞములుచేయుట యం దాసక్తికలవారు, (2) వ్యాధితులు, (3) విద్యార్జనమునకై గురువింట కాపురముండు బ్రహ్మచారులు; (4) చిన్నవాండ్రు, (5) దరిద్రులు. * కాని ఆర్యమతములు పెక్కితరవిషయము లందువలె ఒక దారిత్రొక్కవాయెను. వైశ్యులకువడ్డీవృత్తిధర్మ్యమే యని ధర్మశాస్త్రకారులు నిర్ణయించినారు. ఆర్యమతమున ఏ ధర్మమైనను వర్ణాశ్రమముల నాశ్రయించియుండును వడ్డీవృత్తిని వైశ్యులకు ధర్మ్యమొనర్చుటయే కాక ఆర్యధర్మకారులు ఎవరెవరికడ ఎంతెంత వడ్డీని గ్రహించవలెనో నిర్ణయించిరి.

* N. N. Law Studies in Ancient Hindu Polity, P. 176 నరేంద్ర నాథలాగారు దీనికి ప్రమాణము చూపరైరి.

"ద్వికం శతం వా గృహ్ణానో న భవత్యర్థకిల్బిషీ"- అని నూటికి నెలకు రెండు చొప్పున వడ్డిని గ్రహించువాడు ధనగ్రహణ మూలమున పాపికానేరడు అని మను వనుచున్నాడు. అంతటితో ఆగక బ్రాహ్మణునికడ నూటికి రెండును, క్షత్రియుని కడ నూటికి మూడును, వైశ్యునికడ నూటికి నాల్గును, శూద్రునికడ నూటికి ఐదును వడ్డీగైకొనవలయునని శాసించుచున్నాడు (మను ౮ ౧౪౨). యాజ్ఞవల్క్యుడు (౨ ౩౭, ౧, ౨), విష్ణువు (౬ ౨), నారదుడు (౧ ౬౬) మున్నగు ధర్మశాస్త్రకారు లును ఇదేవిధముగ శాసించుచున్నారు. నూటికి సాలుకు 15 చొప్పున వడ్డీ తీసుకొన వచ్చునని అర్థశాస్త్రకారు డనుచున్నాడు.

గౌతమ బుద్ధుడు వడ్డీని నిషేధించక పోయినను బౌద్ధయుగములో వడ్డీ తీసుకొను వారు సత్పురుషులుగ భావింపబడకుండినట్లు జాతక కథలలో కన్పించుచున్నది. వంచ కులగు పారివ్రాజకులు వడ్డీ వ్యాపారము చేయుదురని ఒకజాతకములో కలదు. * భారత దేశమున ఎవరును వడ్డీ తీసుకొనరని మెగాస్తనీసు వ్రాసెను. (Hopkins in Cambridge Hist. of Ind P 287) ఇది మెగాస్తనీసు పొరపాటని కొంద రభిప్రాయపడినను వడ్డీ వ్యాపారము నీచవృత్తిగానైనను నాటి భారత దేశమున పరిగణింపబడుచుండుట నిర్వివాదము. మెగాస్తనీసు నీచులవలంబించు ఈ వృత్తిని గమనించి యుండకపోవచ్చును మొత్తము మీద సర్వకాలము లందును, సర్వదేశము లందును, అన్ని మతములందును వడ్డీ తీసుకొనుట దుష్టమనియు, వడ్డీ వ్యాపారము నీచవృత్తియనియు పరిగణింపబడుచుండెననుట స్పష్టము.

వడ్డీకి సంబంధించిన ఈ నిషేధము మానవుని ఆర్థిక జీవితమునకు సంబంధించినది. మానవుని ఆర్థిక జీవితమునకు సంబంధించిన ఈ విషయమును కూడ మతాచార్యులు ఆధ్యాత్మిక జీవితమునకుసంబంధించిన సమస్యలను వలెనే తేలికగ ఇచ్ఛానుసారము మార్చివైచిరి. దీనికి ఫలితముగ- మానవుడు ధనార్జనయంత్రముగ మారిపోయినాడు. పరుల దారిద్ర్యము వలన లాభము పొంది వారి అవసరములలో అప్పు సప్పు నిచ్చి తమ ధనమును పెంచుకొనుట కిదొక మార్గమైపోయినది. ఎన్ని కొంపలు కూలుట లేదు ఈ వడ్డీ వలన ? ఒక్క మనగ్రామసీమలో 900 కోట్ల రూపాయలకు పైగా ఋణమున్నదనియు దానిపై అధమము 225 కోట్ల రూపాయలు ప్రతి సాలు మీద రైతులు వడ్డీగా చెల్లించుచున్నారనియు అర్థశాస్త్రజ్ఞులు అంచనావేసిరి. గత ఐరోపా

* "Hypocritical ascetics are accused of practising it (money-lending on interest). (Jataka IV. 484). No one but the money lender seems to have lent capital wealth for interest as an investment." (Rhys Davids in Cambridge History of India, Vol. 1 P. 218)

మహాసంగ్రామములో అమెరికా నుండి ఇంగ్లాండు ఫ్రాంసుదేశములు తీసుకొనిన అప్పులపై వడ్డీ ఇచ్చుకొనలేక అనేక సార్లీ దేశములు అమెరికాను ప్రాధేయపడి వాయిదా వేయించుకోవలసివచ్చెను. సంవత్సరమునకు వేల కోట్ల రూపాయలు అమెరికాకు ఇంగ్లాండు వడ్డీ క్రింద ఇవ్వవలసి వచ్చుచుండెను.

కాపిటలిజమ్ లేక పుంజీపతిత్వమునకు ఆధారము వడ్డీయేయని ౧౯-వ శతాబ్దములో గ్రహింపబడెను. తనకడనున్న ధనము వర్తకమునందుగాని పరిశ్రమలయందుగాని తాను స్వయముగ పెట్టుకొన చేతకాక వడ్డీపై ఆధనమును పెట్టుబడి పెట్టువాడు కాపిటలిస్టు. * అందు చేతనే సామ్యవాద పితామహుడగు కార్ల్ మార్క్స్ వడ్డీని నిషేధించినాడు. బీదకార్మికులనుండి కాపిటలిస్టు అన్యాయముగ పిండుకొని తినుచున్న 'సర్ ప్లస్ వ్యాల్యూ' లేక అదనపువిలువలో వడ్డీనికూడ చేర్చినాడు. జాన్ డో పండితు డన్నట్లు పాటకజనముపై ఒక అన్యాయపు పన్నని ఇప్పుడు వడ్డీ ఖండింపబడుచున్నది. అంతేకాదు. వడ్డీ ధనికులను ధనికతరులుగను, బీదలను ఇంకను ఎక్కువ బీదవాండ్రుగను చేయుననియు, దీని వలన సాంఘిక జీవితము నిలుకడగా ఉండజాలదనియు జాన్ డో అనుచున్నాడు. † అందుచే సామ్యవాదుల అర్థశాస్త్రములో వడ్డీకి స్థానము లేదు. "All extant Capital is accumulated or capitalised interest; for interest is nothing more than one fragment of surplus value" (Karl Marx, Capital, Vol. II, P 646.)
(వడ్డీ అదనపు విలువలోని ఒక భాగం. అందుకని, నిలువధనమంతా కూడబెట్టబడిన వడ్డీ అనిగాని, లేదా, ధనముగా కూడబెట్టిన వడ్డీ అనిగాని చెప్పాలి.)

---

* Grimm defines "capitalist" in German, as "a man who lends out money on usury." (Ashley, Vol. I. Part. II P. 430.)

† "The early attacks on usury were motived by the church's sympathy for the oppressed poor, the latest attack finds its strength in the plea that interest is an unjust tax on laboring classes .By interest then, the rich are made richer, and the poor poorer, and the stability of social organisation is disturbed," John Dow in the Encyclopeadia of Religion & Ethics.

(బీదల బాధలను జూచి కనికరించే దృష్టితో, తొలుత వడ్డీ పద్ధతులమీద దాడి మొదలు పెట్టబడెను. ఇప్పటి దృష్టిలో వడ్డీ, కూలి వాళ్ల మీద విధింపబడే అన్యాయపు పన్నుగా భావింపబడి నిరసింపబడుచున్నది. వడ్డీ కారణముగా, బీదలు మరీ బీదతనములో మగ్గి పోవుటయును భాగ్యవంతులు విపరీతముగా భాగ్యవంతులగుటయు జరుగుచున్నది. అందుచేత, సాంఘికవ్యవస్థలో స్థిరత్వము లేకుండా పోవును.)

అన్నాడు కార్ల్‌మార్క్స్. ఈ సందర్భములో ఎకానిమిస్టులోని ఈ క్రింది మాటల నుద్ధరించాడు మార్క్స్. చూడుడు ఇవి ఎంత స్పష్టముగా ఉన్నవో. "Capital with compound interest on every portion of capital saved, is so all-engrossing that all the wealth in the world from which income is derived, has long ago become the interest on capital"

(Economist, July 19, 1859)

(వడ్డీ వ్యాపారములో అదనపు విలువగా మనము కొంత అదనపుధనమును కూడబెట్టుదుము. ఈ అదనపుధనమే కాంపౌండు వడ్డీతో పెంచబడిన ట్లైతే, ప్రపంచములోనిమూలధనమంతయు, అనాదినుండి పెంచబడే వడ్డీ మాత్రమేనని గ్రహించవలెను.)

తాను అనుభవించకుండా నిగ్రహముతో దాచియుంచిన ధనమునకు ప్రతిఫలము ఈ విలువ యని చెప్పు ధనికునకును, వాని బానిసయగు అర్థశాస్త్రజ్ఞుని పరిహసించుచు కార్ల్‌మార్క్స్ ఇట్లు వ్రాయుచున్నాడు "It has never occured to the vulgar economists to make the simple reflection that every kind of human activity can, if you like, be regarded as 'abstinence' from the opposite kind of activity. Eating is abstinence from fasting, walking is abstinence from standing, work is abstinence from idleness, idleness is abstinence from work, and so on. These gentlemen would do well to ponder, once in a way, Spinoza's dictum "determination is negation" (Ibid, P 656.)

(ఛాందసులైన అర్థశాస్త్రజ్ఞులకు ఒక చిన్నవిషయముకూడ బోధపడినట్లు కనబడదు. మానవుని ప్రతిచర్యయు, తద్వ్యతిరేక కార్యము యెడ నిగ్రహ భావమని వారికి తట్ట లేదు. తినుట, దానికివ్యతిరేకమైన ఉపవాసమునుచేయకుండుట, అదేవిధముగ, నడచుటకు, నిలచుట, పనిచేయుటకు సోమరితనము మొదలైనవి వాటికి వ్యతిరేకములైన కార్యములు. ఈ పెద్దలు, స్పినోజా చెప్పిన 'నిర్ణయించుట యనునదే వ్యతిరేకించుట' యను సూత్రమును మననముచేసిన బాగుండును.)

వడ్డీ ఉండుటచేతనే, అనగా ధనమునకు కొంత ప్రతిఫలము లభించునను ఆశ ఉండుటచేతనే ధనము కూడుచున్నదనియు, లేనిచో ఎవరును ధనము కూడబెట్టరనియు, ఒకసారి కూడబెట్టినను పరిశ్రమాదులలో పెట్టుబడిపెట్టరనియు, అట్టి పరిస్థితులలో, సంఘమున కభివృద్ధి యుండదనియు, జాతిసంపద పెరుగక నిలిచిపోవునవియు, ఆధునిక నాగరకతకు కావలసిన ఉన్నతజీవిత ప్రమాణము స్వప్నప్రాయమై పోవునవియు, ప్రజలకు పల్లెటూరి నాగరికతయే ప్రాప్తమగుననియు మొన్నమొన్నటి వరకు కొమ్ములు తిరిగిన అర్థశాస్త్రవేత్తలందరును అనుచుండిరి. ఇప్పుడు వారిలోనే

అత్యంత ప్రముఖుడగు ఒక అర్థ శాస్త్రవేత్త ఈ మధ్య ఈభావము లన్నిటిని పడగొట్టినాడు. అతడే జేమ్స్ మేనార్డ్ కైన్స్ (James Maynard Keynes). బ్రిటిష్ సామ్రాజ్యములోనే కాదు ప్రపంచ అర్థశాస్త్రవేత్తలలో ఇత డగ్రగణ్యుడు. ఇతడు ౧౯౩౬ లో "The General theory of Employment, Interest and Money" అను ఒక ఉద్గ్రంథమును రచించి అర్థశాస్త్రజ్ఞులను విభ్రాంతుల నొనర్చెను. వడ్డీరేటు హెచ్చించినచో పెట్టుబడికై ఎక్కువ ధనము మార్కెటులోనికి వచ్చునను ఆర్థిక సిద్ధాంతము తప్పని కైన్సు ఇందు చూపెను. వడ్డీరేటునకును పెట్టుబడికై మార్కెటు లోనికి వచ్చు ధనముయొక్క మొత్తమునకును ఎంతమాత్రము సంబంధము లేదని కైన్సు ఇందు దీర్ఘముగ చర్చించెను. దీనితో ఆర్థిక సౌభాగ్యమునకు వడ్డీయే మూలకందమనుకొనిన ప్రాచీన అర్థశాస్త్రజ్ఞుల మూఢభావము మొదలంట కూలెను. ఆర్థికపు టెగుడుదిగుడులను తగ్గించుటకు మార్గము వడ్డీరేటు తగ్గించుట కాని హెచ్చించుట కాదని కైన్సు ఇందు రుజువు పరచెను. అర్థశాస్త్రజ్ఞులిప్పుడు కండ్లు తెరచినారు. వడ్డీ సర్వ ఆర్థిక అరిష్టములకు మూలమని ఇప్పుడు వారికి బోధపడినది.

వడ్డీని గూర్చి ప్రాచీన భావములు, ప్రాచీన మతములు, వివిధ ఆర్థిక నీతులనాదరించు అర్థశాస్త్రజ్ఞులు ఏమనిరో, ఇన్నాళ్ళ అనుభవము, భావన, అర్థశాస్త్రజ్ఞులను ఏఫలితార్థము వంకకు తీసుకొని వెళ్లినవో వెనుక స్పష్టముగ వివరించితిని. వెనుకటి మతములు వడ్డీని నిషేధించెను. తరువాత ఆయామతముల పండితులు వడ్డీని ధర్మ్యమొనర్చిరి. కాని ఇస్లామ్ ఈ విషయమున పొందిన జాగ్రతను గమనింపుడు. సర్వమతములును వడ్డీ తీసుకొనుటను మాత్రము నిషేధించినవి. వడ్డీవృత్తిని ఖండించినవి. ఇస్లామ్ అంతటితో ఆగలేదు వడ్డీతీసుకొనుటయే కాదు. వడ్డీ ఇచ్చుటయు, వడ్డీ పత్రమును వ్రాయుటయు, అందు సాక్షులై యుండుటయు, మొత్తమునకు వడ్డీకి సంబంధించిన సమస్త కార్యములను ఇస్లామ్ నిషేధించినది. (బుఖారీ ౩౪ ౨౪) "వడ్డీ తీసుకొనుట భగవంతుని పైనను భగవంతుని ప్రవక్తపైనను యుద్ధముచేయుట వంటిది." (౨ ౨౭౯) అని ఖుర్ఆన్ స్పష్టముగ ఆదేశించినది. అందుచేతనే వడ్డీ నిషేధమను భావము ముస్లిమ్ హృదయములలో చెదరక నిలిచియున్నది. ప్రతి సంవత్సరము పెక్కు లక్షలరూపాయలు ముస్లిములు వడ్డీక్రింద పోస్టల్ సేవింగ్సు బాంకు నుండి తీసుకొనకుండా ఉన్నారని సెంట్రల్ బాంకింగు ఎన్క్వైరీ కమిటీవారు వ్రాయుచున్నారు.

యూదులు (Jews) వడ్డీ వ్యాపారమున ప్రసిద్ధికెక్కినవారు. మొన్న మొన్నటివరకు యూరప్ ఖండములో వడ్డీవ్యాపారమంతయు వీరిచేతులలోనే యుండెను. యూదుల

మతగ్రంధమగు పాతనిబంధనవడ్డీని యూదులమధ్య నిషేధించినది. కాని ఇతరులతో వడ్డీ వ్యాపారము ధర్మ్యమొనర్చినది. అందుచే యూదులు క్రైస్తవులతో నిరాటంకముగ వడ్డీ వ్యాపారము చేయుచుండిరి. కాని యూదులీ వృత్తి నీచమైనదని ఇప్పుడు గ్రహించినారు. ఇప్పుడు వడ్డీవృత్తి గౌరవ ప్రదమగు వృత్తిగా భావింపబడుచుండుటలేదు. J Abelson వడ్డీయెడ యూదుల ప్రస్తుత వైఖరినిగూర్చి Encyclopeadia of Religions and Ethics లో వ్రాయుచు ఇట్లనుచున్నాడు.

"The trade of usury is looked upon with shame, and the usurer is stigmatised as a reproach to his people In some Jewish Communities to day the money lender is forbidden to have any voice in the affairs of the synagogue and is socially tabued by the better classes among his co-religionists."

("వడ్డీవ్యాపారము నీచముగ చూడబడుచున్నది. వడ్డీ వ్యాపారస్థుడు కులమునకు కళంకముగా బరిగణింపబడుచున్నాడు. నేడు యూదులలో వడ్డీ వ్యాపారికి సినగాగులపరిపాలనమున స్థానములేదు, అతనిని సాంఘికముగబహిష్కరించుచున్నారు.)

౫౭. వడ్డీ తీసుకొనుట దానమునకు విరుద్ధముగ ఇందు చెప్పబడినది. "కృతఘ్నుడగు పాపిని భగవంతుడు ప్రేమింపడు" అన్న ఈ సూక్తమునందలి వచనములు గమనింపదగినవి. వడ్డీ తీసుకొనుటయు, దానము చేయకుండుటయు కృతఘ్నుని కార్యములని దీని భావము. సంపదే భగవంతునిచే ప్రసాదింపబడినది. 'దానిని భగవన్మార్గమున ఖర్చుపెట్టుటయే దానియొక్క సరియైన వ్యయము. అట్లుచేయక లోభియై, అంతటితో ఆగక, తన ధన బలముచే దరిద్రుల దారిద్ర్యము నూతగా గొని వారి ధనమును వడ్డీరూపమున పిండుట భగవంతు డిచ్చినదానికి కృతఘ్నత చూపుటకాక మరేమి ?

దాతనని గర్వమున నిక్కు ధనమదాంధ !
నమ్ము నీయీవి నిర్యాతనమ్మె సుమ్మి ;
నాది యని నీవు నిక్కు ధనమ్ము నీదె?
సర్వధన సంప్రదాత ఈశ్వరుడు లేడె ?

* * *

౫౮. 'జకాత్' లేక 'విహితదానము' ఖుర్ఆన్‌లో 27 చోట్ల ప్రార్థనము (నమాజ్) తో పాటు పేర్కొన బడినది. దీనినిబట్టి ఖుర్ఆన్ గ్రంథము జకాతున కెంత ప్రాముఖ్యత నిచ్చుచున్నదో తెలియగలదు. "ధనికులకడనుండి గ్రహించి

పేదల కివ్వబడు" ధనము జకాత్ అని శ్రీప్రవక్త ఉపదేశము. (బుఖారీ 24 1). ఆర్థిక సమానత్వమును నెలకొల్పుటకును, దారిద్ర్యమును నిర్మూలించుటకును, భిక్షుకావృత్తి లేకుండ చేయుటకును ఇంతకంటె మంచి ఉపాయము వేరొకటిలేదు.

*　　　　*　　　　*

౬౯. ఋణము చేయుట తప్పని సరియైన ఒక దురభ్యాసమని ఇస్లామ్ చెప్పుచున్నది. సాధ్యమైనంతవరకు అప్పుచేయక ఉన్నదానితోనే తన అవసరములను తీర్చుకొనుట మేలని ప్రవక్త ఉపదేశము. "ప్రభూ! నన్ను తప్పులనుండియు అప్పుల నుండియు తప్పింపుము" అని శ్రీప్రవక్త సాధారణముగ ప్రార్థించుచుండిరి. ఒకడు శ్రీప్రవక్త నుద్దేశించి 'ఓ ప్రవక్తా! తా మెప్పుడును అప్పుల నుండి నన్ను తప్పింపుమని ప్రార్థింతురే?' అనెను. దానికి ప్రవక్త ఇట్లు ప్రత్యుత్తర మొసగిరి 'అవును. అప్పులలో నున్నవాడు అబద్ధములు చెప్పును. వాగ్దానములను చేసి వానిని చెల్లింపడు'. (బుఖారీ, 43 10).

కాని అప్పుచేయుట ఒకొక్కప్పుడు తప్పనిసరి యగును. అట్టియెడ ఋణదాత ఋణస్థునియెడ దయతో ప్రవర్తించవలెనని శ్రీప్రవక్త ఉపదేశించు చున్నారు. ఈ విషయమున ప్రవక్త ఉపదేశములను కొన్నిటి నీ క్రింద ఉదహరించుచున్నాను

"అమ్మునప్పుడు, కొనునప్పుడు, అప్పడిగినప్పుడు ఔదార్యముతో ప్రవర్తించు వానిని భగవంతుడు కరుణించును." (బు. 34 : 16)

"ఋణస్థుడు కష్టపరిస్థితులలో నున్నప్పుడు అతనికి గడువిచ్చినను లేక అతని ఋణమును విడిచి వేసినను భగవంతు డట్టి వారికి తనకడ ఆశ్రయమిచ్చును." (మస్నద్, I, పుట 73).

"కష్టపరిస్థితులలో నున్న ఋణగ్రస్తునకు గడువిచ్చిన వానిని లేక అతని ఋణమును విడిచి వేసిన వానిని నరకాగ్ని అంటకుండ నేను చేతును." (మస్నద్ I. పుట. 327).

"అప్పును విడిచిపెట్టి వేయు వానికి నేను సంరక్షకుడ నగుదును." (బు. 65 1).

ఋణము చేసిన వాని ధర్మముకూడ కఠినముగ శాసింపబడినది. "తన అప్పులను సరిగా ఎవడు తీర్చునో మీలో అతడే ఉత్తముడు" అని శ్రీ ప్రవక్త వచనము. ధనికులైనవారు తమ ఋణములను తీర్చివేయుటలో ఆలస్యము చేయుట దౌర్జన్యమని ఒకచో శ్రీప్రవక్త ఉపదేశించుచున్నారు. (బు. 38, 1, 2).

తీర్చనను ఉద్దేశముతో అప్పుతీసినవాడు ధిక్కృతుడని ప్రవక్తవచన మొకటి కలదు. (మస్నద్ II, పుట 417). అప్పులను తీర్చిన తర్వాతయే దానాదులు చేయవలెననియు, అప్పులు తీర్చగా మిగిలిన ఆస్తిని వారసులు పంచుకోవలెననియు శ్రీ ప్రవక్త ఉపదేశించుచున్నారు. (మస్నద్ I. పు. 79)

*		*		*

౬౦. దీనిపైనను దీని తర్వాత సూక్తముపైనను ఒడంబడికలనను సాక్ష్యమునను సంబంధించిన ఇస్లామీయ లా ఆధారపడి యున్నది.

## వ్యాఖ్యానము

# మూడవ అధ్యాయము

## ఇమ్రాన్ వంశము

ఈ అధ్యాయము మదీనాయందు ప్రోక్తమైనది ఇందు 200 సూక్తములు కలవు. కొందరు 3, 4, సూక్తములు కలిపి చదివి 199 సూక్తములే గణించిరి. నేను ఈజిప్టు రాయల్ ఎడిషనును అనుసరించితిని. మనదేశములో అంజుమనె హిమాయతె ఇస్లామ్ వారుకూడ ఇదేపద్ధతి ననుసరించిరి.

ఇందులో మూసాతండ్రియగు ఇమ్రాన్ లేక అమ్రాన్ పేర్కొనబడుటచే ఈ సూరాకు ఈ పేరు వచ్చినది. ఇందులో మొదటి 83 సూక్తములలో క్రైస్తవ మత చర్చచేయబడినది.

శ్రీ ప్రవక్త మదీనాకు వెళ్ళిన తర్వాత నజ్రాన్ పట్టణమునుండి 60 మంది క్రైస్తవ పండితులు అబ్దుల్ మసీహ్ అనువాని నాయకత్వము క్రింద ప్రవక్తతో చర్చించుటకు మదీనా నగరమునకు వచ్చిరి నజ్రాన్ మదీనాకు సమీపమున నున్న ఒక ముఖ్య క్రైస్తవ పట్టణము. అరేబియా చర్చికి ప్రధాన పీఠాధిపతి ఆకాలములో నజ్రాన్ పట్టణమున నుండువాడు ఇందలి మొదటి 83 సూక్తములు ఆ సందర్భమున ప్రోక్తమైనవి.

* * *

౩౧. 'తౌరాత్' మూసాప్రవక్త (Moses) కివ్వబడిన భగవద్గ్రంథముగ ఖుర్ ఆనులో పెక్కుచోట్ల చెప్పబడినది. తౌరాతు అన నేమియో స్పష్టముగ తెలిసికొనుట అవసరము. 'ది-లా' అనబడు పాతనిబంధనము (Old Testament) యొక్క భాగమునకు 'తోరా' అందురు. * ఇప్పుడు ఇంగ్లీషు పాత నిబంధనములో ఉన్న మొదటి ఐదు పుస్తకములు (అనగా జెనెసిస్, ఎక్సోడస్, లెవెటికస్, నంబర్స్, డ్యుటెరినొమి) మూసాకు ప్రోక్తమైన 'లా' లేక ధర్మగ్రంథమని ఇటీవలి వరకు అనుకొనుచుండిరి. కాని బైబిల్ పరిశోధకులు ఈ మధ్య ఇప్పుడు పాతనిబంధనమున మూసా మున్నగు ప్రవక్తలకుప్రోక్తమైనవిగా ఇంగ్లీషుబైబిలులో ప్రచురింపబడిన గ్రంథములలో ఎక్కువ భాగము ప్రక్షిప్తమనియు, అసలుగ్రంథములు ఎప్పుడో పోయినవనియు కనిపెట్టిరి. పాత నిబంధనము యొక్క కూర్పునుగూర్చి ఒక ప్రాచీన చరిత్రకారు డిట్లనుచున్నాడు. 'In like manner also Judas (Maccabeus)

* పాత నిబంధనము మూడు విభాగములలో విభజింపబడినది లా, ప్రాఫెట్సు, సామ్స్.

brought together in addition to all the things *that were lost by reason of the war we had*, and they remain with us." † ఈ విధముగ యుద్ధకారణముచే నశించిన మూలగ్రంథముల స్థానమున నాటి మతాచార్యులు క్రొత్తగ్రంథములను రచించి యుందురు.

ఇప్పుడు 'తోరా' అనబడుచున్న పాతనిబంధన గ్రంథములు మూసాచే వ్రాయబడ లేదను విషయము నిర్వివాదమైనది. అంతేకాదు. అవి మూసాకు సమీప కాలమున నైతము వ్రాయబడి యుండలేదు. క్రి. పూ. 536 లో యూదులు బాబిలోనియానుండి మరలివచ్చిన పిదప వారి ధర్మగ్రంథముల కూర్పు ప్రారంభమాయెను. కొన్ని గ్రంథము లీ కాలము తర్వాత వ్రాయబడెను. ఈప్రాచీన గ్రంథములు పరిష్కరించి కూర్చిన వారు అసంఖ్యాకమగు పొరపాట్లు కావించిరి. మూల గ్రంథములను ప్రక్షిప్తములనుండి వేరుపరుపజాలకపోయిరి. అందుచే తర్వాత ఎన్నో చిక్కులు సంభవించెను. ఉదాహరణమునకు ఎపాక్రిఫాలోని పెక్కు గ్రంథము లిప్పుడు ఇంగ్లీషు బైబిలులో లేవు. అవి ప్రక్షిప్తములని ఇంగ్లీషుబైబిల్ పరిష్కర్తలు నిరాకరించిరి. కాని క్రీ. శ. 1546 లో జరిగిన కౌన్సిల్ ఆఫ్ ట్రెంట్ (Council of Trent) లో రోమన్ క్యాథొలిక్ చర్చివారు దీనిని పూర్తిగా గ్రహించి ఈ విధముగ శాసించిరి "He is also to be anathema, who does not receive these entire books, with all their parts, as they have been accustomed to be read in the catholic church, and are found in the ancient editions of the Latin Vulgate, as sacred and Canonical"

(లాటిన్ బైబిలు ప్రతులలో ముద్రించబడిన మొత్తముగ్రంథమును ఏమార్పుయు లేకుండా, ఒక ముక్కనైనా విడిచిపెట్టకుండా నమ్మనివాడు బహిష్కరించబడవలెను.)

ఈఅభిప్రాయమును విమర్శించుచు బైబిల్ విద్వాంసులలో మేటియని ప్రసిద్ధికెక్కిన డాక్టర్ చార్లెస్‌గా రిట్లనుచున్నారు "The weight the scholars in general will attach to this decree cannot but be influenced by the fact, that the Prelates who formed this Council none came from Germany or Switzerland or from any of the northern countries, none knew Hebrew, only a few had some knowledge of Greek, and there were some whose knowledge of Latin was of a doubtful character" *

† I Maccabeus ii, 14. Quoted in Matthew Arnold, God and the Bible, P. 106 ·

* Charles R H. "Religious Development between Old & New Testaments", P. 186.

(ఈ పండితులు ఈ వాదాని కిచ్చిన ప్రాముఖ్యత ఈ క్రింది కారణాలవల్ల తగ్గక మానదు. ఈ సభకు వెళ్ళిన వారిలో ఎవ్వరూకూడా జర్మనీ నుండిగాని స్విట్జర్లాండు నుండిగాని మరియే ఉత్తరదేశముల నుండిగాని వచ్చినవారు కారు. వీరిలో ఎవ్వరికీ హెబ్రూభాష తెలియదు. చాలా కొద్దిమందికి మాత్రమే గ్రీకుభాష తెలియును. కొంతమందికి లాటిన్ భాషకూడా తెలియదని చెప్పవచ్చు.)

ప్రొటెస్టెంట్ చర్చివారు హెబ్రూగ్రంథములనే ఒప్పుకొందురు. **అసలు ఈ గ్రంథముల మూలభాష ఏదో, ఏకాలమున ఇవి వ్రాయబడినవో, ఏ ప్రాంతమున వ్రాయబడెనో మున్నగు విషయము లింకను నిర్ధారణ కాలేదు. ('Scholars are far from unanimous as to the original language, date and place of compilation of some of these books .' —Charles, P 186)**

మూసా ప్రవక్త ధర్మ గ్రంథము దగ్ధము కావింపబడెననియు, తర్వాత క్రీ. పూ. 458-57 ప్రాంతములో 'ఎజ్రా' ఒక ధర్మగ్రంథము రచించెననియు రెండవ ఎస్డ్రాస్ లో చెప్పబడినది. యుద్ధమున మూల ధర్మగ్రంథము నశించెనని మెక్కాబీస్‌లో కల వచనముతో ఇది కలిపి చదివిన యెడల ఇది నిజమైయుండునని తోచుచున్నది.

తోరాయొక్క మూలము ప్రాచీన హెబ్రూభాషలో ఉండియుండవలెను. ఇప్పుడు లభించిన పాత నిబంధనముయొక్క అత్యంత ప్రాచీన ప్రతి క్రీ. శ. 916 నాటిది. యూదులు బాబిలోనియాకు వెళ్ళగొట్టబడిన తర్వాత క్రమముగా వారు హెబ్రూభాషను మరచి గ్రీకు భాషను స్వీకరించిరి. అందుచే వారు తమ ధర్మగ్రంథమును కొంతకాలము తర్వాత గ్రీకుభాషలోనికి పరివర్తించుకొనిరి. ,ఇప్పుడు మూల గ్రంథములుగా భావింపబడుచున్న గ్రంథములు రెండు (1) గ్రీకుభాషయందలి సెప్ట్యూజింట్ (Septuagint), (2) లాటిన్ భాషయందలి వల్గేట్ (Vulgate). గ్రీకు గ్రంథము వివిధకాలములలో 70 మంది పండితులు వేరువేరుగా వివిధకాలములలో, వివిధప్రాంతములలో కూర్చినది. ఈ పని క్రీ. పూ. 284 లో ప్రారంభమాయెను. ల్యాటిన్ భాషలోనున్న వల్గేట్ క్రీ. శ. ౫-వ శతాబ్దములో సెంట్ జెరోమ్ అనువదించినది. ఈరెండు కూర్పులును పరస్పరభిన్నములుగనున్నవి. వల్గేట్ లోకూడ పెక్కు వివాదాస్పదమైన భాగము లుండిపోయెను. తుదకు పోప్ క్లెమెంట్ VIII 1592—1605 సంవత్సరములలో వల్గేటును పరిష్కరించి ప్రచురించెను. ఇప్పుడు రోమన్ కాథలిక్కులలో ప్రచారముననున్న గ్రంథమిదే.

పై చర్చవల్ల తేలినదేమనగా పాత నిబంధనము యొక్క హెబ్రూ మూలగ్రంథము ఇప్పుడు లేదు. ఇప్పుడున్న హెబ్రూ ప్రతులు పరస్పర విరుద్ధముగ నున్నవి. క్రైస్తవులలో రోమన్ కాథలిక్కు లంగీకరించిన వల్గేటునకును, యూదు లంగీకరించిన గ్రీకు గ్రంథమునకు ఎంతయో భేదముకలదు. క్రైస్తవులలో ప్రాటెస్టెంటు శాఖవారు యూదుల గ్రీకు గ్రంథమునే ప్రమాణముగ గ్రహింతురు. ఈ విధముగ మూసాప్రవక్తకు ప్రోక్తమైన తౌరీతు గ్రంథమును, తర్వాతి ప్రవక్తలకు ప్రోక్తమైన ఇతర గ్రంథములును మూలములు నశించి, మూలభాషలో కాక ల్యాటిన్ గ్రీకు భాషలలో ఆ ప్రవక్తల పేర వ్రాయబడియున్నవి. ఇవి అసలు గ్రంథములు కావనియు, అసలు గ్రంథములు పోగా పండితులు రచించిన గ్రంథములనియు, వాటి నిప్పుడు యూదులును క్రైస్తవులును పొరపాటున భగవత్ప్రోక్తమగు గ్రంథములుగ భావించుచున్నారనియు దీనివల్ల తేలినది.

ఇంజీల్ ఇప్పుడు ప్రచారములో ఉన్న పాత నిబంధన మందలి గ్రంథము లెట్లు ప్రక్షిప్తములో, ఆదేవిధముగ ఇప్పుడు క్రొత్త నిబంధనము లేక New Testament అనబడుచున్న బైబిల్ భాగము ఏసుక్రీస్తుకు ప్రోక్తమైన భగవద్గ్రంథము కాదు. పాత నిబంధనము వలెనే క్రొత్త నిబంధనమనబడు బైబిల్ భాగము కూడ వివిధకాలములందు, వివిధభాషలందు, వివిధ క్రైస్తవ మతాచార్యులచే ఏసుక్రీస్తు మరణా నంతరము దాదాపు ఒక శతాబ్ద ప్రాంతములో వ్రాయబడినది. అవి సైతము మొదట వ్రాయబడిన రూపములో ఇప్పుడులేవు. అసలు ఏసుక్రీస్తు భాషలో ఆయన ఉపదేశములు లేనేలేవు. అనువాదములు, ఆ అనువాదముల కనువాదములు, తిరిగి వాటి అనువాదములు ఈ విధముగ ఈ బైబిల్ గ్రంథములు అసంఖ్యాకమగు మార్పులు పొంది ఈ రూపమును దాల్చినవి.

మ్యాథ్యూఆర్నాల్డు Literature and Dogma అను తనఉద్గ్రంథమున క్రొత్త నిబంధనమును గూర్చి దీర్ఘముగ చర్చించి తేల్చిన సారాంశమిది "In short, to know accurately the history of our documents is impossible, and even if it were possible, we should not yet know accurately what Jesus said and did, for his reporters were incapable of rendering it, he was so much above them As to the character of the documents, however it must be remembered that none of the recorders we have, probably, the very original record The record when we first get it, has passed through at least half a century, or more, of oral tradition, and through more than one written account.*

* Matthew Arnold, 'God and the Bible,' P. 96 97,

క్రొత్త నిబంధనము యొక్క రచయితలు, వారి కాలములు, వారి రచనల మూలములు, తద్రచనములు ఎప్పుడు ప్రమాణ గ్రంథములుగ స్వీకరింపబడినవి మున్నగు విషయములు క్లుప్తముగ మ్యాథ్యూ ఆర్నాల్డు ఈ విధముగ చెప్పుచున్నాడు.

"But when did the New Testament, in that form in which we possess it, come to be recognised as Scripture like the Old Testament? Clearly the documents composing it appeared at different times, and were not first published to the world as one authorised whole called the New Testament Clearly there was a time when they had not acquired the authority they possessed afterwards, when people preferred, for instance, to any written narrative, the oral relations of eye witnesses-" † క్రీ. శ. 145 లో పేపియాస్ (Papias of Hierapolis) అను ఒక గొప్ప క్రైస్తవ పండితుడు క్రీ. శ. 135 లో జెరూసెలము నందు ఏసుక్రీస్తు శిష్య పరంపర యందలి వారును, పండితులు మున్నగు పెద్దలు నశించిన పిదప ఏసుక్రీస్తు పేర ప్రచారము లోనికి వచ్చిన అబద్ధోపదేశములను నివారించుటకై "ఏసుక్రీస్తు ఉపదేశసారము" (An Exposition of the Sayings of the Lord) అను ఒక పుస్తకమును వ్రాసి ప్రచురించెను. $ అతని కాలములో ఇప్పుడున్న క్రొత్త నిబంధనము వంటి గ్రంథము కాని, ప్రమాణభూతమగు మరే గ్రంథము గానిలేదు. అట్టి గ్రంథముండిన ఎడల తప్పక తన గ్రంథమున పేపియాసు పేర్కొని యుండెడివాడే. మొట్టమొదట క్రీ.శ. 180 లో ఐరేనియస్ (Irenaeus) అను ఒక గొప్ప క్రైస్తవాచార్యుడు నాల్గు సువార్తలను పేర్కొనెను. అంతకు పూర్వముండిన ఇగ్నేషియస్ (Ignatius) గాని, పాలికార్ప్ (Polycarp) గాని, జస్టిన్ మార్టిర్ (Justin Martyr) క్లెమెంటు (Clement of Rome) గాని నాల్గు సువార్తల (Four Gospels) ప్రసంగ మెక్కడను చేయరైరి. ¶

క్రీ. శ. 397 లో ఒకటియు, క్రీ. శ. 419 లో ఒకటియు ఈ విధముగ కార్తేజిలో రెండు ధర్మ సభలు (Synods) జరిగెను. ఈ సభలలో మొదటిసారి క్రొత్త నిబంధనము నిర్ణయింపబడెను. క్రీ. శ. 383 లో సెంట్ జెరోమి అను ఒక గొప్ప క్రైస్తవాచార్యుడు పోప్ ఆజ్ఞాను సారము నాల్గు సువార్తల లాటిన్ పరిష్కృత

† Ibid, P. 113

$ Benjamin W Bacon, The Making of the New Testament, P-131.

¶ "But we look in vain in Justin Martyr, or Polycarp, or Ignatius or Clement of Rome, either for an express recognition of the four Canonical Gospels, such as we have given from Churchmen who lived later, or for a distinct mention of any one of them." --

అనువాదమును ప్రకటించెను. సెంట్ జెరోమి పండితుడు కార్తేజిలో జరిగిన ధర్మ సభల వారు సంకలిత పరచిన క్రొత్త నిబంధనముపై చేసిన విమర్శనము గమనించ దగినది. ఇప్పుడు బైబిల్‌లోని 19 వ పుస్తకమును (To the Hebrews) లాటిన్ క్రైస్తవులు ప్రమాణ గ్రంథముగ స్వీకరించరనియు, జాన్ సువార్తను గ్రీకు చర్చివా రంగీకరించుట లేదనియు, 22వ పుస్తకమును (II Peter) పల్వురు అంగీకరించరనియు, 22వ పుస్తక మగు ఎపిజిల్ ఆఫ్ జేమ్సును ఒక ప్రక్షిప్త గ్రంథముగ భావించుచున్నా రనియు, 26-వ పుస్తకమును (Jude) అత్యధిక సంఖ్యాకులు స్వీకరించుట లేదనియు, సెంట్ జాన్ వని చెప్పబడుచున్న మూడుపుస్తకములలో (24, 25 27, నంబర్లు)తరువాతి రెండును సెంట్ జాన్ వ్రాయలేదనియు, జాన్ ది ఎల్డర్ అను వానిచే అవి వ్రాయ బడిన వనియు ఆయన వ్రాసెను. *ఈ విధముగ క్రొత్త నిబంధన మందలి 27 పుస్తక ములలో 7 పుస్తకములు 5-వ శతాబ్ద ప్రారంభములో ప్రమాణ గ్రంథములుగ స్వీక రింపబడలేదని దీనివల్ల స్పష్టమగుచున్నది. ఐనను చర్చివారు వీటిని ప్రమాణములుగ స్వీకరించవలెనని శాసించిరి. చర్చి ఏది చెప్పినను వేదవాక్యముగనే పరిగణింపబడుచు వచ్చినది. ఒక్క 'జెరోమి'యే కాదు, యూసెబియస్ (Eusebius), ఆరిజెన్ (Origen) వంటి క్రైస్తవాచార్యులుసైతము ఇప్పుడు క్రొత్త నిబంధనములోనున్న పెక్కు గ్రంథములు తమ కాలములో ప్రమాణ గ్రంథములుగ స్వీకరింపబడుచుండెడివి కావని వ్రాసిరి.

ఇంక మొదటి నాల్గు సువార్తలను గూర్చి వినుడు. పేపియాస్ (క్రీ శ. 145) కాలములో సెంట్ మ్యాథ్యూ, సెంట్ మార్కు మాత్రమే బహుశః ప్రమాణ గ్రంథములుగ స్వీకరించబడి యుండవచ్చును. క్రీ. శ. 100 లో మ్యాథ్యూయొక్క మూలము ప్యాలెస్టయినులో నిరాకరింప బడిన గ్రంథముగ నుండెను. దీనితర్వాత దీని మూడు అనువాదములు—రెండు గ్రీకు భాషయందును, ఒకటి ఆర్మెయిక్ భాష లోను—వచ్చెను. ఇంతకంటె ఎక్కువ అనువాదములు ఉండియుండవచ్చును ఇవన్ని యు మ్యాథ్యూ నామముతోడనే ప్రచారములో నుండెను. కాని ఇందులోఎక్కువ భాగము మార్కు సువార్తనుండి గ్రహించి క్రొత్తగా వ్రాయబడినది. మార్కు రోము నగరమున తన సువార్తను వ్రాసెను. సెంట్ మార్కు ఏసుక్రీస్తు శిష్యుడు కాడు. ఆయనసెంట్ పీటర్ తనకు చెప్పిన ఏసుక్రీస్తు జీవితాంశములను ఉపదేశ ములను ఒక సువార్తరూపమున వ్రాసెను అదికూడ పీటర్ చనిపోయిన తర్వాత వ్రాయబడెను పీటర్ చెప్పిన విషయములు ఒక సువార్త రచించు ఉద్దేశముతో చెప్పినవి కావు. తా నప్పుడప్పుడు సందర్భానుసారముగ మార్కుతో చెప్పిన విష

* Matthew Arnold, Ibid, P. 115,

యములను మార్కు కొంతకాలము తర్వాత ఒక పుస్తక రూపమున వ్రాసెను. సెంట్ లూక్ కూడ ఎక్కువగ మార్కు సువార్తనుండి విషయములను గ్రహించి తన సువార్తను రచించెను. ఈ ముగ్గురు సువార్త రచయితలును తమకు పూర్వముండిన ఏసుక్రీస్తు ఉపదేశగ్రంథములనుండి గ్రహించిరనుట నిర్వివాదము.

ఐతే మ్యాథ్యూ మొదట వ్రాసిన పుస్తకము సైతము నశించి దాని స్థానే పెక్కనువాదములు వచ్చుటకు కారణ మేమై యుండునో తెలిసికొనుట అవసరము. ఇది కేవల భాషాభేదముల వల్ల కల్గిన చిక్కు కాదు. కేవలము అనువాదములలో జరిగిన మార్పుకూడ కాదు. ఈగ్రంథములు వెలువడు నప్పటికి **"ఏసుక్రీస్తు సందేశము"** యొక్క ప్రాముఖ్యత సన్నగిల్లి తుదకు **"ఏసుక్రీస్తును గూర్చిన సందేశము"** యొక్క ప్రాముఖ్యత హెచ్చెను. *

అసలు ఏసుక్రీస్తు ఉపదేశములు కల గ్రంథము ఇప్పుడు మనకడ లేనే లేదు. అప్పుడుండిన గ్రంథములలో ఎక్కడను ఏసుక్రీస్తు సిలువపై ఎక్కిన విషయముకాని పునరుత్థాన విషయముగాని లేకుండెనని పండితులంద రంగీకరించిన విషయమే. అందుచే ఏసుక్రీస్తు ఉపదేశములు కేవలము ఉపదేశముగనే కాక ఆయన జీవిత చరిత్రతో చేర్చి వ్రాయవలసిన అవసరము కలిగెను. అందుచే మ్యాథ్యూయును, లూక్ యు కూడ మార్కుయొక్క చారిత్రక భాగమును గ్రహించిరి. ఇతర పుస్తకములం దెక్కడను ఏసుక్రీస్తు చరిత్రాంశములు లేకుండెను. (There is outside of Mark *no* considerable amount of historical material, Cononical or uncanonical, for the story of Jesus—Bacon P 139.)

ఈ ఉన్న చరిత్రాంశములు కూడ ఒక వరుసలో లేవు. ఇది మార్కు చరిత్రాంశములను గ్రహించిన మ్యాథ్యూ లూకులకు తెలిసియు గత్యంతరము లేక వారా వరుసను యథాతథముగనే యుంచిరి. (In short, incorrect as they know the order of Mark to be, it was the best that could be had in the days when evangelists began to go beyond Syntagus (Collactions of Jesus' teachings), and to write "*Gospels*" as we understand them, or, in their own language, "the things which Jesus began *both* to do and to teach."—B Bacon. P. 140.)

---

*"It was impossible to blind to the conquests made by the Gospel *about* Jesus Enclosed in it, as part of its substance the Gospel *of* Jesus found its final resting-place, much as the mother church itself was later taken up and incorporated in a Catholic Christendom" (Benjamin W Bacon, The Making of the New Testament, P. 137).

క్రీ. శ. 45-50 సంవత్సరములలో రోముచర్చిని స్థాపించు ప్రయత్నములు జరుగుచుండిన కాలములో మ్యాథ్యూ ఏసుక్రీస్తు ఉపదేశములను చేర్చికూర్చు ప్రయత్నము చేసెను. కాని ఇప్పుడు 'మత్తయిసువార్త' అని మనము చదువుచున్న సువార్త ఆగ్రంథముకాదు. అథమము దాని అనువాదమును కాదు. అట్లనుటకు మూడుకారణములను బేకన్ పండితుడు చూపుచున్నాడు (1) మొట్టమొదట మ్యాథ్యూ రచించిన గ్రంథము ఉపదేశమాలగాని మార్కుసువార్త వలె ఏసుక్రీస్తు కథకాదు. (2) మ్యాథ్యూ అసలు ఆర్మేయిక్ భాషలో వ్రాసియుండెను. ఇప్పుడు మనమున్న మత్తయి సువార్త మూలము గ్రీకు భాషయందున్నది. (3) మొదట వ్రాయబడిన పుస్తకము రచయిత ఏసుక్రీస్తుశిష్యుడు. కాని మన మత్తయి సువార్తకర్త తుదివరకు మార్కుపై ఆధారపడి సువార్తను రచించెను. ఏసుక్రీస్తుతో స్వయముగ పరిచయము కలిగి, ఆయన ఉపదేశాదులను స్వయముగ విన్న ఆయన శిష్యుడు మార్కునేల అనువదించును? మార్కు ఏసుక్రీస్తు శిష్యుడైనను కాడాయెను. ఈ విధముగ మనము చదువుచున్న సువార్త మత్తయి వ్రాసినదికూడ కాదు ఇది ఇంతటితో సైత మాగలేదు. మత్తయి సువార్తలో తర్వాత ఎన్నో ప్రక్షిప్తములు చేర్చబడెను — ("Over and over again special additions are made in Matthew to emphasise a warning against the workers of 'lawlessness.' "—Bacon, P 149)

తక్కిన సువార్తలను గూర్చికూడ అట్లే చెప్పవచ్చును. మార్కు సువార్తనుగూర్చి బేకన్ గారు ఇట్లు వ్రాయుచున్నారు "The Gospel of Mark is no exception to the rule that church-writings of this type inevitably undergo recasting and supplementation until the advancing process of canonization at last fixes their text with unalterable rigidity. Whether we recognise 'sources' or earlier 'forms' or only earlier 'editions' of Mark, it is certain that appendices could still be attached long after the appearance of Luke, and probable that in the early period of its purely local currency at Rome the fund of Petrine anecdote had received more than one adaptation of form before it was carried to Syria and embodied substantially as we now have it in the composite Gospels of Matthew & Luke"

(Ibid, P. 170)

ఈ విధముగ ఒక్కొక్క విషయమును గూర్చి ఎంతేని వ్రాయవచ్చును. క్రొత్త నిబంధనమందలి నాల్గు పుస్తకముల రచనా కాలములను గూర్చి వివిధ బైబిల్ పండితుల అభిప్రాయములను ఈ ప్రక్క క్రోడీకరించుచున్నాను — *

* Christlieb పండితుని "Modern Doubt and Christian Belief" అను గ్రంథమునుండి సంగ్రహించి కూర్చిన విషయము లివి.

| సువార్త పేరు | కాలనిర్ణయము చేసిన పండితుని పేరు | కాలము |
|---|---|---|
| 1 సెంట్ మ్యాథ్యూ | బాఉర్ (*Baur*) | క్రీ శ 105.10 |
| | సి ఆర్ కాస్ట్లిన్ (*C.R. Costlin*) | ప్రస్తుత రూపములో క్రీ శ. 90 నుండి 100 మధ్య వరకు అసలు మూలగ్రంథం క్రీ శ 70 మొ॥ 80 వరకు. |
| | హిల్గెన్ఫెల్డ్ (*Hilgenfeld*) | క్రీ శ. 80 |
| 2 సెంట్ మార్క్ | సి ఆర్ కాస్ట్లిన్ (*C. R Costlin*) | క్రీ శ. 100 |
| | కియెమ్ (*Kiem*) | క్రీ శ. 100 |
| | హిల్గెన్ఫెల్డ్ (*Hilgenfeld*) | క్రీ శ. 100 |
| 3 సెంట్ లూక్ | బాఉర్ (*Baur*) | క్రీ శ. 150 |
| | జెల్లర్ (*Zeller*) | క్రీ శ 130 |
| | హిల్గెన్ఫెల్డ్ (*Hilgenfeld*) | క్రీ శ. 120 |
| 4 సెంట్ జాన్ | బాఉర్ (*Baur*) | క్రీ శ 160 |
| | కియెమ్ (*Kiem*) | క్రీ. శ. 110—117 |

ఈ విధముగ ఏసు క్రీస్తు మరణానంతరము నూరేండ్లకుపైగా వ్రాయబడిన ఈ గ్రంథములు భగవతోప్రోక్త మెట్లగును? వివిధ రచయితలు, వివిధ కాలములలో, వివిధ దేశములలో, వివిధ భాషలలో, వివిధమగు ఉద్దేశములతో రచించిన వివిధ గ్రంథముల కూర్పే ఇప్పుడు ప్రచారములో నున్న బైబిల్ గ్రంథము ఇది ఏసుక్రీస్తుచే ప్రవచింపబడిన గ్రంథము కాదనియు, ఏసుక్రీస్తుచే ప్రవచింపబడినదిగా చెప్పబడిన బైబిల్ గ్రంథము ఎన్నడో నశించినదనియు, దానిస్థానే వివిధ గ్రంథములు వ్రాయబడి బైబిల్ అను నామమున ప్రచారములో నున్నవనియు చెప్పుటకే ఇంత దీర్ఘముగ వ్రాసితిని. ఈ విషయమునుగూర్చి ఇంకను వివరములు తెలుసుకొనగోరువారు ఈ క్రింది గ్రంథములను చూడవలెను *

*New Testament*

| | |
|---|---|
| R. W Mackay | Rise and Progress of Christianity |
| G R S Mead . | The Gospel, and the Gospels |
| B W Bacon . | Making of the New Testament. |
| R Hone · | The Apocryphal New Testament. |
| E. Reuss : | History of the New Testament 2 vols. |
| P. Wernle . | The beginnings of Christianity. 2 vols. |
| O. Pfeiderer : | Christian Origin. 4 vols. |
| W. Wrede . | The origin of the New Testament. (An admirable Primer) |
| Matthew Arnold : | Literature and Dogma. |
| . | God and the Bible. |

*Old Testament*

G. F. Moore . Literature of the Old Testament.
G. E. Hammond . Outlines of Textual criticisms.
Matthew Arnold : Literature and Dogma.
" " : God and the Bible.
R. H. Charles . Religious Development between the Old and New Testaments.

* * * *

౬౨. ఖుర్ ఆన్‌లో రెండు విధములైన సూక్తములు కలవనియు అవి (1) **మహాకుమాత్** (2) **ముత్ షాబిహాత్** అనబడునవనియు ఈ సూక్తమున చెప్పబడినది. 'మహాకుమాత్' సూక్తములు మూలసిద్ధాంతములను ప్రతిపాదించునవి. అవి స్పష్టముగ నున్నవి. వాటిలో అపార్థములకుగాని, అర్థాంతములకుగాని స్థానములేదు. ఇవి సర్వమతగ్రంథములందును మూలసిద్ధాంతములై యుండునవని 'సయీద్ బిన్ జుబైర్' అనుచున్నారు. ఇవి సర్వమతస్థులును అంగీకరించు మూలసిద్ధాంతము లని హజరత్ ముఖాతిల్ అభిప్రాయము. * ముతషాబిహాత్ సూక్తములు పైమూలసిద్ధాంతములను వివరించుట కివ్వబడిన ఉదాహరణములు. ఉపమానములు, ఉపాఖ్యానములు మున్నగునవి కల సూక్తములు.

వివిధార్థములకు తావిచ్చుట మానవభాషలో గల లోపము. వ్యాఖ్యాత తన ఇష్టము ననుసరించి ఒక వాక్యము యొక్క అర్థమును చెప్పగలుగుచున్నాడు, ఒకొక్కప్పుడు పొరపాటుపడుచున్నాడు, ఒకొక్కప్పుడు చేయవలెనని చేయుచున్నాడు. అసలు మతములు పోయి తర్వాతి పండితుల మతము లిట్లే స్థాపితమైనవి. ప్రస్థానత్రయమునకు శంకర రామానుజ మధ్వాచార్యులు వివిధభాష్యములొనర్చి అద్వైత విశిష్టాద్వైత ద్వైత మతములను స్థాపించినారు. అదే విధముగ ఆనాటి ఆచారముననుసరించి ఏసుక్రీస్తు భగవంతుని 'నాతండ్రీ!' అని పిలిచినంతమాత్రమున క్రైస్తవాచార్యులు ఏసుక్రీస్తు భగవంతుని కుమారు డనినారు*. శబ్దప్రమాణముపై తగవులాడుకొని మతాచార్యులు వివిధమత భేదములలో చిక్కుకొనినారు. అందుచే ఖుర్ ఆన్ ఈ విషయమును స్పష్టముగ చెప్పివైచినది. మూలసిద్ధాంతములను

* ఈ అభిప్రాయములు తఫ్సీరె ఇబ్నెకసీర్‌లో ఉద్ధృతమైనవి.

* 'Jesus made use of the figurative language familiar to the theocratic mind' (Schenkel, Sketch of the character of Christ, P. 145)

"Christ applies to himself the designation of the 'Son of God' in no other sense than that in which the People of Israel or the theocratic King might be so called-" (Ibid, P. 177)

ప్రతిపాదించు సూక్తములలో అర్థాంతరములకుగాని, అపార్థములకుగాని తావులేదు. ఉపమానములును, ఉపాఖ్యానములును, ఉదాహరణములును కల సూక్తములు వ్యాఖ్యానించునప్పుడు ఆ వ్యాఖ్యానము మూలసిద్ధాంతములకు వ్యతిరేకముగనుండ కూడదనియు, ఆ సూక్తముల వ్యాఖ్యానములలో పడి తగవులాడుకొనుచు మూల సిద్ధాంతములను దృష్టినుండి తొలగించవలదనియు శ్రీప్రవక్త ఈసందర్భమున ఉపదేశించుచున్నారు. ప్రవక్తవాక్యములు గమనింపుడు "ముతషాబిహాత్ సూక్తములను గూర్చి తగవులాడుకొనువారిని విడిచిపెట్టుము." (బు) ముతషాబిహాత్ సూక్తములను గూర్చి తగవులాడుకొనియే మతముల నన్నిటిని పండితులు మార్చివైచిరి. ఇస్లామున కట్టి విపత్తు సంభవించకుండ ఖుర్ ఆన్ హెచ్చరించుచున్నది.

* * * *

౬౩. ఇందు బదర్ యుద్ధరంగమును గూర్చి చెప్పబడినది. ఆ యుద్ధమున ముసల్మానుల సంఖ్య 313. అవిశ్వాసుల సంఖ్య 900 మొదలు 1000 వరకు ఉండెను. ఐనను ఆ యుద్ధమున ముసల్మానులకే విజయము కలిగెను. భగవత్సహాయమున కిదొక ఉదాహరణము.

ముసల్మానుల సంఖ్య అవిశ్వాసుల సంఖ్యలో మూడవ వంతు యుండినను, అవిశ్వాసులకు ముసల్మానులు తమకంటె రెండింతలు కన్పించుచుండిరనియు ఇక్కడ అర్థము చెప్పవచ్చును.

మక్కా వాసుల దౌర్జన్యమును సహించలేక శ్రీ మొహమ్మద్ ప్రవక్త మదీనాకు రహస్యముగ వెళ్లిపోయిరి. కాని మక్కా వాసులగు ఖురైషులు శ్రీ ప్రవక్తను మదీనాలో కూడ శాంతితో జీవితము గడపనివ్వరైరి. శ్రీ ప్రవక్త మదీనాకు పలాయితులైన రెండవ యేడే ఖురైషులు ఒక గొప్ప సైన్యమును తయారుచేసి మదీనాపై కత్తివచ్చిరి. ముసల్మానులు నగరములో 313 రు మాత్రముండిరి. ఆయుధములా లేవు. యుద్ధముచేయుటయం దనుభవమా సున్న. శత్రుపక్షమున వెయ్యిమంది యుద్ధకళయం దారితేరిన యోధులు. ఐనను ముసల్మానులకే విజయము లభించెను. అవిశ్వాసులకు సంపూర్ణమగు అపజయము కల్గెను.

* * * *

౬౪. భార్యాపుత్రాదులు, ధన ధాన్యములు మున్నగు ఐహిక వాంఛలు మానవునకు ప్రియములే కాని నిజమైన విలువ వీటిలో లేదు. పారలౌకిక సుఖములే వాంఛింప దగినవని ఖుర్ ఆన్ ప్రబోధించుచున్నది.

* * * *

౬౫. ఖుర్ ఆన్ తాను బోధించిన మతమును 'ఇస్లామ్' అని పిలుచు

చున్నది. ప్రపంచ మహామతములలో దేనికిని ఒక పేరు లేదు. ఏసుక్రీస్తు మతమునకు క్రైస్తవమత మనియు గౌతమబుద్ధుని మతమునకు బౌద్ధమత మనియు అదేవిధముగ మతకర్తల నామములతో ఆయామతములు ప్రసిద్ధి కెక్కినవి.* హిందూమత మనబడుచున్న బ్రాహ్మణమతమునకు ఒక పేరే లేదు. **ఖుర్ఆన్ ఇచ్చిన 'ఇస్లామ్' అను నామము శ్రీ మొహమ్మద్ ప్రవక్త బోధించిన మతమునకే కాదు. భగవంతునిచే వివిధ కాలములందు వివిధ దేశములందు వివిధ ప్రవక్తలకు ప్రోక్తమైన మూలమతమునకు 'ఇస్లామ్' అను నామమును ఖుర్ఆన్ ప్రతిపాదించుచున్నది.** ఇబ్రాహీమ్ ప్రవక్త తన పుత్రులను, యాకూబు (Jacob) తన పుత్రులకును "మీరు ముస్లిములై గాని మరణింపకుడు" అని ఉపదేశించినట్లు ఖుర్ఆన్ వక్కాణించుచున్నది. (2 131_133)

'ఇస్లామ్' అనగా 'శాంతిని ప్రవేశించుట' లేక 'శాంతివహించుట' అని అర్థము. 'ఇస్లామ్' 'సలమ్' అను ధాతువునుండి వచ్చినది. 'సలమ్' అనగా 'శాంతి.' ఆత్మశాంతిని పొందినవాడు ముస్లిమ్. భగవదిచ్ఛకు సమస్తమును సమర్పించినప్పుడే

* 'ఇస్లామ్'ను మొహమ్మదీయ మతమని ఐరోపీయులు వ్రాసిరి కాని ఇది ముసల్మాను సంప్రదాయము కాదు. ఖుర్ఆనులోగాని, ఇస్లామ్ మతమునకును చరిత్రకును సంబంధించిన మరేగ్రంథమునగాని 'మొహమ్మదీ' అను పేరు ముస్లిములకు వాడబడలేదు. ఖుర్ఆన్ బోధించిన మతమునకు 'ఇస్లామ్' అనియు, ఆ మతము ననుసరించువారిని ముసల్మానులనియే వాడిరి. ఈ విషయమునుగూర్చి ఒక క్రైస్తవ పండితు డేమనుచున్నాడో చూడుడు

"The habitual want of comprehension of the ordinary representatives of either religion with regard to the other extends to almost insignificant details, such as for instance the term 'Mohomadan' applied to Musalmans. This expression is an improper transposition of the term 'Christian' which is perfectly applicable to the adherents of religion based on Chirst, whose presence is perpetuated in the Eucharist and in the mystic body, whereas Islam is not based directly on the prophet but on the conception of Allah, and does not consist in a perpetuation of Muhammad but in ritual and legislative conformity of Man and Society to the Supreme Unity."

*(Frithjof Schnon in an article entiled 'Christianity and Islam' in Triveni, Vol VIII No. 1, 1935)*

ఆత్మశాంతి లభించును. ఖుర్ఆన్‌లో 'అస్లము' అను క్రియ 'భగవదిచ్ఛకు సమస్త మును సమర్పించుట' అను అర్థములో ఎక్కువచోట్ల వాడబడినది. భగవదైక్యము, మానవైక్యత— ఈరెండు సిద్ధాంతములును మానవుని ఆత్మశాంతికి మూలాధార ములుగ ఖుర్ఆన్ పేర్కొనుచున్నది. ఏకైకుడగు భగవంతుని తప్ప మరెవ్వరిని ఆరాధింపకుండుటయు, ఏకైకుడగు ఆ భగవంతునితప్ప మరెవ్వరికడను సహాయ మపే క్షింపకుండుటయు, ఏకైకుడగు భగవంతుని ముందు తప్ప మరెవ్వరిముందును తన శిరస్సును వంచకుండుటయు,ఇవి మానవునియందు వ్యక్తిత్వమును, ఆత్మవిశ్వాసమును, ఔన్నత్యమును కల్గించుచున్నవి. అతని శాంతిదాంతుల కదే మూలాధార మగు చున్నది. ఇది ఆధ్యాత్మిక శాంతి. ఇంక మానసికమగు శాంతి కల్గుటకు మానవై క్యత అవసరము. మానవు లందరును ఒకరికొకరు సమానులని అనుకొనినప్పుడే పరస్పరసంఘర్షణము నశించును. జాతి, కుల, వర్ణ, దేశ, ధన, భేదములు కారణ ముగా ఇప్పుడు ప్రపంచమున జరుగుచున్న సంఘర్షణము మానవైక్యతా సిద్ధాంత మును ఇంతవరకు ప్రపంచ మంగీకరించక పోవుటచేతనే కలుగుచున్నది. ఇస్లామ్ ఈ భేదముల నన్నిటిని రూపుమాపి మానవైక్యతను స్థాపించినది. శాంతికి రెండు మూలాధారములలో మానవైక్యతను రెండవదిగ ప్రతిపాదించినది.

ఈ సూక్తములో మతమునకు 'దీన్' అను శబ్దము ఖుర్ఆన్ ఉపయో గించుచున్నది. 'దీన్' అనగా మూలమతము లేక మూలధర్మము. 'మిల్లత్' అను మరి యొక శబ్దము మతమునకు పర్యాయపదముగా ఉపయోగింపబడినది. కాని ఈ రెండు శబ్దములలో కల భేద మిది 'దీన్' అనగా మూలమతము, 'మిల్లత్' అనగా ఆ మూలమతముతోపాటు ఒక ప్రవక్త తన దేశకాలపాత్రానుసారముగా ప్రతిపాదించు ధర్మము.

ఈ మూలధర్మమే ఇక్కడ పేర్కొనబడుచున్నది. దీనినే ఖుర్ఆన్ మాన వుని ప్రకృతి సిద్ధమైన ధర్మముగ కూడ చెప్పుచున్నది.

"నిశ్చయముగ భగవంతునికడ నిజమైన మతము ఇస్లామ్" అని ఖుర్ఆన్ ఇక్కడ వక్కాణించుచున్నది. ఖుర్ఆన్ ప్రతిపాదించిన ఈ మతమునకును ఇతరమత ములకును గలవైధర్మ్య మేది యన్న ప్రశ్న వచ్చును. మూలధర్మమునకు ఆధారము లుగ పైన పేర్కొనబడిన రెండు ధర్మములు – భగవదైక్యత, మానవైక్యత – మరే మతమునను నిజమైన అర్థములో లేవు. మతము లన్నియు భగవంతు డొక్కడే యని అంగీకరించినవి. కాని బహుదైవతారాధనమును ధర్మ్య మొనర్చినవి. ఏకైకుడగు భగవంతుడే ఈ మతములలో విభాజ్యుడైనాడు. క్రైస్తవమతములో తండ్రిగను, కుమారునిగను, పరిశుద్ధాత్మగను విభజింపబడినాడు. హిందూమతములో భగవంతుడు

అవతారములు దాల్చి వేలకొలది ఆరాధ్యదైవతములుగను, భార్యలు, పుత్రులు, సేవకులు ఇత్యాది సిబ్బందితో కోట్లకొలది ఆరాధ్యదైవతములకు మూలమైనాడు. అదేవిధముగ ఇతర మతములలో కూడ ఏకేశ్వరుడు ఏదో ఒక విధముగ బహుదైవత ములుగ మారినాడు. ఇంక మానవైక్యతకు ఇతర మతములలో స్థానమేలేకుండ పోయినది. భారతదేశమున జాతి, కుల, దేశ, వర్ణ భేదములపై నిర్మింపబడిన హెచ్చుతగ్గులు అసంఖ్యాకముగనున్నవి. క్రైస్తవులలో వర్ణభేదములను పాశ్చాత్య శాస్త్రజ్ఞానముకూడ మార్చలేకపోయినది. ఈ మతస్థుల మతగ్రంథములు కూడ ఇదే బోధించుచున్నవి.

ఇంక ఖుర్ఆన్ బోధించుచున్న ధర్మము చూడుడు. క్రైస్తవులు ఏసు క్రీస్తునే నమ్మెదురు. మరొక ప్రవక్తను వారు స్వీకరింపరు. అదేవిధముగ వారు బైబిల్ గ్రంథము నొక్కదానినే భగవద్గ్రంథముగ స్వీకరింతురు. ఇతర మత గ్రంథములను గౌరవింపరు. అదేవిధముగ భారతదేశమునందు వర్ధిల్లిన ఋషులను మాత్రమే హిందువులు సత్యప్రవక్తలుగ నంగీకరింతురు. అట్లే వేదములు, తత్సం బంధమగు గ్రంథములను మాత్రమే ప్రమాణ గ్రంథములుగ అంగీకరింతురు. కాని ఖుర్ఆన్ సర్వ కాలములందు, సర్వ దేశములందు వర్ధిల్లిన ప్రవక్తలను, వారి గ్రంథములను విశ్వసింపుడని బోధించుచున్నది. ఖుర్ఆన్ మాటలను వినుడు

"ఓ విశ్వాసవంతులారా! ఇట్లనుడు 'మేము భగవంతుని యందును, మాకు ప్రోక్తమైన (ఖుర్ఆన్) గ్రంథమునందును, ఇబ్రాహీం, ఇస్మాయీల్, ఇస్హాక్ ప్రవక్తలకును, యాకూబు సంతతివారికిని ప్రోక్తమైన గ్రంథములందును, మూసాకును, ఈసాకును ప్రోక్తమైన గ్రంథములందును, (అంతేకాదు) ప్రపంచ మున నుద్భవించిన సమస్తప్రవక్తలకు ప్రోక్తమైన ఉపదేశములందును విశ్వసింతుము. ఈ ప్రవక్తలలో ఎవ్వరియెడను మేము భేదభావమును చూపము. ఏకేశ్వరునకే వినతు లమగుదుము." (2 136)

"భగవత్ప్రవక్త తనకు ప్రోక్తమైన ఈ వచనములను విశ్వసించుచున్నాడు. విశ్వాసవంతులుకూడ అట్లే విశ్వసించుచున్నారు. వారందరు అల్లాను, అతని దేవ దూతలను, అతని (చే ప్రోక్తమైన) గ్రంథములను, అతనిప్రవక్తలను అట్లే విశ్వసించు చున్నారు. (వా రిట్లందురు ) 'ఏప్రవక్త యెడను మేము భేదభావమును చూపము." (2 285)

"ప్రవక్త వెలయని జాతి లేదు." (35 . 24)
"ప్రతిజాతికి ఒక ప్రవక్త కలడు." (10 47)

"నేను పంపిన ప్రవక్తల పేర్లను ఇంతకుపూర్వము వ్రాయిచ్చితిని. (పెక్కురు) ప్రవక్తల పేర్లు నీకు చెప్పలేదు." (4 164)

ఖుర్ఆన్‌లో ఇరువదైదుగురు ప్రవక్తల పేర్లు మాత్రము పేర్కొనబడినవి. 124,000 మంది ప్రవక్త లుద్భవించిరని శ్రీప్రవక్తవచనము.

మూలమతము (దీన్) ఒక్కటే యనియు, అదే మానవుని ప్రకృతియందు స్థగితమై యున్నదనియు, వివిధ ప్రవక్తలు తమ దేశకాలపాత్రానుసారముగ ఈ మూలమతము (దీన్) తోపాటు ఒకజీవితవిధానమును (మిల్లత్) బోధించి రనియు ఖుర్ఆన్ చెప్పుచున్నది. ఖుర్ఆన్ దృష్టిలో సత్యము సనాతనమైనది. అంతేకాదు అది ఒక్కటి. దేశ కాల పాత్రముల ననుసరించి అందు మార్పుండదు. జీవిత విధానమునకు సంబంధించిన ధర్మము (మిల్లత్) లో మార్పులుండుట సహజము. కాని మూల మతము (దీన్) లో మార్పుకు తావులేదు. ఈ విధముగ ఖుర్ఆన్ ఒకే భగవంతుడు, ఒకే సత్యము, ఒకే మానవజాతిని ప్రతిపాదించుచున్నది. ఈ మతమునే ఖుర్ఆన్ ఇస్లామ్ అని పిలుచుచున్నది. ఇదే మానవుని మతమని నిర్ధారణచేయుచున్నది. "నిశ్చయముగ భగవంతునికడ నిజమైన మతము ఇస్లామ్" అను ఈ సూక్తమునకర్థ మిదే. భగవదైక్యము, మూలమతైక్యము, మానవ జాత్యైక్యము ఇస్లామ్ మతమునకు మూలసూత్రములు.

ఈ సూత్రములను తెలిసియుండియు పెక్కు మతస్థులు వీనిని స్వీకరింప కుండ నున్నారని ఖుర్ఆన్ చెప్పుచున్నది. చూడుడు అన్ని మతములును భగవంతు డొక్కడే యని ఒప్పుకొనుచున్నవి. కాని ఏకేశ్వరారాధనము ఏ మతమునను లేదు. ఏసుక్రీస్తును భగవదవతార మనియు, భగవంతుని కుమారు డనియు, భగవంతుడే యనియు క్రైస్తవాచార్యులు త్రిత్వమును ప్రతిపాదించిరి. ఆదేవిధముగ వందలకొలది దైవములు హిందూమతమున ఆరాధనీయులైరి. భగవదైక్య సిద్ధాంతము భగ్నమైన పిదప మానవైక్య సిద్ధాంతము, కొన్ని మతములలో నామ మాత్రముగ నిలిచిపోయెను. కొన్ని మతములలో స్పష్టముగ నిరాకరింపబడెను. మతైక్య సిద్ధాంతము కేవలము క్రొత్తది. ఇది ఇప్పుడున్న ధర్మగ్రంథములలో ఖుర్ఆన్ ఒక్కటే బోధించుచున్నది. మరేమతము మూలమత మొకటే యనియు ప్రపంచమందలి సర్వదేశములందును భగవంతుని ప్రవక్తలువచ్చిరనియు, వారికి ప్రోక్తమైన, ధర్మములను విశ్వసింపవలెననియు బోధించలేదు. ఖుర్ఆన్ ఒక్కటే అట్లు బోధించినది.

ఈ విధముగ భగవదైక్యాది సిద్ధాంతములు తెలిసియుండియు వివిధమతములు ఆ సిద్ధాంతములను మరచి, వాటికి వ్యతిరేకమగు సిద్ధాంతములను ప్రతిపాదించిన వని ఖుర్ఆన్ చెప్పుచున్నది.

*　　　*　　　*

౬౬. ఇది యుద్ధసమయపుఆజ్ఞ. ఖుర్ఆన్‌లో మరొకసూక్తమున (60 8,9) ఈ విషయము స్పష్టపరుపబడినది

"మీ రీ మత మవలంబించినందుకై మీతో యుద్ధముచేయక, మిమ్ములను మీ ఇండ్లనుండి వెళ్లగొట్టక (మీతో సఖ్యముననున్న అవిశ్వాసులతో) మీరు సౌహార్దముతోడను, న్యాయముతోడను ప్రవర్తింపుడు. నిశ్చయముగ భగవంతుఁడు న్యాయ ప్రవర్తనులను ప్రేమించును.

"మీ రీ మత మవలంబించినందుకై మీతో యుద్ధము చేయువారితోడను, మిమ్ములను మీ ఇండ్లనుండి వెళ్లగొట్టువారితోడను, మిమ్ములను వెళ్లగొట్టుటయందు (మీ శత్రువులకు) సాయపడువారితోడను (మాత్రమే) సఖ్యము చేయుటను భగవంతుడు నిషేధించుచున్నాడు. వారితో స్నేహము చేయువారు అధర్మపరులు."

*　　　*　　　*

౬౭. ఏసుక్రీస్తు సిలువపై మరణించెనని క్రైస్తవులు నమ్ముచున్నారు. ఏసు ప్రవక్త అట్లు సిలువపై మరణించలేదనియు, ఆయన సహజమగు మరణమునే పొందెననియి ఇక్కడ ఖుర్ఆన్ చెప్పుచున్నది. 4 వ అధ్యాయము 157 వ సూక్తములో ఈ విషయము మరియు స్పష్టముగ నిట్లు చెప్పబడినది

"వాస్తవ మేమనగా వా రతనిని (ఏసుక్రీస్తును) చంపనూలేదు, సిలువపై ప్రాణముల తీయనూ లేదు. వారి కా విషయము సందేహాస్పదము కావింపబడెను. ఈ విషయమున వివాదపడినవారు సందేహములలో మునిగియున్నారు. దానినిగూర్చి వారికడ నిశ్చయజ్ఞానము లేదు. వారి కున్నది ఊహామాత్ర జ్ఞానమే. వారు అతనిని చంపలేదనుట నిశ్చయము."

ఏసుక్రీస్తు సిలువపై మరణించె ననియు, తరువాత సమాధిలో పాతిపెట్టబడె ననియు, అట్లు పాతిపెట్టబడిన మూడవ దినమునాఁడు జీవితుడై లేచెననియు క్రైస్తవుల విశ్వాసము. ఏసుక్రీస్తు సిలువపై మరణించలేదనియు, సిలువపై మూర్ఛపోయె ననియు సిలువపైనుండి దించిన మూఁడవ దినమునాఁడు మూర్ఛతేరుకొని తన శిష్యు

లకు దర్శనమిచ్చెననియూ పెక్కురు పాశ్చాత్యపండితుల అభిప్రాయము.* బాసిలైడెస్ అను పండితుడు ఏసుక్రీస్తు అసలు సిలువపైననే ఎక్కింపబడలేదనియు, ఏసుక్రీస్తు బదులు సైమన్ అనునాతడు సిలువపై ఎక్కింప బడెననియు బోధించెనని స్ట్రాఉస్ పండితు డనుచున్నాడు. ఆ పండితుని మాట లివి

"Basildes the Gnostc is said to have taught that Simon was crucified in the place of Jesus"

(*Strauss, A New Life of Christ, Vol. II, P 367.*)

శ్లీయర్ మాషర్ (Schleiermacher) పండితుడు తన Life of Christ (క్రీస్తు జీవితచరిత్రము) అన్న ఉద్గ్రంథములో ఈ విషయమును దీర్ఘముగ చర్చించినాడు. ఈ పండితుని పూర్వమును, తర్వాతను కూడ పల్వురీవిధముగ తా మభిప్రాయ పడుట కిచ్చిన ఆధారముల నీ క్రింద క్రోడీకరించుచున్నాను

## 1. ఏసుక్రీస్తు కొన్ని గంటలు మాత్రమే సిలువపై నుండెను.

ఏసుక్రీస్తు సిలువపై సుమారు ఆరు గంటల కాల ముండినట్లు తెలియుచున్నది.† సిలువపై ఎక్కించిన వారు అంత త్వరగా చచ్చువారు కారు. రెండు మూడు దినముల వరకు వారు బ్రతికియుండుట కలదనుటకు ఆధారము లెన్నియో కలవు ♦ అందుచే ఏసుక్రీస్తుకు మరణము సంభవించలేదు. ఆయన మూర్ఛపోయి యుండును.

---

* "On the one hand, the reality of Christ's *death* was denied and reduced to a mere *trance*, so that the resurrection would be perfectly natural *recovery from a deep swoon.* On the other hand, the reality of our Saviour's death was confessed, but the *resurrection* as an *outward* fact denied, and the origin of the belief in it attributed to visions experienced by the disciples.

—*Christliebe, Modern Doubt and Christian Belief*, P. 4.55

† Dean Farrar, *Life of Christ*, P. 449, Neander, *Life of Jesus Christ*, P. 472.

♦ "The crucified person suffered a lingering and very painful death, sometimes surviving till the third day, and even longer."

*Rev Barrows, Biblical Geography and Antiquitis*, P. 462.

"The crucified often lived for many hours — nay, even for two days."

*Farrar, Life of Christ*, P. 452.

2. ఏసుక్రీస్తుతో సిలువపై ఎక్కించిన మరి ఇద్దరు సిలువపై క్రిందకు దింప బడినప్పుడు చావలేదు.

3. ఆయనతో సిలువపై ఎక్కించబడిన దొంగ లిద్దరియొక్క కాళ్ళు విరుగ గొట్టబడెను. ఏసుక్రీస్తున కట్లు చేయరైరి.

4. ఏసుక్రీస్తు ప్రక్కను పొడిచినప్పుడు రక్తము వచ్చెను. బ్రతికియుండె ననుట కిదొక తార్కాణము.

5. ఇంత త్వరలో చచ్చిపోయెనని పైలేటుకూడ నమ్మలేదు. (మార్కు 15 44)

6. తక్కిన ఇద్దరివలె ఏసుక్రీస్తు పాతిపెట్టబడలేదు. ధనికుడగు ఒక శిష్యుని కొప్పజెప్పబడెను. ఆ శిష్యు డాయనను ఒక కొండలో తొలచబడిన విశాలమైన గదిలో ఉంచి సర్వోపచారము లొనర్చెను.†

7. మూడవనాడు గుహాముఖమున నున్న రాయి తొలగింపబడియుండెను.

8. తరువాత ఆయనను చూచిన మేరీ మాగ్డలీను ఆయనను తోటమాలియని భ్రమించెను (జాన్, 20 15). ఏసుక్రీస్తు ఆ గుహనుండి అన్యులకు తెలియ కుండుటకై తోటమాలి వేషము వేసుకొని వెళ్లినట్లు దీనివల్ల స్పష్టమగుచున్నది. ఏసుక్రీస్తు నిజముగా మరణించి తిరిగి లేచియుండినచో ఈ ప్రచ్ఛన్న వేషమేల? మేరీ మాగ్డలీను ప్రచ్ఛన్నవేషధారియగు ఏసుక్రీస్తు పాదములు మ్రొక్కినప్పుడు ఆయన పాదములందు మేకులు కొట్టిన గాయములు స్పష్టముగ నుండెను.* దివ్య శరీరముతో ప్రత్యక్షమైనప్పుడు గాయములుకూడ నుండునా? శిష్యులకు దర్శన మిచ్చినప్పుడుసైతము గాయములన్నియు యథాతథముగ నేయుండెను. ఏసుక్రీస్తు అదే శరీరముతో నుండెను.

9. ఏసుక్రీస్తుకు ఆకలివేసి తన శిష్యులతో భోజనముచేసెను. (లూకు 24 : 39—43).

10. ఏసుక్రీస్తు ఇద్దరు శిష్యులతో కలిసి గాలీలీకి ప్రయాణముచేసెను.

---

† "Having obtained the sought-for permission, Joseph provided himself with a winding sheet of fine linen and the necessary bandages, and set out for the place of the skull"

Pappini Giovani, *The Story of Christ*, P. 408.

* "Falling on her knees in the wet grass, she laid her loving hands upon those bare feet that still showed the red prints of the nails."

Pappini Giovani, *Ibid*, P. 417.

11. ఏసుక్రీస్తు ప్రచ్ఛన్నముగానే సంచరించెనని స్పష్టముగ కన్పించుచున్నది.

12. తాను పట్టుబడుటకు పూర్వము ఏసుక్రీస్తు రాత్రియంతయు తనను అవమానకరమగు చావునుండి తప్పించవలసినదని భగవంతుని ప్రార్థించెను. ఈ ఘట్టమును డీన్ ఫారర్ గారు ఎట్లు వర్ణించిరో చూడుడు

"A grief beyond utterance, a struggle beyond endurance, a horror of great darkness, a giddiness and stupefaction of soul overmastered Him, as with the sinking swoon of an anticipated death. It was a tumult of emotion which none must see 'My Soul,' He said, 'is full of anguish even unto death, stay here and keep watch.' Reluctantly he tore Himself away from their sustaining tenderness and devotion, and retired yet farther, perhaps out of the moonlight into the shadow And there until slumber overpowered them, they were conscious of how dreadful was that paroxism of prayer and suffering through which He passed. They saw Him sometimes on His knees, sometimes outstretched in prostrate supplication upon the damp ground, they heard snatches of sounds of murmured anguish in which His humanity pleaded with the divine will of His Father. The actual words might vary, but the substance was the same throughout 'Abba, Father, all things are possible unto Thee, take away this cup from me, nevertheless, not what I will, but what thou wilt.'"

(*The Life of Christ*, P. 394)

సిలువమీద ఎక్కినతర్వాతకూడ ఏసుక్రీస్తు "నా తండ్రీ! నా తండ్రీ! నన్నేల విడిచిపెట్టితివి?" అని వాపోయెను. తన ప్రవక్త ప్రార్థనను భగవంతుడు నిరాకరించునా? ఏసుక్రీస్తు సిలువపై మరణించియుండడనుటకు ఈయొక్కనిదర్శనమే చాలును.

*　　　*　　　*　　　*

౧౩. ఏసుక్రీస్తు అసలు సృష్టింపబడనేలేదనియు,* ఆయన భగవంతునివలె ఆదిమధ్యాంతరహితుడనియు, ఆయన మానవజన్మము ఒక అవతారముమాత్రమేనియు ఒక విశ్వాసము క్రైస్తవులలో కలదు. ఏసుక్రీస్తు క్రైస్తవులు పూజించు త్రిమూర్తులలో రెండవ పురుషునిగ భావింపబడుచుండుట సుప్రసిద్ధము. ఏసుక్రీస్తు సృష్టికర్త

" *The Sonship of Christ is increate and unbeginning, the presupposition of all time and history." (*Ibid*, P. 103) "Jesus as the son is eventually to share in the omnipotence and absoluteness of God himself." (*Ibid* P. 106)

యనియు, భగవంతునకును మానవునకును మధ్య గల సంబంధములను ఆయన వ్యవహర్తయై తీర్చు ననియు క్రైస్తవుల మతము.♦ ఏసుక్రీస్తు కేవలము మానవు డనియు, అందరు మానవులవలె అతడుకూడ సృష్టింపబడినాడనియు ఇక్కడ ఖుర్ఆన్ చెప్పుచున్నది.

కాని "భగవంతునికడ ఈసాను తార్కాణము ఆదమ్. (భగవంతుడు) ఆదమును మట్టితో సృష్టించి "అగుము" అనిమాత్ర మనెను. అంతట నత డాయెను."

అని ఇంత డొంకతిరుగుడుగ ఈ విషయ మేల చెప్పబడిన దను ప్రశ్న రావచ్చును. దీనికి కారణము కలదు. క్రైస్తవులు ఏసుక్రీస్తును మొదటి మానవుడైన ఆదముతో పోల్చి, ఆదమ్ మంటితో చేయబడి భూమికి సంబంధించినవా డనియు, ఏసుక్రీస్తు స్వర్గమునుండి దిగివచ్చిన ప్రభు వనియు, ఆదమ్ సజీవ మగు ఒక ఆత్మగా చేయబడె ననియు, ఏసుక్రీస్తు జీవము నిచ్చు ఆత్మ యనియు చెప్పిరి.* దానికి జవాబుగా ఖుర్ఆన్ పై మాటలలో ఆదముయును ఈసాయు ఒకే విధముగ సృష్టింపబడిన మానవు లనియు, వారిలో ఎట్టి భేదమును లే దనియు చెప్పుచున్నది.

---

♦ "On the one hand, the Godhead of Christ is explicitly asserted. The son acts as Creator, and the relations of created things to God are mediated by Him."

(*Mackintosh, The Person of Jesus Christ*, P. 84)

* And so it is written, The first man Adam was made a living soul, the last Adam was made a quickening spirit.

" Howbeit that was not first which is spiritual, but that which is natural, and afterward that which is spiritual.

" The first man is of the earth, earthly. the second man is the Lord from heaven." (*I. Corinthians* XV. 45–7)
(*Also Romans* V 14)

(ఆదమ్ అను మొదటి మనుష్యుడు జీవించు ప్రాణి యాయె నని వ్రాయబడియున్నది. కడపటి ఆదమ్ జీవింపజేయు ఆత్మ యాయెను ...మొదటి మనుష్యుడు భూసంబంధియై మంటినుండి పుట్టినవాడు, రెండవ మనుష్యుడు పరలోకమునుండి వచ్చిన ప్రభువు.)

మాకిన్టాష్ పండితుడు ఈ వాక్యములను వ్యాఖ్యానించుచు నిట్లనుచున్నాడు :
"Adam was earthly, Jesus heavenly, Adam a transgressor, Jesus obedient, Adam only a living soul, Jesus a quickening spirit, a Being above nature, who had life and was capable of giving it."
(*Ibid*, P. 61)

ఏసుక్రీస్తు మానవమాత్రుడు కాడనియు, ఆయన సాక్షాత్తు పరమేశ్వరుడనియు మొదలుగా గల అభిప్రాయములు సెంట్ పాల్ వ్యాప్తిలోనికి తెచ్చినవి. అందుచేతనే క్రైస్తవమత సంస్థాపకుడు అసలు సెంట్ పాల్ యేనని చెప్పుదురు.* మొదటి మూడు సువార్తలయందును ఏసుక్రీస్తు ప్రవక్తయని మాత్రము చెప్పబడెను. సువార్తలయందలి ఈ క్రింది మాటలు చూడుడు

"And the multitude said, This is Jesus *the prophet of Nazereth of Galilee*" (Mathew, XXI, 11)

"And there came a fear on all and they glorified God, saying, That *a great prophet* is risen up among us, and, That God hath visited His people." (Luke, VII, 16)

"And he said unto them, what things? And they said unto him, concerning Jesus of Nazareth, *which was a prophet* mighty in word and deed before God and all the people." (Luke, XXIV, 19)

"Then those men, when they had seen the miracle that Jesus did, said, This is of a truth *that prophet* that shonld come into the world" (John VI. 14)

"The woman sayeth unto him, Sir, I perceive that thou art *a prophet.*" (John, IV 19)

They say unto the blind man again, what sayest thou of him, that he hath opened thine eyes? He said, He is *a prophet.*

(John, IX. 17)

ఈ విధముగ సువార్తలలో ఏసుక్రీస్తు ప్రవక్త యనియే పెక్కు చోట్ల చెప్పబడెను. ఆయన భగవంతు డనియు, భగవంతునికుమారు డనియు, సృష్టికర్తయనియు చెప్పబడలేదు. ఆయన తాను సామాన్యమానవుడ నని ఎన్నో చోట్ల చెప్పుకొనెను. **మ్యాథ్యూ, మార్కు, లూకు, సువార్తలలో దాదాపు 70 సార్లు**

---

* "The Christ of the Pauline Epistles has no relation at all to the historic Jesus. We need scarcely hesitate in regarding St. Paul, indeed, as the real founder of our religion"

(Mackintosh, Ibid, P. 51)

"Without the Pauline gospel *about* Jesus Christianity could never have become more than a sect of reformed Judaism."

—B. W. Bacon, *Making of New Testament, P. 61.*

**40 సందర్భములలో ఏసుక్రీస్తు తాను 'Son of man' (మనుష్యుని కుమారుడు) లేక మానవుడు అని చెప్పుకొనెను.***

ఏసుక్రీస్తు దేవునికుమారు డని బైబిలులో ఉన్నంతమాత్రమున నిజముగ దేవుని కుమారు డనియే క్రైస్తవులు భావించుచున్నారు. భగవంతుని తండ్రి యని పిలుచుట ఆ కాలములో పరిపాటియై యుండెను. ఆ వాడుక ననుసరించి ఏసుక్రీస్తు భగవంతుని 'నా తండ్రి' యని పిలుచుచుండెను. అందరివలె తానుకూడ పరమపిత కుమారుడ నని చెప్పుకొనెను. ధనవంతుని మనము లక్ష్మీపుత్రుడు అందుము. అన్నంతమాత్రమున ఆ కోమటిబిడ్డ లక్ష్మి కడుపునపుట్టిన బిడ్డడగునా? అట్లే క్రైస్తవులు అలంకారికముగ ఆ కాలములలో వాడబడు 'పరమపిత' 'దేవపుత్రుడు' మున్నగు మాటలను యథాతథముగ అర్థముచేసుకొని ఏసుక్రీస్తును దేవుని కుమారునిగ భావించి పూజించ సాగినారు.

'దేవుని కుమారుడు' అనుపదము వివిధార్థములలో, వివిధ సందర్భములలో, వివిధ వ్యక్తులచేత పాత నిబంధన మందును, క్రొత్త నిబంధన మందును వాడబడినది. సువార్తలలో ఈ పదము 'మసీః' లేక 'ప్రవక్త' అను అర్థములో వాడబడినదని క్రైస్తవ పండితుల అభిప్రాయము.♦ పాత నిబంధనములో దేవదూతలు, రాజులు, ప్రవక్త మున్నగు అర్థములలో ఈ పదము వాడబడినది.†

ఇట్లు ఏసుక్రీస్తు 'దేవుని కుమారుడు' కాడనియు, కేవలము మానవుడే ననియు, ఆయన భగవంతుని ప్రవక్తలలో ఒకడనియు బైబిలులో కలదు. అదే విషయమును ఖుర్ఆన్ స్పష్టముగ చెప్పుచున్నది. ఏసుక్రీస్తుకూడ ఆదమ్‌వంటి మానవుడేనని ఖుర్ఆన్ నొక్కి చెప్పుచున్నది.

* * * *

ఉ. హి. శ. 10వ సంవత్సరములో 'నజ్రాన్' పట్టణమునుండి వచ్చిన క్రైస్తవాచార్యులతో జరిగిన వాగ్వివాదములో ఏసుక్రీస్తు భగవంతుడు కాడనియు,

---

* "*Son of man* is only used by Jesus in the Synoptics, virtually always as a self designation." (*Mackintosh, Ibid,* P 20)

"In Mathew, Mark, and Luke the title (Son of man) is found on Jesus' lips about seventy times, representing forty occasions more or less."—Ibid, P. 20.

♦ "But in the majority of cases belonging to this class, our wisest course is to regard 'Son of God' as a synonym of Messiah." (Mackintosh, Ibid, P. 25.)

† Mackintosh, Ibid, P. 25.

మానవమాత్రు డగు ఒక ప్రవక్తయే ననియు ఎంత నచ్చజెప్పినను క్రైస్తవులు తమ విశ్వాసమును మార్చుకోరైరి. అప్పుడు ప్రవక్త ఎవరి వాదము సత్యమో నిర్ణయించు టకు భగవంతుని ప్రార్థింత మని చెప్పిన విషయ మిక్కడ ముద్దేశింపబడినది. "ఎవ రబ ద్ధములు పలుకుచున్నారో వారు శాపహతు లగుదురుగాక!" అని ప్రవక్త ప్రతిపాది నము. క్రైస్తవపండితులు దీని కొప్పుకొనక ప్రవక్తతో సంధిచేసుకొని పోయిరి.

*   *   *   *

౭౦. రోమ్ చక్రవర్తి యగు హెరాక్లియస్‌కు ప్రవక్త పంపిన లేఖలో ఈ సూక్తము కలదు. హిజరీ శకము 6 వ సంవత్సరములో ప్రవక్త రోమ్ చక్రవర్తికిని, అబిసీనియా చక్రవర్తికిని, పారసీక చక్రవర్తికిని, ఈజిప్టు ప్రభువునకును, సిరియా రాజునకును ఇస్లామ్ స్వీకరించవలసినదని ఉత్తరములు వ్రాసిరి. హెరాక్లియస్ క్రైస్తవుడగుటచే ప్రవక్త తన లేఖలో ఈ సూక్తము నుదహరించిరి.

ఈ సూక్తమున పేర్కొనబడిన మూలసిద్ధాంతములు మూడు . 1. ఏకేశ్వ రునే ఆరాధించుట , 2. భగవంతునకు సమానులను కల్పించకుండుట ; 3. మానవు లకు భగవదర్హమగు గౌరవప్రపత్తులనిచ్చి పూజింపకుండుట.

క్రైస్తవులు ఏకేశ్వరునే ఆరాధించుచున్నామని చెప్పుచుండియు ఏసుక్రీస్తును దేవుని కుమారునిగను, అందుచే భగవంతునకు సమానునిగను భావించి పూజించు చున్నారు. 'పరిశుద్ధాత్మ'ను త్రిమూర్తులలో ఒకనిగా భావించి పూజించుచున్నారు. 'భగవంతు డొక్కడే' యని ఊరక చెప్పిన లాభము లేదు. భగవంతు డొక్కడేయని ఒప్పుకొనినప్పుడు 'పరిశుద్ధాత్మ'ను భగవంతునకు సమానునిగను, మానవుడును ప్రవక్తయునగు ఏసుక్రీస్తుని భగవంతుని కుమారునిగను భగవంతునిగను పూజించ కూడదని ఇక్కడ ఖుర్ఆన్ బోధించుచున్నది.

"మీకును మాకును సాదృశ్యముగల" మూలసిద్ధాంతములవైపునకు ఖుర్ఆన్ పిలుచుచున్నది. ఆ సిద్ధాంత మేది? అదే ఏకేశ్వరత్వ సిద్ధాంతము. ప్రపంచము నందలి మతము లన్నియు ఏకేశ్వరత్వమును ఒప్పుకొనుచున్నవి. కాని ఆయా మత స్థులు ఆచరణములో మాత్రము దానికి విరుద్ధముగ ప్రవర్తించుచున్నారు. ఖుర్ఆన్ అందుచేతనే ఏకేశ్వరత్వముయొక్క పూర్తియర్థమును వివరించుచు దానిని స్వీకరించ వలెనని ఆహ్వానించుచున్నది. ఈ సందర్భమున క్రైస్తవ మతమునుగూర్చి ఫ్రీత్‌జాఫ్ ష్నాన్ (Frithjof Schnon) పండితుడు చెప్పిన మాటలను గమనింపుడు

"Christians cannot lay claim to the idea of Unity with the same right as the Muslims, the idea of Redemption is not necessari-

ly linked to the conception of Divine Unity, it might in fact be the outcome of a polytheistic doctrine As for Divine Unity, although theoretically admitted by Christians, it never appears as a dynamic element.''*

క్రైస్తవ మతమునకును ఇస్లామ్‌నకును గల భేద మిందే యున్నదని పల్వురు ప్రఖ్యాత క్రైస్తవ పండితుల అభిప్రాయము. జాన్ విలియమ్ డ్రేపర్ తన 'History of the Conflict between Religion and Science' అను ఉద్గ్రంథములో ఇట్లు వ్రాయుచున్నాడు (పుట 72) "Sir William James, following Locke, regards the main point in the divergence of Mohammadanism from Christianity to consist 'in denying vehemently the character of our Saviour as the son, and his equality as God with the Father.' This opinion has been largely entertained in Italy"

* * * *

౩౧. ఇస్లామ్ విశ్వ విశాల భావమును వెల్లడించు మరొక సూక్తమిది. "ఇబ్రాహీం యూదుడును కాడు, క్రైస్తవుడును కాడు. కాని అతడు సత్యమార్గ ప్రవర్తకుడు, భగవదిచ్ఛకు శిరస్సును వంచిన వాడు, అతడు బహు దైవతారాధకుడు కాడు." అను ఈ సూక్తములో సన్మార్గ ప్రవర్తకుడైయుండుటయు, బహు దైవతారాధకుడు కాకుండుటయు మాత్రమే ఇస్లామ్‌యొక్క ముఖ్య షరతులుగా చెప్పబడినది. "భగవదిచ్ఛకు శిరస్సును వంచుట" లేక "భగవదిచ్ఛకు సమస్తమును సమర్పించుట" లేక ఇక్కడ ఖుర్ఆన్ ఉపయోగించిన శబ్దములలో "ముస్లిమ్ అగుట" అనగా ఏకేశ్వరునియందు విశ్వాసముంచి సన్మార్గ ప్రవర్తకు డగుట. ఒక ప్రవక్తను బట్టిగాని, ఒక జాతిని బట్టిగాని, ఒక దేశమునుబట్టిగాని మతములకు పేర్లిచ్చుటను ఖుర్ఆన్ అంగీకరింపదు. వివిధ ప్రవక్తలు వివిధమగు మతములను బోధించిరనియు ఖుర్ఆన్ ఒప్పుకొనదు. ఎవరు, ఏ కాలమున, ఏ దేశమున బోధించినను ఒకే మతమును బోధించిరనియు, ఎందుకన, మతము లేక సత్యమగు ధర్మము ఒక్కటే యనియు ఖుర్ఆన్ చెప్పుచున్నది. ఆ ధర్మము భగవత్ప్రతిపాదితము, ప్రవక్తచే బోధింపబడినది. ఏకేశ్వరారాధనము, సన్మార్గ ప్రవర్తనము — ఇవి రెండును ఈ సత్యమునకు ప్రధానాంగములు. మాటిమాటికి ఖుర్ఆన్ ఈ సత్యమునే బోధించుచున్నది. (259—263 పుటలలో 65 వ నోటునుకూడ చూడుడు.)

* * * *

౩౨. క్రైస్తవులు కానివారు ఎంతటి సత్ప్రవర్తకులైనను వారికి స్వర్గమోక్ష

---

* Christianity and Islam, *By Frithjof Schnon in Triveni, Vol. VIII, No. 1, 1935.*

ములు లభించవని క్రైస్తవులును, యూదులు కానివారెవ్వరికిని స్వర్గమోక్షములు లభించవని యూదులును అనుచున్నారు ఈ విషయమున క్రైస్తవమత సిద్ధాంతములనుగూర్చి L. T Hobhouse తన Morals in Evolution అను ఉద్గ్రంథములో ఇట్లనుచున్నాడు "Without faith (in Christ) no virtue can save, and though they had no means of knowing the Gospel, the best of the heathen are irrevocably lost. This may be said to have been common ground to the churches down to the modern period But further than this, faith not merely in Christ, but in the Church's own scheme of salvation is too often a necessity, and no virtue, no sanctity, not even the utmost plenitude of the time spirit of religion, could avail to make good this flaw "‡

(ఏసుక్రీస్తుయందు నమ్మకము లేకపోయినచో ఎంతటి శీలవంతుడైనను భ్రష్టుడు కావలసినదే. బైబిల్ తెలుసుకొను అవకాశము లేకపోయినను క్రైస్తవుడు కాని ఎంతటి ఉత్తముడైనను అధఃపతితుడే. ఇటీవలివరకు అన్ని చర్చిల యొక్కయు అభిప్రాయమిదే అంతకుమించి, ఏసుక్రీస్తునందేకాక చర్చియొక్క మోక్షవిధానమునందు నమ్మకముకూడ ఆవశ్యకమాయెను ఎంతటి శీలవంతుడైనను, ఎంతటి పవిత్ర చరిత్రుడైనను, ఎంతటి ధర్మపరుడైనను క్రైస్తవ చర్చితో ఏకీభవించనియెడల భ్రష్టుడగును.)

దీనికి ప్రోద్బలముగ Hobhouse ఈక్రిందివాక్యములను ఉద్ధరించుచున్నాడు "For any man who does not hold the unity of the Catholic church neither Baptism nor alms however profuse, nor death met in the name of Christ, can be of benefit for his salvation "*

(క్యాథలిక్కు చర్చియొక్క ఐక్యమునందు నమ్మకము లేనివాడు క్రైస్తవుడయ్యు, ఎక్కువ దానతత్పరుడయ్యు, ఏసుక్రీస్తుకొఱకు ప్రాణములను ధారపోసినవాడయ్యు మోక్షమును పొందజాలడు.)

Hobhouse మరియు నిట్లనుచున్నాడు "Augustine suggests that good works may mitigate damnation when they cannot procure salvation."

(సత్కృతులు నరకమునుండి తప్పించవచ్చునుగాని మోక్షము నిప్పించజాలవు అని అగస్టీన్ అభిప్రాయపడెను.)

‡ Vol. ii, P. 140.

* Quoted from Fulgentius in the Decr. Greg. Corpes Juris P. 778. ఈ గ్రంథమున ఇది అగస్టీన్ చెప్పినట్లుగా నున్నది.

ప్రొటెస్టెంటు మతనాయకులైన లూథర్, కాల్విన్ ఇత్యాది ప్రముఖుల అభిప్రాయములను చర్చించుచు హాబ్‌హౌస్ ఇట్లు వ్రాయుచున్నాడు ·

"Calvin even detracts from the merits of the heathen :—The good works of the heathen are distinguished from bad and rewarded in this life, but Augustine is right in saying "That all who are strangers to the religion of the one true God, however they may be esteemed worthy of admiration for their reputed virtue, not only merit no reward, but are rather deserving of punishment because they contaminate the pure gifts of God with the polution of their own hearts" They are restrained from evil not by a sincere attachment to virtue, but by ambition, self-love, or some other irregular disposition The end of what is right is always to serve God, and as they regard not this end, any externally good act performed by them becomes sin.

Luther, though of more tolerant disposition, is equally clear that outside Christendom there is no forgiveness and can be no holiness (*Primary Works, ed Wace and Buchheim, P. 104*). The Anglican Article XIII denies that "works done before the grace of Christ" are pleasant to God — "Yea rather, for that they are not done as God hath willed and commanded then to be done, we doubt not but they have the nature of sin."

(*Corpus Juris, P 14*).

(కాల్విన్ క్రైస్తవుడుకానివాని మంచితనముసైతము మంచితనము కాదనుచున్నాడు —క్రైస్తవుడు కానివాడు చేయు సత్కృతులకు ఫలము ఈ లోకముననే లభించును. 'క్రైస్తవ మతము తెలియనివారు సత్పురుషులని ఎంతటి ప్రశంసలకు పాత్రులైనవారైనను దాని ఫలమును పొందకపోవుటయేకాక వారు శిక్షకు పాత్రులు - ఎందుకన వారు భగవంతుని అనుగ్రహములను తమ హృదయముల అంటుచే కళంకితమొనర్తురు-' అని అగస్టిన్ చెప్పిన మాటలందు సత్యముకలదు. వారు దౌష్ట్యమునుండి దూరముగ నుండునది వారికి సద్వృత్తియందు కల ప్రేమచే కాదు - ఆశ, స్వాతిశయము మున్నగు భావములే దానికి కారణము - ఏ సత్కృతియొక్కయు ఫలితార్థము భగవత్సంసేవనమే. వారీ ఫలితార్థమును అభిలషించరు కనుక వారు పైకిచేయు ఏ మంచిపని యైనను పాపమే యగును.

ఇంతకంటెను ఇంచుక ఎక్కువ విశాలహృదయము గల లూథర్ కూడ క్రైస్తవ మతము బయట ఎక్కడను పావిత్ర్యము లేదనియు, క్రైస్తవేతరు లెప్ప

డును క్షమింపబడరనియు అభిప్రాయపడెను. (ప్రైమరీ వర్క్సు, పేజి 104). యాంగ్లికన్ ఆర్టికల్ XIII లో క్రైస్తవ మతములో ప్రవేశించకపూర్వము చేసిన సత్కార్యములు వ్యర్థములనియే చెప్పబడినది - 'భగవంతుడు ఇచ్ఛించకయు ఆజ్ఞాపించకయు చేసిన పనులగుటచే అవి పాపకార్యములే అనుటకు సందేహము లేదు.)
(కార్పస్ జ్యూరీస్, పుట 14.)

ఇంక ఖుర్ఆన్ బోధించిన మతము చూడుడు. క్రైస్తవులలోను, యూదులలోను, ఇతరులయందునుగల సత్ప్రవర్తనలను ఖుర్ఆన్ పొగడుచున్నది. సత్ప్రవర్తనులైన వారిని భగవంతుడు ప్రేమించుననుచున్నది. భగవంతుని ప్రేమకు పాత్రులగుటకంటె మరి కావలసినదేమున్నది? ఈవిధముగ ఇస్లామ్ ఒక విశ్వవిశాలమగు భావమును ప్రకటించుచున్నది.

*　　*　　*　　8

83. ఒక్కొక్కరితో ఒక్కొక్క విధమగు ప్రవర్తనము క్రైస్తవులయందును, యూదులయందును, ఆర్యమతములందునుగూడ కానవగును. క్రైస్తవుడు కాని వారెంతటి సత్ప్రవర్తనులైనను అది సత్ప్రవర్తనముగ భావింపరాదని క్రైస్తవాచార్యులేవిధముగ ననిరో వెనుకటి నోటులో చూపితిని.

యూదుల ధర్మగ్రంథములను చూడుడు. అవి వడ్డీనితీసుకొనుటను నిషేధించుచున్నవి. కాని "Unto a stranger thou mayest lend upon usury, but unto thy brother thou shalt not lend upon usury" (Deut. 23-70) అని బైబిల్ యూదుడుకాని వానికడ వడ్డీ తీసుకొనుట పాపము కాదనుచున్నది. అట్లే ఆర్య ధర్మగ్రంథములు బ్రాహ్మణునికడ తక్కువ వడ్డీయు, బ్రాహ్మణేతరులకడ ఎక్కువవడ్డీయు తీసుకొనుట న్యాయమని చెప్పుచున్నవి. అట్లే బ్రాహ్మణులకు ఏది విధివిహితమో అది శూద్రాదులకు నిషేధ మొనర్చినవి. ఖుర్ఆన్ ఇట్టి భేదభావమును ఖండించుచున్నది. "విశ్వాసహీనులతో వ్యవహరించునప్పుడు ధర్మయుతముగ ప్రవర్తించుట మాకు విధివిహితము కాదు" అని క్రైస్తవులును యూదులును అందురని చెప్పుచు ఖుర్ఆన్ దీనిని అబద్ధమని ఖండించుచున్నది. అది 'భగవంతునియెడ అపవాదమ'నుచున్నది.

ఇట్లు భేదభావమును చూపుడని భగవంతు డనునా? వ్యవహారముచేయునప్పుడు ఎవరితోనైనను సరే వారితో ధర్మయుతముగ ప్రవర్తించవలెను. అదే భగవద్ధర్మము అని ఖుర్ఆన్ హెచ్చరించుచున్నది.

*　　*　　*　　*

౨౪. మాట ఇచ్చి దానిని పాలించుటకు ఖుర్ ఆన్ ఎంత ప్రాముఖ్యత నిచ్చు చున్నదో చూడుడు. వాగ్భంగ మొనర్చినవారిని దయాదృష్టితో చూడనని భగవం తుడు చెప్పుచున్నాడు. వారి పాపములను ఇతరుల పాపములనువలె తుదకు క్షమించ ననుచున్నాడు.

* * * *

౨౫. యూదులగ్రంథమగు బైబిల్ పాతనిబంధనమందును, క్రైస్తవులు పవిత్ర గ్రంథముగ భావించుచున్న బైబిల్ క్రొత్త నిబంధనమందును ఆ యా మతముల పండితులు చేసిన మార్పులు, వారు ఆ యా గ్రంథములను తారుమారొనర్చిన విధ మును గూర్చి 61వ నోటు (249 - 258 పుటలు) లో సంక్షిప్తముగ చర్చింపబడినది. అదే విషయమును ఇక్కడ మరొకసారి ఖుర్ ఆన్ స్పష్టముగ చెప్పుచున్నది.

క్రైస్తవ పండితులు తమ ఇచ్ఛవచ్చినట్లు ఏసుక్రీస్తు బోధనలను మార్చి వేసిరని ఖుర్ ఆన్ చెప్పు మాటలు ఎంత సత్యమైనవో నేటి క్రైస్తవపండితుల వ్రాతలవల్లనే తెలియగలదు. ఉదాహరణమునకు బెంజమిన్ బేకన్ గారి ఈ క్రింది వాక్యములను చూడుడు

"Mercion's 'Gospel' consisted of our Luke, expurgated according to his own ideas. His 'Apostle' contained the Epistles of Paul minus the pastoral Epistles and a series of passages cancelled out from the rest as Jewish interpolations. This was the first Christian Bible distinct from the 'Scriptures' of the synagogue." (P. 23.)

(మార్కియోన్ ప్రచురించిన 'సువార్త'లో ఇప్పటి మన లూక్ సువార్త యుండెను. అది అతని భావముల ననుసరించి మార్చివేయబడినది. అతని 'అపోస్త లుల'లో పాల్ యొక్క ఎపిజిల్సు ఉండెను. తక్కినవాటినుండి అనేక వాక్యములు యూదులు చేసిన ప్రక్షిప్తములని తీసివేయబడెను. ఇదే మొదటి క్రైస్తవ బైబిల్.)

"Clement attaches to his own epistle, written in behalf of the Church at Rome, the same superhuman authority claimed in Acts XV 28 for the letter sent by the Church at Jerusalem" (P. 20)

(తాను రోము చర్చి పక్షమున వ్రాసిన ఎపిజిల్ భగవత్ప్రేరితమని క్లెమెంటు చెప్పెను.)

"His message, Ignatius declares with emphasis, was revealed to him, together with the occasion for it, directly from heaven

It was 'the voice of God and not only of a man' when he cried out among the Philadelphians." (P, 21.)

(తన సందేశము భగవంతుని కడనుండి తిన్నగా వచ్చినదే నని ఇగ్నేషియస్ నొక్కి చెప్పెను. తాను ఫిలడల్ఫియన్సును పిల్చినప్పుడు వినిపించిన ధ్వని కేవలము మనుష్యునిదే కాదనియు భగవంతునిదికూడననియు అతడు చెప్పెను.

"Hermas, a 'Prophet' of the same Roman Church as clement, though a generation later, is still so conscious of the superhuman character of his 'Visions', 'Parables', and 'Mandates' that he gives them out for circulation as inspired messages of the spirit, and this not for Rome alone"

(క్లెమెంటు తరువాతి తరమువాడగు హెర్మాస్ రోమన్ చర్చియొక్క 'ప్రవక్త'. అతడు తాను భగవదాదేశమును పొందినవాడనని చెప్పుకొనుచు తన సందేశములను భగవత్సందేశములుగ రోమునందేకాక బయటకూడ ప్రచురించు చుండెను.)

"None of the early canons (i. e. list of writings permitted to be read in churches) coincides exactly, it is true, with the New Testament current among ourselves" (P. 30)

(చర్చిలలో చదువుటకు అనుజ్ఞబడసిన తొలి పవిత్ర గ్రంథములలో ఏదియు ఇప్పుడు మనలో ప్రచారమునందున్న క్రొత్త నిబంధనమునకు సరిపోదు.)

"The lists of Origen (A D 251) and Eusabius (A. D. 325) vary as respects both exclusion and inclusion. All early authorities express a doubtful judgment regarding the outer fringe of minor writings such as James, Jude, 2nd Peter, 2nd and 3rd John. Even those of larger content, such as Hebrews and Revelations, remained subject of dispute .. ..(A party) under the lead of Gaius had denied the authenticity of all the writings attributed to John, including the Gospel itself." (P. 31)

(క్రీ. శ. 251 లో ఆరిజెన్ ఇచ్చిన పవిత్ర గ్రంథముల పట్టికకు క్రీ. శ. 325 లో యుసేబియస్ ఇచ్చిన పట్టికకును ఎంతో భేదము కలదు. ఇందున్నవి అందు లేవు. అందున్నవి ఇందు లేవు. జేమ్స్, జూడ్, 2వ పీటరు, 2వ 3వ జాన్ మున్నగు చిల్లర గ్రంథముల విషయమునను, హెబ్రూస్, రెవలేషన్స్ మున్నగు పెద్ద గ్రంథముల విషయమునను కూడ వివాదముండెను. గేయస్ నాయకత్వము

క్రింద ఒక పార్టీవారు జాక్ చే వ్రాయబడినవని చలామణిలో ఉన్నట్టి గ్రంథములను, జాక్ సువార్తను సైతము ప్రక్షిప్తమని నిరాకరించెను.)

"The Gospel of Mark is no exception to the rule that church-writings of this type inevitably undergo recasting and supplementation until the advancing process of canonization at last fixes their text with unalterable rigidity." (P. 170)

(ఈవిధమైన చర్చివ్రాతలు మారుచుండుటయు, హెచ్చింపబడుచుండుటయు తప్పనిసరిగా జరుగును. మార్కు సువార్తకూడ అట్లే మార్పులు పొందినది. క్రమ క్రమముగ ఇది ఘనీభవించి మార్పుచెందని గ్రంథమాయెను.)

ఈ విధముగ ఎన్నెని వాక్యము లుదహరించవచ్చును. ఈ చివరి వాక్యము ఖుర్ఆన్‌సూక్తమును సంపూర్ణముగ నిరూపించుచున్నది. సువార్తలు మొదలైవన్నియు చర్చివ్రాతలనియు, ఇవి తప్పనిసరిగ అనేకసార్లు మార్పుచెందుచుండుననియు, హెచ్చుతగ్గులందులో జరుగుట సహజమనియు ఇప్పుడు క్రైస్తవపండితులొప్పుకొనినారు. పై వాక్యము లన్నియు Benjamen W. Bacon D. D చే రచింపబడిన The making of the New Testament నుండి ఉదహరింపబడినవి. బేకన్ యేల్ విశ్వవిద్యాలయములో ప్రొఫెసర్ ఆఫ్ న్యూటెస్ట్‌మెంట్ క్రిటిసిజమ్ గా ఉన్నాడు. పై అభిప్రాయములన్నియు ఈ విధముగ క్రైస్తవ పండితులవి. క్రైస్తవమతే మసత్యమని నమ్ము స్ట్రౌఉస్, రినాన్ మున్నగు పాశ్చాత్య భావుకుల అభిప్రాయములు ఇంకను తీవ్రముగ నుండును. వాని నుదహరించుట భావ్యముకాదని క్రైస్తవపండితులనే ఇట ఉదహరించితిని.

* * * *

౭౬. ఖుర్ఆన్ క్రూరుడగు భగవంతుని ప్రతిపాదించెనని క్రైస్తవ మిషనరీలు అబద్ధ ప్రచారమును చేయుచున్నారు. 1928 లో జరిగిన జెరూసెలం అంతర్జాతీయ క్రైస్తవ మిషనరీ కౌన్సిలు సమావేశములో మాట్లాడుచు కానన్ గైర్డ్నర్ ఇస్లామ్‌లో పశ్చాత్తాపమునకునుపాపపరిహారమునకును స్థానమేలేదని ఉపన్యసించినాడు.* 89వ సూక్తమున ఖుర్ఆన్ వాక్యము లీ అబద్ధమును ఎంత స్పష్టముగ ఖండించుచున్నవో చూడుడు. ఎంతటి మహాపాతక మొనర్చియు మానవుడు నిజముగా పశ్చాత్తాపపడి, తన దోషమును సవరించుకొనుచో వానిని భగవంతుడు క్షమించును. ఎందుకన భగవంతుడు కరుణానిధి అని ఖుర్ఆన్ వ్రాయుచ్చినది. ఖుర్ఆన్‌లో భగ

* Report of the Jerusalem Meeting, Vol. 1, P. 238.

వంతుడు కరుణానిధి యనియు మహాక్షమి యనియు వందలకొలది సూక్తములలో కలదు. కాని ఖుర్ ఆన్ వాక్యములలో వీరు "తెలిసియుండియు భగవంతునిపై అబద్ధములు చెప్పు"వారు. ఇట్టి అబద్ధప్రచారము చేయుట పుణ్యకార్యమని వీరు భ్రమించుచున్నారేమో!

* * * *

---

# నాల్గవ భాగము

## వ్యా ఖ్యా న ము

౩౩. 113, 114, 115 సూక్తములలో వెనుక 72వ నోటులో చర్చించిన విశ్వవిశాలభావము మరింత స్పష్టముగ ప్రవచింపబడినది. మతములో ఇస్లామ్ జూపిన ఇట్టి విశ్వవిశాలభావము మానవచరిత్రలో ముందెన్నడును చూపబడలేదు. అందుచేతనే మత పరిణామచరిత్రలో ఖుర్ఆన్ ప్రతిపాదించిన మతము తుదిమెట్టని ఖుర్ఆనే చెప్పుచున్నది. "నేడు మీ మతమును సర్వవిధముల సంపూర్ణమొనర్చితి" నని ఖుర్ఆన్ మానవప్రపంచమును సంబోధించి ఘోషించుచున్నది.

౩౪. 118 మొదలు 120 వ సూక్తాంతము వరకు అవిశ్వాసులతోడను వంచకులతోడను ఎట్టి సంబంధములు కలిగియుండవలెనో వివరింపబడినది. అవిశ్వాసులు రెండు రకములు 1. అవిశ్వాసులైయుండి విశ్వాసవంతులతో ప్రత్యేక ద్వేషము లేక స్నేహభావముతో మెలగువారు, 2. విశ్వాసవంతులతో ద్వేషమును బూని వారిని, వారి మతమును నశింపజేయ గోరువారు.

ఖుర్ఆన్ మొదటిరకము విశ్వాసవంతులతో స్నేహభావమున మెలగవలసిన దనియే విశ్వాసవంతుల నాదేశించుచున్నది. (ఖుర్ఆన్ 60 8, 9) రెండవ రకము అవిశ్వాసులతో "ఎక్కువ గాఢమైత్రి సలుపకుడు." అని విశ్వాసవంతులను ప్రబోధించుచు దానికి కారణములు వివరించుచున్నది .

1. అవిశ్వాసవంతులు "మిమ్ములను చెడగొట్టుట కెంతమాత్రము వెనుదీయరు,"
2. వారు "మీ వినాశమునే కోరుదురు,"
3. వారు బహిరంగముగను రహస్యముగను మిమ్ములను ద్వేషింతురు,
4. మీరు వారి నెంత ప్రేమించినను వారు మిమ్ములను ప్రేమింపరు,
5. మీ శ్రేయశ్శుభములు వారికి కన్నుకుట్టుగా నుండును.

మరి ఖుర్ఆన్ ఇట్టి బద్ధశత్రువులగు వీరితో ఎట్లు ప్రవర్తించు మనుచున్నది?

"ఓర్పు వహించి సత్ప్రవర్తకులై యుండుడు." అనుచున్నది.

అట్లున్నచో "వారి కుతంత్రములు మిమ్ములను రవ్వంతయు బాధింపవు" అనుచున్నది.

తా మోర్పువహించి సత్ప్రవర్తకులై యుండుటయా బద్ధశత్రువులగు వారి కుట్రలకు జవాబు !

వారి చెడుగునకు జవాబు చెడుగు కాదు. వారి దుష్ప్రవర్తనమునకు మన సత్ప్రవర్తనము జవాబు.

౭౯. 13 వ ఖండము నందును తరువాతి ఖండములందును శ్రీ మొహమ్మద్ ప్రవక్త అవిశ్వాసులతో తప్పనిసరిగ పోరాడవలసివచ్చిన యుద్ధముల ప్రశంస కలదు. మక్కావాసులగు ఖురైషులు శ్రీ ప్రవక్తను, ఆయన శిష్యులను నానా విధముల హింసించిరి. తుదకు ముసల్మానులకు మక్కాలో జీవితము దుర్భరమాయెను. శ్రీ ప్రవక్త తమ మతమును బోధించసాగిన మూడేండ్ల కాలములో దాదాపు ఏబది మంది మాత్రము ముసల్మానులైరి. మక్కావాసుల దుర్భర బాధలను సహించలేక వీరిలో 16 గురు అబిసీనియా దేశమునకు వలసపోయిరి ఈ పరిస్థితులలో కూడ ముసల్మానుల సంఖ్య దినదిన ప్రవర్ధమాన మగుచుండెను అబిసీనియాకు పారిపోయిన ముసల్మానులకు నజాషీచక్రవర్తి ఆశ్రయమిచ్చుటయేకాక వారి నెంతో గౌరవించెనని అక్కడినుండి వార్తలు రాసాగెను. ముసల్మానుల మరొక నూర్గుర జట్టు మక్కా విడిచి అబిసీనియాకు వలసపోయెను అబిసీనియాలో పల్వురు క్రైస్తవులు ఇస్లామును స్వీకరించిరి. అబిసీనియా చక్రవర్తియగు నజాషీ ఆస్థానములో ముసల్మానుల పలుకుబడి హెచ్చసాగెను. ఖురైషుల కిది కన్నుకుట్టుగా నుండెను. వారు నజాషీ చక్రవర్తికడకు రాయబారముల నంపిరి. నజాషీ ముసల్మానులను పంపివేయ నిరాకరించెను. ఖురైషుల ఆగ్రహజ్వాలలు మరింత ప్రజ్వరిల్లెను వారు ముసల్మానులను వెలివేసిరి. ప్రవక్త మతబోధ ప్రారంభించిన 7వ సంవత్సరమున ప్రారంభమైన సంఘబహిష్కారము మూడేండ్లవరకు సాగెను ఈ కాలమున ముసల్మానులు సహించిన హింసలకు మేరయేలేదు. వారు మక్కాపట్టణమునకు బైట 'షా అబె అబూతాలిబ్' అను కొండకొమ్ముపై యుండవలసివచ్చెను. ఇది ముసల్మానులకు ఖైదువలె నుండెను. మూడేండ్లతర్వాత ఖురైషు తెగ నాయకులలో కొందరు ముసల్మానుల బాధలను చూడలేక వారిని కారాగారమునుండి విడిపించిరి. ఇస్లామ్‌మత వ్యాప్తి సాగుచునే యుండెను. పదవయేట మదీనానగరవాసులు యాత్రార్థమై మక్కాకు వచ్చి ప్రవక్తను దర్శించిరి. వారిలో ఆరేడుగురు వెంటనే ముసల్మానులై మదీనాకు మరలిరి. మరుసటి సంవత్సరము మరి పండ్రెండుగురు మదీనావాసులు ప్రవక్తను దర్శింప మక్కాకు వచ్చి ముసల్మానులైరి. తరువాతి సంవత్సరము 70 మంది ఇస్లామును స్వీకరింపవచ్చిరి. దానిలో ఇస్లామ్ సందేశము మదీనాలో ఇంటింట వ్యాపింపసాగెను. మక్కావాసులగు ముసల్మానులుకూడ మదీనాకు తమ కుటుంబములతో వెళ్ళిపోసాగిరి. పల్వురు ముసల్మానులు తప్పనిసరిగ మక్కాలోనే ఉండిపోవలసివచ్చెను. ముసల్మానులు పడిన బాధలు ఖుర్‌ఆన్‌లో

పెక్కుచోట్ల సూచింపబడినవి. (16 43, 44, 2 215, 3 194, 22.57; 4 97, 99 - 100 60, 8 - 9)

శ్రీ ప్రవక్త కాబాయొక్క పురోహితుల వంశమునకు చెందినవారు. ఖురైషులు శ్రీ ప్రవక్తను సైతము గౌరవింపరైరి. ప్రవక్త నానావిధములగు అవమానములకును హింసలకును గురికావలసివచ్చెను. ప్రవక్త పినతండ్రియగు అబూతాలిబ్ బ్రతికి యున్నంతకాలము వారి ప్రాణమునకు భంగము లేకపోయెను. అబూతాలిబ్ మరణానంతరము ప్రవక్తను చంపుటకు ఖురైషులు పూనుకొని కుట్రలు పన్నసాగిరి. తుదకొకనాడు రాత్రి ప్రవక్తను వధించుటకు ఖురైషులు నిశ్చయించిరి. ప్రవక్త కిది తెలిసి ఆ రాత్రి అబూబకర్ అను ఒక శిష్యునితో రహస్యముగ మక్కానగరమును విడిచి మదీనాకు పయనమైరి.

ప్రవక్తయు, ముసల్మానులును తమ పట్టణమును విడిచి, ఇండ్లు వాకిళ్లు విడిచి దేశాంతరములకు పలాయితులై పోయినను ఖురైషులు వారిని విడిచిపెట్టరైరి. ప్రవక్త మదీనాకు వెళ్లిపోయిన సంవత్సరముననే మదీనావాసుల పశువుల నన్నిటిని ఒక మైదానములో మేయుచుండగా ఖురైషులు తోలుకొనిపోయిరి. ఐనను మదీనావాసులు కత్తి కట్టరైరి. తుట్టతుదకు వారికి కత్తి కట్టక తప్పినది కాదు. మక్కావాసులు దాదాపు వెయ్యిమంది సైన్యముతో మదీనాపై దండువెడలిరి. వారికడ 700 ఒంటెలు, 100 గుఱ్ఱములు ఉండెను. శ్రీ ప్రవక్త తొందరగా 305 గురు ముసల్మానులను ఒక చిన్న సైన్యముగ సమకూర్చుకొని మక్కా సైన్యము నెదుర్కొనుటకు సిద్ధపడవలసివచ్చెను మదీనా పట్టణము ప్రవక్త కాతిథ్యమిచ్చెను. ఇప్పుడు ప్రవక్త మూలమున ఆ పట్టణమునకు విపత్తు సంభవింపనుండెను. అందుచే ఆ పట్టణమును సంరక్షించు భారము ముసల్మానులపై పడెను. ముసల్మాను సైన్యములో పల్వు రింకను బాలురు. ముసల్మానులకడ కేవలము 2 గుఱ్ఱము లుండెను. ఖురైషీసైనికు లాపాదమస్తకము కవచములను ధరించియుండిరి. ముసల్మానులకు ఆయుధములైనను సరిగ లేకుండెను. ఐనను ఒక పక్షమున ధర్మము, మరొక పక్షమున అధర్మము పోరాడుచుండెను. ధర్మమునకు అధర్మమునకును మధ్య పోరాటములో ధర్మమునకు కాక అధర్మమునకు విజయము ప్రాప్తమగునా? బదర్ యుద్ధమున ముసల్మానులకు గొప్ప విజయము కలిగెను. ఖురైషులలో 70 గురు ప్రముఖులు మరణించిరి. ముసల్మానులలో కేవలము 14 గురు మాత్రము భగవన్మార్గమున మరణించిరి.

ఈ యుద్ధమునందు కల్గిన పరాజయము ఖురైషుల పగను మరింత హెచ్చించెను. పగతీర్చుకొనుటకై ఈసారి ఖురైషులు ఒక గొప్ప సైన్యమును తయారు

చేయసాగిరి. ఈసారి సైన్యములో స్త్రీలు సైతము ప్రవేశించిరి. గత యుద్ధములో మరణించిన యోధుల బంధుగురాండ్రీ స్త్రీలు మూడు వేలకు పైగా ఖురైషుల సైన్యము - సుమారు 700 మంది ముసల్మానులు. ఒహొద్ అను ఒక కొండక్రింద యుద్ధముజరిగెను. ఖురైషు స్త్రీలు ఈక్రింది అర్థముగల పాటను పాడుచు సైనికులను ప్రోత్సహించుచుండిరి :

"మే మాకసమందు వెలుగుచున్న తారకా పుత్రికలము
మేము మెత్తని తివాసీలపై అడుగిడువారము
మీరు శౌర్యముతో యుద్ధమొనర్చినచో మిమ్ముల నాలింగనమొనర్తుము
మీరు వెనుజూపిరా మిమ్ములను దగ్గరకు రానీయము."

శ్రీ ప్రవక్త సైనికుల వీపులు కొండవైపున నుండెను. కొండవైపునుండి శత్రువు పోటుచేయు భయముండెను. అందుచే ప్రవక్త కొండవైపు ఏబదిమంది విలుకాండ్ర నుంచిరి. యుద్ధమున గెలుపైనను సరే ఆ స్థలమునుండి కాలు కదప వద్దని ప్రవక్త ఆజ్ఞాపించిరి. యుద్ధము ప్రారంభమాయెను. యుద్ధము ముసల్మాను లకే అనుకూలముగ నుండెను. శత్రుసైన్యములు చెల్లాచెదరాయెను. ఇంతలో ముసల్మానులు శత్రువుల ఆహారసామగ్రిని దోచుకొనసాగిరి. ఇది చూచి కొండపై నియమితులైన విలుకాండ్రును దోపిడి కొరగిరి. వారి నాయకుడగు అబ్దుల్లా బిన్‌జుబైర్ వారి నెంతయు వారించెను. వారు వినరైరి. ఖురైష్ నాయకుడగు ఖాలిద్ విలుకాండ్రు చెల్లాచెదరగుటను చూచి వెనుకనుండి పోటుసల్పెను. శ్రీ ప్రవక్తను శత్రువులు చుట్టుముట్టిరి. బాణముల వర్షము కురియుచుండెను. కత్తుల ఝణత్కారము నలువైపుల చుట్టుకొనెను. శ్రీ ప్రవక్త అట్లు చుట్టుకొనబడినను ఆయననోట,

"ప్రభూ! నా యీ జాతిని క్షమింపుము.
వారు చేయుచున్నదానిని వారెఱుగరు."

అను మాటలు వెడలుచుండెను. శ్రీ ప్రవక్త కొండశిఖరముపై నెక్కిరి. శత్రువులు వెన్నాడజాలకపోయిరి. ఈ యుద్ధమున మొత్తముపై ముసల్మానులకే అపజయము కల్గెను. ఇది హిజిరీ 3 వ సంవత్సరములో జరిగెను. ఈ యుద్ధవృత్తాంతమే ఈ అధ్యాయమున వివరింపబడెను.

రెండేండ్ల తర్వాత ఖురైషులు తిరిగి మదీనాపై దండువెడలి వచ్చిరి. ఈసారి పదివేల సైన్యముతో వచ్చి మదీనా పట్టణమునకు ముట్టడివేసిరి. శ్రీ ప్రవక్త ఒక కందకము త్రవ్వి మదీనా సైన్యముల నందు నిల్పిరి. ఖురైషు సైన్యములు పెక్కు

మార్లు మదీనా సైన్యములపై పోటుసల్పెను కాని ప్రయత్నములన్నియు విఫల మయ్యెను. ఇంతలో వాతావరణపరిస్థితులు మక్కా సైన్యములకు అననుకూలముగ నుండెను. మక్కా సైన్యములు ముట్టడిని మానుకొని వెనుకకు మరలెను. దీనినే కందకయుద్ధమందురు.

శ్రీ ప్రవక్త స్వసంరక్షణార్థము కావించిన మూడు యుద్ధముల వృత్తాంతమును క్లుప్తముగ ఇక్కడ వివరించుటకు కారణము కలదు. ప్రవక్త చేసిన ఈ యుద్ధములు మతసంస్థాపనమునకను ఒక అపోహ కలదు. ఈ అపోహ యెక్కువగా క్రైస్తవ మిషనరీలు వ్యాపింపజేసినది. ఏసుక్రీస్తు ఒక చెంపపై కొట్టిన రెండవచెంప ఇవ్వవలె నని బోధించెననియు, శ్రీ మొహమ్మద్ ప్రవక్త అట్లుకాక యుద్ధము లొనర్చె ననియు క్రైస్తవ మిషనరీల ప్రచారము. ఏసుక్రీస్తుకూడ ఒక ప్రవక్తయేయని ఖుర్ ఆన్ బోధించుచున్నది. అంతేకాదు ప్రవక్తలలో భేదభావమును చూపవలదని ఆజ్ఞా పించుచున్నది. అందుచే మేమిక్కడ ఏసుక్రీస్తు బోధనలను విమర్శించుటలేదు. క్రైస్తవ చర్చి ఏసుక్రీస్తుపేర ప్రకటించిన ఈ సూత్రమును మాత్రమే యించుక విమ ర్శించవలసియున్నది.

ఇస్లామ్ ఒకసంపూర్ణమతమని ఖుర్ ఆన్ అనుచున్నది. అంతేకాదు. ఖుర్ ఆన్ ఒక కవియొక్క భావగీతి కాదు. మానవజీవితమందలి సర్వాంశములను శాసించు ఒక సంపూర్ణశాసనము అన్ని పరిస్థితులయందును, అన్ని కాలములయం దును, అన్ని దేశములందును, సమస్త నాగరకతావస్థలయందును అమలులో పెట్టగల ఒక సంపూర్ణ శాసనము ఖుర్ ఆన్. అట్టి శాసనము మానవప్రకృతికి అనుగుణముగ నుండవలెను. ఆచరణసాధ్యమై యుండవలెను. మానవచరిత్రతో దానికి సంబంధ ముండవలెను. అప్పుడే అదొక సంపూర్ణధర్మమై యుండగలదు.

ఆదర్శమునకును ఆచరణమునకును గల భేదమును గమనించకుండుట వలన కలిగిన చిక్కిది. సంపూర్ణమగు అహింస ఒక గొప్ప ఆదర్శమే. కాని అది ఆచరణ సాధ్యమా? అట్లే ఏసుక్రీస్తుయు, ఆధునికయుగములో టాల్స్టాయియు గాంధీమహా త్ముడును బోధించిన సత్యాగ్రహము ఆదర్శముగ గొప్పదేగాని ఆచరణ సాధ్యమా? తా నొక్కడే సత్యాగ్రహి నని గాంధీజీ ఒప్పుకొనలేదా?

ఖుర్ ఆన్ మానవాదర్శములను బోధించుచు ఆచరణ మార్గమునుకూడ చూపి నది. "నీ చెంపపై ఎవరైన ఒక దెబ్బకొట్టినచో నీవుకూడ వాని చెంపపై ఒక దెబ్బ కొట్టవచ్చును. కాని వానిని క్షమించుట నీకొఱకు ఉత్తమమైనది." ఇస్లామ్ కావించిన బోధ ఇది. నీ వొకరి చెంపపై కొట్టరాదు. కాని ఇతరు డెవ్వడైన నీ చెంపపై కొట్టినా నీవుకూడ అతని చెంపపై కొట్టవచ్చును. ఐతే ఒక దెబ్బ తిని

రెండు దెబ్బలు కొట్టరాదు. ఒకే దెబ్బ కొట్టవలెను. అది న్యాయము. ఇదియు కేవలము అనుజ్ఞమాత్రము, ఆజ్ఞ కాదు అంతకంటె ఉత్తమ మార్గము క్షమించుట, అపకారిని క్షమించుట ఆదర్శము. ఒహొుద్ యుద్ధరంగమున శత్రువులు ప్రవక్తపై విరిగి పడినప్పుడు ప్రవక్త ఏమి చెప్పుచుండెనో మరొకసారి వినుడు "ప్రభూ! నా యీ జాతిని క్షమింపుము. వా రేమిచేయుచున్నారో వారికి తెలియదు" ఇది ఆదర్శము ప్రవక్తకు వారిపై ద్వేషము లేదు, వారిపై ఆగ్రహము లేదు, వారి అజ్ఞానమునకు జాలి, కరుణ మాత్రమే ఆయన హృదయమును కలచు చుండెను. ఇస్లామ్ ధర్మరహస్య మిదే.

క్రైస్తవ నీతినిగూర్చి నేను చెప్పుటకంటె ఆధునిక నీతిశాస్త్రజ్ఞులలో మేటి యగు **L. T. Hobhouse** ఏమి చెప్పుచున్నాడో చూడుడు

"In Buddhism and Christianity the spiritual order formed for itself a new sphere detached from the more elementary morals of the ordinary good citizens. In this detachment, however, were seeds of trouble We have already seen that the Buddhist life could hardly be lived in its perfection by the ordinary householder The spritual and the human had already fallen apart In Christianity the fissure is in some respects deeper." క్రైస్తవమతములో ప్రకృతి పాపభూయిష్టము. అందుచే ఈ ప్రపంచమంతయు పాపపంకిలము. "The great institutions of humanity, marriage, fatherhood, citizenship, are things of this world. The Christian must make his account with them, but they are not 'of Christian origin. . .... ..Christ's true kingdom is not of this world . .... ... The detachment of what was best in Christianity from the world's affairs made a Christian body unfit to rule the world's affairs" ఇస్లామ్ ప్రపంచవిశాలమగు మానవ సంఘమునకు కావలసిన ఒక శాసనమును ఇచ్చుచున్నది. కాని "Christianity has, in fact, no theory of society by which to guide itself. Its doctrine is personal The common life that it contemplates is a life of brotherly love, a community of saints, where all things are in common and lawsuits are not, nor any other mode of maintaining order by the strong arm. *Hence, amid all the wonderful descriptions of charity, of life, of self surrender, we hear very little of justice,*

"The code of the Sermon on the mount appears to contemplate what in modern phrase we should call a voluntaryist or Anarchist community. Non resistance is its central feature.

There is to be no fighting, no revenge, . .. . no self-defence, no insistence on private property, no excessive provision for the future If there is to be any marrying or giving in marriage, there is to be no divorcing of wives 'save for the cause of fornication' Altogether a life that might be lived *for a while* by a *Picked body of perfect men and women* How were these rules to be made applicable to a word in which men and women are so far from perfect ? "

ఈ సిద్ధాంతమును యుద్ధవిషయమున అమలులోపెట్టుటనుగూర్చి వ్రాయుచు హాబ్‌హౌస్ "On this side also the maintenance of the pure teaching of the Gospel has been left to small and isolated sects . The doctrine of non-resistance was frankly abandoned by the majority of the churches . It is accepted in the canons as a part of the divine law, but as abrogated by the positive law of the empire The pure teaching of the Gospel was left to a few condemned sectaries to preserve, and was put aside by respectability as being merely that which 'certain Anabaptists do falsely boast'.

ప్రకృతికి అతీతమైన క్రైస్తవనీతిని ఖండించుచు Hobhouseఇట్లనుచున్నాడు "Supernatural ethics fail in that they do not recognise *the ideal element in the performance of natural duty* "‡

ఇంక ఖుర్‌ఆన్ యుద్ధమున కెట్టి పరిస్థితులలో అనుజ్ఞ ఇచ్చినదో చూడుడు

"ఏ ముసల్మానులతో (కాఫరులు) యుద్ధము చేయుచున్నారో, ఇప్పుడు వారికికూడ యుద్ధముచేయు అనుజ్ఞ ఇవ్వబడుచున్నది. ఎందుకనగా వారిపై దౌర్జన్యము చేయబడినది. నిస్సందేహముగ భగవంతుడు వారికి సాయపడును." (22 39)

" అల్లాః మా ప్రభువు అన్నంతమాత్రమున వారు అన్యాయముగ తమ ఇండ్లనుండి వెడలగొట్టబడిరి. భగవంతుడు ఒకరి నింకొకరిద్వారా రక్షించి యుండక పోయినచో భగవన్నామస్మరణము ఎక్కువగా చేయబడు (క్రైస్తవుల) మఠములును, చర్చిలును-(యూదుల) ప్రార్థనాలయములును, (ముసల్మానుల) మస్జిదులును నిస్సంశయముగ విధ్వంసమొనర్పబడియేయుండును. ఎవరు భగవంతునకు తోడ్పడుదురో, వారికి భగవంతుడు తోడ్పడును. నిస్సందేహముగ భగవంతుడు సర్వబలసంపన్నుడు, సర్వశక్తిమంతుడు. (22 : 49)

‡ L. T. Hobhouse, Morals in Evolution', Vol. ii, PP. 150–159.

"మీతో యుద్ధముచేయుచున్నవారితో మీరుకూడ భగవన్మార్గమున యుద్ధము చేయుడు. కాని మితిమీరకుడు. హద్దుల నతిక్రమించినవారిని భగవంతుడు ప్రేమింపడు." (2 190)

"(రక్తపాతము మంచిది కాకపోయినను) దౌర్జన్యము స్థిరపడుట (తాత్కాలికముగు) రక్తపాతముకంటె చెడ్డది." (2 : 191)

"ఒకసారి వారు యుద్ధమును మానుకొనినచో భగవంతుడు క్షమించువాడు, కృపానిధి." (2 192)

"వారి దౌర్జన్యమణగువరకు వారితో యుద్ధము చేయుడు. మతము భగవంతునకు సంబంధించినది. ఒకసారి వారు యుద్ధము మానుకొనినచో మీరుకూడ యుద్ధమును మానుకొనుడు దౌర్జన్యముచేయువారితోడనే పోరాడవలెను." (2 193)

" . . . అన్యాయముగ కయ్యమునకు కాలుద్రవ్వి మీకెవరైనను హింస యొనర్చుచో దానికి సమానమైన హింసను మీరును చేయుడు ,భగవంతునకు (మాత్రమే) భయపడుడు. ధర్మపరులకు భగవంతుడు తోడుండునన్నమాట మరువకుడు. (2 194)

" . . . . మానవుని భగవన్మార్గమున నిరోధించుట, కాబాలోనికి వెళ్ళకుండ నడ్డుపడుట, మక్కావాసులను వారి నివాసమునుండి వెడలగొట్టుట—ఇవి భగవంతుని దృష్టిలో అంతకంటెను చెడ్డవి. విద్వేషములను రగుల్కొల్పుటయు, కష్టపెట్టుటయు సంహారముకంటెను దుష్టమైన పనులు. (2 217)

"(ఓ విశ్వాసవంతులారా !) నిస్సహాయులగు ఇంతమంది పురుషులు, స్త్రీలు, పిల్లలు (దుర్మార్గుల హింసలకు తాళలేక) 'ప్రభూ ! మమ్ములను ఇంతగా బాధపెట్టుచున్న హింసలకు వీరి పట్టణమునుండి మాకు ముక్తినిమ్ము. నీవు మాకొఱకు ఒక పోషకుని, ఒక సహాయ్యుని ప్రసాదింపుము.' అని మొఱపెట్టుకొనుచుండగా (వారిని రక్షించుటకు) మీరు భగవన్మార్గమున యుద్ధము చేయుటకు వెనుదీయుచున్నారా ?" (4 . 75)

"తమ వాగ్దానములను భంగమొనర్చి, ప్రవక్తను వెడలగొట్ట నిశ్చయించి, మీతో (యుద్ధమును) వారే ప్రారంభించినప్పుడు వారితో మీరేల యుద్ధము చేయకూడదు ? మీరు వారికి భయపడుచున్నారా ఏమి ? మీరు విశ్వాసవంతులేయైనచో భగవంతునకే భయపడుడు." (9 13)

ఈ విధముగ స్వసంరక్షణార్థము యుద్ధముచేయుటకు ఖుర్ఆన్ అనుమతి నిచ్చుచున్నది. ప్రపంచమునందలి సర్వధర్మములును దీని కనుమతించుచున్నవి.

అహింసావాదులగు ఆర్యఋషులుకూడ స్వసంరక్షణార్థమును, దుష్టశిక్షణార్థమును కత్తికట్టుట ధర్మమనియే శాసించిరి. మనువు "దండం ధర్మం విదుర్బుధాః" అని దండమే ధర్మహేతువనియు, కనుక అది ధర్మమని పెద్దలు చెప్పిరనియు చెప్పు చున్నాడు. దండమే నిషేధమను సిద్ధాంతమును ఆర్యఋషు లెచ్చటను చెప్పలేదు. కాని దండమును ప్రయోగించు రాజు సత్యవాదియు, ప్రాజ్ఞుడును, ధర్మకామార్థకో విదుడునై యుండవలెనని భారతఋషు లనిరి. మనువు (VII 27) దుర్మార్గుని చేతిలో దండము హింసాకారణ మగును. ఒక సత్ప్రవర్తకుని చేతిలో అదే హింసా నిరోధకమగును. మనువనినట్లు

సర్వో దండజితో లోకో దుర్లభో హి శుచిర్నరః
దండస్య హి భయాత్సర్వం జగద్భోగాయ కల్పతే. (VII 22)

(ఈలోకమంతయు దండముచేతనే నియమింపబడినదై సన్మార్గమునందున్నది. లోకములందు దండములేక స్వాభావికముగ పరిశుద్ధుడైన మానవుడుండుట అరుదు. దండభయమువలననే యీ జగమంతయు భోజనాది కార్యముచు జరుపుకొనగలిగి యున్నది.)

*   *   *   *

౭౯. ఒహెుద్ యుద్ధమునుగూర్చి వెనుకటి నోటులో చెప్పబడినది. ఈ యుద్ధకథ ఒక గుణపాఠముగ ఖుర్ఆన్ జ్ఞప్తికి తెచ్చుచున్నది. క్రమ శిక్షణము లేకపోవుట, ఆత్మవిశ్వాసము లేకపోవుట, భగవంతునియందు నమ్మక ముంచకుం డుట వలన పతనము తప్పదని ఖుర్ఆన్ ఉపదేశించుచున్నది.

*   *   *   *

౮౦. ఒహెుద్ యుద్ధరంగమున ప్రవక్త పన్నొకటి విరిగెను. ప్రవక్త అప్పుడు "తమ్ము సన్మార్గము వైపునకు పిలుచు ఒక ప్రవక్తను ఈవిధముగ హింసించు చున్న ఈజాతికి మోక్ష మెట్లుకలుగును?" అని ఆగ్రహముతో చెప్పగా ఈ సూక్తము ప్రోక్తమైన దని భాష్యకర్తల అభిప్రాయము. అట్లు శపించవలదని భగవంతుడు ప్రవ క్తను హెచ్చరించుచున్నాడు. నేటి శత్రువులు రేపటి మిత్రులు కావచ్చును. నేటి అవిశ్వాసులు రేపటి విశ్వాసవంతులు కావచ్చును. తొందరపడి శత్రువులనైనను దూషించుట భావ్యము కాదని ఖుర్ఆన్ బోధించుచున్నది. ఖుర్ఆన్ గరపిన క్షమాపాఠము నిరుపమానమైనది.

*   *   *   *

౮౧. ఇక్కడ మూడుపదేశములు చేయబడుచున్నవి. దానతత్పరత, కోపము నాపుకొనుట, పరుల తప్పులను క్షమించుట.

దానమునకు ఇస్లామ్‌లో ఎంతో ప్రముఖస్థాన మున్నదో వెనుక చర్చించితిమి.

ఇక్కడ కోపము నాపుకొనుటను గూర్చి శ్రీ ప్రవక్త ఉపదేశములను కొన్నిటి నుదహరింతును. ఎందుకన ప్రవక్త ఉపదేశములు అసలు ఖుర్ ఆన్ సూక్తులకు వ్యాఖ్యానములు.

"మల్లయుద్ధమున తన ప్రతిపక్షిని చిత్తుచేయువాడు నిజమైన బలవంతుడు కాడు. కోపమువచ్చినప్పుడు దానిని అరికట్టువాడే బలవంతుడు." (అహమద్)

"హారిసా అను ఒక శిష్యుడు నాకు క్లుప్తముగనుండు ఉపదేశము చేయుడు అని శ్రీ ప్రవక్తను కోరెను. "ఆగ్రహింపకుము" అని ప్రవక్త సెలవిచ్చిరి. ఆయన తిరిగి ప్రశ్నించెను. తిరిగి ప్రవక్త అదే జవాబు నిచ్చిరి. ఇట్లే పలుమార్లు ఇదే జవాబు నిచ్చిరి." (మస్నదె అహమద్)

"ఒకాయన ప్రవక్తకడకువచ్చి నా కేదేని ఉపదేశింపుడని కోరెను. "కోపము మానుము" అని ప్రవక్త సెలవిచ్చిరి. నే నాలోచించి చూడగా కోపము చెడుగు లన్నిటికిని మూలమని తెలిసెను. అని అతడు చెప్పెను." (మస్నదె అహమద్)

"ప్రవక్త శిష్యులలో ఒకరగు 'అబూజర్' అనునాయనకు ఒకసారి కోపము వచ్చెను. ఆయన వెంటనే అక్కడ కూర్చొనిపోయెను. కొంత సేపటికి పండుకొనెను. ఇట్లేల చేయుచున్నారని ఆయన నడుగగా 'ఇది ప్రవక్త ఉపదేశము. శ్రీవారు ఇట్లు సెలవిచ్చిరని వింటిని నిలువబడియున్నప్పుడు కోపమువచ్చినచో కూర్చొనవలెను. అంతటితో కోపము పోనిచో పండుకొనవలెను." (మస్నదె అహమద్)

"కోపము వచ్చినప్పుడు వుజూ (నమాజు చేయబోయినప్పుడు చేయు ప్రక్షాళన విధి) చేయుడు. మీ కోపము చల్లారును." (ఇబ్నెకసీర్ లో ఉద్ధృతము)

"ఎవరు తన కోపమును తీర్చుకో గలిగియు కోపము నణచివేయుదురో వారి హృదయములను భగవంతుడు శాంతిప్రపూర్ణ మొనర్చును." (అబూదావూద్)

ఇంక పరుల దోషములను క్షమించుటనుగూర్చి శ్రీ ప్రవక్త కావించిన కొన్ని ఉపదేశములను వినుడు :

"మీరు ఇతరులయెడ దయచూపుడు; భగవంతుడు మీయెడ దయచూపును. మీరు ఇతరులను క్షమింపుడు, భగవంతుడు మీ పాపములను క్షమించును."

(మస్నదె అహమద్)

"ఎవరు ఇతరుల తప్పిదములను క్షమింతురో వారి గౌరవము హెచ్చును."

"నమ్రుడై ఇతరుల తప్పిదములను క్షమించువాడు భగవంతునికడ ఉన్నత స్థానమును పొందును."

"ఎవరు ఉన్నతస్థానమును పొందగోరుదురో వారు దుర్మార్గులనుసైతము క్షమించవలెను."

"ఇతరుల పాపములను క్షమించువారు స్వర్గమును ప్రవేశింతురు."

పై ఉపదేశ రత్నములు ఇబ్నెకసీర్ భాష్యమునుండి సంగ్రహింపబడినవి.

దానమునుగూర్చిన ఈక్రింది వాక్యములను ఇబ్నె కసీర్ ఈ సూక్త భాష్యములో ఉదహరించెను

"(శ్రీ) ప్రవక్త తన శిష్యుల నిట్లడిగిరి 'దరిద్రు డనగా ఎవడో మీకు తెలియునా?' శిష్యు లిట్లు జవాబిచ్చిరి 'నిర్ధనుడు దరిద్రుడు.' దానికి ప్రవక్త 'కాదు, ఎవడు ధనముండియు భగవన్మార్గమున దానముచేయడో వాడే దరిద్రుడు.'"

(మస్నదె అహమద్)

"ఒకసారి శ్రీ ప్రవక్త తమ శిష్యుల నుద్దేశించి 'తమ ధనముకంటె తమ వారసుల ధనముయెడ ఎక్కువ ప్రీతిగలవారు మీలో ఎవరున్నారు?' అని ప్రశ్నించిరి. 'ఎవరును లేరు' అని శిష్యులు జవాబుచెప్పిరి. 'మీరు దానధర్మాదులలో ఖర్చు పెట్టు సొత్తే మీది. మీరు విడిచిపెట్టివెళ్లునది మీది కాదు, మీ వారసులది. మీరు దానధర్మములు తక్కువగ చేసి ధనము కూడబెట్టినచో మీరు మీ ధనముకంటె మీ వారసుల ధనమును ఎక్కుడు ప్రీతితో చూచుచున్నారన్నమాట."

(బుఖారీ, ముస్లిమ్)

* * * *

౨౩. చరిత్రలో కార్య కారణ సంబంధమును మొట్టమొదట నిరూపించిన మతము ఇస్లామ్. ప్రపంచ మంతటను ఒక యూనిట్ గా భావించి ప్రపంచ చరిత్రను గుణపాఠముగ ఖుర్ఆన్ గ్రహింపుడనుచున్నది. అంతటితో ఆగక దేశాటనము చేయుడనుచున్నది. భగవంతుని నియమముల నుల్లంఘించి హద్దుల నతిక్రమించి నప్పుడు జాతులకు పతనము తప్పదు. వివిధ నాగరికతలు ప్రపంచములో ఎట్లు విధ్వంసమైనవో తిరిగి చూడుడని ఖుర్ఆన్ ప్రబోధించుచున్నది. అందుచేతనే ముస్లిములు కేవలము శాస్త్రాభివృద్ధిని భావనపై విడిచిపెట్టలేదు. వారు నూటిగా ప్రకృతినుండి అభ్యాససిద్ధ జ్ఞానమును బడసిరి. డాక్టర్ డ్రేపర్ ఈ విషయమును

నిట్లనుచున్నాడు: "They (the Arabs) perceived that it (Science) can never advance by mere speculation, its only sure progress is by the practical interrogation of the nature."*

ప్రకృతిశాస్త్ర పరిశోధనమునకు అనుకూల మనస్సంస్థితిని కలిగించు దృక్పథమును ఖుర్ఆన్ కల్గించినది. అందుచేతనే ముస్లిములు అజ్ఞానాంధకారబంధురమైన నాటి ప్రపంచములో విజ్ఞానజ్యోతిని జాజ్వల్యమానముగ వెలిగించగలిగినది. ఈ విషయమును చర్చించుచు డాక్టర్ డ్రేపర్ గారు తన History of the Conflict between Religion and Science(P. 91) అను ఉద్గ్రంథములో నిట్లనుచున్నారు

"To the Christian the progress of the world was an exhibition of disconnected impulses, of sudden surprises. To the Mohammaden that progress presented a very different aspect. Every corporeal motion was due to some preceding motion, every thought to some preceding thought, every historical event was the offspring of some preceding event, every human action was the result of some foregone and accomplished action. In the long annals of our race nothing has ever been abruptly introduced. There has been an orderly, an inevitable sequence from event to event."

౭౩. యుద్ధమునందు జయాపజయములును, అట్లే జీవితమందలి ప్రతి సాఫల్య వైఫల్యమునుకూడ మన ప్రవర్తనముపై ఆధారపడియుండును. కాని మన ఇష్టమువచ్చినట్లు కలుగవు. ప్రపంచములో ప్రతిదానికిని కార్య కారణ సంబంధమున్నది. ఐతే భగవంతుడు దయాప్రపూర్ణుడుకదా ఇంత కఠినమగు నియమము నేలయేర్పరిచెను ? అను ప్రశ్న రావచ్చును. మనకు కలుగు వైఫల్యము, కష్టనష్టములు, బాధ—మున్నగు నవన్నియు మనకు గుణపాఠములుగా ఉండి మనలో సంస్కారమును కలిగించును. స్వయముగ అనుభవములేక ఇతరులు చెప్పినదానికంటె అనుభవముపొంది నేర్చుకొనిన గుణపాఠము హృదయమున అచ్చొత్తుకొనిపోవును.

పెక్కుచోట్ల ప్రపంచమునందలి దురవస్థ (Evil) ను గూర్చి ఖుర్ఆన్ చర్చించుచున్నది. "మనకు ఏ మంచి కలిగినను భగవత్కృప యనియు, మనకే దురవస్థ సంభవించినను అది మన చేతులతో చేసుకొన్నదాని ఫలితమనియు ఖుర్ఆన్ చెప్పుచున్నది. అట్లు సంభవించిన దురవస్థ మనకు గుణపాఠమై సంస్కారమును కల్గించునదై యుండవలెను. మనకది క్రమశిక్షణమును కల్గించునదై యుండవలెను.

* History of the Conflict between Religion and Science, By *John William Draper*, M. D, LL. D, (*Watts & Co., London*) P. 94.

భౌతికమగు ఈ దురవస్థయే మానవుని సర్వ ప్రగతికిని మూలకారణమని ఒక పాశ్చాత్య భావుకుడు చెప్పినది సత్యదూరము కాదు.

*                *                *                *

౧౪. ఒహెుద్ యుద్ధరంగమున ప్రవక్త మరణించెనని శత్రువులు కొందరు ఒక వదంతిని వ్యాపింపజేసిరి. దానితో ముస్లిం సైనికుల ధైర్యము సడలెను. వారిలో కొందరు వెనుజూపిరి. ఆ సందర్భమున ఈ సూక్తము ప్రోక్తమాయెనని వ్యాఖ్యాతల అభిప్రాయము.

ముస్లిమ్‌సైన్యములు ఒక సత్యమును నిలబెట్టుటకై ధర్మవిధ్వంసకులగు శత్రువులతో పోరాడుచుండిరి. ఆ సత్యమును ప్రవచించిన ప్రవక్తకంటె సత్యము ముఖ్యమైనది. అందుచే సత్యసంస్థాపనము ప్రవక్త బ్రతికియుండుటపై ఆధారపడ లేదనియు, ఆయన మరణించినను ఆ పని సాగుచునేయుండవలె ననియు ఖుర్ఆన్ బోధించుచున్నది. ఇతర మతములలో మత ప్రవక్తలకు ఎక్కువ ప్రాముఖ్యమునిచ్చి క్రమక్రమముగ ఆ ప్రవక్తలనే దైవతములుగ కొలువసాగినారు. వారు బోధించిన సత్యముకంటె వారి వ్యక్తిత్వముపై ఎక్కువ మక్కువ కలిగించుకొని అసలు మతమును విడిచి ఈ ప్రవక్తలను పూజించుటే మతమెునర్చివైచినారు. శ్రీకృష్ణుడు, ఏసుక్రీస్తు, బుద్ధుడు మున్నగు మతప్రవక్తల సందేశము సంగతియెట్లున్నను, ఈ మహాత్ములు మాత్రము దేవుళ్లై వేలకొలది దేవాలయములలో అధిష్ఠించియున్నారు. ఖుర్ఆన్ ఇట్టి ప్రమాదమునకు తావే ఇచ్చినది కాదు. "మెుహమ్మద్ కేవలము మానవమాత్రుడు, అందరి ప్రవక్తలవలె ఒక ప్రవక్త. ఆయనకూడ జననమరణాది భగవన్నియమములకు బద్ధుడై మరణింపగలడు." అని ప్రవక్తకు ఏవిధమైన దైవత్వమును ఎవ్వరును ఎక్కడను ఆపాదింపకుండ ఖుర్ఆన్ కట్టుదిట్టములు చేసినది.

*                *                *                *

౧౫. అతీంద్రియములగు విషయములు అంతర్దృష్టికి గోచరించునవియే గాని మానవ భాషలో అనువదింప దగినవి కావు. ఒకసారి చెప్పినను ఏదేని సాంకేతికమగు భాషయందు చెప్పబడవలసినదే. ఇట్టి భాష ప్రమాదజనితమై పరిణమించినది. అందుచే సాధ్యమైనంతవరకు ఖుర్ఆన్ అతీంద్రియ విషయములు అట్టి భాషలో చెప్పలేదు. అతీంద్రియ విషయజ్ఞానము ప్రవక్తలకు మాత్రమే ప్రసాదింపబడిన

---

* "Physical evil has been the good which has impelled man to most of those achievements which make the history of man so wonderful. Hardship is the stern but fecund parent of invention."

దనియు, సామాన్యు లెల్లరకును అది చెప్పబడదగినది కాదనియు ఖుర్ఆన్ ఇక్కడ చెప్పుచున్నది.

* * * *

౧౮. **"భగవంతుడు తన అనుగ్రహముచే ప్రసాదించిన దానిని దానముచేయునెడ లోభము చూపువారు"** అను వాక్యాంశమును నేను **"భగవంతుడు తన అనుగ్రహముచే ప్రసాదించిన (ధన ధాన్య విద్యా) సంపదలను దానముచేయునెడ లోభము చూపువారు"** అని వివరణానువాద మొనర్చితిని.

భగవంతుడు ప్రసాదించిన ఎట్టి సంపదలైనను దానముచేయుటయందు లోభించవలదని ఇక్కడ ఖుర్ఆన్ ఆదేశము. ఇబ్నె అబ్బాస్ గారు ఈ సూక్తమునకు భాష్యమును వ్రాయుచు క్రైస్తవ పండితులును యూదుల పండితులును ధర్మ విజ్ఞానమును రహస్యముగనుంచి విద్యాదానము చేయుటలో చూపు లోభమునుగూర్చి ఇందు చెప్పబడినదని వ్రాయుచున్నారు. (ఇబ్నె కసీర్, సం. 4, పుట 48.) విద్య మున్నగునవికూడ భగవంతు డిచ్చిన సంపదలలో చేరునని ఇబ్నె కసీర్ అభి ప్రాయము.

"ఎవడైన ఒకడు తన యజమాని కడకు వెళ్ళి, తన అవసరము నిమిత్త మర్థింపగా, తనకడ ధనముండియు ఇవ్వని యజమాని తుదిదినమునాడు శిక్షింపబడును" అని శ్రీ ప్రవక్త వచనము. (తబరీ)

"ఎవడైన ఒక బీదవాడు ధనికుడైన తన బంధువుకడకువెళ్లి తన అవసరము నిమిత్త మేదేని యర్థింపగా, తనకడ ఉంచుకొనియు లేదని చెప్పువానిధనము తుది దినమునాడు వాని కంఠమున సర్పమై చుట్టుకొనును" అని శ్రీ ప్రవక్తవచనము మరొకటి కలదు. (ఇబ్నె జరీర్)

* * * *

౧౨. **"మీ రింతకుముందు మీ చేతులతో చేసుకొనిన దాని ఫలమిది. అంతేకాని భగవంతుడు తన సేవకులను హింసించడు."**

ఒక వ్యక్తికి గాని, ఒక జాతికి గాని సంభవించు 'దురవస్థ'కు కారణమేమి? దీనికి కారకుడు భగవంతుడా? లేక అది ఆయా వ్యక్తులు గాని జాతులు గాని చేయు అపరాధముల లేక పాపముల ఫలితమా? అన్న ప్రశ్నలకు ఇది జవాబు. భగవంతుడు కరుణామయుడు. అట్టి భగవంతుడు మానవులను హింసించునా?

మన కే చెడుగు సంభవించినను మనమో లేక మనముండు సంఘమో చేసినదాని ఫలితమే.

'దురవస్థ' రెండు విధములైనది వ్యక్తిగతమైన దొకటి జాతికి ప్రాప్తించి, దాని మూలమున ఆ జాతియొక్కగాని సంఘముయొక్కగాని వ్యక్తులకు సంక్రమించున దొకటి. ఒకటి మనముచేయు చెడుగువల్ల సంభవించునది. ఇతరుల చేతల వల్ల మనకు ప్రాప్తించున దొకటి.

ఈ రెండు విధములైన 'దురవస్థ'లకును భగవంతుడు కర్తకాడని ఖుర్ ఆన్ చెప్పుచున్నది. భగవంతుడు మంచినే చేయును. మనకు మంచినే కలిగించును. తన సేవకులమగు మనకు బాధ కలిగించి హింసింపడు. మనకు కలుగు బాధా దుఃఖములు స్వయంకృతాపరాధములకు లభించిన శిక్షయే కాని వేరొండు కాదు. ఖుర్ ఆన్ తుది రెండు అధ్యాయముల వ్యాఖ్యానములో ఈ విషయమును దీర్ఘముగ చర్చింతును.

* * * *

౨౨. భగవంతుని మరచి, ఈ ప్రపంచమునం దనుభవించునదే సర్వస్వము, చచ్చిన తర్వాత యేమియు కాదని అనుకొని ఇష్టమువచ్చినట్లు ప్రవర్తించువారికి ఇది చెప్పబడుచున్నది. ఈ లోకపు జీవితము విషయవాంఛలతో కూడుకొన్నది. ఐహిక జీవితమందలి విషయవాంఛలయందే తగుల్కొని, ధర్మబుద్ధిని వదలి ప్రవర్తించువాడు పతితుడగును. అందుచే ప్రపంచమునందలి చెడుగునుండి తప్పించుకొని తిరుగవలసినదనియు, ఈ జీవితమే సమస్తమును అనుకొనవలదనియు, పరలోకమును మరువవలదనియు ఖుర్ ఆన్ హెచ్చరించుచున్నది.

* * * *

౨౩. స్త్రీపురుషులు సమానులనియు, ఇద్దరకును ఒకేవిధమైన కర్మఫలము లభించుననియు ఖుర్ ఆన్ ఇక్కడ స్పష్టముగ చెప్పుచున్నది. స్త్రీలకు ఆత్మ సైతము లేదనియు, స్త్రీలకు స్వర్గనరకములు వారి భర్తలపై ఆధారపడియున్నవనియు, స్త్రీలకు పుణ్యకార్యములు చేసుకొను స్వతంత్రాధికారమే లేదనియు, వెనుకటి మతములలో ఉండెను. ఖుర్ ఆన్ స్త్రీలకు పురుషులతో సమానమగు కర్మఫలము కలదని వక్కాణించుచున్నది.

ప్రపంచములో ఇతర మతములు స్త్రీకి ఇహమునను పరమునను కూడ ఎట్టి స్థానము నిచ్చినవో తరువాతి అధ్యాయ వ్యాఖ్యాన పీఠికయందు దిచ్చితిని.

* * * *



# నాల్గవ అధ్యాయము

# స్త్రీలు

## వ్యాఖ్యానము

### పీఠిక

ఈ అధ్యాయమునందు స్త్రీల హక్కుల విషయకమైన ఆదేశము లుండుటచే దీనికి 'స్త్రీలు' అని నామకరణము చేయబడినది.

మానవ హక్కుల విషయములో ఇస్లామ్ ప్రతిపాదించిన విప్లవిక సిద్ధాంతములలో స్త్రీ స్వాతంత్ర్య మొకటి. ధన, జాతి, వర్ణ, కుల, లింగ భేదముల నాధారముగా ప్రపంచమునందు ప్రబలిన దౌర్జన్య పిశాచమును మొదలంట నశింప జేసి మానవజాతికి, అందలి ప్రతివ్యక్తికి ఒక విశిష్టమైన స్థానమును ప్రసాదించినది ఇస్లామ్. ధనబలమును, జాతి వర్ణ కుల భేదములను ఊతగాగొని ఒకరిపై నొకరు దౌర్జన్యమునకు గడగుటను ఖుర్ఆన్ ఎట్లు నిషేధించినదో, అట్టి దౌర్జన్యమునకు అవకాశములేకుండ భ్రాతృత్వ సమానత్వ సిద్ధాంతములు పునాదిగాగల సంఘము నెట్లు ప్రతిపాదించినదో వెనుకటి అధ్యాయములందు వివరింపబడినది. ఇప్పుడు లింగభేదము ఆధారముగా మానవసంఘమున ప్రబలిన దౌర్జన్యమును నిషేధించుచు ఖుర్ఆన్ కొన్ని నియమముల నిచ్చుచున్నది.

ప్రతిదేశమునందును మొన్నమొన్నటివరకు స్త్రీ పురుషునిబానిసగ భావింప బడుచుండెడిది. ఆమెకు పుట్టింటియందుగాని, భర్త ఇంటియందుగాని ఎన్నదగిన హక్కులేవియు లేవు. గృహిణి యగుటచేతను, భర్త ప్రేమకు పాత్రురాలగుట చేతను ఆమెకు భర్త బ్రతికియుండగా కొంత పలుకుబడియు, పెత్తనమును ఉం డుట సహజము. ధీసంపన్నలగు కొందరు స్త్రీలు పురుషులకంటె ఒక్కొక్కప్పుడు ఆధిక్యతను సంపాదించుటయు కలదు. కాని సాధారణముగ స్త్రీ ప్రతిదేశము నందును పురుషుని ఆటవస్తువుగను, బానిసగను ఉండెడిది. ఆమెకు స్వాతం

త్ర్యార్హత లేదు * ఆమె ఇంటియందు సైతము స్వతంత్రముగ నెట్టి పనియు చేయరాదు. † ఆమెకు ఆస్తి లేదు. § భర్త చనిపోయిన తర్వాతకూడ ఆమెకు భర్త ఆస్తియం దెట్టిహక్కును లేదు. ఆమె కష్టపడి గడించు ద్రవ్యముపై సైతము ఆమెకు హక్కులేదు. వేయేల? ఆమెకు ఒక ప్రత్యేక వ్యక్తిత్వమే లేదు. ♦ భర్త తన భార్యను చంపినను అది నేరము కాదు. ‡ భర్తతర్వాత భార్యకు బ్రతికి యుండు హక్కే లేకపోయెను. భర్తతోపాటు చితాగ్నియందు పడి చావవలసినదే. ఒకసారి సహగమనబాధ తప్పినను తల గొరిగించుకొని వికారరూపము దాల్చి యావజ్జీవము అందరిచే అసహ్యించుకొనబడుచు ఊడిగముచేసి బ్రతుకవలసినదే. స్త్రీకి ఆధ్యాత్మికముగ శూద్రుని స్థాన మివ్వబడెను. ఆమెకు వేదపఠనార్హత లేదు.

---

* "పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే।
రక్షంతి స్థావిరే పుత్రా న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి ॥" (మను . 9, 3)

ఇంకను మనువు (5 148), బౌధాయన ధర్మసూత్రములు II 2, 3, 44–45, వాసిష్ఠ ధర్మసూత్రములు V , 2 కూడ చూడుడు.

"She was (under Roman law) in perpetual ward, subject, in short to the Chinese rule of three obediences." (Hobhouse vol I p. 219)

† "బాలయా వా యువత్యా వా వృద్ధయా వాపి యోషితా ।
న స్వాతంత్ర్యేణ కర్తవ్యం కించిత్కార్యం గృహేష్వపి ॥"
(మను. 5 147)

§ మను. IX. 194. 1882వ సంవత్సరము వరకు ఇంగ్లాండులో స్త్రీకి ఆస్తి హక్కు లేదు. 1870 వరకు స్త్రీకి ఆమె గడించినదానిపైకూడ హక్కు లేకుండెను. ఇతర ఐరోపీయ దేశములలో కూడ ఇటీవలివరకు స్త్రీ నిర్ధనగనే యుండెను.

♦ "In the English law of Blackstone's day, for example, a married woman can scarcely be said to have any personality, so great is the number of her disqualifications as to the holding of property, as to capacity to give evidence, as to the custody of her children, even as to her legal responsibility for crimes, and many of these disqualifications lasted on down to the present generation." (Hobhouse, Ibid, Vol. I, p. 36)

‡ "Down to the ninth century the husband was possibly within his rights in killing his wife for a 'good' reason" (Hobhouse vol. I p. 223)

వివాహమే ఆమెకు సంస్కారము. భర్తృ శుశ్రూషయే ఆమెకు స్వర్గము. భర్త అనుమతిలేక ఆమెకు వ్రతముగాని ఉపవాసముగాని లేదు. పురుషుడు తన భార్యను బానిసగగూడ అమ్మివేయుట ధర్మ్యమే యైయుండెను. ♦

వెనుకటి మతములందును, సంఘములందును స్త్రీ కివ్వబడిన స్థాన మిది. దీనికి కారణముల నరయుదము.

ఆర్షమతమున స్త్రీల కివ్వబడిన ఈ నికృష్ట స్థానమునకు కారణము పురుషులకు స్త్రీలయెడ కల ద్వేషభావము కాదు. పురుషుడైనవానికి స్త్రీయెడ ద్వేషభావ ముండుట అసహజము. పురుషుని తల్లి, అక్కచెల్లెండ్రు, భార్య, కూతుండ్రు వీరందరు స్త్రీలేకదా. ఏ పురుషుడు తన తల్లిని ద్వేషించును? ఏ పురుషుడు తన అక్కచెల్లెండ్రను అసహ్యించుకొనును? ఏ పురుషుడు తన భార్యను ప్రేమింపడు? ఏ పురుషుడు తన కూతుండ్రను మక్కువతో గారవింపడు? "ఏ కులమున అతివలు గారవింపబడుదురో ఆ కులమువారిపై వేల్పులు దయగలిగియుందురు. ఏ కులమున వీరికి మన్ననలు లేవో ఆ కులమువారు చేయు క్రియలన్నియు నిష్ఫలములు. ఏ కులమున తోబుట్టువులు, భార్యలు, కోడండ్రు పూజితలు కారో ఆ కులము శీఘ్రముగ నశించును. ఏ కులమున వీరు పూజాదులచే వగపులేక యుందురో ఆ కులము సర్వదా వృద్ధినొందుచుండును." † అని మనువు చెప్పుచున్నాడు.

ఇట్లయ్యు స్త్రీల కీ నికృష్టస్థాన మేల కల్పింపబడినది? వారికి శూద్రత్వ మేల ఇవ్వబడినది?

ఆర్యధర్మకారులకు స్త్రీప్రకృతియందే విశ్వాసములేదు. స్త్రీ స్వభావమే దుష్టమైనదని వారి అభిప్రాయము.

ఆడుది స్వభావముచే పాపశీలయనుట నమ్మదగినది కాదనియు, అట్లైనచో భార్యాసహితుడై మాత్రమే యజ్ఞాదు లొనర్పవలెనని వేదము లెట్లు శాసించుననియు యుధిష్ఠిరుడు జిజ్ఞాసువై భీష్ముని నడిగెను. దానికి భీష్ముడు ఒక ఉపాఖ్యానమును వివరించుచు స్త్రీ అన్ని చెడుగులకును మూలస్థానమని సహేతుకముగ నిరూపించును *

♦ "The sale of a wife appears in the eleventh century in Cologne, and in the same century Cnut had to forbid the sale of a woman to a man whom she disliked." (Hobhouse, vol I p. 224)

† మను. 3 56-57.

* మహాభారతము XIII 73-8

ఋగ్వేదమునను, * బ్రాహ్మణము లందును, † మనుస్మృత్యాది♦ ధర్మ శాస్త్ర గ్రంథములందును స్త్రీ దుష్టయనియు, చపలస్వభావ యనియు, అశాస్య చిత్తయనియు, అందుచే ఆమెకు మంత్రవత్సంస్కారమునకును, వేదాభ్యాసమునకును, ధర్మజ్ఞతకును అధికారము లేదనియు చెప్పబడినది.

ఆర్య ధర్మ గ్రంథములన్నియు ఇదే భావముపై స్త్రీలకు సంబంధించిన సమస్త నియమములను ఏర్పరచినవి.

ఇది ఒక్క ఆర్యమత గ్రంథములందే కాదు. క్రైస్తవమతమునను స్త్రీకి ఇంతకంటె ఎక్కువ ఉన్నతస్థాన మివ్వబడలేదు. ఎక్కువగా క్రైస్తవమత ప్రాబల్యముగల యూరప్ ఖండములో మొన్నటివరకు స్త్రీలు అధమాధమస్థితియందుండినట్లు చరిత్ర సాక్ష్యమిచ్చుచున్నది. బైబిల్‌లో స్త్రీలనుగూర్చి ఏమున్నదో చూడుడు :

**"It is good for a man not to touch a woman; nevertheless to avoid fornication let every man have his own wife .." (I Cor VII-1)**

(స్త్రీని ముట్టకుండుట మానవునకు మేలే. కాని వ్యభిచారమునుండి తప్పించుకొనుటకు ప్రతి పురుషుడు ఒక భార్యను పరిగ్రహించుగాక.)

టెర్‌టూలియన్ అను ఒక గొప్ప క్రైస్తవాచార్యుడు ఇట్లనుచున్నాడు :

**"Woman is the gate of hell, mother of all ills. She should blush with shame at the thought of her womanhood and live in perpetual penance for the sins of Eve"**

(స్త్రీ నరకమునకు ద్వారము. అన్ని చెడుగులకును తల్లి. తాను స్త్రీయైనందుల కామె సిగ్గుపడవలెను. అవ్వ చేసిన పాపమునకు ఆమె నిత్య తపశ్చర్య గావించవలెను.)

పదకొండవ శతాబ్దపు బిషప్ మార్బత్ అను ఒక క్రైస్తవాచార్యుడు ఇట్లనుచున్నాడు :

**"Of the numberless snares that the crafty enemy spreads for us over all the hills and fields of the world, the worst and the one which one cannot avoid is woman, sad stem, evil root, vicious fount,**

* ఋగ్వేదము X 95, 15; IV. 33, 17.

† శతపథబ్రాహ్మణము III. 2, 3, 6.

♦ మను. XI. 14-18.

who persuaded our first parent to taste the forbidden fruit ? A woman. Who forced the father to defile his daughter ? A woman."*

(సైతాను ప్రపంచములో మనకై ఒడ్డు ఊరులన్నిటికంటె చెడ్డది స్త్రీ. అది తప్పించుకోజాలనిది. ఇది దుఃఖములకు కొండము, చెడుగులకు మూలము; స్త్రీయే మన ప్రథమపితను నిషిద్ధఫలమును తినిపించినది. తన కూతురిని చెడగొట్టుటకు పురికొల్పినదేది ? స్త్రీ.)

క్రీ. శ. 585 లో మేకన్ (Macon) లో జరిగిన సైనాడులో (Synod) అక్కడ సమావేశమైన బిషప్పులు స్త్రీలు అసలు మానవజాతికి చెందినవారా కారా అన్న విషయమును దీర్ఘముగ చర్చించి తుదకు స్త్రీలుకూడ మానవజాతికి చెందినవారే నని పరిష్కరించిరి †

మధ్యయుగములో ఇంగ్లాండుదేశమునకూడ స్త్రీ బానిసస్థితియందుండెను. ముల్లర్ లయ్యర్♦ గారి ఈ క్రింది వాక్యములను గమనింపుడు —

"The English common law made the married woman almost a nullity. All her rights devolved on her husband. She could not make a will, or be party to a contract, or appear in court. Her personal property and earnings were his Even after separation or divorce no account could be demanded from him"

"Neither the romantic service of the knight to his lady in certain phases of chivalry, nor the culte of Virgin Mother, nor the many learned ladies and remarkable feminine personalities of the Renaissance helped women out of their lamentable civic and legal status. The medieval inquisitors and legalists saw only the uncanny, the degraded and the malignant aspects of the beings whose ancestress and archetype, Eve, had brought sin into the world, they saw only the chosen and appropriate instrument of Satan. The number of women burnt to death as witches in Germany alone is estimated by the social historian, Johan Scherr, as not less than one hundred thousand

---

* ఈ విషయములు *J L. Davies* కృతమైన "*A Short History of Woman*" (*1927*)అను గ్రంథమునందలి నాల్గవ ప్రకరణమునుండి సంగ్రహించినవి.

† Muller-Lyer, *The Family*, p 228.

♦ Muller-Lyer, *The Family*, p. 236 Also Pollock & Maitland, *History of English Law*, vol. II, Hobhouse, *Morals in Evolution*, vol. I, p 224, Ellis, *Sex in Society*, p 401.

Even after most of the concepts and customs of the Middle Ages had been profoundly changed by economic forces, the domain of the family was still largely under the shadow of the Canon Law, e. g in the 18th and 19th centuries"

అంతదూరము పోనేల? ఫ్రాన్సులో సమానత్వ స్వాతంత్ర్యముల పేర జరిగిన మహావిప్లవము స్త్రీలకు సమానత్వమిచ్చినది కాదు. ఫ్రెంచి నేషనల్ ఎసెంబ్లీ వారు స్త్రీల దరఖాస్తును చదువుటకు సైతము నిరాకరించిరి.*

1840 లో లండన్ నగరమున జరిగిన బానిసత్వ నిరోధక మహాసభలో (Anti Slave Congress) పాల్గొనుటకు అమెరికానుండి వచ్చిన స్త్రీ ప్రతినిధురాండ్రను సభయందు పాల్గొననివ్వలేదు. కాంగ్రెసులో స్త్రీలు పాల్గొనుట భగవదాదేశమునకు వ్యతిరేకమని బ్రిటిషు ప్రతినిధులు తలచుటయే దీనికి కారణము. క్రీ. శ. 1888 వరకు ఇంగ్లాండులో స్త్రీలకు వైద్యవిద్య నభ్యసించుటకు అనుజ్ఞ ఇవ్వలేదు. ఇంగ్లాండులో అన్నిటికంటె గొప్ప విశ్వవిద్యాలయమగు ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయము 1920 వరకు స్త్రీలకు డిగ్రీలనియ్య నిరాకరించెను. కేంబ్రిడ్జివిశ్వవిద్యాలయములో నేటికిని స్త్రీలకు వోటింగుహక్కు లేదు.

ఈజిప్టు, గ్రీసు, రోమన్, బౌద్ధ నాగరికతలనుగూర్చి ఇక్కడ ప్రసంగించనైతిని. అవి మృత నాగరికతలు. వానినిగూర్చి ముచ్చటించుట గ్రంథవిస్తరమేగాని వేరొండుకాదు. ఆ నాగరికతలలోను స్త్రీలస్థితి పైన వర్ణించినట్లే యుండెనని చెప్పుట చాలును.

ఈ విధముగ స్త్రీలకు అన్నిదేశములందును, అన్నిమతములందును, అన్నికాలములందును కూడ సమానత్వముగాని స్వాతంత్ర్యముగాని ఇవ్వబడలేదు. ఆమెకొక వ్యక్తిత్వమున్నదని సైతము మతములుగాని విజ్ఞానులుగాని అంగీకరింపలేదు.

ఇస్లామ్ ఇట్లు పతితయైన స్త్రీ నుద్ధరించెను. ఆమెకొక వ్యక్తిత్వమును ప్రసాదించెను. ఆమెకు స్వాతంత్ర్యము నిప్పించెను. ఆమెకు విద్యార్హతను, మోక్షార్హతను కల్పించెను. ఆమెకు తండ్రి ఆస్తియందును, భర్త ఆస్తియందును హక్కిప్పించెను. ఆమెకు ఆమె ఆస్తిపై, ఆమె ధనముపై పెత్తన మిప్పించెను. ఆమె వ్యక్తురాలై తన సమ్మతితో వివాహమాడును. దాంపత్య మనుకూలముగలేక దుర్భరమైనచో ఆమె వివాహచ్ఛేద మొనర్చుకొని అనుకూలుడగు మరొక భర్తను పెండ్లియాడును. ఆమె నిర్ధనకాదు. వివాహసమయమున ఆమెభర్త ఆమె కిచ్చినట్టిగాని, ఈయ వాగ్దానము చేసినట్టిగాని మహర్ ధనమునకు ఆమె స్వామిని. భర్త ఆమెను హింసింపజా

* George, *The Story of woman*, P, 186.

లడు. అట్లు హింసించినయెడల ఆమె అతనిని విడిచి వేరొక అనుకూలపతిని బడయ వచ్చును. భర్త మరణించినచో విధవయై కురూపియై, హానిసయై, సర్వవిధముల ఇతరుల పెట్టుపోతలపై ఆధారపడి చచ్చిన కుక్కవలె పడియుండనక్కరలేదు. ఆమె కోరినచో మరొక పురుషుని పెండ్లాడవచ్చును. లేదా తన పిల్లలతో తన భర్త ఆస్తి ననుభవించుచు హాయిగా కాలము గడపవచ్చును. పురుషులవలె ఆమెకూడ సమస్త విద్యలను అభ్యసింపవచ్చును. పురుషులవలెనే ఆమెకూడ సమస్త కార్యములందు పాల్గొనవచ్చును. పురుషునకు సమానమైన మతవిధులు, సమానమైన మంత్రములు ఆమెకు కలవు. ఈ విధముగ ఇస్లామ్ స్త్రీల కిచ్చిన హక్కులు ప్రపంచమున ఏ మతమైనను నేటికిని అంగీకరించియుండలేదు. స్త్రీ పునర్వివాహము, ప్రౌఢా వివాహము, స్త్రీలకు ఆస్తియందు హక్కు, స్త్రీలకు వేదాది గ్రంథపఠనార్హత ఈ మధ్య నవీన పాశ్చాత్య నాగరికతా సంపర్కముచె రాజకీయశాసనములద్వారా ప్రవేశపెట్టబడుచున్నవేగాని ఆయా మతము లొప్పుకొనినవి కావా విషయములు.

దీనినిబట్టి ఇస్లామ్ ప్రతిపాదించిన ధర్మ మెంతపరిపూర్ణమైనదో తెలియగలదు.

అధ్యాయము మధ్య వచ్చిన స్త్రీ సమస్యలనుగూర్చిన వివిధ విషయములను సందర్భానుసారముగ వేరుగ ఆయా సూక్తములపై వ్రాసిన నోటులం దుండును.

*　　*　　*　　*

౯౦. ఇందులో రెండు విషయము లుగ్గడింపబడినవి. (1) తా మొక ఉత్తమజాతికి చెందినవారమనియు, స్త్రీలు అధమజాతికి చెందినవారనియు, పురుషులకుగల అహంభావమును రద్దుపరచుచు స్త్రీపురుషులొకే ప్రాణినుండి ఉద్భవమైనవారనియు, ఒకే జాతికి చెందినవారనియు, సహజముగ వారిలో ఉత్తమాధమత్వములు లేవనియు, అందుచే స్త్రీపురుషులుసమానులనియు ఖుర్ఆన్ చెప్పుచున్నది. (2) స్త్రీ పురుషుల పరస్పర సంబంధము, ప్రత్యేకముగ భార్యా భర్త సంబంధము, స్త్రీపై పురుషునకు కొంత ఆధిక్యమునకు అవకాశము నిచ్చుచున్నది. దానివలన లాభమును పొంది పురుషుడు స్త్రీపై అధికారదుర్వినియోగము చేయరాదనియు, భగవంతుడు మానవుల కర్మల నన్నిటిని చూచుచునే యున్నాడనియు, అతడు సర్వసాక్షియనియు, భగవంతుని సర్వసాక్షిగా గ్రహించి పురుషుడు స్త్రీయొక్కయు, స్త్రీ పురుషునియొక్కయు హక్కులను కాపాడవలెననియు, తాత్కాలికముగ ఒకరిపైనొకరికి లభించిన అవకాశమువలన లాభమును పొందవద్దనియు ఖుర్ఆన్ హెచ్చరించుచున్నది.

*　　*　　*　　*

౯౧. అనాథబాలికల హక్కులనుగూర్చి ఖుర్‌ఆన్ పెక్కుచోట్ల ఆదేశించుచున్నది. తల్లిదండ్రులులేని పిల్లల ఆస్తిని ధనమును పలుకుబడిగల బంధువులు స్వాధీనముచేసుకొనుట సర్వసాధారణముగ జరుగుచుండును. స్త్రీలు, అనాథబాలికలు పేదవాండ్రు – వీరియెడ సంఘమునకు ప్రత్యేకబాధ్యతకలదు. ఆర్యధర్మగ్రంథములలో తల్లిదండ్రులులేని పిల్లలయెడకల ఈబాధ్యతకు సంబంధించిన నియమము లున్నట్లు కన్పించదు. దీని కొక కారణము కలదు. ఆర్యకుటుంబము సమిష్టికుటుంబము. తల్లిదండ్రులులేని పిల్లలు సమిష్టికుటుంబముల పోషణముక్రిందనుండ తటస్థించుటచే అట్టి నియమముల అవసరము లేకపోయియుండవచ్చును. ఇప్పుడు సమిష్ఠికుటుంబము క్రమక్రమముగ మాయమగుచున్నది. అందుచే ఇప్పుడీ ఆదేశముయొక్క అవసరము కలుగుచున్నది.

*　　　*　　　*　　　*

౯౨. ఈసూక్తమున బహుభార్యాత్వము కొన్ని షరతులపై ధర్మయుతమే యని చెప్పబడినది. క్రైస్తవమతము బహుభార్యాత్వమును నిషేధించుచున్నదనియు, అందుచే ఈవిషయమున క్రైస్తవమతము ఇస్లాముమతము కంటె ఆదర్శప్రాయమైన వివాహమును ఆదేశించుచున్నదనియు మిషనరీలు బోధించుట కలదు. ఆర్యధర్మగ్రంథములలో బహుభార్యాత్వము నిషేధముకాదు. ప్రఖ్యాత పురాణపురుషులలో ఒక్క శ్రీరాముడే ఏకపత్నీవ్రతుడని ప్రసిద్ధి. ఈ మధ్య శ్రీరాముడుకూడ ఏకపత్నీవ్రతుడు కాడనియు, బహుభార్యాయుతుడే యనియు కొందరు వ్రాయుచున్నారు. మనకావాద మప్రస్తుతము. ఆర్యధర్మకారులు ఏకాలమునందును బహుభార్యాత్వమును నిషేధింపలేదన్న విషయమే మనకు కావలసినది. బ్రాహ్మణుడు ఒక్కొక్క వర్ణమునుండి ఒక్కొక్క భార్యను ఈవిధముగ నలుగురు భార్యలను, క్షత్రియుడు ముగ్గురు భార్యలను, వైశ్యు డిద్దరిని, శూద్రు డొక్కతెను వివాహమాడవచ్చునని విష్ణుధర్మసూత్రకారు డనుచున్నాడు. (XXIV. 1—4)

కాని పురాణములలో పెక్కురు ప్రసిద్ధపురుషులకు ఇంతకంటె ఎక్కువమంది భార్యలున్నట్లు ప్రసిద్ధి. శ్రీకృష్ణునకు ఎనమండుగురు భార్యలుండుటయు, దశరథునకు ముగ్గురు క్షత్రియభార్య లుండుటయు, కార్తవీర్యార్జునునకు వెయ్యిమంది భార్యలుండుటయు, అట్లే అర్జునాదులకును పెక్కండ్రు భార్యలుండుటయు సుప్రసిద్ధము. ఋషులు సైతము బహుభార్యాయుతులైన ఉదాహరణములు కలవు.

క్రైస్తవ మతమున పెక్కితరవిషయములందువలె స్పష్టమైన వివాహనియమములు బైబిల్‌గ్రంథమున ఇవ్వబడలేదు. క్రైస్తవ చర్చి అప్పుడప్పుడు ఆయాకాల పరిస్థితులనుబట్టి వివాహ నియమముల నేర్పరచుకొనెను. అదియు వివిధ శాఖల

చర్చిల నియమములు వివిధముగనున్నవి. మార్మనులను ఒక చర్చివారు బహుభార్యాత్వము ధర్మ్యమే యని చెప్పుచున్నారు. అట్లే ప్రొటెస్టెంటు మతస్థాపకుడగు లూథర్ బహుభార్యాత్వము ధర్మ్యమని చెప్పుచున్నాడు.♦ ఫ్రాంకులలో బహుభార్యాత్వ ముండెననియు, డాగోబర్టు చక్రవర్తికి ముగ్గురు భార్య లుండిరనియు హాబ్‌హౌస్ వ్రాయుచున్నాడు. (Vol. 1, P. 220) క్రైస్తవ చర్చి బహుభార్యాత్వమునే కాదు అసలు వివాహమే గర్హ్యమైనదను మనస్తత్వము కలది. పాపమునకు మూలకారణము స్త్రీ యనియు, అందుచే స్త్రీ సైతానుయొక్క పరికరమై మానవుని పతితు నొనర్చుననియు చర్చి అభిప్రాయము కాని కామేచ్ఛ మానవునకు సహజమగుటచే స్త్రీ సంగమమును తప్పనిసరిగ ధర్మ్య మొనర్చినది. ‡ వివాహమే తప్పనిసరిగ ఒప్పుకొనిన చర్చి బహుభార్యాత్వము నెట్లొప్పుకొనును? కాని ఇస్లామ్ మతముయొక్కయు, ఆర్యధర్మముయొక్కయు మూలతత్త్వము వేరు. ఆర్యధర్మమున వివాహము పురుషార్థములలో ఒకటి. గృహస్థాశ్రమము ఆశ్రమము లన్నిటికంటె శ్రేష్ఠమైనది.

ప్రాణవాయువు నాశ్రయించి జంతువులెల్ల జీవించునట్లు, గృహస్థు నాశ్రయించి తక్కిన యాశ్రమస్థులు జీవింతురనియు, అందుచే గృహస్థు డన్నియాశ్రమములవారిలో శ్రేష్ఠు డనియు మనుస్మృతికారు డనుచున్నాడు †(III · 27, 28) అట్లే ఇస్లాం వివాహమున కెంతో ప్రాముఖ్యత నిచ్చుచున్నది. "వివాహమాడుట సగము మతవిధులను నెరవేర్చుటతో సమానము" అని శ్రీ ప్రవక్త వచనము. వివాహము మానవుని పెక్కుపాపములనుండి కాపాడు ననియు, మానవ సంఘమునకు పునాదియైన కుటుంబమును సాధ్యమొనర్చునదదియే ననియు ఇస్లామ్ అభిప్రాయము.

ఇంక బహుభార్యాత్వము విషయములో ఒకటి జ్ఞాపకముంచుకొనవలెను. ఇస్లామ్ బహుభార్యాత్వమునకు **అనుజ్ఞమాత్రము** ఇచ్చుచున్నది. అదియు **పెక్కు షరతులతో**. భార్యలనందరను సమానముగ చూడగలిగిన మనోదార్ఢ్యమును, శరీర పటుత్వమును, ఆర్థికసంపత్తియు, న్యాయబుద్ధియు నున్నప్పుడే బహుభార్యాత్వమున

♦ L. T. Hobhouse, *Morals in Evolution* Vol. I, P. 228.

‡ "The church regarded marriage as a concession to the weakness of the flesh It is of the nature of a hindrance in spiritual duties It is incompatible with the performance of sacraments, and thus continence is enjoined on priests"

—L. T. Hobhouse, *op. cit* I, 218.

కనుజ్ఞ కలదు. లేనిచో ఒకే భార్యతో మాత్రమే కాపురము చేయవలెనని ఖుర్ ఆన్ ఆజ్ఞాపించుచున్నది.

ఖుర్ ఆన్ ఒకదేశమునకుగాని ఒకజాతికిగాని ఒక కాలమునకుగాని మాత్రమే అన్వయించు ధర్మగ్రంథముకాదు. అది పూర్తి మానవసంఘమునకు సర్వకాల సర్వావస్థలయందుకావలయు ధర్మసూత్రములను ప్రతిపాదించుచున్నది. ఒక్కొక్క కాలమున, కొన్ని పరిస్థితులలో బహుభార్యాత్వము తప్పనిసరియగును. అట్టి పరిస్థితులలో మొదటిభార్యను విడిచిపెట్టివేసిగాని, లేక రహస్యముగ తాను కోరిన రెండవ కాంతతో వ్యభిచరించిగాని, పతితు డగుటకంటె తాను కోరిన రెండవ స్త్రీని ధర్మయుతముగ పెండ్లాడి ఇద్దరు భార్యలను న్యాయబుద్ధితో సమాన దృష్టితో చూచుచు వారితో కాపురముచేయుట మేలుకాదా ?* పెద్దపెద్ద యుద్ధములు జరిగినప్పుడు లక్షలాది పురుషులు మరణింతురు. అప్పుడు పురుషుల సంఖ్య కంటె స్త్రీల సంఖ్య ఎక్కువైపోవును. అట్టిపరిస్థితులలో పెక్కుండ్రు స్త్రీలు భర్తలను పొందలేక వ్యభిచారమునకు దిగి తమకే కాక జాతియంతటికిని కళంకమై యుందురు. అట్టిచో బహుభార్యాత్వము వాంఛనీయముకదా ? గత ఐరోపా మహా యుద్ధానంతరము యూరప్ ఖండములో స్త్రీల సంఖ్య హెచ్చుగుటవలన సంభవించిన అవినీతిరోగము నేటికిని యూరప్ ఖండవాసులకు తలవంపైయున్నది. ఇట్టిప్రత్యేక పరిస్థితులయందు ఖుర్ ఆన్ బహుభార్యాత్వమునకు అనుజ్ఞ నొసగుచున్నది.

౯౩. ఇస్లామ్‌లో వివాహము ఒక స్త్రీకిని ఒక పురుషునకును మధ్యజరుగు ఒక ఒడంబడిక. స్త్రీపురుషులు స్వేచ్ఛతో సాక్షులముందు తాము భార్యాభర్తలమై యుండుట కంగీకరించి చేసుకొను ఒడంబడికయే వివాహము. ఈ అంగీకారమునకు ఇస్లామీయ ధర్మశాస్త్రములో “ఈజాబ్ వ ఖుబూల్” అందురు. ఇది వివాహవిధి యందలి మొదటి ముఖ్యాంశము. ఈ సమయమున ‘ఖుత్బా’ లేక ‘హితోపన్యాసము’ నొకటి ఇచ్చుట శ్రీ ప్రవక్త నెలకొల్పిన సంప్రదాయము.

మహర్ యొక్క నిర్ణయము రెండవ ముఖ్యాంశము. మహర్ అనగా ‘శుల్కద్రవ్యము’ అని నేను బ్రాకెట్లలో వ్రాసితిని. వధువునకు వివాహకాలమున

---

* గార్హస్థ్యధర్మములను నెరవేర్చుచు పుత్రవతి యగు భార్యయున్నప్పుడు మరొక స్త్రీని పెండ్లాడరాదనియు, భార్యపుత్రవతి కానిపక్షమునను, తనతో గార్హస్థ్యధర్మములను నెరవేర్ప నిచ్ఛగించకయు నెరవేర్పజాలకయు నున్నపక్షమునను మరొక భార్యను పెండ్లాడవలెనని మను (IX 80, 81) యాజ్ఞవల్క్య (1-73) ఆపస్తంబులు (II 5, 11, 13—14) ను, విష్ణుధర్మసూత్రకారుడును అనుచున్నారు.

వరుడిచ్చు ధనమునకు 'మహర్' అందురు. ఈ ధనము వరుడు వధువు తండ్రికిగాని, ఆమె సంరక్షునకుగాని ఇచ్చు ధనముకాదు. మహర్ ధనము పూర్తిగా వధువుది. అది వరుడు తన నూతన వధువున కిచ్చు బహుమానము.

ఖుర్ఆన్‌లో 'మహర్' కు పర్యాయపదములుగా ఈ క్రింది శబ్దములు వాడబడినవి :—

(1) 'అజ్ర్' అనగా 'బహుమానము' లేక 'వధువున కివ్వబడు బహుమతి', 'కేవలము లాభముతో కూడి కించిత్తైనను నష్టములేని బహుమతి' అని రాగిబ్ అను నిఘంటుకారుడు.

(2) 'సదుఖా' అనగా 'సత్యసంధతతో లేక ధర్మనిర్వహణార్థము చేయ బడినది లేక ఇవ్వబడినది.' ఈ సూక్తమున ఇదే శబ్దము వాడబడినది. ఇదే ధాతువు నుండి ఉత్పన్నమైన 'సదుఖాత్' అను శబ్దముకూడ వాడబడినది.

(3) 'ఫరీజా' లేక విధివిహితమైనది.

మహర్ అన్న శబ్దము ప్రవక్త ఉపదేశ గ్రంథములలో (హదీస్) మాత్రము వాడబడి ఇప్పుడు పారిభాషికపదమైనది. ఖుర్ఆన్ మహరునకై వాడిన పర్యాయ పదములే మహర్‌యొక్క అర్థమును వివరించుచున్నవి. ఎంత చిన్న మొత్తమైనను సరే మహర్ తప్పక ఇవ్వవలెనని ప్రవక్త ఆదేశము.

**'మహర్' ఎంత ఇవ్వవలెను ? అన్న విషయమునుగూర్చి ఖుర్ఆన్ సూచించిన గురి ఇది : "కలిగియున్నవాడు తన శక్త్యనుసార మీయవలెను. బీదవాడు తన స్థితి ననుసరించి యివ్వవలెను. సుకృతమొనర్చువారి కిది విధి విహితము." (2 : 236)**

వధువుయొక్క హోదానుబట్టి మహర్ ద్రవ్యము నిర్ణయించుట సంప్రదాయము. వధువుయొక్క అక్కలయొక్కగాని, ఆమె తండ్రి అక్కచెల్లెండ్రయొక్కగాని, పినతండ్రి కూతుండ్లయొక్కగాని మహర్ ధనమునుబట్టి ఆమె మహర్ నిర్ణయింప వలెనని ముస్లిమ్ ధర్మశాస్త్రకారులు†. అనగా తండ్రియొక్క వంశమువారి ఆర్థిక హోదా ననుసరించి మహర్ ధనముండవలెను.

వివాహ సమయముననే మహర్ ధనమిచ్చివేయుట ఉత్తమపక్షము. ఒక సారి అట్లివ్వలేకపోయినచో వరుడు వాగ్దానముచేసిన మొత్తమున కతడు శాశ్వత ముగ ఆమెకు ఋణపడియుండును. ఆమె ఎప్పు డడిగిన అప్పుడు వరు డామె కా

† హిదాయా, సం. I పుట 304.

ధనమును ఇవ్వవలసియుండును. అతని మరణానంతరముకూడ అతనిఆస్తి పంపకము సమయమున మహర్ ధనము అతని ఆస్తినుండి తీసి భార్యకీయవలెను.

మహర్ హిందూలాలో హిందూ స్త్రీల 'స్త్రీధనము' కాదు. ముస్లిమ్‌భార్యకు 'స్త్రీధనము', 'మహర్' ధనము, భర్త ఆస్తియందు భాగము, తండ్రి ఆస్తియందు భాగము, పుత్రుని ఆస్తియందు భాగము—ఈ విధముగ ఆర్థిక స్వాతంత్ర్యమునకు వలయు సమస్త అవకాశములును కల్పింపబడినవి.

'మహర్' ముస్లిమ్ వనితలకు ఇన్సూరెన్సు వంటిది.

*  *  *

౯౪. స్త్రీలకు ఆస్తియందు భాగము ఇస్లాముకుపూర్వము ఏమతమును ఇవ్వలేదు. పురుషునితో స్త్రీకి సమానత్వమిచ్చి, దానితో ఆమెకు స్వాతంత్ర్యమును ప్రతిపాదించి, ఆ స్వాతంత్ర్యమును సమానత్వమును నిలబెట్టుకొనుటకై కావలసిన ఆర్థిక స్వాతంత్ర్యమును ఖుర్ఆన్ స్త్రీకిచ్చినది. ఇంగ్లీషు 'లా'లో వారసత్వపు పద్ధతి లేనేలేదు. హిందూ ధర్మశాస్త్రకారులు కుమార్తెకు తండ్రిఆస్తియందు భాగమివ్వనేలేదు. అవివాహితయగు బాలికల వివాహవ్యయమునకై మాత్రము అన్నదమ్ములు తమ ఆస్తులనుండి కొంతభాగమును ఖర్చుపెట్టవలెనని ధర్మశాస్త్రకారులు శాసించినారు.* ఇది మిక్కిలి అన్యాయమని కొందరు ఆర్యధర్మశాస్త్ర

*మనుస్మృతి 9వ అధ్యాయము 118వ శ్లోకమున "బాలికలకు అన్నదమ్ములు తమ భాగములనుండి చెరి నాల్గవభాగము నివ్వవలెను." అను మాటలను వ్యాఖ్యానించుచు దాయాభాగకారుడు ఆభాగము వారసత్వముక్రిందకు వచ్చునది కాదనియు, అవివాహితలగు బాలికలకు అన్నదమ్ములు వివాహవ్యయమును భరించుట న్యాయమని మాత్రమే దీని అర్థమనియు చెప్పుచున్నాడు. అన్నదమ్ముల ఆస్తి పెద్దదైనచో నాల్గవభాగ మివ్వనక్కరలేదనియు, వివాహవ్యయమునకు సరిపోయినంత ఇచ్చిన చాలుననియు కూడ దాయాభాగకారు డనుచున్నాడు. ఆస్తి చాల చిన్నదైనచో నాల్గవభాగము సైతమివ్వనక్కరలేదని మేధాతిథి యనుచున్నాడు.

కె. టి. భాష్యం అయ్యంగార్‌గారు, గాంధీజీకి ఈ విషయమున వ్రాసిన ఒక ఉత్తరమందలి ఈ క్రింది వాక్యములను చూడుడు

"The principles of Hindu Law as at present administered are antiquated and opposed to our sense of equity and justice. I shall give a few instances 1. Near and dear relations like the sisters, daughters, daughters in-law, the brother's widow, and the step-mother altogether denied the right of inheritance etc. etc."

Young India dated [3—10—1927]

కొరలు ప్రతిఘటించిరి. వారిలో బృహస్పతి ముఖ్యుడు. కూతురుకూడ కొడుకువలె ప్రత్యంగసంభూతయనియు, అట్టిచో కూతురు బ్రతికి యుండగా మరొక పరాయి వాడు ఆమె తండ్రిఆస్తికెట్లు వారసుడు కాగలడని బృహస్పతి ప్రశ్నించుచున్నాడు (xxv 56). కాని బృహస్పతివంటి సంస్కర్తల మాటలు బధిర శంఖారావములే యాయెను.

యాదులలోకూడ కొడుకులున్నప్పుడు కూతుళ్ళకు వారసత్వపు హక్కులేదు. కొడుకులు లేనప్పుడు మాత్రము కూతుళ్ళు వారసులగుదురు.

ఇప్పుడిప్పుడు ప్రపంచమంతయు స్త్రీలకు ఆస్తి నిప్పించు సంస్కరణమునకై నోరార్చుకొనుచున్నది. అట్టి సంస్కరణమును ఖుర్ఆన్ ఇప్పటికి 14 వందల ఏండ్ల క్రిందటనే శాసించినది. ఇక్కడ ఒక విషయము గమనించదగినది. ఆధునిక నాగరికత, శాస్త్రవిజ్ఞానము ఇంతగా ప్రబలిన ఈ కాలములో ఇట్టి సంస్కరణముయొక్క ఆవసరము గుర్తింపబడుట భావ్యమే. కాని ఏదేశమున స్త్రీ బానిసకంటెను అధమముగ పరిగణింపబడుచుండెడివో, ఏదేశమున స్త్రీశిశువు పుట్టగనే చంపివేయబడుచుండెడివో, ఏదేశమున స్త్రీలు కేవలము చరాస్తిగా భావింపబడి వారసులకు సంక్రమించుచుండిరో అట్టి దేశములో, ఆ అంధకారయుగములో ఇట్టి శాసనములు కావించిన ఖుర్ఆన్ మహత్తు విజ్ఞులు గ్రహింపవలెను.

* * *

౯౫. "పురుషుడు ఇద్దరు స్త్రీలకు సమానమైన భాగమున కర్హుడు." అని ఖుర్ఆన్ శాసించుచున్నది. అనగా కుమారుని భాగమునకు సగము కుమార్తెకు వచ్చును. ఇక్కడ ఒక విషయము జ్ఞాపకముంచుకొనవలెను. ఇక్కడ "కూతురు" వివాహితయైనను వివాహిత కాకపోయినను ఆమెకు ఒకేవిధమైన హక్కుకలదు.

స్త్రీపురుషసంతతిలో ఇట్టి భేదమేల కల్పింపబడినదని ప్రశ్నరావచ్చును. పురుషుడు ఒకే వంశమునకు చెందినవాడైయుండును స్త్రీ అట్లుకాక రెండువంశములకు చెందినదగును. ఆమె పుట్టింటి ఆస్తియందును, భర్త ఇంటి ఆస్తియందును భాగస్తురాలగును. అంతేకాదు వివాహమైనవెంటనే ఆమెకు భర్త ఇచ్చు మహర్ ధనమొకటి వచ్చును. పురుషసంతతికి ఒక్క తమ వంశపు ఆస్తియే సంక్రమించును. ఈ కారణములచే స్త్రీసంతతి భాగము పురుషసంతతి భాగముకంటె తక్కువగ ఉంచబడినది. ఉదాహరణమునకు 1930 లో మైసూరు ప్రభుత్వమువారు నియమించిన హిందూ లా రిఫార్మ్స్ కమిటీవారు ప్రతిపాదించిన చిత్తుశాసనములో సోదరికి సోదరుని భాగమునకు నాలవవంతు మాత్రమే ఇవ్వబడవలెనని శిఫార్సు చేసిరి.

అదికూడ సోదరి అవివాహితయైనచో. ఆమె వివాహవ్యయము ఆమె భాగమునుండియే చేయవలెనని సూచించిరి.*

ఈ సూక్తములో 'పురుషుడు' అనగా 'పురుష సంతతి' యనియు, 'స్త్రీలు' అనగా 'స్త్రీ సంతతి' యనియు అర్థము.

పురుషసంతతిలేక స్త్రీసంతతి యున్నయెడల వారికి మూడింట రెండు భాగముల ఆస్తిలో సమానభాగములు వచ్చును.

**మరణశాసనము :** ఆస్తిలో మూడవభాగముపై మాత్రమే మరణశాసనము చెల్లును. మరణశాసనములో వారసులకు జోక్యములేదు. వారి భాగములు మరణశాసనము క్రిందికి రావు. సాధారణముగ మరణశాసనము వారసత్వపుహక్కులేని బంధుమిత్రులయెడలను, దానధర్మములయెడలను, మాత్రమే చెల్లును. వారసుల ఇష్టముపై వారి భాగములను విభజించికూడ విల్లు వ్రాయవచ్చును.

ఇస్లామ్ ఈవిషయమున చేసిన ఏర్పాటు విజ్ఞుల కాశ్చర్యము గొల్పకపోదు. ఇది ఇప్పుడిప్పుడు ప్రపంచము కనిపెట్టిన ఆర్థికసూత్రములకెంతయు అనుగుణముగనున్నది.

ఇంగ్లీషు వారసత్వపుపద్ధతిలో ఆస్తియంతయు మరణశాసనము ననుసరించియే విభజింపబడును. ప్రతి వ్యక్తియు తనయిష్టమువచ్చినట్లు తన ఆస్తినంతటిని విభజించి మరణశాసనము వ్రాయవచ్చును. ఈ పద్ధతినిగూర్చి Josiah Wedgwood గారు ఇట్లనుచున్నారు.

"Judged by its effects on distribution, our system of inheritance is clearly indefensible on economic grounds"‡

ఇస్లామ్ వారసత్వపు పద్ధతితోపాటు, ఆస్తికలవానికి వాని ఆస్తిపై కొంత స్వాతంత్ర్యమును కూడ ఇచ్చినది. ఇప్పుడు ఫ్రాన్సు, డెన్మార్కు, బెల్జియం దేశములలో కూడ ఆస్తిపరుడు తన ఆస్తిలో మూడవభాగమును తన ఇష్టమువచ్చినట్లు

* "In the case of every unmarried daughter or sister, one-fourth of the share of a brother .. .. provided that the share to which a daughter or sister is entitled under this section shall be inclusive of, and not in addition to, the legitimate expenses of her marriage including a reasonable dowry or marriage portion." *Report on Women's Rights under the Hindu Law presided over by Dewan Bahadur K. S Chandrasekhara Ayer, P 215.*

‡ Josiah Wedgwood, *Economics of Inheritance, P. 201.*

విల్లుమూలముగ ఇచ్చివేయవచ్చును. ఈపద్ధతే ప్రశస్తమయినదని ఇప్పుడు అర్థశాస్త్రజ్ఞులు ఒప్పుకొనినారు. అట్టిపద్ధతిని ప్రవేశపెట్టవలెనని ఇంగ్లాండులో ఆర్థికసంస్కారవాదులు కోరుచున్నారు.

*   *   *

౯౬. స్త్రీ మానవతి. అంతేకాదు. కుటుంబగౌరవము చాలవరకు ఆమెప్రవర్తనముపై ఆధారపడియుండును. ఆమె దుష్ప్రవర్తనురాలైనచో ఆ అగౌరవము ఆమెకేకాదు వంశమంతటికిని అప్రతిష్ఠ తెచ్చును. అందుకే స్త్రీల శీలమును కాపాడుటలో అప్రమత్తులైయుండవలెనని సర్వధర్మములును శాసించినవి.

అన్నిదేశములందును, అన్నికాలములందును వ్యభిచారమునకు కఠినమగు శిక్షలు విధింపబడినవి. ఆర్యధర్మకారులు వ్యభిచారమునకు విధించిన శిక్షకు ఒక ఉదాహరణమును చూడుడు

"వ్యభిచరించిన స్త్రీ ముక్కు, పెదవులు, చెవులు కోసివేసి, వీధులలో త్రిప్పి నీటిలో పడద్రోయవలెను. లేదా నలుగురుచూడు ఒక బహిరంగ ప్రదేశములో ఆమె ముక్కలు ముక్కలుగా కుక్కలచే చీల్చివేయబడవలెను."

-(బృహస్పతి. xxii 16)*

"వివాహితయగు స్త్రీ వ్యభిచారముచేసినచో ఆమె వెంట్రుకలు గొరిగివేయవలెను. ఆమెకు అధశ్శయనము నియమించవలెను. ఆమెకు చెడ్డఆహారము, చెడ్డ వస్త్రములు మాత్రమే ఇవ్వవలెను. విస్తర్భృత్తి, ఎంగిలి శుభ్రపరచుపని ఆమెకివ్వవలెను." (నారదుడు xii 90-91)†

వ్యభిచరించిన భార్యను చంపివేయు అధికారము ధర్మశాస్త్రకారులు భర్తకిచ్చిరి. చైనాలోను ప్రాచీనరోములోను భర్త కట్టి అధికారము కలదు.§ యూదులలో వ్యభిచారముచేసిన స్త్రీని బ్రతికియుండగనే కాల్చివేయు ఆచారముండెడిది.* క్రైస్తవాచార్యులు కూడ వ్యభిచారమునకు మరణశిక్షను విధించిరి.§

---

*అట్లే మనువు viii 371. గౌతమ ధర్మసూత్రములు xxiii 14-15.

† అట్లే యాజ్ఞవల్క్యుడు I. 70.

§ L. T. Hobhouse, Morals in Evolution Vol. 1, P. 198 and P. 214.

* L. T. Hobhouse "Morals in Evolution" Vol. 1., P. 203

§ 'The early reformers considered death as appropriate penalty for adultery.' *Hobhouse, Ibid, P. 228.*

ఈవిధముగ ప్రపంచమందెల్లెడలను వ్యభిచారమునకు అత్యంత కఠినముగ శిక్షలు విధింపబడినవి. ఖుర్ఆన్ ఈవిషయమున ఎంత సున్నితమగు శిక్షను విధించ చున్నదో చూడుడు.

ప్రప్రథమమున ఒక స్త్రీ వ్యభిచారముచేసినదని నిర్ధారణ కావలెను. కేవలము అనుమానము నాధారముగాగొని ఆమెను శిక్షింపరాదు. తమవారిలో అనగా తమ వంశమునకు చెందిన వారిలో నలుగురు సాక్ష్యము నిచ్చినప్పుడే ఆమెదోషము నిర్ధారణ మగును. తరువాత అట్టి స్త్రీని బయటకు వెళ్ళకుండా ఇంట నిర్బంధించి యుంచవలెను.

సూక్తపు చివరిమాటలు చూడుడు "భగవంతుడు వారికేదైన మంచిమార్గము చూపించువరకు (వారినట్లుంచుడు.)"

ఖుర్ఆన్‌లో శిక్షయొక్క ఉద్దేశము సంస్కారము. కాని కసితీర్చుకొనుట కాదు. అట్లు శిక్షపొందిన స్త్రీ సత్ప్రవర్తనురాలైనచో ఆమెకు తిరిగి స్వాతంత్ర్య మివ్వవలెనని ఖుర్ఆన్ ఉపదేశించుచున్నది.

ఇక్కడ ఒకవిషయము గమనించవలసియున్నది. సాధారణముగ స్త్రీలు వ్యభిచరించుటకు కారణములు :

1. **అనుకూలపతి లభింపకుండుట :** దీనికి బాల్యవివాహములు, వధువు సమ్మతిలేకుండ తల్లిదండ్రులు వివాహమొనర్చుట కారణములు.

2. **విధవావివాహ నిషేధము.**

3. **విడాకులు తీసుకొను హక్కు భార్యకు లేకపోవుట** · ఏదేనికారణముచే భార్యాభర్తలయందు ఘనస్పర్ధలు కలిగిగాని, భర్త దుర్మార్గుడై తన్ను హింసించుచుండినగాని, లేక నపుంసకుడైనగాని, మరేయితర దుర్భర కారణములచేగాని భార్య తన భర్తనుండి విడాకులు పొంది అనుకూలపతి నింకొకని బడయు హక్కు ఆమెకు లేకపోవుట.

4 **స్త్రీకి ఆర్థికస్వాతంత్ర్యము లేకపోవుట.**

వ్యభిచారమునకు సాధారణముగ ఇవే కారణములు. ఖుర్ఆన్ రజస్వలానంతరవివాహములను శాసించియు, వివాహమునకు వధువుయొక్క సమ్మతిని ఆవశ్యకమొనర్చియు, విధవావివాహములకు గౌరవప్రదమొనర్చియు, స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యమునిచ్చి ప్రసాదించియు స్త్రీల నైతికనైర్మల్యమునకు తోడ్పడినది.

ముస్లిందేశములలో వ్యభిచారము మిక్కిలి అరుదని ఆ దేశములలో నుండిన పాశ్చాత్యవిజ్ఞానులు వ్రాయుచున్నారు.

*                    *                    *

౯౭. ఇక్కడ 'ఇద్దరు పురుషులు కామాసక్తులై ప్రవర్తించినయెడల' అని కొందరును* 'ఇద్దరు స్త్రీపురుషులు' అని కొందరును♦ అభిప్రాయపడిరి.

అసహజమైన కామదురభ్యాసములలో పురుషులు పురుషులతో ప్రవర్తించుటొకటి. ఈ దురభ్యాసము పారశీకదేశమున ఎక్కువగ వ్యాపించియున్నది. పూర్వకాలమునుండియు మనదేశమునకూడ కొంత యుండినట్లు వాత్స్యాయనకామసూత్రములలో ఇది పేర్కొనబడుటనుబట్టి గ్రహింపవచ్చును.

మనదేశమున ఈ దురభ్యాసము పర్షియాదేశమునుండి దిగుమతియైయుండవచ్చును. ఖుర్ఆన్ కఠినముగ ఈ దురభ్యాసమును నిషేధించుచున్నను ముస్లిందేశమగు పర్షియాయందును, పారశీకనాగరికత నెక్కువగ అవలంబించిన ఉత్తరహిందూస్థానమునందును ఇది వ్యాప్తమైయుండుట మిక్కిలి శోచనీయము. ఏ నాగరికజాతియు లజ్జింపవలసినవిషయ మిది.

*                    *                    *

౯౮. ఈ సూక్తము తుదిభాగమున కావింపబడిన ఆదేశము ఖుర్ఆన్ ప్రతిపాదించిన స్త్రీపురుషసంబంధధర్మమునకు మూలసూత్రమై యున్నది. చూడుడు ఇక్కడ ఖుర్ఆన్ ఏమనుచున్నదో

"స్త్రీలతో వ్యవహరించునప్పుడు దయాదాక్షిణ్యములతోడను, న్యాయముతోడను ప్రవర్తింపుడు. ఒకసారి వారనిన మీకు (ఏ కారణముచేనైనను) అయిష్టముగ నున్నచో (హద్దుల నతిక్రమించకుడు). మీకు వారిలో ఒక్క విషయము అయిష్టముగ నుండిన నుండవచ్చును. కాని భగవంతుడు దానియందే మీ కెంతో శ్రేయస్సు సమకూర్చవచ్చును."

స్త్రీలయెడ సాధారణముగ ఎట్లు ప్రవర్తింపవలెనో మొదటివాక్యమున చెప్పి తర్వాత వచ్చు ప్రశ్నకు ఖుర్ఆన్ జవా బిచ్చుచున్నది.

దయాదాక్షిణ్యములతో ప్రవర్తించుడని చెప్పుచున్నారుకదా, భార్యయందు నా కసహ్యకరమగు ఒక దోషముగాని, ఒక లోపముగాని ఉండినచో వెంటనే నే

---

* జలాలుద్దీన్ సుయూతీ.

♦ జమఖ్షరీ; బైదవీ.

నామెను విడిచిపెట్టుట కభ్యంతర మేమున్నది ?" అను ప్రశ్న రావచ్చును. ప్రతి జీవియందును ఏదో ఒక దోషము, ఏదో ఒక లోపము ఉండుట సహజము. తరువాత మన మొకరిలో జూచు దోషము నిజముగా దోషము కాకపోవచ్చును. మనము ఒకరిలో ఉన్న దనుకొనుచున్న లోపము మనకు తుదకు ఉపకారకరమై పరిణమించవచ్చును అని ఖుర్ఆన్ జవా బిచ్చుచున్నది.

ఒకొక్కప్పుడు ఇతరులయందు మన మేవి దోషము లనుకొందుమో, ఏవి లోపములని భావింతుమో అవి దోషములు కాకపోవచ్చును, ఆ లోపములే గుణములై పరిణమించవచ్చును. అందుచే తొందరపడి స్త్రీలను విడిచిపెట్టిగాని, వారిని బాధించిగాని, వారిని దూషించిగాని హింసించుటకంటె వారిని దయాసౌహార్దములతో చూచి వారి లోపములను, దోషములను సహనదృష్టితో చూడవలసినదని ఖుర్ఆన్ ఆదేశము.

* * *

౯౯. ఇక్కడ తిరిగి ఖుర్ఆన్ స్త్రీలహక్కులనుగూర్చి మరొకసారి నొక్కి వక్కాణించుచున్నది. స్త్రీల కొకసారి ఇచ్చిన ధన కనక వస్తు వాహనములను తిరిగి పరిగ్రహింపరాదని చెప్పుచున్నది. కొందరు వివాహసమయమున ఆభరణాదులను ఇచ్చి తరువాత తీసుకొందురు. వివాహసమయమున మహరు ఇంత ఇత్తుమని చెప్పి తర్వాత కొంత తగ్గింపించుకొందురు. వివాహసమయమున చేసిన ఒడంబడికలను తర్వాత చెల్లింపరు. ఖుర్ఆన్ ఇట్టి చెడునడతను ఖండించుచు స్త్రీలకు కావించిన ఎట్టి వాగ్దానమునైనను చెల్లించవలెననియు, వారి కిచ్చిన ఏ ఆస్తియైనను తిరిగి పరిగ్రహింపవలదనియు ఆదేశించుచున్నది.

* * *

౧౦౦. తండ్రుల భార్యలను పుత్రులు తక్కిన ఆస్తితోపాటు బడయు దురాచారము ఒక్క అరేబియాలోనే కాక పెక్కితరదేశములందును ఉండెడిది. హాబ్ హౌస్ పండితుడు ఇట్లనుచున్నాడు

**" In many cases a son inherits his father's wives, with the exception of his own mother, along with the rest of the family property."**§ (పెక్కు సందర్భములలో కుమారుడు తనతల్లితప్ప తనతండ్రి తక్కిన భార్యలను ఇతర కుటుంబ ఆస్తితోపాటు గ్రహించును.)

ఖుర్ఆన్ ఈ దురాచారమును కఠినముగ నిషేధించుచున్నది.

* * *

---

§ Morals in Evolution, Vol. i. P. 146.

౧౦౧. ఈ అధ్యాయము మొదటి 30 సూక్తములయందును నిషేధింపబడి నవి మహాపాతకములని అతినింద్యమగు ఈ మహాపాతకములనుండి "మీరు తప్పించుకొనినచో, మీయందలి తక్కిన చెడుగుల నన్నిటిని తొలగించివైతును" అని భగవంతుడు ఈ సూక్తమున చెప్పుచున్నాడని కొందరు వ్యాఖ్యాతలు.†

సాధారణముగ మహాపాతకములు ఏడని (శ్రీ) ప్రవక్తయొక్క పెక్కుపదేశములలో కానవచ్చుచున్నది. ఇబ్నెకసీర్ అను వ్యాఖ్యాత దీనికి సంబంధించిన ప్రవక్తృవచనములన్నియు సంకలితపరచెను. ఇందు పేర్కొనబడిన పాపములు ఈ క్రింద ఇవ్వబడుచున్నవి :

బహుదైవతారాధనము
హత్య
వడ్డీ తీసుకొనుట
చేతబడి మున్నగు మంత్రతంత్రములు
తల్లిదండ్రులులేని పిల్లల ద్రవ్యమును హరించుట
ధర్మయుద్ధమున వెనుజూపుట
పవిత్ర యగు స్త్రీకి వ్యభిచారదోష మాపాదించుట
తల్లిదండ్రులను హింసించుట
మద్యపానము
వ్యభిచారము
చౌర్యము
దోపిడి
ఒరుల ఆత్మగౌరవమును భంగపరచుట
అసత్యము పల్కుట
అబద్ధసాక్ష్యము నిచ్చుట.

పై పాపములు మహాపాతకము లనబడునని శ్రీ ప్రవక్తృవచనముల వల్ల గ్రహింపనగును. ఈ పాపములను భగవంతుడు క్షమింపడని ఖుర్ఆన్ చెప్పుచున్నది.

* * *

౧౦౨. బుద్ధిప్రతిభలయందును, శారీరకముగను స్త్రీ పురుషులలోకల హెచ్చు తగ్గులవల్ల పురుషునకు సహజముగ స్త్రీపై ఆధిక్యత కల్గినది. పురుషునకు కల బుద్ధి

† తఫ్సీరె ఇబ్నెజరీర్‌లో హజరత్ ఇబ్నెమసఊద్‌గారు చెప్పినట్లు కలదు.

ప్రతిభలు స్త్రీకి లేకపోవుటను ఇప్పుడు పాశ్చాత్యశాస్త్రజ్ఞానము నిరూపించినది. అంతేకాదు. పురుషుడు శారీరకముగ స్త్రీకంటె ఎక్కువ అనుకూలపరిస్థితులలో ఉన్నాడు. స్త్రీ నెలకు మూడుదినములు ఋతుస్రావముచే మైలపడియుండును. గర్భవతియై అథమము 2 నెలలు పనిచేయ నశక్తురాలై యుండును. పురుషుని వలె స్త్రీ బరువయిన పని చెయ్యజాలదు. అందుచే సహజముగ ఆడకూలీలకు ప్రపంచమందెల్లెడలను కూలి తక్కువ. స్త్రీకి శిశుపోషణ మొక విధాయక కృత్యముగ నుండుటచే సాధారణముగ ఆమె కుటుంబపోషణమునకు ధనసంపాదనము చేయగలుగు స్థితియందుండదు. అందుచే పురుషుడు కుటుంబపోషకుడుగ నుండ తటస్థించినది. తనయొక్కయు తన పిల్లలయొక్కయు పోషణమునకు స్త్రీ పురుషునిపై ఆధారపడవలసివచ్చినది. ఈ కారణములచే పురుషునకు స్త్రీపై ఆధిక్యత కల్గినది. ఇది సహజము, నైసర్గికము.

ఇప్పుడు స్త్రీలు పురుషులతో పోటీచేసి మొగరాయళ్ళగుటకు ప్రయత్నించుచున్నారు. పురుషులకు మనపై ఆధిక్యమేల యుండవలెనని వాదించుచున్నారు. ఇట్లు పోటీపడుట కూడదనియు, పురుషుని ఆధిక్యతయెడ ఈర్ష్యవహించ కూడదనియు ఖుర్ఆన్ చెప్పుచున్నది.

ఒకరి ధన ధాన్య విద్యాసంపత్తిని చూచి యొకరు ఈర్ష్య వహించ కూడదనియు, ఈ సూక్తము కేవలము స్త్రీపురుషసంబంధములనుగూర్చిమాత్రమే చెప్పినది కాదనియు కొందరు వ్యాఖ్యాతలు.*

* * *

౧౦౩. స్త్రీకంటె పురుషు డధికు డని ఇక్కడ స్పష్టముగ చెప్పబడినది. ఇట్లనుట ఖుర్ఆన్ ప్రతిపాదించిన స్త్రీస్వాతంత్ర్య సిద్ధాంతమునకు వ్యతిరేకము కాదు. స్త్రీస్వాతంత్ర్యము ఒక నైతికవిధి, స్త్రీపురుషభేదము ఒక భౌతికధర్మము. నైసర్గికముగ స్త్రీ పురుషునికంటె శారీరకముగ అబల; బుద్ధిప్రతిభలయందుకూడ ఆమె పురుషునికంటె తక్కువయే. పై నోటులో వివరించిన కారణములచే పురుషుడు కుటుంబపోషకుడుగను, సంరక్షకుడుగను, ఇట్లు స్త్రీకి అన్నివిధముల భర్తగను ఐనాడు. అందుచే స్త్రీ తన భర్తకు విధేయురాలై యుండుట అవసరమాయెను.

* * *

* ఇబ్నెఅబ్బాస్‌గారి అభిప్రాయమైనట్లు ఇబ్నెకసీర్, సం. 5, పుట 17.

౧౦౪. భార్య అనుకూలవతియై లేనప్పుడు భర్త ఆమెయెడ ఎట్లు ప్రవర్తించవలెనో ఖురాన్ ఇక్కడ చెప్పుచున్నది. ఇందులో ఎంత సున్నితమగు మనస్తత్వము కన్పించుచున్నదో చూడుడు (1) మొట్టమొదట అనునయించి బుద్ధిచెప్పుట. (2) తర్వాత ఆమెను తన పరుపునుండి వేరుచేయుట. (3) పిమ్మట మెల్లగా కొట్టుట. సామాన్యమగు తగవు లింతటితో తీరిపోవును.

ఈ పరిస్థితులలో ఆర్యధర్మశాస్త్రకారు లేమనుచున్నారో చూడుడు

“భర్తయెడ యెల్లప్పుడు ఈర్ష్య కనబరచుచు, పరుషవాక్కులనాడుచు, భర్త రాకపూర్వమే తాను భుజించుచు ఉండు స్త్రీని భర్త ఇంటినుండి వెంటనే వెడల గొట్టవలెను.”

“గొడ్డాలగు భార్యను భర్త ప్రేమించరాదు. అట్లే ఎల్లప్పుడు ఆడపిల్లలనే కనునట్టియు, దుష్ప్రవర్తన కలదియు, భర్తకు ఎదురాడునదియు నగు స్త్రీతో సంగమించిన భర్త స్వయముగ భ్రష్టుడగును”

అని నారదుడు (xii . 93-94) చెప్పుచున్నాడు.

మనువు (ix. 80, 81), యాజ్ఞవల్క్యుడు (I 73) కూడ ఇట్టి పరుషప్రవర్తనమునే శాసించుచున్నారు.*

యూరపులోకూడ ఇటీవలివరకు భర్తకు భార్యపై అపరిమితమైన అధికారముండెను. ఈ విషయముపై L. T. Hobhouse గారి ఈ క్రింది వాక్యములను గమనించుడు.

**“In Normandy, in the XIII century, it is held that a man could not be prosecuted for beating his wife. It is the same in other parts of France though in Flanders the magistrates condemned a husband for beating his wife till the blood flowed.” (Vol. I., P. 224)**

(పదమూడవ శతాబ్దములో నార్మండీయందు భార్యను కొట్టినందుకు భర్తపై అభియోగము చెల్లకుండెను. ఫ్రాన్సుదేశమందలి ఇతరభాగములందు కూడ ఇంతే. ఫ్లాండర్సులో ఒక భర్త తనభార్యను రక్తము వచ్చునంతవరకు కొట్టెనని న్యాయాధికారి ఖండించెను.)

* * *

---

* Colebrook's Digest IV, 1,63 కూడచూడుడు.

౧౦౫. భార్య అనుకూలవతిగ లేనప్పుడు భర్త అవలంబించవలసిన మూడు పద్ధతులు వెనుకటి సూక్తమున వివరింపబడినవి. ఈ సూక్తమున నాల్గవ పద్ధతి చెప్పబడుచున్నది.

అనునయించి బుద్ధి గరపినను వినక, తన పక్కపై రానీయకపోయినను భయపడక, కొట్టినను బుద్ధి తెచ్చుకొనక వెనుకటివలెనే ప్రవర్తించు భార్యవు హితవుగరపుటకు భర్త తనపక్షమువాని నొకని, తన భార్యపక్షమువాని నొకని, ఇట్లు ఇద్దరు మధ్యవర్తులను నియమించి ఆమెకు బుద్ధి చెప్పించవలె నని ఖుర్ఆన్ బోధించుచున్నది. ఆ మధ్యవర్తులు సాధ్యమైనంతవరకు భార్యాభర్తలలో ఐకమత్యము కల్గించుటకు యత్నించవలెను. ఈ విధముగ తిరిగి ఐకమత్యము కలిగినచో భర్త తన భార్యతో ఎప్పటియట్ల దయతో ప్రవర్తించవలెను. ఆమెయందు దోసగులు వెతుకు ప్రయత్నము చేయరాదు.

*　　　*　　　*

౧౦౬. ఇక్కడ 49, 50 సంఖ్యగల సూక్తములలో కులతత్త్వమును ఖుర్ఆన్ మరొకసారి ఖండించుచున్నది. ప్రతిదేశమునందును ఏదో ఒక కులమువారు తాము ఆజన్మపవిత్రుల మని చెప్పికొని తక్కిన జాతులను హీనసజాతులుగ గణించుట కలదు. యూదులు తమకంటె ఉన్నతమగు జాతి ప్రపంచములో లేదనియు, భగవంతుడు తమ్ము ప్రత్యేకముగ ఎన్నుకొనె ననియు చెప్పుదురు. అట్లే మనదేశమున బ్రాహ్మణులు తాము ఆజన్మపవిత్రుల మని చెప్పుదురు. బ్రాహ్మణుడు వివేకియైనను అవివేకియైనను దైవమే నని మనువు (9. 317) చెప్పుచున్నాడు.*

* మహాభారత అనుశాసనికపర్వమున భీష్ముని ధర్మజుడు

'బ్రాహ్మణ్య మవులజాతుల మాటకు
జనియించినవానికి దొర
కొనునొకొ యతివిమలకర్మగుణయోగమునన్ ?'

అని అడుగును. దానికి భీష్ముడు "బ్రాహ్మణత్వంబు గడు దుర్లభము" అని ఇంద్రమతంగసంవాద మను ఉపాఖ్యానమును చెప్పును. అందు ఇంద్రుడు పరమతపస్విలు డైన మతంగునితో "ఇత్తెఱంగు తపంబునను బది మడుంగులు సేసి చండాలుండు శూద్రుం డగు. నూఱు మడుంగు లనుష్ఠించి శూద్రుండు వైశ్యుం డగు. వేయి మడుంగు లాచరించి వైశ్యుండు క్షత్రియుం డగు. అప్పుణ్యాచరణంబునం బదివేలుమడుంగులు నిర్వర్తించి క్షత్రియుండు దుర్బ్రాహ్మణుం డగు" నని చెప్పును. ఈవిధముగ జన్మచేతనే బ్రాహ్మణుడు దైవసమానుడని ఆర్యధర్మశాస్త్రకారుల మతము.

ఆధునిక యుగములోకూడ పాశ్చాత్య దేశములలో సైతము తెలుపు నలుపు, ఎరుపుతెలుపు భేదములపై ఏర్పడిన హెచ్చుతగ్గులు ఎంతో అంతర్జాతీయ విద్వేషమునకు కారణమగుచున్నది. ఆఫ్రికాలో నల్లజాతులును, అమెరికాలో నీగ్రోలును, మన దేశములో అబ్రాహ్మణజాతులును తమకంటె అధికులనుకొనుచుండిన తెల్ల జాతులయొక్కయు, బ్రాహ్మణాది జాతులయొక్కయు బాధలను ఇంకను అనుభవించుచున్నారు. తెల్లవారిపేటలలో నీగ్రోలుండరాదు. తెల్లవారికిచ్చు కూలి నల్ల వారి కివ్వరు. తెల్లవారి పాఠశాలలలోగాని, చర్చిలయందుగాని నల్లవారు రాకూడదు. తెల్లవారి హొటళ్లలో నల్లవారికి ప్రవేశములేదు. తెల్లవారి చదువువేరు నల్ల వారి చదువువేరు. మనదేశములోను బ్రాహ్మణాబ్రాహ్మణులలో ఇట్టిభేదములే యున్నవి. ఇప్పుడు దక్షిణాఫ్రికాలో నల్లవారిపై జరుగుచున్న దౌర్జన్యములకు మన మెంతయో ఆందోళనముచేయుచున్నాము. మనము మనదేశములో మనవారికి సమానత్వ స్వాతంత్ర్యముల నివ్వకయే ఇతరులను ఖండించుచున్నాము. ఇతరులు మనలను నీచముగ జూచినప్పుడు మన కెట్టి బాధ కలుగునో తెలిసినప్పుడే మనముకూడ మన తోడిజాతులయెడ ఉదారముగ ప్రవర్తింతుమేమో.

ఈ మన స్తత్త్వమంతటికిని మూలము ఒకజాతిసహజముగ పవిత్రమైనదనియు, మరొకజాతి సహజముగ నీచమైనదనియు యెంచుటయే. ఇట్టి భావము మన కుల తత్త్వమునకు మూలమై యున్నదని అందరకు తెలిసినవిషయమే కాబట్టి ఇక్కడ వివరముగ తెలుపనైతిని. పాశ్చాత్యఖండములందు కూడ ఇట్టిభావమే దీనికి మూల మనుటకు డాక్టర్ వూఫ్టర్ గారి ఈ వాక్యమును చూడుడు

**"White people assumed that subordination was natural or divinely decreed status of the Negro, and Negroes had a traditional subordination to live down."§**

అందుకోసమే పాశ్చాత్య దేశములలో తెల్లవారు నల్లజాతులకు మతములో కూడ సమానత్వమిచ్చినారు కాదు. తెల్లజాతుల చర్చివేరు. నల్లజాతుల చర్చివేరు. అంతేకాదు. నల్లవారి పాఠశాలలువేరు. తెల్లవారిపాఠశాలలు వేరు. వారి పేటలు వేరు; వీరి పేటలువేరు. తెల్లవాండ్ర పార్కులలో, హొటళ్ళలో, నాటకశాలలలో నల్లవారికి ప్రవేశములేదు. అన్నిటికంటె ఆశ్చర్యకరమైన విషయమేమనగా రైల్వే

---

§ Dr. T J. Woofter, Jr. Ph. D., '*Agencies for inter - racial Co-operation in the United States*' in '*Christian Mission in the Light of Race Conflict*', *P. 25.*

స్టేషనులలో రెండుజాతులకును వేరువేరు గేట్లు కలవు. ట్రాములలోను, బస్సుల లోను నల్లవారి సీట్లువేరు.‡

మానవమనస్తత్త్వము భారతదేశమునందున్నను పాశ్చాత్యదేశములందున్నను, ప్రాచీనకాలమందున్నను, ఆధునికయుగమునందున్నను ఒకటే. ఈ జాత్యుత్కర్ష భావము అప్పుడూ, ఇప్పుడూ, ప్రాగ్దేశములలోను, పాశ్చాత్యదేశములందును కూడ ఉండినట్లు స్పష్టమైనది. ఈ దృష్టితో చూచిన యెడల ఇస్లామ్ మానవ మనస్తత్త్వములో కావించిన అపూర్వ విప్లవముయొక్క విలువ తెలియగలదు.

జెరూసెలెమ్‌లో జరిగిన అంతర్జాతీయ మిషనరీ కౌన్సిలులో మాట్లాడుచు ప్రొఫెసర్ జబావూగారు చెప్పిన మాటలు గమనింపుడు

One of the great difficulties in the way of black people in South Africa building up their own Church is the feeling that *even under Christian missions there is no equality in Church or State. Islam is gaining more African adherents because of the attitude on this question* . . The Government enacts all sorts of laws against black races, just because of their colour . . There is land segregation .. .. .and social segregation . . ..In Pretoria I cannot ride in a train "†

‡ "In the South (States of North America) statutes prescribe seperation on common carriers, in schools and in public places .. .. .. As the Negroes have increased, some Northern cities have tried to set up separate schools and some owners of theatres and restaurants employ subtle means to exclude Negroes . .at one place they (Negroes) enter the railway station through the same gate with white people but at another they use a different gate, at one place they are seated at the front of the street car and at another at the rear." *Ibid P. 28.*

" At Post office, bank, railway station and all public buildings he (the South African native) must seek separate counters and often finds proper and more ungracious service."

*Rev. J. Dextor Taylor, Relations between the Black and White races in South Africa. (P. 113)*

† Missions and Race Conflict, Proceedings of the Jerusalam Meeting, Vol IV, P. 223 ప్రొఫెసర్ జబావూగారూ బహుశా దక్షిణాఫ్రికా దేశపు నల్లజాతి విద్వాంసుడై యుండవలెను. ఈయన ఇస్లాంమత మిచ్చిన సర్వజాతి సమానత్వమునుగూర్చి చెప్పినమాటలను మిషనరీకౌన్సిలువారు తమ రిపోర్టులో తీసివైచి చుక్కలు పెట్టిరి.

ఒక్క ఆఫ్రికాఖండమునందే కాదు. ప్రపంచమందెల్లెడలను అణగద్రొక్క బడిన జాతులన్నియు ఇస్లామ్ మతముయొక్క ఒడియందే ఆశ్రయమును పొందెను.

ఇక్కడ శ్రీ మొహమ్మద్ ప్రవక్త జీవితచరిత్రమునుండి ఒకఅంశ ముల్లేఖించుట అప్రస్తుతము కాదు. ఒకనాడు శ్రీవారికడకు ఒక అబిసీనియాదేశపు నీగ్రో వచ్చి "ఒక సందేహము కలదు" అనెను.

శ్రీ ప్రవక్త నిర్భయముగ జెప్పి సందేహనివృత్తి గావించుకొనుము.

నీగ్రో ఓ భగవత్ప్రవక్తా ! మీరు విశ్వసించుచున్న సత్యములయందే నేనును శ్రద్ధాభక్తులుకలిగియుండి, మీ రనుసరించుచున్న విధులనే నేనును అనుసరించినచో స్వర్గములో మీకు సమానమైన స్థానము నాకు లభించునా ?"

శ్రీ ప్రవక్త "తప్పక లభించును."*

* * *

౧౦౪. "మీపై అధికారము వహించియున్నవారికి విధేయులై యుండుడు." అని ఖుర్ఆన్ ఈ సూక్తమున ఉపదేశించుచున్నది. అనగా మనపై అధికారము వహించియున్న ప్రభుత్వమునకు విధేయులై యుండుడని దీని భావము.

ఐతే మనపై అధికారము వహించియున్న ప్రభుత్వము ధర్మముతో ప్రవర్తించక, నిరంకుశమైయున్నప్పుడు కూడ విధేయులై యుండవలెనా ? అన్న ప్రశ్న దీనిపై రాకమానదు.

ఈ ప్రశ్నకు జవాబు మనకు శ్రీ ప్రవక్త ఉపదేశములలో లభించగలదు. శ్రీ ప్రవక్త అధికారవర్గమునకు విధేయతను శాసించుచు, అట్టి అధికారవర్గముకాని, పరిపాలకుడుకాని న్యాయబద్ధమును, ధర్మబద్ధమును అగు ఆజ్ఞలనిచ్చినప్పుడే విధేయులై యుండవలెననియు, అట్లుకాక న్యాయబద్ధము కానట్టియు, దౌర్జన్యపూరితమైనట్టియు ఆజ్ఞలను ధిక్కరించవచ్చుననియు శ్రీ ప్రవక్త కావించిన ఉపదేశముల వల్ల స్పష్టమగుచున్నది. చూడుడు విధేయతను శాసించుచు శ్రీ ప్రవక్త కావించిన ఉపదేశములు

"మీపై ఒక నీగ్రోబానిస పరిపాలకునిగా నియమింపబడినను వానికి విధేయులై యుండుడు" (బుఖారీ)

---

* తఫ్సీరె ఇబ్నెకసీర్ సం. 5, పుట 56.

"వికలాంగుడైన ఒక నీగ్రోబానిసయైనను మీపై పరిపాలకుడుగా నియమింపబడి భగవద్గ్రంథము ననుసరించి మిమ్ములను పరిపాలించుచుండినచో వాని మాట వినుడు దాని ప్రకారము చేయుడు." (ముస్లిం)

ఐనను ఇట్టి విధేయత సత్పరిపాలకులయెడల, న్యాయబద్ధమైన ఆజ్ఞలు వారిచ్చినప్పుడు మాత్రమే చూపవలె ననుటకు ఈ క్రింది ఉపదేశములను చూడుడు

"ఒకప్పుడు ప్రవక్త ఒక చిన్నసైన్యమును ఒక అన్సారీ ఆధిపత్యము క్రింద పంపెను. ఒకనాడేదో సందర్భమున ఆ దళాధిపతి మిక్కిలి ఆగ్రహపరవశుడై సైనికుల నుద్దేశించి, 'నాకు విధేయులై యుండుడని శ్రీ ప్రవక్త మీ కాజ్ఞాపించియుండలేదా ?' అని ప్రశ్నించెను. 'అవును' అని అందరు జవాబుచెప్పిరి. 'ఐనచో కట్టెలను ప్రోగుచేయుడు' అని అతడు ఆజ్ఞాపించెను. సైనికులందరును కట్టెలు పోగుచేసిరి. వానికతడు నిప్పు ముట్టించి 'మీరందరు ఈ నిప్పులో దూకుడు' అని వారి నాజ్ఞాపించెను. అప్పుడు ఒక యువకుడు లేచి 'సోదరులారా! అగ్ని* నుండి రక్షింపబడుటకు మీరు శ్రీ ప్రవక్త నాశ్రయించితిరి. శ్రీ ప్రవక్త ఆజ్ఞ వినువరకు మీరు తొందరపడకుడు. వారి ఆజ్ఞయైన మనము తప్పక నిప్పులో దూకుదము' అని వారిని వారించెను. సైన్యము మరలివచ్చి శ్రీ ప్రవక్తను దర్శించెను. జరిగినదంతయు శ్రీవారికి వినిపించిరి. అంతయు విని శ్రీప్రవక్త "నిప్పులో దూకియుండినచో మీరు నిత్యము అగ్నియందే ఉండియుందురు. వినుడు విధేయత మంచి ఆజ్ఞలకే !"

(బుఖారీ)

"ధర్మబద్ధమగు ఒక మాటకు వ్యతిరేకముగ నడుచుట కిచ్చిన ఆజ్ఞను విననక్కరలేదు." (అబూదావూద్)

ఈ విధముగ ధర్మబద్ధమగు ఆజ్ఞలకే విధేయుడై యుండవలెననియు, అన్యాయమును, అధర్మమును అగు ఆజ్ఞల నుల్లంఘించవలెననియు శ్రీ ప్రవక్త ఉపదేశము.

అధర్మమగు ఆజ్ఞ ఎట్టిది ? అని దీనిపై ప్రశ్నవచ్చును. ఖుర్ఆన్ యొక్కయు శ్రీ ప్రవక్తయొక్కయు ఉపదేశములకు వ్యతిరేకముగనున్న ఆజ్ఞలన్నియు అధర్మ

* 'నరకాగ్ని' అని భావము.

మైనవే. ఉదాహరణమునకు ఒక ప్రభుత్వము దైవప్రార్థనమును నిషేధించినచో అట్టి ఆజ్ఞను ఉల్లంఘించవచ్చును. మరొక ఉదాహరణము ఒక ప్రభుత్వము ఒక ముస్లిం సైనికదళమును మరొక ముస్లింసైనికదళముతో యుద్ధము చేయవలసినదని ఆజ్ఞాపించినచో అట్టి ఆజ్ఞయు ఉల్లంఘింపదగినదే. ఎందుకన ఇది ఖుర్‌ఆన్ ఉపదేశములకు విరుద్ధము.

* * *

౧౦౫. "ఏమి! వీరు ఖుర్‌ఆన్ (యొక్క ఉపదేశముల)ను గూర్చి శ్రద్ధతో యోచింపరా? ఇది అల్లాః కడనుండి కాక మరెవ్వరి కడనుండియైన వచ్చియుండినచో ఇందులో ఎన్నోచోట్ల స్వవచనవ్యాఘాతము లుండియుండును."

ఈ సూక్తములో ఖుర్‌ఆన్ భగవద్వాక్యమనుటకు రెండు నిదర్శనములు చూపబడినవి :

(1) "వీరు (అనగా అవిశ్వాసులు) ఖుర్‌ఆన్ యొక్క ఉపదేశముల గూర్చి శ్రద్ధతో యోచింపరా?" అని ఖుర్‌ఆన్ ప్రశ్నించుచున్నది. ఖుర్‌ఆన్ యొక్క ఉపదేశములు సామాన్యమానవబుద్ధికి సాధ్యమా? అట్టి గొప్ప ఉపదేశములు కావించిన ఖుర్‌ఆన్ భగవద్వాక్యమనుటలో సందేహమేమి? అని ఖుర్‌ఆన్ ప్రశ్నించుచున్నది. వెనుక నోటులలో పలుచోట్ల సూచించినట్లు ఖుర్‌ఆన్ సాంఘిక, ఆర్థిక, రాజకీయ, ఆధ్యాత్మిక విషయములనుగూర్చి కావించిన శాసనములు ఎంత సార్వజనీనికములును, ఎంత సార్వకాలికములును, ఎంతటి సంపూర్ణములును ఐ ఉన్నవో సూచించితిని. ఇప్పుడిప్పుడు భౌతిక, మానసిక శాస్త్రవిజ్ఞానము కనిపెట్టుచున్న గొప్ప సత్యములు ఎన్నడో ఖుర్‌ఆన్ ప్రతిపాదించినది. ప్రపంచచరిత్రములో ఏధర్మగ్రంథమునుకూడ ఇంత సంపూర్ణమైన ధర్మము నిచ్చియుండలేదనిన అతిశయోక్తి కాదు. బైబిల్‌లో సాంఘిక, ఆర్థిక రాజకీయ జీవితమునకు సంబంధించిన ఎట్టి ఆదేశమునులేదు. ఆదేవిధముగ వేదమును, ఉపనిషత్తులును సంపూర్ణమగు ధర్మమును శాసించియుండలేదు. తరువాత వెలువడిన ధర్మశాస్త్రగ్రంథములు పరస్పర భిన్నముగను, ఇప్పటికాలమునకు సరిపడనట్లును ఉన్నవి. తక్కిన మతగ్రంథములను గూర్చికూడ ఇట్లే చెప్పవచ్చును.

ఖుర్ఆన్ అట్లుకాదు. ఖుర్ఆన్ అన్నివిషయములందును మనకు మార్గదర్శన మొనర్చుచున్నది. భౌతికశాస్త్ర విజ్ఞానమునకు విరుద్ధముగ లేదు. ఆధునికసాంఘికశాస్త్రములకును (social sciences) మానసిక, నైతికశాస్త్రములకును (Mental and Moral sciences) విరుద్ధముగలేదు. అంతేకాదు, ఈ శాస్త్రవిజ్ఞానమునకు, శాస్త్ర జిజ్ఞాసకును దోహదమిచ్చినది ఖుర్ఆన్.

ఇప్పుడు ప్రపంచములో శ్రుతులని ఆ యా మతస్థులచే అంగీకరింపబడుచున్న గ్రంథములన్నియు పరస్పర విరుద్ధముగను, ప్రక్షిప్తభాగములతోడను, ఖిలకాండ ములతోడను నిండియున్నవనుట సుప్రసిద్ధము.* భగవంతునిచే ప్రోక్తమైనదానిలో

---

*ఆర్యశ్రుతులను గూర్చి రాధాకృష్ణ పండితుని అభిప్రాయమును గమనింపుడు

"Eeverywhere we had controdictory notions. In religion there was Vedic polytheism and sacrifices tempered by Upanishad monism and spiritual life . . In eschatology, there was the conception of rebirth mixed up with ideas of hell. But the true was overwhelmed by the false, and the chaos of the Brahmanical religion, with all its conflicting theories, soon reached a climax in the post-Upanishad or the pre-Buddhistic Period"

*Sir S Radhakrishnan, Indian Philosophy, Vol. I, 265.*

మరియొకచో ఉపనిషత్తులను గూర్చి వ్రాయుచు శ్రీ రాధాకృష్ణ పండితు లిట్లనుచున్నారు "Not being systematic philosophy, or the product of the same age, they contain much that is inconsistent and un conscious" (*Ibid*, P 138)

"So numerous are their suggestions of truth, so various are their guesses at God, that almost anybody may seek in them what he wants and find what he seeks, and every school of dogmatics may congratulate itself on finding its own doctrine in the sayings of the Upanishads" (*Ibid*, P 140)

బైబిల్నుగూర్చి విట్లె ఫిలిప్స్ పండితుడు ఏమనుచున్నాడో చూడుడు :

"Some of their (the Gospels') statements of fact are quite erroneous, and the data are *often in direct contradiction to one another*"

*Churches and Modern Thought*, P. 62.

"Gospel accounts (of Resurrection) exhibit *contradictions of the most glaring kind.*"

*-Prof. Schmiedel in Encyclopaedia Biblica, art. Resurrection.*

పరస్పరవిరుద్ధములగు వచనములుండుట అసంభవముకదా? ఖుర్ఆన్ భగవత్ప్రోక్త మనుటకు ఇదొక నిదర్శనముగా ఇక్కడ చెప్పబడినది.

* * *

౧౦౯. ఎట్టివారితో యుద్ధముచేయవచ్చునో, ఎట్టివారితో యుద్ధముచేయరాదో ఇక్కడ చెప్పబడినది వైరులైయుండియు తటస్థులైనచో వారితో యుద్ధము చేయరాదు. పైబడి యుద్ధమునకు వచ్చువారితోడనే యుద్ధముచేయవలెనని ఖుర్ఆన్ ఇక్కడ చెప్పుచున్నది. అవిశ్వాసు లందరితోడను యుద్ధముచేయవలసినదని ఖుర్ఆన్ బోధించుచున్నదను మిషనరీల ప్రచారము ఎంత సత్యదూరమో దీనివల్ల తెలియగలదు. ఇట్టి ఆజ్ఞ ఇచ్చినది ఖుర్ఆన్ కాదు. క్రైస్తవ మతాచార్యులే. యూరప్‌లో క్రైస్తవేతరు లగు యూదులను శతాబ్దముల తరబడి క్రైస్తవ ప్రభువులును క్రైస్తవ ప్రజలును ఎంత హింసించిరో చరిత్రప్రసిద్ధము. క్రైస్తవ చర్చి చరిత్రకారులు ఈ విషయమున ఏమి వ్రాసిరో చూడుడు. రాచెస్టర్ యొక్క ఆర్చ్‌డీకన్ ఐయుండిన డాక్టర్ చీతామ్‌గారి మాటలివి

"In the year 353 he (Constantius) forbade heathenish ceremonies *under pain of death and confiscation of goods* Prefects who did not enforce the law were to be liable to the same punishments."‡

"When Theodosius I, one of the greatest rulers of the declining empire, became sole ruler of the empire, he forbade in the most emphatic terms all sorts and conditions of men to offer sacrifice to senseless idols, or even to practise private worship before the domestic shrines. To pour a libation of wine to the tutelary genius or to hang a garland before the penates was made criminal, though heathen worship still lingered in Rome and Alexandria But the zeal of the Christian mobs had outrun the legislation of the emperors ——————Hypatia, a distinguished teacher of Neo-platonistic school at Alexandria. .. . . .... was seized one day by a rabble of Christians and dragged from her carriage into a neighbouring church, where she was killed

‡ S. Cheetham, *A History of the Christian Church P. 201*
పై వాక్యములలోని కాన్‌స్టాంటియను క్రీ. శ. 337 నుండి 361 వరకు పరిపాలించిన క్రైస్తవ రోమన్ చక్రవర్తి.

with potshreds and her body torn limb from limb, carried out and burnt."*

ఖుర్ఆన్‌గాని, ప్రవక్తగాని, ఆయనతర్వాత వచ్చిన ఖలీఫాలు, ముస్లిమ్‌చక్రవర్తులు, రాజులుగాని ఏకాలమునందును ఇట్టి పద్ధతులను అవలంబించలేదని చరిత్ర చదివినవారెల్లరికిని విదితమే. క్రైస్తవమతాచార్యులును, క్రైస్తవపరిపాలకులును తమ మతమును విశ్వసించనివారిని పెట్టిన బాధలు, వారి వ్యతిరేకముగ ఏర్పరచిన నియమములు మున్నగు విషయములు ఇక్కడ దీర్ఘముగ చర్చించుట కవకాశములేదు. వీనినిగూర్చి ఎక్కువగ తెలుసుకొనగోరువారు డాక్టర్ ఎన్. డి. నోక్స్‌గారు వ్రాసిన A History of the Crime of Blasphemy అను గ్రంథమును, చార్లస్ బ్రాడ్లాగారు వ్రాసిన The Laws Relating to Blasphemy and Heresy అను గ్రంథమును, సర్ జేమ్స్ స్టీఫెన్‌గారు వ్రాసిన The History of Criminal Law అను గ్రంథమును, బ్రాడ్లా బోనర్‌గారువ్రాసిన Penalties upon Opinion అను గ్రంథమును చూడవచ్చును.

* * *

౧౧౦. పదునారవ ఖండమున 105 మొదలు 112వ సూక్తమువరకు నేరము చేసి యింకొకరిపై ఆ నేరమును మోపుట మిక్కిలి దుష్కార్యము. ఈ సూక్తములు ప్రోక్తమైన సందర్భమును భాష్యకర్త లీ క్రిందివిధముగ చెప్పుచున్నారు.

బనూఉబైరిఖ్ అను ఒక తెగవారు తాము దొంగతనముచేసి ఆ నేరమును మరియొకరిపై మోపిరి. ప్రవక్త ముందు దొంగతనముచేసిన వారిమాటనమ్మి ఏమియు నెఱుగని ఖతాదాగారిని మందలించిరి. ఆ సందర్భమున ప్రోక్తమైన సూక్తములివి.*

ఏదేని వివాదములో తీర్పుచెప్పుట మిక్కిలి బాధ్యతతో కూడుకున్న విషయము. ఏపక్షమున సాక్ష్యము బలముగానున్న ఆ పక్షమున కనుకూలముగ తీర్పు

---

* Cheetham, *Ibid*, *PP*. 207-208.

"The Roman Catholics have not only the right, but it is their duty to kill heretics."

Pastor Chiniquy, *Fifty years in the Church of Rome* P. 94.

* తిర్మజీ, కితాబుత్తఫ్సీర్. తిర్మజీలో మిక్కిలి దీర్ఘముగ వివరము లివ్వబడినవి. నేను సంక్షిప్తముగ ఇక్కడ ఆవిషయము నుల్లేఖించితిని.

చెప్పుట మానవసహజము. మానవుడు సర్వజ్ఞుడు కాడు. అతని తీర్పులో పొరపాటుండ వచ్చును. అందుచే బలవత్తరమైన సాక్ష్యమును తెచ్చినవారి కనుకూలముగ తీర్పు లభించుట వలన న్యాయాధీశుని మోసగించితిమని ఆ పక్షము తలచవచ్చును. కాని వారు తమను తామే మోసగించుకొనుచున్నారనియు, దానివలన వారికే నష్టమనియు ఇక్కడ ఖుర్ ఆన్ చెప్పుచున్నది.

ఈ సందర్భమున శ్రీప్రవక్త జీవితచరిత్రమునుండి ఒకటి రెండంశముల నుల్లేఖించుట అప్రస్తుతము కాదనుకొందును.

ఒకనాడు శ్రీప్రవక్త తమ ఇంటిబైట ఎవరో ఘర్షణపడుచున్న ధ్వనులు విని వీధిలోనికి వచ్చిరి. పోరాడుచున్నవారు శ్రీప్రవక్తను తీర్పు చెప్పగోరిరి. దానికి ప్రవక్త "చూడుడు. నేను మానవమాత్రుడను. నేను విన్నదానినిబట్టి తీర్పు చెప్పుదును. వాది ప్రతివాదులలో ఒకడు వాదకుశలుడై వాచాలుడై యుండుట సాధ్యము. అప్పుడు నేను వానిమాటలే నిజమని నమ్మి వాని కనుకూలముగ తీర్పు చెప్పవచ్చును. ఒకసారి వాస్తవముగ రెండవపక్షమే న్యాయసమ్మతమై యుండ వచ్చును. అట్టితరి అన్యాయముగ హక్కును పొందినవాడు నరకమునకు పాల్పడును." అని చెప్పి "ఇక మీ ఇష్టము." అని సెలవిచ్చిరి. (బుఖారీ–ముస్లిమ్ రెంటియందును ఈ వృత్తాంతము కలదు.)

ఒక ఆస్తి విషయములో ఇద్దరు క్రైస్తవులకు తగవు సంభవించెను. వారు శ్రీ ప్రవక్త కడకు తమ తగవును తీర్చుడని నివేదించుకొనిరి. శ్రీ ప్రవక్త తీర్పు చెప్పి ఇట్లు సెలవిచ్చిరి "నా ఈ తీర్పు ఆధారముపై మీకు వాస్తవముగ హక్కులేని ఆస్తిని ఆక్రమించుకొనకుడు. అది నరకయాతనయై మీ మెడలకు వేలాడగలదు." ఈ మాటలు విని ఆ క్రైస్తవులు కన్నులనీరు పెట్టుకొని "నా భాగమునుకూడ నా సోదరున కిచ్చివేయుదు"నని ఇద్దరును చెప్పిరి. "అట్లైనచో మీరు పరస్పరముసమాధానపడి ఆస్తిని మీమీ హక్కుల ననుసరించి పంచుకొనుడు" అని శ్రీ ప్రవక్త సెలవిచ్చిరి. ఆ ఇద్దరుసోదరులు సమాధానపడి సుహృద్భావముతో ఆస్తిని పంచుకొనిరి.
(మస్నదె అహమద్)

* * *

౧౧౧. ఏకేశ్వరత్వము ఖుర్ ఆన్ ప్రతిపాదించు ధర్మమునకు పునాది. ఖుర్ ఆన్ గ్రంథమున కాత్మ. అందుచే అన్నివిధముల అసమానుడగు భగవంతునకు సమానులను కల్పించి వారి నారాధించుటకంటె గొప్ప పాతకము ఖుర్ ఆన్ దృష్టిలో మరొకటి లేదు.

ఏకేశ్వరత్వమును నిరాకరించినవాడు ప్రకృతిధర్మము (Natural Law) ను విశ్వసింపడు. మూఢభావములకును తత్ఫలితముగ దురాచారములకును పాల్పడును.* అందుచేతనే ఖుర్ఆన్ దీనితర్వాతిసూక్తములో విగ్రహారాధనము దుష్టుడగు సైతాను పూజయేనని చెప్పుచున్నది. తర్వాత సైతాను ఎట్టివాడో చెప్పుచున్నది

"వారిని (మానవులను) నేను దారితప్పించి వారిలో తుచ్ఛములగు కోరికలను రేకెత్తింతును. వారిలో మూఢవిశ్వాసములను కల్గించి వారు భగవత్సృష్టిని మార్చునట్లు చేయుదును." అని సైతాను శపథము. బహుదైవతారాధనమును, విగ్రహారాధనమును చేయుట అట్టి సైతానును ఆరాధించుటవంటిదని ఖుర్ఆన్ చెప్పుచున్నది.*

* * *

౧౧౨. ఇక్కడ విగ్రహారాధనము, బహుదైవతారాధనముల వల్ల కలుగు నష్టములకు స్త్రీవిగ్రహముల పూజ ఉదాహరణముగ సూచింపబడుచున్నది. మన

---

* ఈ సందర్భమున సర్. ఎస్. రాధాకృష్ణ పండితుని వాక్యములు గమనింపుడు

"We cannot have plurality of Gods, for religious consciousness is against it . ... ..... . .Self-surrender of man to God, the central fact of religious experience, is possible only with one God."

*Dr. Sir S. Radhakrishnan, Indian Philosophy* Vol I., P.91.

"Monotheism is inevitable with any true conception of God. The Supreme can only be one. We cannot have two supreme and unlimited beings"

"Trust in natural law means faith in one God. The advance of this conception implies the paralysis of superstition. An orderly system of nature has no room for miraculous interferences in which alone superstition and confused thought find the signs of polytheism." *Ibid* P. 90.

* విగ్రహారాధనము వలనను, బహుదైవతారాధనము వలనను మన దేశములో వ్యాపించిన దురాచారములు రావుబహద్దర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారి రచనలలో వర్ణింపబడినవి. అట్లే హిందూమత సంస్కారవాదులగు దయానందసరస్వతి మున్నగువారి రచనలలోను వర్ణితములు. వాటి నిక్కడ గ్రంథవిస్తరభీతిచే నుల్లేఖింపనైతిని.

దేశములో శక్తిపూజ ఎంతటి ఘోరమును అవాచ్యమును అగు దురాచారములను వ్యవహారములోనికి తెచ్చినదో వామాచారము, శాక్తేయమతము మున్నగు మతములను గూర్చి తెలిసినవారికి విదితమే. ఉదాహరణమునకు హానరబుల్ రావుబహద్దర్ గోపాలహరిదేశముఖ్ గారిచే పరిష్కృతమైన 'ఆగమప్రకాశము'ను గ్రంథమునుండి ఈ క్రింది శ్లోకార్థమును సంగ్రహింతును —

"భయంకరమగు తెరచిననోరు కలిగి విరియబోసికొనిన జుత్తుగల కాళిని మద్య పదార్థములతో పూజింపవలెను. ఆమెకు నాల్గు చేతులును, రాక్షసుల శిరస్సులతో చేయబడిన అద్భుతమగు హారము కలవు. ఆ రాక్షసుల నామె సంహరించెను. వారి రక్తము నామె త్రాగెను. ఆమె చేతిలో ఖడ్గముకలదు. . . మేఘము వంటి నల్లనిరంగు. ఆమె నగ్న.. . ...ఆమె మెడలో కపాలములహారమొకటి కలదు. ఆమె కంఠము రక్తప్లావితము . .. .. .. . ఆమె రెండు చేతులలో రెండు కళేబరములు కలవు . . . . ఆమె శ్మశానములలో వసించును. ఆమె భర్తయగు మహాదేవుని వక్షస్థలముపై నిలువబడియుండును."

ఇట్టి భయంకరమగు విగ్రహమును ఇంతకంటెను భయంకరమును, అవాచ్యమును అగు పద్ధతులతో పూజింతురు. శాక్తేయులు కానివారుసైతము కాళిని తాంత్రికుల పద్ధతిపై కాకపోయినను ఇట్టి భయంకరరూపమునే పూజింతురు. భగవంతుని విడిచి కాష్ఠలోష్ఠములతో చేయబడిన దేవతావిగ్రహములను పూజించి మానవు డెంత అధఃపతితుడగునో యుక్తాయుక్తవిచక్షణపరులు గ్రహింపగలరు.

*　　　*　　　*

౧౧౩. ఇక్కడ మూఢవిశ్వాసములకు ఒక ఉదాహరణ మివ్వబడినది. జంతువుల చెవులను చీల్చు మూఢవిశ్వాసము, ఇట్టి పెక్కితర మూఢవిశ్వాసములకు ఇది ఒక ఉదాహరణము. మన దేశములో ఇట్టి మూఢ విశ్వాసములకు అంతులేదు. శకునములు, ముహూర్తములు, మొక్కుబడులు, చేతబడులు, మశూచికము మున్నగు అంటువ్యాధులు స్త్రీదేవతలవలన కలిగినవని జాతరలుచేసి బలులిచ్చుట, దేవతలకు తలవెంట్రుకలు సమర్పించుట ఇత్యాది మూఢాచారములు ఏకేశ్వరత్వము నందు విశ్వాసము లేకపోవుటవల్లనే కలుగునని ఖుర్ఆన్ భావము. ఈశ్వరు డొకడే ననియు, ఈశ్వరు నాజ్ఞ లేనిది ఏదియు సంభవించదనియు, సమస్తమును ఒక నిర్ణీత మగునట్టియు, భగవన్నిర్మితమైనట్టియు ఒక ప్రకృతి ధర్మమునకు లోబడియున్న దనియు విశ్వాసమున్నయెడల ఈ మూఢవిశ్వాసములు మొదలంట కూలును. ఖుర్ఆన్ అందుచేతనే ఏకేశ్వరత్వమును గ్రహింపుడని ఉద్ఘోషించుచున్నది.

*　　　　*　　　　*

౧౧౪. స్త్రీకి మోక్షార్హత లేదనియే వెనుకటి మతములన్నియు అభిప్రాయ పడినవి. ఖుర్ ఆన్ ఇక్కడను ఇంకను పెక్కుతరచోట్లను స్త్రీలకు పురుషులకువలెనే స్వర్గప్రాప్తి కలుగునని చెప్పుచున్నది.

*　　　　*　　　　*

౧౧౫. భగవంతునకు ఆత్మ సర్వస్వము నర్పించుటయే నిజమైన మతమందలి కేంద్రసూత్రము. అట్లు సమర్పించినవానికి భగవన్మార్గమే ఏకైకమార్గము. ఇబ్రాహీం ప్రవక్త బహుదైవతారాధకులలో పుట్టి పెరిగి, బహుదైవతారాధనమునందలి అవివేకమును మోసమును కనిపెట్టి ఏకేశ్వరారాధకుడయ్యెను. అందుచేతనే ఆయన ఉదాహరణ మిక్కడ ఇవ్వబడినది.

*　　　　*　　　　*

౧౧౬. భార్యాభర్తలలో గృహకలహములు సంభవించుట సహజము. భర్త తన భార్యయందనురక్తుడుకాక ఆమెను నిరాదరించవచ్చును. అంతమాత్రమున వైరములు పెంచుకొని వివాహబంధములను త్రెంచుకొనరాదు. భార్యాభర్తలు ఒకరినొకరు పీడించుకొనుట పాపకార్యము. వారు పరస్పరము సమాధానపడి ఒకరినొకరు ప్రేమగౌరవములతో చూచుకొనినచో తాత్కాలిక కలహములవలన కలిగిన పాపము తుడుచుకొని పోవును. ఒకరియెడ ఒకరు ఉపకారబుద్ధితో ప్రవర్తించవలెనని ఖుర్ ఆన్ ఆదేశించుచున్నది.

“భగవంతుడు మీ సమస్తకర్మలను గమనించుచునే యున్నాడు” అని ఇట్టిచోట్ల ఖుర్ ఆన్ మాటిమాటికి అనుచున్నది. మన మేపనిచేసినను భగవత్సాక్షిగా చేయవలెనని ఖుర్ ఆన్ భావము. అట్లు చేసినచో మానవు డధర్మమార్గమునకు ఒరగడు.

*　　　　*　　　　*

౧౧౭. ఒకసారి తప్పనిసరిగా భార్యాభర్తలు వేరైపోవలసి వచ్చినచో భగవంతుడు సర్వసంపోషకుడగుటచే భర్తృవిహీనలగు స్త్రీలనుకూడ పోషించుననని చెప్పుచున్నాడు. అట్లే భర్తలకు అనుకూలపత్నులనుకూడ సమకూర్చునని ఇక్కడ భావము.

క్రైస్తవమతములో విడువబడిన స్త్రీని వివాహమాడుట పాపముగా పరిగణింపబడుచున్నది. ఈ విషయమున బైబిల్ ఏమనుచున్నదో చూడుడు :

"But I say unto you, that whosoever shall put away his wife, saving for the cause of fornication, causeth her to commit adultery · and whosoever shall marry her that is divorced commiteth adultery ''

(St Mathew, VI 32 Also XVI 18.)

భగవంతుడు కరుణామయుడు. భార్యాభర్తలు పరస్పరానురాగములేక మార్జాలదాంపత్యమును నెరపుటకంటె వేరై అనుకూలదాంపత్యమును పొందుటను ఖుర్ఆన్ అనుమతించుచున్నది.

వెనుకటి దినములలో బైబిల్ యొక్క ఈ నిషేధము అనుసరింపబడుచుండినను ఆధునిక యుగములో ఇది అన్యాయమగు నిషేధమని ఖుర్ఆన్ చూపిన మార్గమునే ప్రపంచ మనుసరించుచున్నది. ఈ విషయమున మొన్న మొన్నటివరకు ప్రాచీన సంప్రదాయముల ననుసరించిన మనదేశములోకూడ విడాకులు కావలెనని స్త్రీలు పురుషులుకూడ ఆందోళనము చేయుచున్నారు. భర్తలచే విడువబడిన స్త్రీలకొరకు అనాథ శరణాలయములు, మహిళాశరణాలయములు ప్రతి పట్టణమునను వెలసినవి. ఖుర్ఆన్ ప్రతిపాదించిన ధర్మమును ప్రపంచము క్రమక్రమముగ అనుసరించుచున్న దనుటకు ఇదొక చిన్న ఉదాహరణము.

*　　　　*　　　　*

౧౧౮. బహుదైవతారాధకులు ఒక్కొక్కవిధమగు కోరికకు ఒక్కొక్క విధమగు దేవతను పూజింతురు. ఆ దేవతలను వారు ఆధ్యాత్మిక లాభమునకై పూజింపరు. మన దేశములో ధనాశతో లక్ష్మీపూజను, విద్యార్జనమునకై సరస్వతీ పూజను, మంత్రబలమును చేతబడి, కట్టుబడి మున్నగు దుష్టశక్తులను సంపాదించుటకై కాళీపూజను, బలమునకై హనుమత్పూజను, విఘ్నములు కలుగకుండుటకై విఘ్నేశ్వరపూజను ఈవిధముగ ఒక్కొక్క కోరికకై ఒక్కొక్క దేవతను పూజించుచున్నారు. ఈ విధముగ దేవతలసంఖ్య అగణ్యముగనున్నది. ఇక్కడ ఖుర్ఆన్ ఇట్టిపద్ధతినిగూర్చి చెప్పుచు సమస్తఐహికలాభములను సైతము ప్రసాదించు వాడు భగవంతుడేననియు, సమస్తమును భగవంతునే ప్రార్థించి పొందవలెననియు చెప్పుచున్నది.

*　　　　*　　　　*

౧౧౯. అబద్ధసాక్ష్యమును చెప్పుట మహాపాతకమని ఇక్కడ చెప్పబడు చున్నది. నిజము చెప్పుటవలన తనకుగాని, తన తల్లిదండ్రులకుగాని, సన్నిహితబంధువులకుగాని, ఎవరికైననుసరే నష్టము కలుగునన్నను నిజమే చెప్పవలెను అని ఖుర్ఆన్ చెప్పుచున్నది.

ఈ సత్యము సర్వమతములు ఒప్పుకొన్నదేయని భావింపరాదు. ఉదాహరణమునకు క్రైస్తవ మతాచార్యులు ఈ విషయమునుగూర్చి ఏమిచెప్పిరో చూడుడు

"Liguori, in his treatise on oaths, Question 4, asks if it is allowable to use ambiguity, or equivocal words, to deceive the judge when under oath, and at No. 151 he answers It is a certain and a common opinion amongst all divines that for a just cause it is lawful to use equivocation in the ways laid down, and to confirm it with an oath, and by a just cause we mean all that can do any good to the body or the soul'.

"When a crime is well concealed, the witness, and even the criminal, may and even must swear that the crime has not been committed"*

ఇట్టివే పెక్కుదాహరణములను ఈ గ్రంథకర్త చూపినాడు. పైన పేర్కొనబడిన ఆయన గ్రంథములో 13వ అధ్యాయమును చూడుడు.

ఈ విధముగ ఈ ధర్మము సర్వమతాంగీకారమును పొందినదికాదు. ఖుర్ఆన్ ఈ విషయమునుగూర్చి ఎంత గట్టిగ నొక్కిచెప్పినదో చూడుడు.

* * *

౧౨౦. "సమస్త గౌరవప్రదానమును భగవంతుని వశమందే యున్నది" అని తెలిసినవాడు గౌరవమునకై పాకులాడి అధర్మప్రవర్తనుల ఇచ్ఛకములాడి వారిని సంతోషపెట్టజూడడు. 'ఐహికాముష్మికముల రెంటను శ్రేయశ్శుభములు కల్గించువాడు భగవంతుడే'నని తెలియనివాడు ఏ విధముగ ఐహిక వాంఛలను తీర్చుకొను ఉద్దేశముతో దేవతావిగ్రహములను సేవించునో, అట్లే ధనికుడును బలవంతుడును అగు ఒక వ్యక్తినిగాని, బలముకల ఒక సంఘమునుగాని ప్రాపంచిక గౌరవమును బడయుటకై సేవించుట భగవంతుని మరచుట యన్నమాట.

ఏకేశ్వరత్వమునందు విశ్వాసముకలవాడు ప్రాపంచిక లాభమునకైగాని, గౌరవమునకుగాని ఒరుల నాశ్రయించి వారికి దాసోహమని లొంగియుండడు. వానికి ఆత్మస్వాతంత్ర్యము, ఆత్మగౌరవము, ఆత్మవిశ్వాసము కలుగును. ఒక్క భగవంతుని శక్తినే నమ్మినవానికి ఒరులశక్తి ఎట్లు చలింపజేయును? ఒక్క భగవంతుని దయనే అభిలషించువాడు ఇతరుల దయాదాక్షిణ్యములకై ఏల పాకులాడును? ఒక్క భగవంతుని సహాయమునే వేడువాడు ఒరుల ముందేల చేయి

* Pastor Chiniquy, *Fifty years in the Church of Rome*, PP. 91-92

చాచును ? ఒక్క భగవంతుని ముందే తన శిరస్సును వంచువాడు ఒరులముందేల సాష్టాంగపడును ?

ఏకేశ్వరత్వమునందలి విశ్వాసము మన మనస్తత్త్వముపై ఎట్టి ప్రభావమును వేయునో దీనినిబట్టి తెలియగలదు.

*   *   *

౧౨౧. కొందరు కేవలము లోకమునకు చూపుటకై మతవిధులను నెరవేర్తురు. తాము మిక్కిలి ధర్మబుద్ధులని లోకు లనుకొనవలెనని వారి ఉద్దేశము. లోకము నిట్లు మోసగించుటకై మతము నవలంబించు వంచకులను ఖుర్‌ఆన్ ఇక్కడ ఉద్దేశించుచున్నది.

మతముపేరు చెప్పి రాజకీయలాభమును పొందువారుకూడ ఇందు చేరుదురు.

*   *   *

౧౨౨. ప్రతి చిన్నవిషయమునకును నరకమును విధించువారి సూక్తమును గమనించవలెను. వివిధమత పండితులు—ఇస్లామ్‌మతపండితులుకూడ—భగవంతుని యొకతలారివానిగ చిత్రించినారు. ప్రతి చిన్న పొరపాటునకు ఏదో ఒకవిధమైన నరకశిక్షను వీరు విధించినారు. ఖుర్‌ఆన్ ఏమనుచున్నదో చూడుడు :

**భగవంతుడు మిమ్ముల నేల శిక్షించును ? అనగా చీటికిమాటికి శిక్షించుటకు భగవంతుడు క్రూరుడా ? కాదు, భగవంతుడు దయామయుడు, పాపములను క్షమించువాడు, పోషకుడు.**

**కృతజ్ఞులై యుండి విశ్వాసవంతులై యుండు వారందరును భగవంతుని క్షమాకారుణ్యములకు పాత్రులు.**

కృతజ్ఞులైయుండుట అననేమి ?

భగవంతుడు మనకు ప్రాణము నిచ్చినాడు. పాలుపోసి కంటికి రెప్పవలె కాచి పెంచు తల్లిదండ్రులనిచ్చినాడు. సమస్తవిశ్వమును మనకు ఉపయోగమునకై ఏర్పరచినాడు. భగవంతుడు మనకు ప్రసాదించిన వరములను గణింపగలమా? అట్టి భగవంతునకు కృతజ్ఞులై యుండుట మన ధర్మముకాదా? ఎవరైన మన కెప్పుడైన ఏదేని కించిదుపకారమొనర్చినంత మాత్రమున మనము వారికి యావజ్జీవము కృతజ్ఞులమై యుందుముకదా. అట్టిచో భగవంతునియెడ మన మెంత కృతజ్ఞులమై యుండవలెను ?

భగవంతునియెడ మన మెట్లు కృతజ్ఞతను ప్రకటించగలము ? భగవన్నామమును స్మరించియు, భగవంతుడే సర్వశక్తిమంతుడు, సర్వేశ్వరుడు, సర్వము

నిచ్చువాడని గ్రహించి ఆ ఏకేశ్వరునే ఆరాధించుట, భగవద్ధర్మము ననుసరించుట, ఇదే భగవంతునియెడ కృతజ్ఞతను తెలుపు విధము.

'క్షేమముగ నున్నారా?' అని ఎవరైన అడిగినప్పుడు "భగవదనుగ్రహము వల్ల సుఖముగ నున్నాము. భగవంతునకు కృతజ్ఞులము" అనియు, భోజనముచేసి "ఈశ్వరా! నీకు కృతజ్ఞతలు" అని చెప్పుటయు ముస్లిముల విధి. 'ఎవరు ఒక కబళ మన్నము తిని, ఒక గ్రుక్కెడు నీళ్ళు త్రాగి భగవంతునకు కృతజ్ఞతలను సమర్పింతురో వారికి భగవంతు డితోధికముగ ఆహార మొసగును" అని శ్రీప్రవక్త వచనము.*

* * *

౧౨౩. ఈ సూక్తమునకును దాని తర్వాతి సూక్తమునకును భాష్యమును వ్రాసినవారు శ్రీ ప్రవక్తయొక్క ఈ క్రింది ఉపదేశముల నుల్లేఖించిరి.

"ఒక ముస్లిమ్ మరొక ముస్లిమును శపించరాదు. ఎవరైన దౌర్జన్య మొనర్చినచో శపించుట కనుజ్ఞ కలదు. కాని ఓర్పువహించి క్షమించుట ఉత్తమము"
(ఇబ్నె అబ్బాస్)

ఒకసారి హజరత్ ఆయెషాగారి ఒక వస్తువు పోయెను. ఆమె ఆవస్తువును దొంగిలించినవానిని తిట్టెను. (శ్రీ)ప్రవక్త నామె నుద్దేశించి "అట్లు తిట్టరాదు. 'భగవంతుడా! నా వస్తువును దొంగిలించిన దొంగనుండి నా హక్కును ఇప్పించుము' అని ప్రార్థించవలెను." అని సెలవిచ్చిరి. (అబూదావూద్)

"మీ కపకారము చేసినవారిని క్షమించినయెడల భగవంతుడు మిమ్ముల బహుమానించును. భగవంతుడు మిక్కిలిగ క్షమించువాడు. మానవులలో కూడ క్షమాగుణము భగవంతునకు ప్రియము." (అబూదావూద్)

"ఒరుల తప్పిదములను క్షమించి, అపకారములను మరచిపోవువారికి భగవంతుడు గౌరవము నిచ్చును." (ఇబ్నెకసీర్‌లో ఉద్ధృతము)

* * *

౧౨౪. సర్వదేశములందును, సర్వకాలములందును, సకల జాతులకును భగవంతుడు మానవుల ఉపదేశమునకై ప్రవక్తలను పంపెనని ఖుర్‌ఆన్ బోధించుచున్నది. ఈ ప్రవక్త లందరి యెడలను విశ్వసించుట విధి యొనర్చినది. ఎందుకనగా ఏదేశమందైనను, ఏకాలమందైనను, ఏజాతికైనను ప్రవక్తలు బోధించిన సత్యే

* షావలీఉల్లాగారి 'హుజ్జతుల్లా హిల్ బాలిగా, పుట 578.'

మొక్కటే. ఏకేశ్వరత్వము, సత్ప్రవర్తనము—ఇవి రెండును సర్వప్రవక్తలును బోధించిన సత్యమునందలి ముఖ్యమైన అంశములు. ఈ విధముగ సర్వప్రవక్త లందరి యెడలను విశ్వాసములేని వాడు అవిశ్వాసియే నని ఖుర్ఆన్ చెప్పుచున్నది.

*   *   *

౧౨౫ ఒక పద్ధతి కలవడినవారు అది తప్పని తెలిసియుండికూడ దానిని మానలేరు. అది పరంపరాగతమైన సంప్రదాయమై వారిలో గడ్డకట్టుకొనిపోవును. సత్యము వారికి తెల్లమైనను వారు దానిని గ్రహింపరు. తమ ఆచరణమునే సమర్థించుటకు వాదములను పన్నుదురు. అట్టివారి హృదయములు ముద్రాబద్ధములైనవని ఖుర్ఆన్ చెప్పుచున్నది. రెండవ అధ్యాయమున కూడ ఇదే విషయమును గూర్చిన ఖుర్ఆన్ సూక్తమిది :

"కాని ఎవరు నిశ్చలమగు ఆస్తిక్యబుద్ధిని విడనాడి తిరస్కారమును చూపిరో వారిని నీవు భయపెట్టినను భయపెట్టకపోయినను ఒకటే. వారింక విశ్వసింపరు.

వారి హృదయములును చెవులును ముద్రాబద్ధములు కావింపబడినవి. వారి కండ్లు పొరలు గ్రమ్మినవి. వారు ఘోరశిక్షకు పాత్రులగుదురు."

*   *   *

౧౨౬. ౩వ అధ్యాయమున ౕ౫౪వ సూక్తమునందు కూడ ఈ విషయము సూచింపబడినది. ఏసుక్రీస్తు సిలువపై ఎక్కింపబడినతర్వాత "భగవంతుడా! నన్నేల విడిచిపెట్టివేచితివి ?" అని దీనముగ ప్రార్థించినట్లు బైబిల్‌లో కలదు. ఆ ప్రార్థనమునకు ప్రత్యుత్తరముగ భగవంతు డాయనకు ప్రకృతిసహజమైన మరణమునే ఇత్తునని వాగ్దానమిచ్చెను. ఏసుక్రీస్తు సిలువపై మూర్ఛపోయెను. తరువాత ఆయనను సిలువపైనుండి దించివైచి ఆయన ప్రియశిష్యు నొకనికి ఆయనను ఒప్పజెప్పిరి.

ఇంతవరకు అభిప్రాయభేదములేదు. ఏసుక్రీస్తు సిలువపై మరణించెనా లేక మూర్ఛపోయి తరువాత తేరుకొనెనా యన్న విషయమునుగూర్చి వివాదము కలదు. ఏసుక్రీస్తు కేవలము మూర్ఛపోయెనని కొందరి మతము. సిలువపై మరణించి మూడవ దినము బ్రతికిలేచె నని కొందరి మతము.

ఈ విషయమునుగూర్చి 67 వ నోటు (పుటలు 264—267) లో కొంత చర్చించితిని.

ప్రొఫెసర్ J. Warschaner గారి *The Historical Life of Jesus* అను ఉద్గ్రంథము (పుటలు 338—342) లో ఈ విషయము యుక్తియుక్తముగ వర్ణింపబడినది. 341 వ పుటలో ఈవిషయమై బైబిల్ లోగల సూచనలను గూర్చి ఈ పండితుడు ఇట్లనుచున్నాడు :

"It should not surprise us to find the Gospel narratives of what happened after the death of Jesus in a state of bewildering confusion, disjointedness and mental contradiction."

ఖుర్ ఆన్ ఇదే విషయము నిక్కడ చెప్పుచున్నది. "ఈ విషయమున వివాదపడినవారు సందేహములలో మునిగియున్నారు."

ఈ సూక్తమునందలి చివరిభాగము "వమాఖతలూహుయఖీనా" ను నేను "వారు అతనిని చంపలేదనుట నిశ్చయము" అని అనువదించితిని. సిలువపై చంపబడెనను విషయములో వారికి నిశ్చయజ్ఞానము లేదు." అని రాగిబ్ అనువాదము. "వారికి నిశ్చయముగ తెలియదు" అనియు కొందరనువదించిరి.

* * *

౧౨౩. యూదులు తాము ఏసుక్రీస్తును చంపితిమనియు సిలువపై చంపబడినవాడు భగవత్ప్రవక్త కాజాలడనియు డంబములు పల్కుచుండిరి. "ఉరితీయబడినవాడు భగవంతుని శాపముచే హతుడైనవాడు" అని బైబిల్ పాతనిబంధనము (Deut 21 : 23) లో కలదు. ఏసుక్రీస్తుకూడ అదే విధముగ భగవచ్ఛపితుడని యూదులు చెప్పుచుండిరి. ఖుర్ ఆన్ దానికి జవాబిచ్చుచున్నది: "ఏసుక్రీస్తు మీ రనుకొనుచున్నట్లు సిలువపై బలవన్మరణము పొందలేదు. ఆయన సహజమరణమునే పొందెను. మీ రనుకొనుచుండినట్లు ఆయన భగవచ్ఛపితుడు కాడు. భగవంతు డాయనకు ఉన్నత స్థానమును గౌరవమును ప్రసాదించెను" అని ఖుర్ ఆన్ చెప్పుచున్నది.

* * *

౧౨౫. వెనుక 56 వ నోటులో 236_237 పుటలలో చూపబడినట్లు యూదుల మతగ్రంథ మగు పాత నిబంధనము వడ్డీని నిషేధించినది. ఐనను యూదులు వడ్డీ వ్యాపారముచేయుజాతి యయ్యెను. వడ్డీ తీసుకొని పరుల ఆస్తిని ధనమును దోచుకొనుచున్నా రనియు వీరికి భగవంతుడు కఠినమగు శిక్ష విధించు ననియు ఖుర్ ఆన్ చెప్పుచున్నది. క్రైస్తవులకు కూడ వడ్డీ నిషేధింపబడినను

యూరప్ అమెరికా ఖండములు వడ్డీవ్యాపారమును ప్రధానవృత్తిగా గ్రహించినవి. ఈ మాటలు వారికికూడ చెల్లును.

* * *

౧౭౯. క్రైస్తవులు సాధారణముగ (యూనిటేరియనులు, సోసీనియనులు తప్ప) అందరును ఏసుక్రీస్తు భగవంతుడనియు, భగవంతుని కుమారుడనియు, త్రిమూర్తులలో ఒకడనియు, త్రిమూర్తులలోని పురుషత్రయములో ప్రతిపురుషుడుకూడ శాశ్వత పరబ్రహ్మమేయనియు నమ్ముచున్నారు. క్రైస్తవుల త్రితత్వముయొక్క తత్త్వము ఎంత చిత్రముగ నున్నదో చూడుడు

"The persons are different, the substance one Each of these divine persons is uncreate, each is eternal, each almighty etc; and not three Gods or three Lords, but one Lord and one God. The Father is uncreate and unbegotten; the Son uncreate, but begott en of the Father , the Holy Ghost uncreate, but proceeding from the Father and the Son. And in this Trinity of divine Persons there is none before and none after, none higher and none less, but all three co-equal."‡

(పురుషులు వేర్వేరుగా ఉన్నను, తత్త్వమొక్కటే, ఈ దివ్యపురుషులలో ఏ పురుషుడును సృష్టింపబడినవాడు కాడు, ప్రతి పురుషుడును ఆదిమధ్యాంతరహితుడు, సర్వశక్తిమంతుడు. ఐనప్పటికి ముగ్గురు దేవులుగాని మువ్వురు ప్రభువులుగాని లేరు, ఒకే దేవుడు; ఒకే ప్రభువు. పరమపిత (Father) సృష్టింపబడినవాడు కాడు జన్మరహితుడు. కుమారుడు (Son) కూడ సృష్టింపబడినవాడు కాడు, కాని పరమ పితకు పుట్టినవాడు, అట్లే పరిశుద్ధాత్మ సృష్టింపబడినవాడు కాడు. కాని పరమపిత నుండియు, కుమారునినుండియు వెల్వడినవాడు. ఈ పరమపురుషుల త్రిమూర్తిత్వములో ఒకడు ముందు ఒకడు తరువాత ఉండినవారు కారు; ఒకరు ఎక్కువయు ఒకరు తక్కువయు కారు; అందరూ సమానులు.)

‘ దీనిభావమేమి తిరుమలేశ ? ’ అన్నట్లు దీనిభావము మనకు తోచదుకదా క్రైస్తవపండితులకు సైతము చాల అవకతవకగ నున్నట్లు తోచెను. ఈ తత్త్వమునందలి చమత్కారము కట్టుకథవలె తలాతోక లేకయున్నది. క్రైస్తవమతముపై ఆధునికులు గావించిన విమర్శనములకు జవాబిచ్చి క్రైస్తవ మతసిద్ధాంతములను సమర్థించుటకై వ్రాసిన Modern Doubt and Christian Belief అను తన గ్రంథములో (పుట 242) థియోడోర్ క్రైస్ట్లియబ్ గారు దీనినిగూర్చి వ్రాయుచు

‡ Theodore Christlieb, *Modern Doubt and Christian Belief*, *P. 242.*

"The Athanasion Creed is evidently too stiffly arithmetical in some of its definitions and antitheses, without attempt to reconcile their obvious contradictions. Thus each divine person is said to be eternel, each uncreate etc, and yet there are not three uncreate and three Eternels, but one uncreate and one Eternel etc. To these statements the objection is obvious, that they destroy the Unity for the sake of Trinity, or the Trinity in the interests of the Unity, nor is it quite easy with the doctrine so stated to rebut the charge alleged, not by Jews and Mohomedans only, but also by many Christians, that *Trinitarianism contradicts the fundamental article of all true religion, that there is one living and true God*"

ఇక్కడ కొన్ని విషయములు ఆలోచింపవలసియున్నది. ఈ త్రిమూర్తి సిద్ధాంతము బైబిల్‌లో ప్రతిపాదింపబడినదా? కానిచో ఎవరు ఏ కాలమున ఈ సిద్ధాంతమును ప్రతిపాదించిరి?

ఈ ప్రశ్నలకుత్తర మిచ్చుటకు ముందు కొన్ని విషయములు తెలిసికొనుట అవసరము. అసలు ఏసుక్రీస్తు ధర్మబోధ చేసినకాలము చాల తక్కువ. అది ఒక ఏడని కొందరు మూడేండ్లని కొందరు చెప్పుచున్నారు. ఈకాలములో ఏసుక్రీస్తు చుట్టుచేరిన శిష్యులు పండ్రెండుగురు. వీరిలో చదువగలిగిన వారును వ్రాయగలిగిన వారొక్కరును లేరు. క్రీస్తు చెప్పిన మాటలు వారెవ్వరును వ్రాసియుంచుకొనరైరి. ఇప్పుడు క్రొత్తనిబంధన మనబడుచున్న బైబిల్ గ్రంథములో ఏ సువార్తయు క్రీస్తు శిష్యులచే రచింపబడినదికాదు. ఇవి ఏసుక్రీస్తు మరణానంతరము 80 మొదలు 130 ఏండ్లవరకుగల కాలములో వివిధభాషలలో, వివిధప్రాంతములలో రచింపబడినవి. ఈ చర్చ వెనుక ఒకనోటులో చేసియుంటిని. ఇప్పుడు క్రైస్తవమతమని ప్రచారములో నున్న మతము భగవత్ప్రవక్తయగు ఏసుక్రీస్తుగాని ఆయన శిష్యులుగాని బోధించినది కాదని ఇప్పుడు సామాన్యముగ అందరును ఒప్పుకొనిన విషయమే. ఇప్పుడు ప్రచారములో నున్న క్రైస్తవమతము సెంట్‌పాల్ అను నతడు స్థాపించినది. ఇప్పుడు చర్చివారు చిత్రించుచున్న ఏసుక్రీస్తు చరిత్ర ప్రసిద్ధుడగు ఏసుప్రవక్త కాడు. సెంట్‌పాల్ సృష్టించిన ఒక పురాణపురుషుడు.* సెంట్‌పాల్ బోధించిన

* "The Christ of the Pauline Epistles, therefore, has no relation at all to the historic Jesus We need scarcely hesitate to regard St Paul, indeed, as the real founder of our religion." H R. Mackintosh, *The Doctrine of the Person of Jesus Christ*, p. 51.

"Paul is not the second after Jesus, but the first in Christ" అన్నాడు డైస్మన్ అను ఒక గొప్ప క్రైస్తవపండితుడు.

మతము ఏసుక్రీస్తు బోధనలతో ప్రారంభము కాదు. ఏసుక్రీస్తు మరణముతో ప్రారంభమగును. పాల్ ఎన్నడును ఏసుక్రీస్తును చూచియుండలేదు. ఐనను తన అంతర్దృష్టికి గోచరమై ఏసుక్రీస్తు తనకు చెప్పిన విషయములు తాను బోధించుచున్నానని పాల్ ప్రకటించెను. ఈ విధముగ క్రైస్తవమత నిర్మాత పాల్. ఇతడు ఏసుక్రీస్తు భగవంతుడని నమ్మి ఆ సిద్ధాంతము పునాదిగా చర్చియను ఒక మహాసంస్థను స్థాపించెను.

క్రైస్తవ బైబిల్ గ్రంథమందలి మొదటినాల్గు సువార్తలలో ఎక్కడను ఈ త్రిత్వసిద్ధాంతము ప్రతిపాదింపబడలేదనియు, జాన్ సువార్తయందు ఈసిద్ధాంతమును సూచించు (I V. 7) వాక్యము తరువాత వారు వ్రాసి అందు చేర్చిన దనియు, అసలు త్రిమూర్తులు, త్రిత్వము, పురుషుడు (Person) ఇత్యాది శబ్దములు సైతము బైబిల్‌లో లేవనియు డాక్టర్ క్రైస్టు లియబ్ అనుచున్నాడు.* క్రొత్తనిబంధనమందే కాదు, పాతనిబంధనమందు సైతము ఈ త్రిత్వసిద్ధాంతముయొక్క జాడలేదు. రెండవ శతాబ్దములో ఏర్పడిన ఈ సిద్ధాంతమునుగూర్చి శతాబ్దముల తరబడి వాదోపవాదములు జరిగెను. నేటివరకు యీ చర్చ తెగలేదు.

స్కెంకెల్, స్ట్రాసస్, బాఉర్, రినాన్ మున్నగు సుప్రసిద్ధ ఐరోపీయ బైబిల్ పండితులెల్లరును ఏసుక్రీస్తు కేవలము మానవుడనియే క్రొత్తనింబంధన సువార్తలనుచున్నవనియు, త్రిత్వసిద్ధాంతము మిక్కిలి అసంబద్ధముగ నున్నదనియు, అది ఆనాటి విగ్రహారాధక మతముల ప్రోద్బలముచే నిర్మింపబడిన సిద్ధాంతమనియు అభిప్రాయపడిరి.† మతప్రవక్తలు, మహాపురుషులు వారి మరణానంతరము అవతార పురుషులుగను, దేవులుగను భావింపబడుట అన్నిదేశములందును, అన్ని కాలములందును కలదు. మనదేశమున శ్రీరామ, శ్రీకృష్ణ బుద్ధాది మహాత్ములెల్లరును అవతార

---

* But now to come to the doctrine itself, and its basis in Holy Scripture You are all aware that no such sentence as God is a triune God is to be found in the Bible. The well-known text, (I John V. 7.), 'There are three that bear record in heaven, the Father, the Word aud the Holy Ghost, and these three are one,' is now *universally recognised as an interpolation.* The terms trinity, triunity, threefold personality, and even the word person itself, are not derived immediately from scripture."

T. Christlieb, *Modern Doubt and Christian Belief*, P. 243.

† Schenkel, '*Sketch of character of Jesus*'
Strauss '*Life of Christ*'
Renan, '*Life of Christ.*'

పురుషులుగ భావింపబడుచుండుట సుప్రసిద్ధమే. వారు తమ జీవితకాలములో తా మవతారపురుషులమనియు, దేవులమనియు చెప్పుకొనినట్లు రామాయణ భారతాది మూలగ్రంథములలో లేకపోయినను తరువాతివారు పెక్కు కథలనల్లి ఆ యా గ్రంథములందు చేర్చి, లేనిపోని మాహాత్మ్యములను కల్పించి ఆ మహాత్ముల చరిత్రములు మనకు సరిగా గోచరింపకుండ సైతము చేసిరి. ఇష్టమువచ్చినట్లు పురాణములను కథలను అల్లి మహర్షులు వాటిని చెప్పినట్లుగా అబద్ధములు చెప్పుట మన దేశములో పరిపాటి ఐపోయినది. ఇది అందరకును తెలిసిన విషయమే. క్రైస్తవ మతములో కూడ నంతే. ఎవరో గ్రంథములను రచించి ఏసుక్రీస్తు శిష్యుల పేరుంచుటయో లేక తాము స్వయముగ ఆ విషయములను భగవత్ప్రేరణముచే వ్రాసితిమనియు చెప్పుకొనుటయు కలదు. ఈ విధముగనే బహుదైవతారాధనము వ్యాపించినది.

ఇందొక్క విషయము గమనించవలసియున్నది. బహుదైవతారాధకులలో ఎవరును భగవంతులు అనేకులు అని చెప్పరు. భగవంతు డొకడనియే అందురు. అట్లు చెప్పుచునే అనేక దేవతలను పూజింతురు. దీనికి కారణము కలదు. బహుదైవత్వము సత్యమునకు దూరము. అది మానవబుద్ధికి వ్యతిరేకము. ఆస్తికతయే నిజమైన యెడల ఏకేశ్వరత్వ మొక్కటే అవలంబనీయము. బైబిల్‌నందు సైతము ఆధారము లేని ఈ త్రిత్వసిద్ధాంతములను క్రైస్తవు లెట్లు నమ్ముచున్నారో అర్థముకాదు. సత్యముకంటె మూఢవిశ్వాసములే ఆకర్షణీయముగ నుండుట మన యోచనాజ్ఞానముల లోపము. ఇప్పుడు మతమును వ్యాజిక్కుగా భావించుకాలము పోయినది. మతము మానవుని హృదయమునే కాక బుద్ధినికూడ సంతృప్తిపరచవలెను. మూఢవిశ్వాసములను బుద్ధి అంగీకరింపదు. ఆధునిక భౌతిక మానసిక శాస్త్రముల దాడికి ఆగవలెనన్నచో మతము మానవుని బుద్ధినికూడ సంతృప్తిపరచవలెను. లేనిచో మతమునకు మానవసంఘమున తావుండజాలదు.

బుద్ధికిని హృదయమునకును సమాన సంతృప్తి గలిగించు మతమే నిజమైన మతమని ఖుర్‌ఆన్ బోధించుచున్నది. ఏకేశ్వరత్వము పునాదిగా ఉండినప్పుడే సత్యమగు మత మేర్పడును.

* * *

౧౩౦. ఏసుక్రీస్తు సైతము భగవంతుని ప్రార్థించెను, దీనముగ భగవంతుని వేడుకొనెను కదా, అట్టిచో ఏసుక్రీస్తు భగవంతు డెట్లగును? అని ఖుర్‌ఆను ప్రశ్నించుచున్నది. అదే విధముగ దేవతలు సైతము భగవంతుని ప్రార్థింతురు కదా. మరి మీరు వారి నేల పూజించుచున్నారని ఖుర్‌ఆను ప్రశ్నించుచున్నది.

ఏసుక్రీస్తు భగవంతుని దీనముగ ప్రార్థించిన పెక్కు సందర్భములు బైబిల్‌లో వర్ణితమైనవి. ఈ క్రిందివి కొన్ని ఉదాహరణములు మాత్రము :—

"And he went a little farther, and fell on his face, and prayed, saying, O my Father, if it be possible, let this cup pass from me nevertheless not as I will, but as thou wilt.

"And he cometh unto the disciples, and findeth them asleep, and saith unto Peter, What, could ye not watch with me one hour ?

"*Watch and pray*, that ye enter not into temptation : *the spirit indeed is willing, but the flesh is weak.*

"He went away again the second time, and prayed, saying, O my Father, if this cup may not pass away from me, except I drink it, *thy will be done*

"And he came and found them asleep again for their eyes were heavy.

"And he left them, and went away again, *and prayed the third time*, saying the same words.

—*Matthew, XXVI, 39—44.**

"And saith unto them, My soul is exceeding sorrowful unto death tarry ye here, and watch.

"And he went forward a little, and *fell on the ground, and prayed* that, if it were possible, the hour might pass from him "—Mark XIV. 34, 35.

మాత్థ్యూలోవలె ఇక్కడకూడ ఏసుక్రీస్తు సాష్టాంగపడి మూడు సార్లు భగవంతుని ప్రార్థించినట్లు కలదు. అదేవిధముగ జాన్‌సువార్తలో (V. 30, VI. 38)ను కలదు. లూక్‌సువార్తలో ఈఘట్టము ఈవిధముగ వర్ణింపబడినది.

"And being in an agony he prayed more earnestly and his sweat was as it were great drops of blood falling down to the ground."—Luke XXII. 44.

ఏసుక్రీస్తు సిలువపై ఎక్కింపబడినతర్వాత భగవంతునను ప్రార్థించినవిధమును మాథ్యూయును మార్కుయు ఈ విధముగ వర్ణించుచున్నారు :

* మత్తయి సువార్త, 26 వ అధ్యాయము 39 మొదలు 44 వ సూక్తము వరకు.

"And about the ninth hour Jesus cried with a loud voice, saying, Eli, Eli, lama sabachthani? that is to say, My God, My God, why hast thou forsaken me?"
—Matthew XXVII. 46. Also Luke XV. 34.

ఈ విధముగ ఏసుక్రీస్తు స్వయముగ భగవంతుని ప్రార్థించినట్లును, దీనముగ వేడుకొనినట్లును ఎన్నో ఘట్టములు బైబిల్ నుండి చూపించవచ్చును. ఈ విధముగ ఏసుక్రీస్తు మానవమాత్రుడేనని స్పష్టపడలేదా? ఐనను భగవంతుని విడిచి భగవద్భక్తుడగు ఏసుక్రీస్తును భగవంతుని స్థానమున నుంచి పూజించుట అకార్యమని ఖుర్ఆన్ చెప్పుచున్నది.



లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి.

# కొన్ని సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 121 | 5 | మరియమ్ | మర్యమ్<br>మరియమ్ అని వచ్చినచోట్లనెల్ల 'మర్యమ్' అని చదువుడు. |
| ,, | 22 | 'రూహిల్ ఖుదిసి' | 'రూహిల్ ఖుదుసి' |
| 122 | 8 | వారు తమకుతామే నష్టపరచుకొనుచున్నారు. | వారు (తమకు తామే) నష్టపరచుకొనుచున్నారు. |
| 125 | 18 | నాటిన గింజ ఒక చేయైనను | (నాటిన గింజ ఒక చేయైనను) |
| 126 | 15 | పాడుచేసికొందురు. | పోగొట్టుకొందురు. |
| 127 | 18 | దానముచేయుటకై పొల్లును తీయ నుద్దేశింపకుడు. | పొల్లును దానముచేయుట కుద్దేశింపకుడు. |
| 128 | 7 | భక్తిపూర్వకముగ ఎట్లు | మ్రొక్కుబడిగ ఏది |
| ,, | 22 | బాధయు కలుగదు | నష్టమును కలుగదు |
| 129 | 18 | ఇంతకుముందు(వడ్డీతీసుకొనుట వలనయిన) వారిపాపము క్షమింపబడును. | ఇంతకుముందు (వడ్డీతీసుకొనుటవలన లభించిన) ధనమును వారుంచుకొన వచ్చును. వారి వ్యవహారమును భగవంతుడు పరిష్కరించును. |
| 130 | 5 | వడ్డీ మొత్తములను | వడ్డీమిగుళ్ళను |
| ,, | 280 సూక్తము | ఋణస్థుడు కష్టపరిస్థితులలో నున్నచో అతనికి తేరిపిరియై తీర్పజాలినంతవరకు వ్యవధినిండు. మీరు ప్రబోధమనస్కులై ఔదార్య దాతృత్వములతో ఋణమును క్షమించిన యెడల అంతకంటె మీకొరకు ప్రశస్తమైనది మరొకటిలేదు. | ఋణస్థుడు కష్టపరిస్థితులలోనున్నచో అతనికి తేరిపిరియై (తీర్పజాలి)నంతవరకు వ్యవధినిండు. మీరు(ప్రబోధమనస్కులై ఔదార్యదాతృత్వములతో) ఋణమును క్షమించినయెడల (అంతకంటె) మీకొఱకు ప్రశస్తమైనది (మరొకటి లేదు). |
| ,, | 23 | ఒకవ్రాయసకానిచే ఉన్నదున్నట్లు జాగ్రత్తగా ఒడంబడిక పత్రమును వ్రాయింపుడు. | న్యాయబుద్ధితో ఒడంబడిక పత్రమును వ్రాయు వ్రాయసకాడొకడుండవలెను. |
| 131 | 9 | ఒక పురుషుడు, ఇద్దరు స్త్రీలు | ఒకపురుషుని ఇద్దరు స్త్రీలను |
| ,, | 14 | వేసుదీయకుము. | వేసుదీయకుడు. |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 131 | 24 | అల్లాయెడశ్రద్ధవహింపుడు. | భగవంతునియెడ భయభక్తులు కలిగి యుండుడు. |
| ,, | 24 | అల్లా | అల్లాః |
| 132 | 19 | భగత్ప్రవక్త తనకు ప్రోక్తమైన | ప్రవక్త తనకు తనప్రభువుచే ప్రోక్తమైన |
| 133 | 8-9 | ప్రభూ! మాకు మోయశక్యముకాని భారమును పూర్వమువారిపైవలె మాపై వేయకుము. | ప్రభూ! మాకు పూర్వము వారిపై వేసినట్టి బరువును మాపై మోపకుము. |
| 136 | 10 | (.. మాలిక సూక్తులను) | ( మాలికసూక్తులు. అవి) |
| 137 | 8 | వీరిప్రవర్తనము | (వీరిప్రవర్తనము) |
| 138 | 8 | భార్యలు | స్త్రీలు |
| 139 | 1 | ఆ సత్యమును | ఈ సత్యమును |
| ,, | 23 | గమనించితివా ? | గమనించలేదా ? |
| 142 | 15 | (నేను వాంచిచిన) కుమారుడు | "(నేను వాంఛించిన) కుమారుడు...... రక్షింబడుదురు గాక !" |
| 144 | 13 | 'ఈ సామనీః' | 'ఈ సామసీః' |
| 146 | 14 | భగవంతునకు భయపడుడు | అందుకే భగవంతునకు భయపడుడు. |
| ,, | 17 | అదియే | ఇదియే |
| 148 | 2 | లొంగినవారము మేము." | లొంగినవారము మేము. (స్వీయ . .. .. వంచము)." |
| ,, | 8 | ఇన్జిల్ (బైబిల్) తౌరీత్ (తోరా) | ఇన్జిల్, తౌరీత్ |
| ,, | 15 | వివాద పడుదురు ? | వివాద పడెదరు ? |
| 149 | 26 | ...ఎవరవ్వాలో అతడే నిర్ణయించును) | ఎవరసర్వ్వాలో అతడే నిర్ణయించును.)అతడు సమస్తము నెఱిగినవాడు. |
| 150 | 1 | అతడు సమస్తము నెఱిగినవాడు | **Delete** |
| ,, | 18 | ఎవరు భగవంతునియెడ గల విశ్వాసమును | ఎవరు భగవంతుని ఒడంబడికను |
| ,, | 19 | వాగ్దానమును | వాగ్దానములను |
| 151 | 14 | విశ్వాసులైన | విశ్వాసులై |
| 155 | 20 | భగవంతుడే మఱిలేడు | భగవంతుడు ఏమఱి లేడు, |
| 156 | 19 | ఇట్టివారికే | ఇట్టివారికి |
| 157 | 1 | ఆ విశ్వాసమార్గము | అవిశ్వాస మార్గము |
| 159 | 9 | విశ్వసించువారు (కహా!) | విశ్వసించువారు [illegible] |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 164 | 12 | (భవన్మార్గమున | (భగవన్మార్గమున) |
| 172 | 2 | (ఇప్పుడైనను ..) | (ఇప్పుడైనను ) |
| 182 | 17 | జరుగ వలెను. | జరుపవలెను. |
| 185 | 4 | మెహార్ | మహార్ |
| | | | ఈ శబ్దము ఎక్కడవచ్చినను ఇట్లే చదువవలెను. |
| 189 | 17 | 'అఖిదత్ ఇమానుహుమ్' | 'అఖిదత్ ఐమానుహుమ్' |
| 195 | 15 | సత్స్రవర్తనము | సత్ప్రవర్తనము |
| 197 | 22 | (వారిటు...) | (వారిట్లు. .) |
| 198 | 10 | (ఓ వ్రవక్తా!) | (ఓ ప్రవక్తా!) |
| 199 | 21 | ఆధ్యాత్మికముగ | ఆధ్యాత్మికముగ |
| 207 | 19 | మీకెవరు | మీకెవడు |
| ,, | 23 | (శ్రేయమ్మ్శాంతులగుగాక! | (శ్రేయ శ్శాంతులగు గాక! |
| ,, | 24 | సూక్తిపైని | 86 వ సూక్తిపైని |
| ,, | 25 | .. నుండగారునో | . నుండగోరునో |
| 212 | 6 | మీపై | నీపై |
| ,, | 8 | మిమ్ములను | నిన్ను |
| 213 | 16 | ...చేయుదును. | చేయుదును " |
| 214 | 12 | ఎవరివాక్కు భగవద్వాక్కుకంటె సత్యమైనది ? | భగవద్వాక్కు కంటె ఎవరివాక్కు ఎక్కువ సత్యమైనది ? |
| 217 | 7 | ప్రవర్తింప జాలదు. | ప్రవర్తింపజాలరు. |
| 219 | 20 | (ఓ ప్రవకా!) | (ఓ ప్రవక్తా!) |
| 221 | 17 | భగవంతుని (భక్తిని) | భగవంతుని (యెడ భక్తిని) |
| 223 | 19 | కొద్దిమంది తప్ప | కొద్దిమందికి తప్ప |
| 231 | 16 | భగప్రీకై | భగవత్ప్రీతికై |
| ,, | 20 | ఖుర్ ఆన్ ప్రబోధించుచున్నది | ఖుర్ ఆన్ బోధించుచున్నది. |
| ,, | 23 | బిచ్చగాండ్రవను | బిచ్చగాండ్రను |
| 232 | 11 | (తఫ్సిరె ..) | (తఫ్సీరె.. ) |
| 235 | 9 | యుండును | యుండెను |
| 255 | 28 | to blind | to be blind |
| 260 | 32 | entiled | entitled |
| 277 | 6 | clement | Clement |
| 283 | 28 | 70 గురు | 70 మంది |
| 289 | 7 | హింసాకారణముగును. | హింసాకారణమగునని చెప్పు చున్నాడు, |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 289 | 7 | ఆదే | అదే |
| 290 | 21 | తన | తమ |
| 303 | 21 | పరపస్పర | పరస్పర |
| ,, | ,, | భార్యాభర్త సంబంధము | భార్యాభర్తృ సంబంధము. |
| 304 | 8 | ఇప్పుడు | ఇప్పుడు |
| ,, | ,, | సమిష్ఠి | సమిష్టి |
| 324 | 11 | Eevrywhere | Everywhere |
| ,, | ,, | Controdictory | Contradictory |
| 326 | 15 | దుష్కార్యము | దుష్కార్యమని చెప్పబడినది. |
| 431 | ,, | Mathew | Matthew |

# హైదరాబాదు ఆంధ్ర సాహిత్య పరిషత్తు

అధ్యక్షులు : ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు, ఆంధ్రాచార్యులు,
ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు (దక్కన్)

---

ఈ పరిషత్తు తెనుగున 'హైదరాబాదు ఆంధ్ర సాహిత్య పరిషత్తు' అనియు, నాంగ్లమున 'హైదరాబాదు తెలుగు ఎకాడమీ' అనియు పిలువబడును. పరిషత్తు కార్యస్థానము హైదరాబాదు నగరమున నుండును.

## ఉద్దేశ్యములు :

(అ) హిందూ మొహమ్మదీయులు పరస్పర మొకరి సంస్కృతి నొకరర్థము చేసికొనుట కుపకరించు గ్రంథముల నాంధ్రమున ప్రచురించుట.

(ఆ) ఆంధ్రమున నుత్తమరచనలను ప్రచురించుట.

(ఇ) నిజాంరాజ్యమున లభించు ప్రాచీన తాళపత్రగ్రంథములను సేకరించి వానిని భద్రపరచుట.

(ఈ) ఆంధ్రసంస్కృతి, ఆంధ్రభాష, ఆంధ్రవాఙ్మయము వీని యందు పరిశోధనలు సల్పుట.

(ఉ) ఒకటి ఆంగ్లమునను, నొకటి యాంధ్రమునను రెండు త్రైమాసపత్రికల ప్రచురించుట. పరిషత్సభ్యుల పరిశోధన లిందు ప్రచురింపబడును.

ఆంగ్లపత్రికయందు తెలుగుభాషను గురించియు, సాహిత్యమును గూర్చియు పరదేశస్థులకు తెలియుటయు, ఆంధ్రప్రతిభ యనాంధ్రులకు తెలియజేయుటయు మొదలుగాగల యుద్దేశములతో వ్రాయబడిన యుత్తమవ్యాసములు ప్రచురింపబడును. ఆంధ్రేతర సాహిత్యములనుండి గొప్ప కావ్యములయొక్క యనువాదములను, నాంధ్రేతర భాషాచరిత్రలు, మున్నగు నాంధ్రభాషాభివృద్ధికి తోడ్పడు నితర విషయములను తెనుగుపత్రికయందు ప్రచురింపబడును

(ఊ) వార్షికోత్సవములను జరిపి ఆంధ్రసంస్కృతికి సంబంధించిన విషయములపై ప్రఖ్యాతపరిశోధకుల చర్చలను ఏర్పాటుచేసి చిత్రకళాపుస్తకప్రదర్శనములను జరిపి, అన్నివిధముల ఆంధ్రసంస్కృతి విస్తృతికి తోడ్పడుట.

మొహమ్మద్ ఖాసింఖాన్, ఎం. ఏ., కార్యదర్శి.

# పండితాభిప్రాయములు

దయతో పంపిన ఖురాన్ అనువాదము అందినది. దానిని ఆమూలాగ్రము త్తసంగతులు గ్రహించితిని. నావలెనే పెక్కురు దీనిని చదువుదురని తక్కిన భాగములనుగూడ పూర్తిచేసి, మీరు సిద్ధసంకల్పులగుదురుగాక. నిరుపమమైన మీ యాంధ్రభాషాపాండిత్యమును చూచి లోక మాశ్చర్యపడునేమో. చిరకాలమునాడే మీ భాషాజ్ఞానమును ఎరిగియున్న నాకు, ఈ పరిణామము సంతోషస్థానమేకాని, ఆశ్చర్యపదము కాదు. దానికితోడు ఇటీవల మీరు సంపాదించిన ధర్మవిజ్ఞానము మాత్రము అక్కజము గొల్పినది మీ విద్యాసంస్కారము ఏకదేశముగాక పరిపూర్ణమగుచున్నందులకు ఎంతో సంతసించితిని."

**ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు,**
ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రధానాంధ్రాచార్యులు.

★ ★ ★ ★

"గ్రంథము చదువుటకు చాలా బాగున్నది. ఇంపైన శైలి. స్వతంత్రగ్రంథములాగుండునట్లు తెలిగించినారు, ఇది గొప్పవిశేషము... ... ... ..

ఇస్లాము హిందూమతములందలి ధర్మోపదేశములొండొంటికి గల పోలికలను భేదములను దెలుపుటకై మీరుచేసిన కృషి ప్రశంసాపాత్రమైనది. ఇది తప్పక అందరు చదివితీరవలసిన గ్రంథమనుటకు సందేహములేదు. మిగిలిన గ్రంథమునుగూడ త్వరలో అనువదించి ఆంధ్రుల కందజేయుదురుగాక అని కోరుచున్నాను."

**శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు**

★ ★ ★ ★

"మొహమ్మద్ ఖాసింఖాన్ ఎమ్. ఏ. గారు రచియించిన ఖుర్ఆన్ షరీఫ్ ఆంధ్రానువాద ప్రథమసంపుటము సాదరముగాఁ జదివి, ఇది సవివరణాంధ్రానువాద మనుటకంటె ఖురానాంధ్రభాష్యమనుట కెక్కువగాఁ దగియున్నదని భావించితిని.

"ఒక భాషలోని గ్రంథమును మఱియొక భాషలోనికి మార్చుటకష్టము, అది మతగ్రంథమే యైనచో బహుకష్టమని వేరే చెప్పవలెనా? దాని, మతతత్త్వమెఱిఁగిన వారగుటచేతను, ఆబాల్యముగాఁ దెలుఁగు చక్కఁగా నేర్చినవారగుటచేతను, ఈ కృతికర్త యట్టి క్లేశములేక మృదుమధురశైలిని విషయము విశదీకరింపఁ గల్గెను.

"పుణ్యాపాపములు స్వర్గనరకములు మరణానంతర జీవితము మొదలగు బహువిషయములు వివరించుపట్టుల నిస్లాంమతమునకును దక్కిన యార్యమతాదులకును సామరస్యము గలిగింప నా యా వేదాదులలోని వాక్యము లుదాహరించుచుఁ గావించిన చర్చయు సత్యాన్వేషణము నీ గ్రంథమం దెన్నఁదగిన విశేషలక్షణము. అందుచే నిది యిస్లాం మతమువారికింబోలె నన్యమతములవారికిని జదువఁదగినదైనది.

"ఇంతకుమున్నీ కృతికర్త నాకుఁ బరిచితుఁడుమాత్రమే. ఇపుడొక యుత్తమ గ్రంథము నిర్మించి యాంధ్రవాణికి నూతనాలంకారము సమర్పించి నా కెన్నఁదగిన మిత్రుఁడయ్యెను. ఈయన యీ సంపుటమువలెనే తక్కిన సంపుటములును మతసామరస్య ప్రధానముగా బరమతసహనబోధకముగా నిర్మించి యుభయమతములవారి సమాదర గౌరవములకుఁ బాత్రుఁడగుఁగాక."

'అభినవవాగనుశాసన'

**శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు**